# మక్సీమ్ గోర్కీ

## సాహిత్య వ్యాసాలు





"రాదుగ" ప్రచురణాలయం

మాస్కో

అనువాదం: ఆర్వియార్
డిజైన్: వి. పేర్కిన్

МАКСИМ ГОРЬКИЙ

О литературе и искусстве

*на языке телугу*

MAXIM GORKY

On Literature and Art

*in Telugu*



సోవియట్ యూనియన్‌లో ముద్రించబడింది

Г $\frac{4603000000—587}{031(05)—85}$ 314—85

ISBN 5—05—000345—8

## యిందులో

# ముందుమాట

## 1

మక్సీమ్ గోర్కీ అనే కలం పేరుతో ప్రసిద్ధుడైన అలెక్సేయ్ మక్సీమొవిచ్ పేష్కొవ్ (1868–1936) కళాత్మక వారసత్వం అపారమైంది. సిద్ధహస్తులైన అందరు సాహిత్యవేత్తల్లాగానే ఆయనా మహత్తర రష్యన్ సాహిత్యపు అభివృద్ధి మీద గణనీయమైన తన సొంత ముద్ర వేశాడు. అంతేగాక, ప్రపంచ సాహిత్యాన్ని కూడా చెప్పుకోదగ్గట్టుగా ప్రభావితం చేశాడు. సమాజపు అట్టడుగు పొరనుంచి పైకి వచ్చి, మరెవ్వరికీ తెలియనంతగా జీవిత సత్యాన్ని గ్రహించి, తన కళాత్మక సాధన సంపత్తి ద్వారా ప్రజలకి యీ సత్యాన్ని తెలియజెయ్యాలని తపించి పోయిన యీ రచయిత పడిన పాట్లు మొత్తం రష్యన్ సమాజాన్నీ, తర్వాత మొత్తం ప్రపంచాన్నీ ఆశ్చర్యచకితం చేశాయి. గోర్కీ సాహిత్య జీవితం కళ్ళు చెదరగొడుతుంది: 1895లో ఆయన తొలి కథలు కేంద్ర పత్రికల్లో ప్రచురితం అయాయి. 1898 నాటికే ఆయన ''వ్యాసాలూ – కథలూ'' రెండు సంపుటాలు వెలువడ్డాయి. 1901 నాటికే ఆయన రచనలు ముఖ్యమైన అన్ని యూరపియన్ భాషల్లోకి అనువాదం అయాయి. ఒక్క 1903లోనే ఆయన సంకలిత రచనల ఆరు సంపుటాలు అయిదు సార్లు పునర్ముద్రణ అయాయి.

గోర్కీ సాహిత్య కార్యకలాపాల విస్తృతి, ఆయన ఆలోచనా గాఢత్వం, ఆలోచనా నైపుణ్యం, భిన్న రీతులమీదా శైలులమీదా ఆయనకి గల ప్రభుత -- మొత్తం అంతా ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆయన పాండిత్యానికీ, అపార విజ్ఞాన తృష్ణకీ ఆయన సమకాలికులు కూడా చకితులైపోయేవాళ్ళు. ఆయన క్రమబద్ధంగా రెండేళ్ళకంటే యెక్కువ చదువుకోలేదనీ కాని తన విస్తృత ఆసక్తులవల్లా, బహుముఖ ప్రజ్ఞవల్లా ఆయన యిరవయ్యవ శతాబ్దపు మహా విద్వాంసుల్లో ఒకడైయ్యాడనీ చాలా మందికి తెలీదు.

సమున్నత మేధాసంపత్తి, గాఢమైన సంస్కృతి, సాహసోపేత భావాలు, లోతైన అనుభూతులు వున్న వ్యక్తులతోటి ఆయనకి నిరంతర సాహచర్యం, సంబంధం వుండేది. అలాంటి వాతావరణంలోనూ, మహా ఆధ్యాత్మిక జీవితం వున్న వాతావరణంలోనూ రచయితగా, సాహిత్యవేత్తగా, సాంఘిక ప్రముఖుడుగా వికసించి, అభివృద్ధిచెందే అదృష్టం గోర్కీకి కలిగింది. ఆయనకి లెనిన్‌తోటి, టాల్‌స్టాయ్‌తోటి, చెహోవ్‌తోటి, బునిన్‌తోటి, ఎల్. అంద్రేయెవ్‌తోటి, ఎఫ్. షల్యాపిన్‌తోటి, ఐ. రేపిన్‌తోటి, కె. స్తనిస్లావ్‌స్కీతోటి, రొమేన్ రోలాన్‌తోటి యింకా తదితరులనేక మందితోటి చాలా సన్నిహిత సంబంధాలు వుండేవి.

రష్యన్ సాహిత్యంలోనూ, ప్రపంచ సాహిత్యంలోనూ గోర్కీకి విశిష్ట, ప్రత్యేక స్థానం వుంది. విప్లవ యుగంతోటి ఆయన విలీనత చెందడంవల్ల ఆ స్థానం వచ్చింది. ఆయన రచనా నైపుణ్యం విశిష్టమైంది. శ్రామికవర్గానికి నూతన సాంఘిక పునాదిమీద ప్రపంచాన్ని పునర్ నిర్మించవలసిన చారిత్రక కర్తవ్యం వుంది. అలాంటి శ్రామికవర్గపు మానసిక స్థితిని, అనుభూతుల్ని, ఆలోచనలని వర్ణించిన (నవల "అమ్మ", నాటకం "శత్రువులు") తొలివ్యక్తి ప్రపంచ సాహిత్యంలో గోర్కీయే. యిందులోనే యితర రష్యన్, యూరపియన్ రచయితలకీ గోర్కీకీ గల విభేదం వెల్లడి అవుతోంది. ఆయన మిత్రుడూ, తరుణ సోవియట్ రష్యాలో విద్యాశాఖకి తొలి ప్రజా కమిస్సారూ అయిన ఎ. లునచార్‌స్కీ యిలా రాశాడు: "గోర్కీకి గల గణనీయమైన, అసదృశమైన ప్రాముఖ్యం ఆయన శ్రామికవర్గపు తొలి మహా రచయిత కావడంలో వుంది.... యీ వర్గం తత్వశాస్త్రపరంగా, రాజకీయంగా మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌లలో తనని తాను గుర్తించుకున్నట్టు, కళాత్మకంగా తనని తాను ఆయనలో గుర్తించుకోవడంలో వుంది." పోరాట మానవుణ్ణి, విప్లవకారుణ్ణి, జీవిత పరివర్తకుణ్ణి చిత్రించేటప్పుడు, అక్టోబరు విప్లవాత్పూర్వపు రష్యన్ సమాజం మొత్తాన్ని — అన్ని సాంఘిక వర్గాలని, తరగతుల్ని, గ్రూపుల్ని, వర్గపోరాటాల్ని, వైరుధ్యాలని, విభిన్న రాజకీయ, తాత్విక, మతపర, నైతిక, సౌందర్యాత్మక అన్వేషణలని గోర్కీ శోధించి, కళాత్మకంగా హద్దులు చూపించాడు. గోర్కీ గొప్ప నవల "క్లిమ్ సామ్‌గిన్ జీవితం". దాన్ని "దశాబ్దాల జీవితపు కదిలించివేసే విశాల దృశ్యం"గా లునచార్‌స్కీ నిర్వచించాడు. యీ నిర్వచనాన్ని రచయిత మొత్తం సృజనాత్మక కృషికి అన్వయింప చేసే హక్కు మనకి వుంది, యేమంటే నిజంగా కదిలించివేసే రష్యన్ జీవితపు విశాల దృశ్యం ఆయన రచనల పుటల్లో కనిపిస్తుంది ("బాల్యం", "నా బాల్యసేవ", "నా విశ్వవిద్యాలయాలు" అన్న త్రయం; "అర్తమొనోవ్‌ల కేసు", "ఫోమా గోర్దేయెవ్" అనే నవలలు; "అధోజనం", "ది ఫిలిస్టయిన్స్",

''దాచాల్లో వుండే జనం'' ''ఎగోర్ బులిచ్యోవూ, ఇతరులూ'', ''వాస్సా జెలెజ్నోవా'' యింకా చాలా రచనలు). అందుకనే గోర్కీ సృజనాత్మక కృషిని 19వ శతాబ్దపు ఆఖరిలోనూ, 20వ శతాబ్దపు తొలి దశాబ్దుల్లోనూ వుండిన రష్యన్ జీవితపు విజ్ఞాన సర్వస్వం అనడంలో అతిశయోక్తి లేదు.

గోర్కీకి చిన్నప్పటినుంచీ విప్లవోద్యమంతో సన్నిహిత సంబంధాలున్నాయి. యీ విష యంలో కూడా రచయితగా ఆయన ప్రత్యేకత వుంది. జారు ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాల్లో ఆయన పాల్గొన్న ప్రధాన ఘట్టాలని చూద్దాం: మార్క్సిస్టు బృందపు కార్యకలాపాల్లో పాల్గొన్నందుకు 19వ శతాబ్దపు 80వ దశకం చివర్లో తొలి సారిగా ఆయన అరెస్ట్ అయాడు — యింతకీ, సరిగ్గా ఆ క్షణంనుంచే గోర్కీ మీద జారిస్టు పోలీసుల నిరంతర నిఘా మొదలైంది; విద్యార్థుల ప్రదర్శనని చెదరగొట్టిన దానికి వ్యతిరేకంగా నిరసన తెలియజేసినందుకూ, జారిస్టు నియంతృత్వాన్ని కూలదొయ్యమని పిలుపు యిచ్చినందుకూ 1901లో రెండవ సారి అరెస్టుచేశారు. (ఆయన్ని ప్రస్తుతం గోర్కీ నగరం అని పిలిచే ఆనాటి నీజ్నీ నొవ్‌గొరొద్‌కి ప్రవాసం పంపేరు); 1902లో గోర్కీని సైన్స్ అకాడెమీకి గౌరవ అకడెమీషియన్‌గా యెన్నుకున్నారు, కాని జార్ రెండవ నికొలస్ ఫర్మానావల్ల ఆ యెన్నికలు రద్దయ్యాయి. సెయింట్ పీటర్స్‌బుర్గ్‌లో 1905 జనవరి 9న శాంతియుత ప్రదర్శనమీద కాల్పులు జరి గిన తర్వాత, నిరంకుశ ప్రభుత్వాన్ని కూలదొయ్యమని నూతనంగా పిలుపు యిస్తూ గోర్కీ విప్లవ కరపత్రాన్ని రాశాడు. అందుగ్గాను ఆయన్ని మళ్లీ అరెస్ట్ చేసి సెయింట్ పీటర్ అండ్ పాల్ కోటలో ఖైదు చేశారు. కాని, విస్తృతమైన ప్రజాభిప్రాయం వల్ల, రష్యాలోనూ పశ్చిమ యూరప్ దేశాల్లోనూ ప్రముఖ మేధావుల నుంచి వచ్చిన నిరసనలవల్లా ప్రభుత్వం గోర్కీని విడుదల చెయ్యాల్సివచ్చింది. కాని 1905 నాటి మాస్కో తిరుగుబాటులో పాల్గొన్న తర్వాత కొత్త న్యాయ విచారణ బెదిరింపు తయారైంది ఆయనకి. అందుకనే 1906 ఆరంభంలో యీ విప్లవ రచయిత పశ్చిమ దేశాలకి వెళ్లిపోవాల్సి వచ్చింది. 1913లో క్షమాపణం జరిగిన తర్వాతనే ఆయన స్వదేశానికి తిరిగి రాగలిగాడు. ప్రపంచం మొత్తంమీద యిలాంటి జీవిత చరిత్ర వున్న రచయితలేడని మనం న్యాయంగానే చెప్పగలం.

యీ శతాబ్ది ఆరంభంనుంచీ సాహిత్య శక్తుల దృఢ సంధాన కర్తగా గోర్కీ ముందుకు వచ్చాడు. యీ రంగంలో కూడా ఆయన ఒక నూతన తరహా కథా కారుడు — నిర్మాణ దక్షుడు అయిన వ్యక్తిగా, ప్రజల కళకోసం, జీవిత సత్యపు కళకోసం తనతోబాటు పోరాడగల రచయితలని ఐక్యంచేస్తూ కృషి జరిపాడు. ఆయన నిర్వహించిన యీ కార్యకలాపాలకి మహత్తర సైద్ధాంతిక, సౌందర్యాత్మక, బోధనా

శక్తి ప్రాముఖ్యం వుంది. ఆ కార్యకలాపాలు సకల దిశలతోనూ 1917 అక్టోబరు విప్లవం తర్వాత కూడా కొనసాగాయి.

గోర్కీని సోషలిస్టు వాస్తవికత తరహా సోవియట్ సాహిత్య వ్యవస్థాపకుడు అనడం సబబే. ఆయన వ్యక్తిత్వం, సృజనాత్మక కృషి, నిర్మాణ, సాహిత్యపర కార్యకలాపాలు — అన్నీ అనేక విధాలుగా (మరి యెంతో ముఖ్యమైనవి అవి!) సోవియట్ సాహిత్య అభివృద్ధినీ, దాని ప్రత్యేక లక్షణాలనీ, కళాత్మక సూత్రాలనీ నిర్ణయించాయి.

సాహిత్యంలోనూ, కళలోనూ సృజనాత్మక పద్ధతిగా సోషలిస్టు వాస్తవికత అనేది యిరవైయవ శతాబ్దపు ఆదిలో రూపొందింది, ప్రపంచం సోషలిస్టు రీతిలో పరివర్తన చెందే ఆరంభ సంవత్సరాల్లో దృఢంగా స్థాపితం అయింది. యు.ఎస్.ఎస్. ఆర్.లో అది ప్రధాన సాహిత్య రీతి అయింది. విప్లవాత్పూర్వపు సాహిత్యానుభవాన్ని (మొట్టమొదటగా గోర్కీది) సోవియట్ సాహిత్యపు ప్రత్యేకతలనీ ''సోషలిస్టు వాస్తవికత'' అనే పదబంధం సామాన్యంగా వివరిస్తుంది. యిది సోవియట్ పత్రికలలో మొట్టమొదటి సారిగా 1932లో కనిపించింది. రష్యన్ ప్రామాణిక సాహిత్యపు అత్యుత్తమ వారసత్వాన్ని అందుకున్న సోషలిస్టు వాస్తవికత అదే సమయంలో సాహిత్యాభివృద్ధిలో గుణాత్మకమైన ముందడుగు. అద్భుతమైన చారిత్రక అనుభవంలో యీ పద్ధతి నవ్యతకీ, శక్తికీ ఆధారం వుంది — శ్రామిక విప్లవం కోసం, శాస్త్రీయ సోషలిజం పునాదిగా సమాజాన్ని మార్చడం కోసం పోరాటం అనే అనుభవం. శాస్త్రీయ సోషలిజం నూతన తరహా రచయిత జీవిత తత్వశాస్త్రాన్ని నిర్ణయించింది, అదే అతని నాయక పాత్రలమీదా, కళాత్మక సాధనాలమీదా ప్రభావాన్ని కలిగించింది. సోషలిస్టు వాస్తవికతా సాహిత్యపు కళాత్మక ఆవిష్కరణ అది అభివృద్ధి చెందే తొలి దశల్లోనే వెల్లడి అయింది. ''అమ్మ,'' ''శత్రువులు,'' ''అర్తమోనావ్‌ల కేసు,'' ''క్లీమ్ సామ్‌గీన్ జీవితం'' లాంటి గోర్కీ రచనలతో మొదలైన ఈ పద్ధతి, సాహిత్యంలోకి నూతన వస్తువునీ, నాయకులనీ ప్రవేశపెట్టడమే కాక అది ఒక నూతన సౌందర్య ఆదర్శంగా, చారిత్రక ఆశావాదంగా రూపొందింది. సాంఘిక, విప్లవాత్మక అభివృద్ధి దృష్టి రీత్యా యీనాటి వైరుధ్యాలని వెల్లడి చేయడం జరిగింది.

పాత కొత్త ప్రపంచాల మధ్య పోరాటం సోవియట్ సాహిత్యం తొలి అడుగులు వేసినప్పుడే దాని ప్రధాన యితివృత్తం అయింది. ''ప్రపంచవ్యాప్త విప్లవాగ్ని'' ఒక నూతన చారిత్రక వస్తువు అయి కళని సంపద్వంతం చేసింది. దీన్ని బట్టి జీవితపు కళాత్మక చిత్రీకరణ మారింది.

సోషలిస్టు వాస్తవికత పద్ధతి ఆధారంలో మూడు యదార్థాలని — భూత భవిష్యత్ వర్తమానాలని — మేళవించడం అనేది గోర్కీ భావం. అంటే అభివృద్ధిలో, పోరాటంలో వాస్తవాన్ని చిత్రించడం, భవిష్యత్ సమున్నత స్థానంనుంచి గతాన్ని దర్శించడం. ''మన వాస్తవికత సకల వైవిధ్యంలోనూ దాని ప్రధాన ధోరణుల్ని వెల్లడిచెయ్యడం వుండాలి'' అని గోర్కీ యెన్నో సార్లు నొక్కిచెప్పాడు. యీ సోవియట్ కళ కొత్త పద్ధతిని ''ప్రపంచాన్ని మార్చే ప్రజల వాస్తవికతగా'' గోర్కీ నిర్వచించాడు. ఆయన సోవియట్ కళలో రొమాంటిక్ సూత్రాల హక్కుల్ని తరచుగా సమర్థించాడు. వాటిని పోరాట నిర్వహణ వీరోచిత ఉత్సాహంతోటీ సద్గుణ పాత్రల సృష్టి కర్తవ్యంతోటి సంధించాడు. సోవియట్ రచయితల మొదటి మహాసభ ప్రతినిధుల నుద్దేశించి మాట్లాడుతూ ఆయన యిలా అన్నాడు: ''శ్రమ మన పుస్తకాల ప్రధాన నాయకుడు కావాలి. అంటే శ్రమక్రమంలో వ్యవస్థీకృతమైన మానవుడు...''

ప్రచారకునిగా, సాహిత్య సిద్ధాంతవేత్తగా, విమర్శకునిగా గోర్కీ వి. బెలిన్‌స్కీ, ఎన్. చెర్నిషేవ్‌స్కీ, ఎమ్. ద్రొబొల్యూబొవ్‌ల రష్యన్ విప్లవ ప్రజాస్వామిక విమర్శనా సంప్రదాయాలని కొనసాగించి, అభివృద్ధి చేశాడు. ఆయన బ్రహ్మాండమైన పాండిత్యం కళాత్మక అభిరుచితోటీ, ఆలోచనా నైపుణ్యంతోటీ, భాషపట్ల విశిష్టమైన అనుభూతితోటీ కలిసి సాహిత్యంమీద ఆయన రాసిన అసంఖ్యాక సైద్ధాంతిక, విమర్శనాత్మక వ్యాసాల్లోనూ, ప్రసంగాలలోనూ నోట్సుల్లోనూ, ఉత్తరాల్లోనూ ప్రసరించింది. వీటిల్లో గోర్కీ సోవియట్ సాహిత్యంమీద, దాని కర్తవ్యాలమీద, శైలులమీద, పద్ధతులమీద, నూతన సమాజ నిర్మాణంలో సోవియట్ రచయిత స్థానంమీద, రష్యన్ సాహిత్యంలోనూ, ప్రపంచ సాహిత్యంలోనూ గల ఉత్తమ కళా ఖండాలమీద దృష్టి లగ్నం చేశాడు. సంస్కృతిమీద గోర్కీ వెలిబుచ్చిన భావాలూ, అభిప్రాయాలూ సాహితీ కళా రంగాల్లో వున్న వాళ్లకేగాక, మామూలు జనానికి కూడా, మార్క్సిస్టు లెనినిస్టు అలంకార శాస్త్రానికి వెలలేని సేవజేసిన నిష్ణాతుడి గాథ, గంభీర చింతనగా మహా ఆసక్తికరంగా వుంటాయి.

## 2

ప్రజల కళలో — జానపదంలోనూ, పురాణంలోనూ — గోర్కీకి ప్రజల ఆలోచనలా, అనుభూతులా సౌష్ఠవ ఐక్యం కనిపించింది. అందులో ఆయన ''అతి గంభీరమైన, తేజోవంతమైన, కళాత్మకంగా పరిపూర్ణమైన నాయకుల నమూనాల''ని చూశాడు. పాఠకుడు దర్శించబోయేటట్టు, అది గోర్కీకి తన జీవితంలో యెంత

కాలంగానో పదేపదేమకున్న భావాల్లో ఒకటి. ఆయన అలంకార శాస్త్రంలో మరో ముఖ్యమైన సూత్రంతోటి అది సన్నిహితంగా కలిసిపోయింది — సౌందర్యానుభూతి అభివృద్ధిలోనూ, మొత్తంమీద సృజనాత్మక కృషిలోనూ శ్రమకి గల మహత్తర ప్రాముఖ్యాన్ని చాటడం. "వ్యక్తిత్వపు వినాశనం" అన్న వ్యాసంలో యీ భావాన్ని ఆయన యీ రకంగా సూత్రీకరించాడు: "ప్రజ సకల భౌతిక విలువలనీ ఉత్పత్తి చేసే శక్తే కాదు, ప్రజలే ఆధ్యాత్మిక విలువలకి తరగని ఆధారం; కాల, సౌందర్య, మేధా ప్రమాణాల రీత్యా తొలి తత్వవేత్తా, కవీ ప్రజే; అన్ని మహా కావ్యాలకీ, ప్రపంచపు సకల విషాదాంత నాటకాలకీ, అన్నిటికంటే మహత్తరమైంది — ప్రపంచ సంస్కృతి చరిత్రకీ, కర్త ప్రజే." యీ ప్రధాన స్థానంమీద ఆధారపడే గోర్కీ, రచయితల్ని స్వరమేళన కర్తలనీ, కళాకారుల్ని ప్రజల అనుభూతులకీ, భావాలకీ, భాషకీ మూల స్థానం అయిన జానపద సాహిత్యాన్ని తమ సృజనాత్మక కృషిలో వాడుకోవలసిందిగా ఉద్బోధించాడు. మనం మరో విషయాన్ని — గోర్కీకి చాలా ముఖ్యమైన దాన్ని — యీ అలంకార శాస్త్ర సమస్యకి సంబంధించి నొక్కి చెప్పాలి: ప్రజల సృజనాత్మక కృషిలో, జానపద సాహిత్యంలో, ఆయా సంస్కృతుల జాతీయ విలక్షణతలని పెంచి, కళా, సాహిత్యాల్లో జాతీయ ప్రత్యేక లక్షణాలని సృష్టింపచేటువంటి చలమని, ఆధారాలని ఆయన దర్శించాడు.

తనకి పంపించిన యువ రచయితల రచనలని విశ్లేషణచేసి, వాళ్లకి గోర్కీ చేసిన సూచనలు, ఆయన రాసిన ఉత్తరాలు, వ్యాసాలు అన్నీ కూడా భాషా స్వచ్ఛత కోసం ఆదుర్దాతోటీ ప్రజలనుంచీ కళా నిష్ణాతులనుంచీ అధ్యయనం చెయ్యడం కోసమూ సలహాలతోటీ, నిండిపోయి వుంటాయి. ముప్పైయ్యవ దశకపు ఆరంభంలో భాషాపరంగా అదిమత్వం వుండేది. "సద్యోజనిత భాషణ" అనే నినాదంతోటి వృత్తి పరత్వమైనా, స్థానికమైనా, మాండలికమైనా పదాలతోటి సాహిత్యాన్ని సంకరం చెయ్యడం జరిగేది. వాటికి వ్యతిరేకంగా ఆయన రాసిన దృఢమైన వ్యాసాలు ప్రయోజన పుష్టమైన చర్చలకి దారితీశాయి. ఆ చర్చల ఫలితాలు సోవియట్ సాహిత్యపు భవిష్యదభివృద్ధికి చాలా ఉపయోగకరం అయాయి.

భాషలో లాంఛన ప్రాయమైన ప్రయోగాలకీ, ప్రజల భాషా జీవితాలకి సంబంధంలేని "పదాల కూర్పు"కి వ్యతిరేకంగా అదే పట్టుదలతోటీ, స్థిరత్వంతోటీ గోర్కీ పోరాడాడు. గోర్కీ అస్తమానూ అంటూ వున్నట్టుగా జీవద్భాషని ప్రజలే సృష్టిస్తారు, పెంపొదిస్తారు. సాహిత్యంలో నిష్ణాతులైన వాళ్లు సాహిత్య భాషగా దాన్ని పరిపుష్టం చేసి, మెరుగులు దిద్దుతారు. జానపద సంస్కృతీ భాషా సంపదని వాడుకోవడమే కాకుండా, నిరంతరం పూష్కిన్, గోగొల్, టాల్‌స్టాయ్,

కాలంగానో పదేపదేమకున్న భావాల్లో ఒకటి. ఆయన అలంకార శాస్త్రంలో మరో ముఖ్యమైన సూత్రంతోటి అది సన్నిహితంగా కలిసిపోయింది — సౌందర్యానుభూతి అభివృద్ధిలోనూ, మొత్తంమీద సృజనాత్మక కృషిలోనూ శ్రమకి గల మహత్తర ప్రాముఖ్యాన్ని చాటడం. "వ్యక్తిత్వపు వినాశనం" అన్న వ్యాసంలో యీ భావాన్ని ఆయన యీ రకంగా సూత్రీకరించాడు: "ప్రజ సకల భౌతిక విలువలనీ ఉత్పత్తి చేసే శక్తే కాదు, ప్రజలే ఆధ్యాత్మిక విలువలకి తరగని ఆధారం; కాల, సౌందర్య, మేధా ప్రమాణాల రీత్యా తొలి తత్వవేత్తా, కవీ ప్రజే; అన్ని మహా కావ్యాలకీ, ప్రపంచపు సకల విషాదాంత నాటకాలకీ, అన్నిటికంటే మహత్తరమైంది — ప్రపంచ సంస్కృతి చరిత్రకీ, కర్త ప్రజే." యీ ప్రధాన స్థానంమీద ఆధారపడే గోర్కీ, రచయితల్నీ స్వరమేళన కర్తలనీ, కళాకారుల్నీ ప్రజల అనుభూతులకీ, భావాలకీ, భాషకీ మూల స్థానం అయిన జానపద సాహిత్యాన్ని తమ సృజనాత్మక కృషిలో వాడుకోవలసిందిగా ఉద్బోధించాడు. మనం మరో విషయాన్ని — గోర్కీకి చాలా ముఖ్యమైన దాన్ని — యీ అలంకార శాస్త్ర సమస్యకి సంబంధించి నొక్కి చెప్పాలి: ప్రజల సృజనాత్మక కృషిలో, జానపద సాహిత్యంలో, ఆయా సంస్కృతుల జాతీయ విలక్షణతలని పెంచి, కళా, సాహిత్యాల్లో జాతీయ ప్రత్యేక లక్షణాలని సృష్టించేటువంటి చలమని, ఆధారాలని ఆయన దర్శించాడు.

తనకి పంపించిన యువ రచయితల రచనలని విశ్లేషణచేసి, వాళ్లకి గోర్కీ చేసిన సూచనలు, ఆయన రాసిన ఉత్తరాలు, వ్యాసాలు అన్నీ కూడా భాషా స్వచ్ఛత కోసం ఆదుర్దాతోటీ ప్రజలనుంచీ కళా నిష్ణాతులనుంచీ అధ్యయనం చెయ్యడం కోసమూ సలహాలతోటీ, నిండిపోయి వుంటాయి. ముప్ఫైయ్యవ దశకపు ఆరంభంలో భాషాపరంగా ఆదిమత్వం వుండేది. "సద్యోజనిత భాషణ" అనే నినాదంతోటి వృత్తి పరత్వమైనా, స్థానికమైనా, మాండలికమైనా పదాలతోటి సాహిత్యాన్ని సంకరం చెయ్యడం జరిగేది. వాటికి వ్యతిరేకంగా ఆయన రాసిన దృఢమైన వ్యాసాలు ప్రయోజన పుష్టమైన చర్చలకి దారితీశాయి. ఆ చర్చల ఫలితాలు సోవియట్ సాహిత్యపు భవిష్యదభివృద్ధికి చాలా ఉపయోగకరం అయాయి.

భాషలో లాంఛన ప్రాయమైన ప్రయోగాలకీ, ప్రజల భాషా జీవితాలకి సంబంధంలేని "పదాల కూర్పు"కి వ్యతిరేకంగా అదే పట్టుదలతోటీ, స్థిరత్వంతోటీ గోర్కీ పోరాడాడు. గోర్కీ అస్తమానూ అంటూ వున్నట్టుగా జీవద్భాషని ప్రజలే సృష్టిస్తారు, పెంపొందిస్తారు. సాహిత్యంలో నిష్ణాతులైన వాళ్లు సాహిత్య భాషగా దాన్ని పరిపుష్టం చేసి, మెరుగులు దిద్దుతారు. జానపద సంస్కృతీ భాషా సంపదని వాడుకోవడమే కాకుండా, నిరంతరం పూష్కిన్, గోగొల్, టాల్స్టాయ్,

రష్యన్ రచయితలతోటి తన సమావేశాలని గురించి గోర్కీ రాసిన జ్ఞాపకాలూ, స్మృతులూ వాటికి అవే ఆయన కళాత్మక కృషిలో ఒక ప్రత్యేక ప్రక్రియ. తన "సాహిత్య చిత్రాలు"లో తమ విశిష్టతలతోటీ, వైయక్తిక ధోరణులతోటీ వుండే వాస్తవ వ్యక్తుల రూపాలని సృష్టించ ప్రయత్నించాడు గోర్కీ. అదే సమయంలో సామాన్యంగా 'మానవుడు' అనే భావానికి ఉదాహరణగా ప్రతి వ్యక్తినీ ఆయన చూపించాడు. తన సాహిత్య జ్ఞాపకాలలో ఆయన రచయిత వి. కొరొలేంకొని — పొడుగునా, "రష్యన్ రచయిత ఆదర్శ రూపం"గా చిత్రించాడు. (ఈ వ్యాసం యీ సంకలనంలో లేదు.) గోర్కీ కళాఖండాల్లో ఒకటనదగిన రచన టాల్‌స్టాయ్ గురించి ఆయన వ్యాసం. దాన్ని ప్రత్యేక ధోరణిలో రాశాడాయన. టాల్‌స్టాయ్‌ని గురించిన వ్యాసం మొత్తం వాగ్వివాద ధోరణితో నిండిపోయి వుంది. గోర్కీ పాఠకుడికి అందించిన ప్రధాన అంశం యిది: టాల్‌స్టాయ్‌కి జీవితంపట్ల యెంతో ప్రేమ. ఆయన ఆదర్శాలైన సంయమితుల్య ఆత్మత్యాగం, దౌర్జన్య నిరోధం కూడదనే నిరాండర తాత్వికత దానితో యెంత మాత్రమూ పొసగని వైరుధ్యం అని రుజవవుతుంది. ఆ రకంగా టాల్‌స్టాయ్ "క్రైస్తవమతం"లోని కృతకత్వం వెల్లడవుతుంది. యీ అంతర్గత వాగ్వివాదాలెలా వున్నా, టాల్‌స్టాయ్‌ని "ఉన్మత్తకారకమైన, చిత్త శాంతికి భంగకరమైన ఆకర్షణీయ వ్యక్తి, సర్వమానవాళికీ చెందిన వ్యక్తి" అనీ, రష్యన్ సాహిత్యపు కీర్తి, గర్వకారణమూ అయిన వ్యక్తి అనీ గోర్కీ భావించాడు. గోర్కీ చిత్రించిన రష్యన్ రచయితల గాలరీనుంచి యిక్కడ స్థలాభావంవల్ల టాల్‌స్టాయ్, చేహొవ్, ప్రిష్విన్, లెస్కోవ్‌ల గురించి వున్న నాలుగు వ్యాసాలని మాత్రమే ప్రచురిస్తున్నాం. అయినా కానీ, అనుకూల, ప్రతికూల వైవిధ్యపు మొత్తంలో, ప్రతి వ్యక్తికీ సాధారణంగా వుండే గుణాలనీ, వ్యక్తిగతంగా ప్రత్యేకం వుండే గుణాలనీ వివరిస్తూ ఆ రచయిత వ్యక్తిత్వాన్ని వర్ణించే గోర్కీ నేర్పేగాక, ఆయా రచయితల సృజనాత్మక కృషిలోని సారాన్ని వెల్లడి చేసే గోర్కీ నైపుణ్యాన్ని కూడా పాఠకుడు గుర్తిస్తాడని మా నమ్మకం.

"....ప్రపంచ సంస్కృతీ యుగాలని విప్లవంతోటి యింకా దివ్యంగా సంధించగలగడంలో గోర్కీతో యెవరూ యెన్నడూ సములు కారు" అన్నాడు రొమేన్ రోలాన్. 20వ శతాబ్దపు మహత్తర ఫ్రెంచి రచయిత అన్న యీ మాటల్లో గోర్కీ కృషిని గాఢంగా నిజంగా అభినందించడం యెవరికేనా కనిపిస్తుంది. ప్రపంచ సాహిత్యాన్ని విస్తృత శ్రామిక ప్రజా బాహుళ్యానికి పరిచయం చెయ్యాలనీ, చేరువకి తీసుకెళ్లాలనీ, ప్రపంచ సాహిత్యపు కళాఖండాలని ప్రజలకి అందుబాటులోకి తేవాలనీ గోర్కీ మనసా, వాచా తపన పడ్డాడు. శ్రామికవర్గం సృష్టించే

సమాజపు కళాత్మక సంస్కృతిని రూపొందించే క్రమంలో ప్రపంచ సాహిత్య గ్రంథాల ప్రాముఖ్యాన్ని ఆయన గుర్తించాడు. 1919లో గోర్కీ ప్రోద్బలంతోటి ''ప్రపంచ సాహిత్య'' ప్రచురణ సంస్థని నిర్వహించడం జరిగింది. ప్రపంచంలో అద్వితీయమైన యీ ముందు చూపు వున్న ప్రోద్బలంతోటి ఆ సంస్థ యు.ఎస్.ఎస్.ఆర్. ప్రజల భాషలలోకి ప్రపంచ సాహిత్యపు ఉద్గ్రంథాలని, ఆధునిక అభ్యుదయ సాహిత్యాన్నీ అనువాదం చేసి, ప్రచురించే బ్రహ్మాండమైన, క్రమబద్ధ మైన కృషిని ఆరంభించింది. 1920లో సోవియట్ రష్యాని దర్శించిన హెర్బర్ట్ వెల్స్ గోర్కీ సృష్టించిన దీన్ని గురించి యిలా రాశాడు: ''యీ దురవగాహ మైన రష్యాలో, యుద్ధనిమగ్నమై, చలితో ఆకలితో దుర్భర కష్టాలని అనుభవి స్తున్న రష్యాలో, సంపన్నమైన అమెరికాలోగాని, ఇంగ్లండులోగాని అనూహ్యమైన ఒక సాహిత్య కృషి ఆచరణలోకి వస్తోంది.... ఆకలితో అలమటించి మరణించే రష్యాలో వందలాది ప్రజలు అనువాదాల పనిలో వున్నారు. వాళ్లు అనువాదం చేసిన పుస్త కాలు ప్రచురితమవుతున్నాయి. అవి నవ రష్యాకి ప్రపంచ సాహిత్యంతో యెలాంటి పరిచయాన్ని కలిగిస్తాయంటే అలాంటిది యే యితర దేశపు ప్రజల వూహకీ అందదు.'' గోర్కీ చిత్రించినట్టు వ్యక్తిత్వం చరిత్రలో భాగం. చారిత్రకాభివృద్ధిలో ప్రజలే నిర్ణాయక అంశం. కాని చరిత్ర తనే యెప్పుడూ ఒక వ్యక్తిని ప్రభావితం చేస్తుంది.

గోర్కీ వ్యాసాల్లోనూ, ఉత్తరాల్లోనూ యెప్పుడూ యెవళ్లకేనా ప్రజల విష యమే కనిపిస్తుంది. ఆయన కడపటి వ్యాసాల్లో ఒక దాంటో ఆయన సలహా యిచ్చాడు: ''సంస్కృతి చరిత్రని పాత వ్యక్తి పతన గాథగా, దాని అవసానంగా, నూతన ప్రపంచాన్ని నిర్మించే వాళ్ల 'కేంద్రీకృత శక్తి' జ్వాలలో వ్యవస్థీకృతమైన నూతన వ్యక్తి ఉత్థాన గాథగా రాయాలి.''

## 3

మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవం తర్వాత లునచార్స్కీ శక్తీ, నిర్మాణ కృషుల సరసన గోర్కీ నిరంతర కార్యాచరణా, గొప్ప పలుకుబడీ సాంస్కృతిక నిర్మాణంలోకి కళాత్మక మేధావుల విస్తృత బృందాలు రావడానికి నిర్ణాయకమైన పాత్ర వహించాయి. మహత్తర శ్రామికవర్గ రచయిత నిర్వహించిన యీ కర్త వ్యాన్ని గురించి రష్యన్ కవి ఎ. బ్లాక్ యీకింది విధంగా రాశాడు: ''మన కాలపు అత్యుత్తమ కళాకారుడిగా గోర్కీమీద విధి గురుతరమైన భారాన్ని మోపింది. ప్రజలకీ, మేధావులకీ మధ్యన, యింకా తమని తాముగాని ఒకొళ్లనొ

ష్యత్తునీ రెండింటినీ చూడాలి. యిరవయ్యవ దశకపు ఆఖరిలోనూ, ముప్ఫైయవ దశకపు ఆరంభంలోనూ సోవియట్ అలంకారశాస్త్ర చింతనా క్రమంలో గోర్కీ భావాలు కలిసాయి. సోషలిస్టు వాస్తవికత అనే సిద్ధాంత సృష్టిలో సోవియట్ అలంకారశాస్త్రం పరిపూర్తి అయింది.

యు.ఎస్.ఎస్.ఆర్. ప్రజల ఏకీకరణకీ, అభివృద్ధికీ అనువాదాలు చేయించడం ద్వారా, వివిధ రచయితల సంకలిత గ్రంథాలని ప్రచురించడంద్వారా గోర్కీ సేవ చేశాడు. అక్టోబరు విప్లవానికి ముందే, రష్యా ప్రజల సాహిత్యాలకి అంకితమైన సంకలిత గ్రంథాలకి ఆయన సంపాదకత్వం వహించాడు, నిర్వహించాడు. సోవియట్ యూనియన్‌లో జాతీయ సంస్కృతుల వికాసారంభాన్ని 1928లో ఆయన యీ రకంగా వర్ణించాడు: ''యింతకుముందు యెక్కడా యెన్నడూ చూడనటువంటిదాన్ని యిప్పుడు రష్యా అనుభవంలోకి తెచ్చుకుంటోంది.... సోవియట్ల యూనియన్‌లోని అన్ని జాతులూ తమ భాషని మాట్లాడే హక్కునీ, తమ సామర్థ్యాలని అభివృద్ధి చేసుకునేందుకు స్వేచ్ఛగా కృషి చేసే హక్కునీ సంపాదించుకున్నాయి.'' చారిత్రకంగా అనిదంపూర్వ శక్తివంతమైన ''ఐక్య సోషలిస్టు సంస్కృతీ నిర్మాణక్రమాన్ని, యే ఒక్క జాతి ప్రత్యేక లక్షణాలనీ తుడిచి పెట్టకుండా, సర్వ ప్రపంచాన్నీ పునరుద్ధరించే శక్తివంతమైన ఉమ్మడి సోషలిస్టు సంస్కృతిని నిర్మించగలిగే దాన్ని'' గోర్కీ స్పష్టంగా దర్శించాడు. సోవియట్ రిపబ్లిక్కుల బహుళ జాతి సాహిత్యాలకి వస్తువు ఉమ్మడి అయిందే; సాంఘిక ఆదర్శంలోనూ, తమ కమ్యూనిస్టు లక్ష్యాల్లోనూ, ఆకాంక్షల్లోనూ అవి ఉమ్మడిగానే వుంటాయి. కాని అవి ఆలంకారిక విలక్షణాలకీ, అవకాశాలకీ సంబంధించి విభేదిస్తాయి. ఉమ్మడి గమ్యాలతోటీ, ఆదర్శాలతోటీ జాతీయ కర్తవ్యాల ఐక్యం, కళాత్మక రూపాల అనేకత, వాస్తవాన్ని ఆపోశనబట్టే పద్ధతులు, పరస్పర ప్రభావం, పరస్పరం సంపద్వంతం కావించుకోవడం — అదీ సోవియట్ బహుళ జాతి సాహిత్యం నడుస్తూ వుండిన, యిప్పటికీ నడుస్తూ వున్న దారి. మరి గోర్కీ ఆ దారిలో అగ్రభాగాన వున్నాడు.

కార్యాచరణ అనే భావం గోర్కీ భావ విధానంలో బహుశా అతి ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. జీవితం పట్ల క్రియాశీల దృక్పథాన్ని ప్రేరేపించడమే తన ముఖ్య కర్తవ్యంగా పరిగణిస్తున్నానని గోర్కీ పదేపదే చెప్పిన మాటలు బాగా ప్రఖ్యాతమైనవే. కార్యాచరణ కోసం, చారిత్రక సృజనాత్మక కృషి కోసం ఆయన తీవ్ర విజ్ఞాపనలు చేశాడు. అవి యే రకమైన చారిత్రక స్తబ్ధతా భావాలకి గాని, నిష్క్రియాపరత్వానికి గాని, సాంఘిక విధివాదానికి గాని వ్యతిరేకంగా ఆయన చేసిన విజ్ఞప్తుల తీవ్రతకి యే మాత్రం తీసిపోవు. గోర్కీ సాహిత్య కార్యకలాపపు

వృత్తుసీ రెండింటినీ చూడాలి. యిరవయ్యవ దశకపు ఆఖరిలోనూ, ముప్పై యవ దశకపు ఆరంభంలోనూ సోవియట్ అలంకారశాస్త్ర చింతనా క్రమంలో గోర్కీ భావాలు కలిసాయి. సోషలిస్టు వాస్తవికత అనే సిద్ధాంత సృష్టిలో సోవియట్ అలంకారశాస్త్రం పరిపూర్తి అయింది.

యు.ఎస్.ఎస్.ఆర్. ప్రజల ఏకీకరణకీ, అభివృద్ధికీ అనువాదాలు చేయించడం ద్వారా, వివిధ రచయితల సంకలిత గ్రంథాలని ప్రచురించడంద్వారా గోర్కీ సేవ చేశాడు. అక్టోబరు విప్లవానికి ముందే, రష్యా ప్రజల సాహిత్యాలకి అంకితమైన సంకలిత గ్రంథాలకి ఆయన సంపాదకత్వం వహించాడు, నిర్వహించాడు. సోవియట్ యూనియన్‌లో జాతీయ సంస్కృతుల వికాసారంభాన్ని 1928లో ఆయన యీ రకంగా వర్ణించాడు: ''యింతకుముందు యెక్కడా యెన్నడూ చూడనటువంటిదాన్ని యిప్పుడు రష్యా అనుభవంలోకి తెచ్చుకుంటోంది.... సోవియట్ల యూనియన్‌లోని అన్ని జాతులూ తమ భాషని మాట్లాడే హక్కునీ, తమ సామర్థ్యాలని అభివృద్ధి చేసుకునేందుకు స్వేచ్ఛగా కృషి చేసే హక్కునీ సంపాదించుకున్నాయి.'' చారిత్రకంగా అనిదంపూర్వ శక్తివంతమైన ''ఐక్య సోషలిస్టు సంస్కృతీ నిర్మాణక్రమాన్ని, యే ఒక్క జాతి ప్రత్యేక లక్షణాలనీ తుడిచి పెట్టకుండా, సర్వ ప్రపంచాన్నీ పునరు ద్ధరించే శక్తివంతమైన ఉమ్మడి సోషలిస్టు సంస్కృతిని నిర్మించగలిగే దాన్ని'' గోర్కీ స్పష్టంగా దర్శించాడు. సోవియట్ రిపబ్లిక్కుల బహుళ జాతి సాహిత్యా లకి వస్తువు ఉమ్మడి అయిందే; సాంఘిక ఆదర్శంలోనూ, తమ కమ్యూనిస్టు లక్ష్యాల్లోనూ, ఆకాంక్షల్లోనూ అవి ఉమ్మడిగానే వుంటాయి. కాని అవి ఆలంకా రిక విలక్షణాలకీ, అవకాశాలకీ సంబంధించి విభేదిస్తాయి. ఉమ్మడి గమ్యాలతోటీ, ఆదర్శాలతోటీ జాతీయ కర్తవ్యాల ఐక్యం, కళాత్మక రూపాల అనేకత, వాస్తవాన్ని ఆపోశనబట్టే పద్ధతులు, పరస్పర ప్రభావం, పరస్పరం సంపద్వంతం కావించు కోవడం — అదీ సోవియట్ బహుళ జాతి సాహిత్యం నడుస్తూ వుండిన, యిప్పటికీ నడుస్తూ వున్న దారి. మరి గోర్కీ ఆ దారిలో అగ్రభాగాన వున్నాడు.

కార్యాచరణ అనే భావం గోర్కీ భావ విధానంలో బహుశా అతి ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. జీవితం పట్ల క్రియాశీల దృక్పథాన్ని ప్రేరేపించడమే తన ముఖ్య కర్తవ్యంగా పరిగణిస్తున్నానని గోర్కీ పదేపదే చెప్పిన మాటలు బాగా ప్రఖ్యాతమైనవే. కార్యాచరణ కోసం, చారిత్రక సృజనాత్మక కృషి కోసం ఆయన తీవ్ర విజ్ఞాపనలు చేశాడు. అవి యే రకమైన చారిత్రక స్తబ్దతా భావాలకి గాని, నిష్క్రియాపరత్వానికి గాని, సాంఘిక విధివాదానికి గాని వ్యతిరేకంగా ఆయన చేసిన విజ్ఞప్తుల తీవ్రతకి యే మాత్రం తీసిపోవు. గోర్కీ సాహిత్య కార్యకలాపపు

ప్రధాన కర్తవ్యం, ఆయన మానవతావాదపు సారం మానవుణ్ణి ''సంకుచిత యాదార్థ్యపు సంకెళ్ల''నుంచి విడదియ్యడమూ, పరిస్థితుల బానిసని జీవితపు స్వేచ్ఛా నిర్మాతకి పోటీ పెట్టడమూనూ. గోర్కీ యీ భావన గతకాలపు కళలోని ''దయార్ద్రభరిత మానవత్వం''తోటి రచయిత పోరాటం అనేదాన్నీ, గోర్కీ ప్రకటన ''అన్నీ మానవునిలో వున్నాయి, అన్నీ మానవుని కోసమే'' అనేదాన్నీ విశదం చేస్తుంది.

గోర్కీ సాంఘిక జీవితం యీ కార్యాచరణతోటి నిండిపోయి వుంది. విప్లవాత్మక కార్యకలాపాలని గురించీ, అక్టోబరు విప్లవం వచ్చిన మరుక్షణంనుంచీ దేశ సాంస్కృతిక జీవితంలో ఆయన ప్రముఖంగా, క్రియాశీలంగా పాల్గోవడాన్ని గురించి యిదివరకే ప్రస్తావించాం. ముప్పయ్యవ దశకపు ఆరంభంనుంచీ ఆయన ప్రోద్బలంతోటీ, ఆయన సంపాదకత్వం కింద ''మా విజయాలు'', ''నిర్మాణంలో యు.ఎస్.ఎస్.ఆర్.'', ''సాహిత్య అధ్యయనాలు'', ''విదేశంలో'', ''విశిష్టవ్యక్తుల జీవితాలు'' అన్న సీరీస్‌లూ ప్రచురితం అయాయి. గోర్కీ ప్రోత్సాహంమీదే ''అంతర్యుద్ధ చరిత్ర'' ప్రచురణ మొదలయింది, ''కవి గ్రంథాలయం'' అన్న పేరుతో రష్యన్ కవిత్వ చరిత్ర గ్రంథావళి మొదలయింది.

సోవియట్ దేశ నిర్మాణపు అనేక పార్శ్వాలమీద, శాంతి ప్రజాస్వామ్యం, సోషలిజం రక్షణమీద నూతన యుద్ధ సన్నాహాలు చేసిన సామ్రాజ్యవాదులకి వ్యతిరేకంగా గోర్కీ యిచ్చిన అసంఖ్యాక రాజకీయ ఉపన్యాసాలకి యెంతో ప్రాముఖ్యం వుంది. యీ రచయిత అంతర్జాతీయ యుద్ధ వ్యతిరేక మహాసభల నిర్వహణకి సహకరించాడు. తన ఉత్తరాలద్వారా, గోష్ఠులద్వారా, వ్యాసాలద్వారా ఫాసిజానికి వ్యతిరేకంగా, శాంతి కోసం జరిగే పోరాటాల్లో అభ్యుదయ భావాలున్న విదేశీ రచయితలు, శాస్త్రజ్ఞులు, సాంస్కృతిక కార్యకర్తలు పాల్గొనేటట్టు ఆయన దోహదం చేశాడు. సకల ప్రపంచ మేధావులనీ ఉద్దేశించిన '''సంస్కృతీ నిష్ణాతులాలా' మీరు యెవరి పక్షం?'' అనే తన వ్యాసంలో గోర్కీ పోరాటానికి దూరంగా నిలబడి పోయిన వాళ్ల కుహనా మానవతావాదాన్ని సింహాసనచ్యుతం చేశాడు; చెడుకీ, దోపిడీకీ, బానిసత్వానికీ వ్యతిరేకంగా క్రియాశీల పోరాటం కోసం పిలుపు యిచ్చే శ్రామిక వర్గ సోషలిస్టు మానవతావాద భావాలని ప్రచారం చేశాడు.

* * *

మహత్తర శ్రామికవర్గ రచయిత, సోవియట్ సాహిత్య వ్యవస్థాపకుడూ చెప్పిన ప్రధాన సిద్ధాంత సూత్రాలని గాని, భావాలని గాని ఒక చిన్న పరిచయ

వ్యాసంలో పైపైన తడమడం అనేది కూడా అసాధ్యం అని వేరే చెప్పక్కర్లేదు.

కాని యీ సంకలనంలో చేర్చిన వ్యాసాలు మార్క్సిస్టు లెనినిస్టు అలంకార శాస్త్రపు ప్రధాన సమస్యలనీ, సోవియట్ కళా, సాహిత్యాల అభివృద్ధి ఆధారపడి వున్న ఆ సూత్రాలనీ బాగా అర్థం చేసుకోవడానికి పాఠకుడికి తోడ్పడతాయని మా నమ్మకం.

రచయిత వ్యక్తిత్వం గురించీ, తన సమకాలికులతో ఆయన సంబంధాల స్వభావాన్ని గురించీ పాఠకుడు బాగా అర్థం చేసుకోవడానికీ యీ వ్యాసాలు సహకరిస్తాయి.

డాక్టరు ఎ. ఎర్మకోవ్

ఒక క్షణం ఆగి, ఆయన చెయ్యి చాచి మెల్లిగా అన్నాడు:

''మన రష్యా యెంత అసంబద్ధమైన, వికృత దేశం!''

ఒక దీర్ఘ విచార ఛాయ ఆయన అందమైన కళ్లని కమ్మింది. చక్కని మృదుతరం వరస కనుకొలకుల్లో ప్రత్యక్షమై ఆయన చూపుని గాఢం చేసింది. ఆయన చుట్టూతా చూసి తనని తనే వేళాకోళం చేసుకోవడం మొదలుపెట్టాడు.

''అదీ విషయం — ఒక ఉదారవాద వార్తాపత్రికలో ముఖ్యమైన వ్యాసానికి సరిపడా సమాచారం మీకు యిచ్చేశాను. రండి, మీ ఓపికకి బహుమానంగా కాస్త టీ యిస్తాను....''

తరచుగా ఆయనతో అలానే వుంటుంది. ఒక క్షణంలో ఆయన ఆత్మీయతతోటే, గంభీరతతోటే, చిత్తశుద్ధితోటే మాట్లాడతాడు. ఉత్తర క్షణంలో తనన్న దాని పట్ల తనే నవ్వుకుంటాడు. యీ మృదువైన, విచారభరితమైన నవ్వు కింద మాటల విలువా, కలల విలువా తెలిసిన మనిషికి వుండే సూక్ష్మ సంశయాత్మక దృష్టి యెవళ్లకేనా తగుల్తుంది. దీనితో బాటుగా, ఒక ఆకర్షకమైన వినయ లక్షణపు ఛాయ, సహజాతమైన సున్నితత్వం ఆయన నవ్వులో ద్యోతకం అవుతాయి.

మేం ఆయన యింటికి తిరిగి నిశ్శబ్దంగా వెళ్లాం. ఆ రోజు వెచ్చగా, ప్రకాశవంతంగా వుంది. మబ్బుల్లేని యెండలో తళతళ మెరుస్తూ, అలల శబ్దం వినిపిస్తోంది. లోయలో కుక్క యేదో దేన్ని గురించో తన సంతోషాన్ని తెలియజేస్తూ కీచుమంటోంది. చేహొవ్ నా చేతిని పట్టుకుని మెల్లిగా అన్నాడు, మధ్య మధ్య దగ్గు తెర అడ్డం వచ్చింది:

''యిది చాలా అవమానకరమైందీ, విచారకరమైందినీ. కాని యిది నిజం — కుక్కలయి వుంటే మేలనేవాళ్లు చాలా మంది వున్నారు....''

తర్వాత ఆయన నవ్వుతూ అన్నాడు:

''యివాళ నే మాట్లాడేదంతా వార్ధక్యద్యోతకంగానే వుంది — నేను ముసలి వాణ్ణి అయిపోతున్నాను.''

మళ్లీ మళ్లీ ఆయన యిలా అంటూ వుండడం నేను విన్నాను:

''చూశారా — ఒక ఉపాధ్యాయుడు యిప్పుడే వచ్చాడు.... అతనికి వంట్లో బాగా లేదు, భార్య వుంది — మీరు ఆయనకి యేమన్నా చెయ్యగలరా, యేం? నేను యీ వేళకే రమ్మన్నానతన్ని....''

లేదా:

''గోర్కీ, విన్నారా! ఒక ఉపాధ్యాయుడు మిమ్మల్ని కలుసుకోవాలను కుంటు

న్నాడు. అతను జబ్బుతోటి మంచాన పడివున్నాడు. అతన్ని చూడకూడదూ మీరు వెళ్లి?''

లేదా:

''ఓ ఉపాధ్యాయుడు వున్నాడు అతనికి పుస్తకాలు కావాల్ట....''

ఒకో అప్పుడు నాకు యీ ''ఉపాధ్యాయుడు'' ఆయన యింట్లోనే కనిపించే వాడు — మామూలుగా ఆ ఉపాధ్యాయుడు తన దేబితనం తనకే తెలిసినట్టు ముఖం యెఱ్ఱబారి, కుర్చీ అంచున కూర్చుని, చెమటలు కక్కుతూ మాటల్ని తడుముకుంటూ, తనకి చేతనైనంత వరకూ ''చదువుకున్న వాడి''లా మెత్తగా మాట్లాడ ప్రయత్నించే వ్యక్తి. లేదా, బహుశా అప్పుడే తన బుఱ్ఱకి తట్టిన ప్రశ్నలతోటి చేహోవ్‌ని ముంచెత్తి ఆ రచయిత దృష్టిలో బడుద్ధాయిలాగా కనిపించకూడదనే కోరికలో పూర్తిగా మునిగిపోయి రోగం లాంటి సిగ్గరితనపు అతి చనువు వుండే వ్యక్తి అయి వుండేవాడు.

చేహోవ్ అతని మోటు మాటలని శ్రద్ధగా వినేవాడు. ఆయన విచారభరిత నేత్రాలని ఒక చిరునవ్వు వెలిగించేది. కణతలమీద ముడతలు యేర్పడేవి. ఆయన లోతైన, మృదువైన, నిశ్చల స్వరంతో సాదా మాటలని, స్పష్టమైన పదాలని, జీవితానికి సన్నిహితంగా వుండే వాటిని ఉపయోగిస్తూ మాట్లాడేవాడు. దాంతోటి అతిథి తక్షణం కులాసాగా అయేవాడు. యుక్తిగా కనిపించాలనే ప్రయత్నం మానేసే వాడు. తత్ఫలితంగా యింకా తెలివిగానూ, యింకా ఆసక్తికరంగానూ అయేవాడు....

యీ ఉపాధ్యాయులలో ఒకరు నాకు గుర్తు వున్నాడు. పొడగరి, సన్నగా వున్నాడు. పాలిపోయి శుష్కించిన ముఖం, చుబుకం కేసి విచారంగా వంగినట్టు వుండే కొక్కెం లాంటి నాసిక వున్నాయి. అతను తన నల్లని కళ్లతో చేహోవ్ కేసే నిశ్చలంగా చూస్తూ ఆయన కెదురుగా కూర్చున్నాడు. యేకతార శ్రుతిలో ఒకే తీరుగా మాట్లాడుతున్నాడు:

''బోధనాత్మక కాలమంతా సజీవ పరిస్థితుల్లో సేకరించిన యీ రకపు భావముద్రలు, ఒక మానసిక మిశ్రంగా సంకలనం చెంది, పరివేష్టిత ప్రపంచం యొక్క వస్తుగత దృక్పథంయొక్క కనీస అవకాశాన్ని కూడా సంపూర్తిగా మృగ్యం చేస్తాయి. ప్రపంచం అనేది, సరే, దాన్ని గురించి మనకి వున్న భావన తప్ప మరేమీ....''

యిక్కడ అతను తాత్విక రంగంమీద, తాగినవాడు మంచుమీద జారినట్టుగా జారిపోతూ, లంకించుకున్నాడు.

వాళ్లు యెక్కువ అర్థం చేసుకుంటారు, మేం కలిసి జీవించే సామాన్యుల కంటే యెక్కువగా వాళ్లు మా దౌర్భాగ్య జీవులకి సన్నిహితంగా వుంటారు. సెలవు, మిమ్మల్ని యెన్నటికీ మర్చిపోలేను.''

అతని నాసిక వణికింది, అతని పెదాలు బిగువు సడిలాయి చిరునవ్వు నవ్వుతూ, అనుకోకుండా అతను అన్నాడు:

''పెద్దవాళ్లు దురదృష్టవంతులు — వాళ్ల ఖర్మ!''

అతను వెళ్లిపోగానే చేహొవ్ అతన్ని కళ్లతోటే అనుసరిస్తూ, చిరునవ్వు నవ్వి, అన్నాడు:

''మంచి వాడు. అతను యెక్కువ కాలం ఉపాధ్యాయుడుగా వుండడు, ప్చ్!''

''యేం, యెందుకని?''

''అతన్ని తరిమేస్తారు.... వదిలించుకుంటారు.''

కొంచెం సేపు ఆగి, తగ్గు స్థాయిలో, మృదువుగా అన్నాడు:

''రష్యాలో నిజాయితీ పరుడైన వాడు చిన్న పిల్లల్ని దాదులు బెదిరించడానికి చూపించే బూచి లాంటివాడు.''

చేహొవ్ సమక్షంలో సాదాగా, మరింత సత్యపూరితంగా, నిసర్గతత్వంతో వుండాలని ప్రతివాళ్లకీ తెలియకుండానే కోరిక పుడుతుందేమో ననుకుంటాను. అనాగరిక తెగలవాళ్లు పూసలతోటే, కొమ్ములతోటే అలంకరించుకున్నట్టుగా, రష్యన్లు యూరపియన్ల మాదిరీ కనిపించాలనే తమ తాపత్రయంలో అలంకరించుకున్న తమ చవకబారు వేషాలనీ, గంభీరమైన పుస్తక పదకోశపు శాలువాలనీ, మోజైన పదబంధాలనీ ఆయన ముందు యెలా విసిరేసేవాళ్లో పరిశీలించే అవకాశాలు నాకు చాలా వచ్చాయి. చేహొవ్‌కి పూసలన్నా, యెరువు తెచ్చుకున్న నెమలి యీకలన్నా యిష్టం లేదు. ''గంభీరమైన వాలకం'' కోసం మనుషులు తొడుక్కునే ఆడంబరాలు, గంగిరెద్దు గంటలు, పరాయివైన సకలమూ ఆయనకి చిరాకు కలిగించేవి. యీ సరంజామా అంతా వేసుకున్న వాడు యెవడేనా యెప్పుడు తగిలినా ఆ సంభాషించే వ్యక్తి నిజ స్వరుపాన్ని వికృతం చేసే భారమైన అదనపు తొడుగులన్నీ విప్పేసి అతన్ని విముక్తుణ్ణి చెయ్యాలని ఆయనకి పట్టలేని సహజ ప్రేరణ కలిగేది. చేహొవ్ తన యావజ్జీవితమూ పరిశుద్ధాత్ముడుగానే వున్నాడు. యెప్పుడూ ఆంతరంగికంగా అమలినంగానే వున్నాడు. కొంతమంది తననుంచి ఆశించిన దాన్ని గురించి గాని, యింకొంచెం తక్కువ నాజూకైన యితరులు చేహొవ్ నుంచి అపేక్షించిన దాన్ని

గురించి గాని, ఆయన పట్టించుకునే వాడు కాదు. "ఉదాత్త"మైన విషయాల గురించిన సంభాషణలు ఆయనకి యిష్టంగా వుండేవి కావు — యిది చమత్కారం అవడం మాట అటుంచి, అసంబద్ధం అనే విషయాన్ని మర్చిపోయి రష్యన్లు తమ అమాయకత్వంలో ప్రస్తుతం మర్యాదైన లాగు లేకపోయినా భవిష్యత్తులోని చీని చీనాంబరాల గురించి మాట్లాడ్డం సరదాగా భావించేలాంటి సంభాషణలు.

తనే యెంతో ముచ్చట వేసే సాదాతనంతో వుండే ఆయన నిరాడంబరమైన, నిజమైన, నిజాయితీ పూర్వకమైన దాన్నంతటినీ ప్రేమించాడు. యితరులని నిసర్గంగా చేసే సొంత పద్ధతీ ఆయనకి వుండేది.

ఒక సారి విపరీతమైన అలంకారప్రీతి వున్న ఆడవాళ్లు ఆయన్ని చూడ్డానికి వచ్చారు. సిల్కు గౌన్ల రెపరెపలతో గది అంతా సువాసనల గుబాళింపుతో నిండి పోతూ వుంటే వాళ్లు దర్పంగా తమ ఆతిథేయుడి ముందు కూర్చున్నారు. రాజకీయాలమీద గాఢమైన ఆసక్తి చూపిస్తూ వాళ్లు ఆయన్ని "ప్రశ్నలు అడగడం" మొదలుపెట్టారు.

"యుద్ధం యెలా ముగుస్తుందనుకుంటున్నారు?"[1]

ఆయన దగ్గి, ఆలోచించుకోవడం కోసం ఆగి తన మృదువైన, గంభీరమైన, దయాన్వితమైన స్వరంతో జవాబు చెప్పాడు:

"నిస్సందేహంగా శాంతితోనే."

"అది సరే లెండి. కాని యెవరు నెగ్గుతారు? గ్రీకులా, టర్కులా?"

"బలమైన పక్షం గెలుస్తుందని నా కనిపిస్తుంది."

"యేది బలమైన పక్షం అని మీరనుకుంటున్నారు?" ఆడవాళ్లు ముక్త కంఠంతో అడిగారు.

"బాగా తిండీ, బాగా చదువూ వున్న పక్షం."

"ఆయన చమత్కారంగా లేడూ?" అని ఒకామె అరిచింది.

"మీరు యెవళ్లని అభిమానిస్తారు? గ్రీకుల్నా, టర్కుల్నా?" అని యింకో ఆవిడ అడిగింది.

చేహొవ్ ఆమెకేసి దయాపూరితంగా చూసి, తన సహజ ధోరణిలో మెత్తగా, మర్యాదగా వుండే చిరునవ్వు నవ్వుతూ అన్నాడు:

"నాకు పళ్లతో చేసిన తినుబండారాలంటే యిష్టం, తెలుసా?"

"ఓ, అవునా!" అందామె ఆత్రతగా.

"అవి యెంత రుచిగా వుంటాయో" అని గంభీరంగా వంత పలికింది రెండవ ఆమె.

ఆ ముగ్గురూ పళ్లతో చేసిన పదార్థాల గురించి, ఆ చర్చనీయాంశంమీద అద్భుతమైన పాండిత్యమూ, నిగూఢ పరిజ్ఞానమూ ప్రదర్శిస్తూ, ఉత్సాహ భరిత మైన సంభాషణ మొదలుపెట్టారు. ఆ క్షణం దాకా ఒక్క పిసరు కూడా ఆలోచించి యెరగని టర్కుల గురించీ, గ్రీకుల గురించీ పెద్ద ఆసక్తి వున్నట్టు నటించి, తమ బుర్రలు బద్దలు కొట్టుకోకుండా వుండటంతో వాళ్లు సంతోష పడ్డట్టే కనిపించింది.

సెలవు తీసుకుని వెళ్లిపోయేటప్పుడు వాళ్లు చేహొవ్‌కి హుషారుగా వాగ్దానం చేశారు:

''మేం మీకు ఒక బుట్టెడు పళ్లతో చేసిన తినుబండారాల్ని పంపుతాం.''

''మంచి సంభాషణ జరిగిందే'' అని నేను వాళ్లు వెళ్లిపోయిం తర్వాత అన్నాను.

చేహొవ్ మృదువుగా నవ్వాడు.

''యెవడి భాష వాడు మాట్లాడాలి'' అన్నాడాయన.

యింకో సారి ఆయన గదిలో నాకు స్ఫురద్రూపి అయిన ఓ అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ కనిపించాడు. చేహొవ్ ముందు నిలబడి, ఉంగరాల జుట్టు యెగ రేస్తూ, అతను బింకంగా అంటున్నాడు:

''మీరు రాసిన 'దోషి' అనే కథలో మహా చిక్కు సమస్య తెచ్చి పెట్టారు నాకు. దెనీస్ గ్రిగోర్యెవ్*లో చెడ్డ పనిచేసే ఉద్దేశపూర్వకమైన యిచ్ఛ వున్నట్టు నాకు కనిపిస్తే సమాజ ప్రయోజనాలు అపేక్షించబట్టి, దెనీస్‌ని యే వూగిసలాటా లేకుండా జైలుకి పంపడం నా విధి అవుతుంది. కాని అతను అనాగరికుడు, తను చేసే పనిలోని నేరం గురించిన యెరుక అతనికి లేదు. పాపం, అందుకని అత నంటే జాలి పడతాను. అహేతుకంగా వర్తించే వాడని భావించి జాలి చూపించా ననుకోండి, మళ్లీ దెనీస్ సీలలు వూడదీసి రైలుని పడగొట్టెయ్యడని సంఘానికి నేను యెలా హామీ యివ్వాలి? అదీ సమస్య. యేం చెయ్యాలి?''

అతను కుర్చీలో వెనక్కి వాలి, వెదికే చూపులతో చేహొవ్ ముఖంలోకి చూస్తూ, ఆగాడు. అతని యూనిఫారం సరి కొత్తది. ఆ పడుచు వీరభక్తుడి నవనవలాడే ముఖంలోని కళ్లల్లాగే ఆ యూనిఫారపు ముందు బొత్తాలు కూడా బింకంగా, మొద్దుగా ఓ క్షణం మెరిశాయి.

---

* ఈ కథానాయకుడు శుద్ధ అమాయకత్వంవల్ల రైలు పట్టాలనుంచి సీలలు వూడదీసి వాటిని చేపలు పట్టే గాలాలకి వూతం కోసం ఉపయోగించాడు. — సం.

''నేను జడ్జీని అయివుంటే దెనీస్‌ని నిర్దోషిగా విడుదల చేసి వుండేవాణ్ణి'' అని చేహొవ్ గంభీరంగా అన్నాడు.

''యే ఆధారంతోటి?''

'' 'నువ్వు యింకా యెరుక వున్న నేరస్తుడి లాంటి రకం కాలేదు, దెనీస్, పోయి అలా అవ్వు' అని అతనికి నేను చెప్పి వుండేవాణ్ణి.''

ఆ ప్రాసెక్యూటర్ నవ్వాడు. కాని తక్షణం తన విపరీతమైన గంభీరత్వం పుంజుకుని, అన్నాడు:

''వుహూఁ, మీరు లేవనెత్తిన సమస్యని సంఘ శ్రేయస్సు దృష్ట్యానే పరిష్కరించాలి. నేను సంఘ శ్రేయస్సుని కాపాడవలసిన వాణ్ణి. దెనీస్ అనాగరికుడు నిజమే కాని అతను నేరస్థుడు. మరి అందులోనే వుంది నిజం.''

''మీకు గ్రామఫోన్ వినడం యిష్టమేనా?'' అని వున్నట్టుండి చేహొవ్ అడిగాడు.

''ఓ, యిష్టమే! బాగా! అది అద్భుతంగా కనిపెట్టిన వస్తువు'' అని ఆ యువకుడు హడావుడిగా జవాబు చెప్పాడు.

''కాని నేను గ్రామఫోన్ అంటే భరించలేను'' అని చేహొవ్ విచారంగా అన్నాడు.

''యెందుకని?''

''యెందుకేమిటి? అది యే అనుభూతీ లేకుండా మాట్లాడుతుంది, పాడుతుంది. దాన్నుంచి వచ్చే ధ్వనులన్నీ బోలుగా, జీవరహితంగా వుంటాయి. మరి మీకు ఫొటోగ్రఫీ అంటే యిష్టమేనా?''

ఆ ప్రాసెక్యూటర్‌కి ఫొటోగ్రఫీ అంటే వెర్రి ఆపేక్షట. అతను తక్షణం దాన్ని గురించి ఉత్సాహంగా మాట్లాడ్డం మొదలుపెట్టాడు, గ్రామఫోన్ విషయంలో, యిక యే మాత్రం ఆసక్తి కనబరచకుండా. ''అద్భుతంగా కనిపెట్టిన'' ఆ వస్తువుకీ తనకీ మధ్య వున్న పోలిక చేహొవ్ యెంతో సూక్ష్మంగా కచ్చితంగా గమనించాడు. నేను మరో సారి ఆ యూనిఫారంకింద ఉత్సాహంగా ఆసక్తికరంగా వుండే మానవుణ్ణి, వేటకి తీసికెళ్లిన కుక్కపిల్లలాగా జీవిత మార్గాల్లో యింకా కొత్తగా వున్న వ్యక్తిని, చూశాను.

ఆ యువకుణ్ణి సాగనంపాక చేహొవ్ చిరచిరలాడుతూ అన్నాడు:

''యిదిగో న్యాయానికి వెనకతట్టున వుండే యిలాంటి మొటిమగాళ్లే మానవ జాతకాల్ని పరిష్కరించేవాళ్లు.''

కొంచెం సేపు ఆగాక ఆయన అన్నాడు:

''ప్రాసెక్యూటర్లకి యెప్పుడూ చేపల్ని పట్టడమంటే సరదా, ముఖ్యంగా పరిగల్ని.''

యెక్కడ వున్నా గానీ నైచ్యాన్ని తూర్పారబట్టే నేర్పు ఆయనకి వుంది. తన జీవితంలో ఉన్నతమైంది అపేక్షించే వాడికే పట్టుబడిన నైపుణ్యం అది. మానవుడిలో నిష్కాపట్యం, అందం, సమరూపత దర్శించాలన్న తీవ్రమైన కాంక్ష నుంచే అది ఉత్పన్నం అవుతుంది. ఆయన నైచ్యాన్ని కఠినంగా, నిర్దాక్షిణ్యంగా విమర్శించే మనిషి.

బాగా ప్రచారంలో వున్న ఒక పత్రిక సంపాదకుడు, ప్రేమ అవసరం గురించీ, యితరుల పట్ల జాలి చూపించడం గురించీ నిరంతరంగా మాట్లాడే అతను, నిష్కారణంగా ఒక రైల్వేగార్డుని అవమాన పరిచాడనీ, తన కింద పని చేసే వాళ్లని కాల్చుకు తింటాడనీ ఎవరో చేహోవ్ ముందు అన్నారు.

''సహజమే'' అన్నాడు చేహోవ్, నిష్కారంగా నవ్వుతూ. ''అతను ఉన్నత వర్గం వాడు, సంస్కారి.... గొప్ప పాఠశాల్లో చదువుకున్నాడు. వాళ్ల నాన్న నార బూట్లే తొడుక్కునే వాడు, కాని తను మాత్రం సీసలైన తోలు బూట్లు తొడుక్కుంటాడు.''

యీ మాటలని అన్న తీరు ఆ ''ఉన్నత వర్గం'' మనిషిని ఒక సామాన్యుడిగా, పరిహాసాస్పద వ్యక్తిగా తీసి పారేసింది.

''చాలా ప్రతిభావంతుడు'' అని ఆయన ఒక జర్నలిస్టుని గురించి అన్నాడు. ''అతను రాసేది యెప్పుడూ యెంతో ఉన్నతంగా, మానవత్వంతో వుంటుంది.... పంచదార పూత. అతను నలుగురి ముందూ పెళ్లాన్ని చవట అని తిడతాడు. అతని నౌకర్లు చెమ్మగా వుండే గదుల్లో పడుకుంటారు, వాళ్లందరికీ కీళ్ళనొప్పులు వస్తాయి....''

''మీకు ఫలానా వాడు యిష్టమేనా?''

''అయ్యో, యిష్టమే. మంచి మనిషి'' అంటాడు చేహోవ్, దగ్గుతూ. ''అత నికి అన్నీ తెలుసు. బోలెడు చదువుతాడు. నావి మూడు పుస్తకాలు తీసికెళ్లాడు, మళ్లీ యివ్వలేదు. కొంచెం పరాకు. ఒక రోజున యెవళ్లతోటో మీరు భేషైన మనిషని చెప్తాడు, మర్నాడే మీరు మీ ప్రియురాలి భర్తగారికి వున్న నల్ల మేజోళ్లు, నీలం పట్టీలు వున్నవి, కొట్టేసారని వేరే యెవళ్లతోనో అంటాడు.''

ఆయన ముందు యెవరో గాని ఓ సారి ''గొప్ప'' పత్రికలలోని ''సీరియస్'' విభాగాలు నిరుత్సాహంగా, కష్టంగా వుంటున్నాయని అన్నారు.

''ఆ వ్యాసాలని చదవకండంతే'' అని చేహోవ్ పరమ విశ్వాసంతోటి సలహా యిచ్చాడు. ''అది సహకార సాహిత్యం.... శ్రీమాన్ ఎరుపుగారు, నలుపుగారు, తెలుపు గారు రాసిన సాహిత్యం. ఒకళ్లు ఒక వ్యాసం రాస్తారు. యింకో ఆయన విమర్శిస్తాడు. యీ యిద్దరిలోనూ వున్న అసంబద్ధతల్ని మూడో

ఆయన సర్ది చెప్పేస్తాడు. డమ్మీని పెట్టుకుని వింట్ పేకాట ఆడ్డం లాంటిదిది. కాని యిదంతా పాఠకుడికి యెందుకు అవసరమా అనేదాన్ని గురించి వాళ్లల్లో ఒక్కళ్లూ పట్టించుకోరు.''

ఒక సారి లావుగా, ఆరోగ్యంగా, అందంగా, బాగా ముస్తాబైన ఒక ఆడావిడ ఆయన్ని చూడ్డానికి వచ్చింది. వచ్చిన వెంటనే ''చేహోవ్ ధోరణి''లో మాట్లాడ్డం మొదలుపెట్టింది.

''బతుకు యెంతో నిరుత్సాహంగా వుంది! ప్రతీదీ యెంతో వెలవెలబోతున్నట్టుంది — జనం, ఆకాశం, సముద్రం, ఆఖరికి పువ్వులు కూడా నాకు వెలవెల బోయినట్టే వున్నాయి. కోరుకోవాల్సిందేమీ లేదు — నా హృదయం మూలుగుతోంది. యిది ఒక రకమైన జబ్బు....''

''యిది ఒక జబ్బు'' అని చేహోవ్ గట్టిగా అన్నాడు. ''సరిగ్గా అంతే అది. దానికి లాటిన్ పేరు మార్బస్ కుహనా — ఇటిస్* అని.''

అదృష్టవశాత్తూ ఆమెకి లాటిన్ రాదు, లేకపోతే రానట్టు నటించిందో.

''నేలని దున్నకుండా గుర్రానికి చిర్రెత్తించే జోరీగల్లాంటి వాళ్లు, విమర్శకులు'' అన్నాడాయన తెలివిగా నవ్వుతూ. ''గుర్రపు కండరాలు ఫిడేలు తీగల్లాగా బిగువుగా వుంటాయి. వున్నట్టుండి ఓ జోరీగ పృష్ఠభాగంమీద రొజపెడుతూ, కుడుతూ వాలుతుంది. గుర్రపు చర్మం వణుకుతుంది. తోక ఆడిస్తుంది. జోరీగ యెందుకు రొజ పెడుతోంది? అది దానికే తెలీదు, బహుశా. అది వూరికే నిలకడగా వుండలేదంతే, 'నేనూ బతికే వున్నాను తెలుసా?' అంటున్నట్టుంటుందది. 'చూడండి, రొజ పెట్టడం యెలాగో నాకు తెలుసు, నేను రొజ పెట్టనిది లేదు!' నేను యిరవై ఐదు యేళ్లుగా నా కథల సమీక్షలు చదువుతున్నాను. వాటిల్లో ఒక్క దాంట్లో కూడా ఒక్క పనికొచ్చే పాయింటు కాని పిసరు మంచి సలహా కాని గుర్తుకు రాదు. నాకు అంతో యింతో ఫరవాలేదు అనిపించే సమీక్షకుడు ఒక్కడూ విమర్శకుడు. నేను తాగి ఓ అగాధంలో పడిచస్తానని అతను జోస్యం చెప్పాడు....''

ఆయన బూడిదరంగు విచారగ్రస్త నయనాల్లో ఒక రకమైన సూక్ష్మ వ్యంగ్యం దాదాపు యెప్పుడూ మిలమిల లాడేది. కాని యెప్పుడేనా యీ కళ్లు అనార్ద్రంగా, నిశితంగా, కఠినంగా తయారయేవి. అలాంటప్పుడు ఆయన మృదు

* చేహోవ్ తమాషాకి లాటిన్ పదాన్ని రోగంపేరు ధ్వనించేటట్టువాడాడు. మనం 'ఆఁ, మాయరోగం' అన్నట్టు. — అను.

వైన, ఆర్ద్రమైన స్వరంలో కటువైన జీరలు గోచరమయ్యేవి. అలాంటప్పుడే నాకు అనిపించేది యీ వినమ్రుడైన, దయాపూరిత మానవుడు యే విద్వేషపూరిత శక్తికైనాగానీ వ్యతిరేకంగా, దృఢంగా, దానికి వశం కాకుండా నిలబడగలడు అని.

యితరుల పట్ల ఆయన వైఖరిలో ఒక నిరాశాపూరిత ఛాయ, అనార్ద్ర పూరిత నిశ్చల నిర్వేదసమమైనదేదో వుండినట్టు నాకు ఒకో అప్పుడు అనిపించేది.

''రష్యన్ మనిషి వింత జీవి'' అన్నాడాయన ఒక సారి. ''అతను జల్లెడలాంటి వాడు. దేన్నీ యెక్కువ కాలం వుంచుకో లేడు. యౌవనంలో తనకి అంకితదాన్నం తటినీ ఆతృతగా అంది పుచ్చుకుంటాడు, ముప్పై యేళ్లు దాటేటప్పటికి రంగు మాసిన చెత్తపోగు తప్ప మరేం మిగలదు. యెపళ్లైనా గానీ మంచి జీవితం, మానవ జీవితం గడపాలనుకుంటే, శ్రమించి తీరాలి. ప్రేమతోటి, విశ్వాసంతోటీ పని చెయ్యాలి. మరి దాన్ని యెలా చెయ్యాలో మన దేశంలో మనకి తెలీదు. రెండు మూడు మర్యాదైన యిళ్లు కట్టిన వాస్తుశిల్పి యిక జీవితాంతం పేకాడుతూ కూర్చుంటాడు, లేకపోతే నాటక రంగస్థలం వెనక భాగంలో తచ్చాడుతూ వుంటాడు. డాక్టరు యెవడికేనా కొంచెం ప్రాక్టీసు పుంజుకుందీ అంటే అతను ''చికిత్సావిధాన సమాచారం'' తప్ప మరేమీ చదవడు. శాస్త్రంతో సంబంధం పెట్టుకోవడం మానేస్తాడు. నలభై యేళ్లు వచ్చేటప్పటికి జబ్బులన్నీ జలుబుల వల్లనే వస్తాయని తీర్మానించుకుంటాడు. తన పని యేమిటైనంటి దాని ప్రాముఖ్యం గురించి పిసరు కూడా తెలిసిన అధికారి నాకు ఒక్కడు తగల్లేదు -- రాజధానిలోనో, లేకపోతే యేదేనా రాష్ట్ర పట్టణంలోనో తిష్ఠవేసి యేదో కాగితాలని సృష్టించి ఓ పట్టణానికి పంపుతాడు. అక్కడ యీ పత్రాలవల్ల యెవడి స్వేచ్ఛకి అంతరాయం కలుగుతుందీ అన్నది యీ అధికారికి ఖాతరీలేదు, నరక బాధలని గురించి నాస్తికుడికి లాగా. ఒక కేసు నెగ్గేటట్టు వాదించి పేరు తెచ్చుకున్న లాయరుకి సత్యాన్ని పరిరక్షించాలన్న బాధ లేదు, అతను ఆస్తి హక్కుల్ని సమర్థించడం, గుర్రాలమీద పందెం కట్టడం, సీపీగుల్ల చేపల్ని తినడం తప్ప మరేం చెయ్యడు. సకల కళల్లోనూ రసజ్ఞత వున్నవాడుగా చలామణీ అయిపోతాడు. రెండు మూడు పాత్రలు బాగా పోషించిన నటుడు, యింకే పాత్రనీ నేర్చుకోడు, కీర్తి కిరీటం తగిలించుకుని తనో దైవాంశ సంభూతుణ్ణని భావించుకుంటాడు. రష్యా ఆశపోతు సోమరిగాళ్ల దేశం. జనం తెగ తింటారు, తెగ తాగుతారు, పగలు నిద్రపోవడం అంటే వీళ్లకి యిష్టం. నిద్రలో గురక కొడతారు. యిళ్లల్లో ఓ పద్ధతి వుండడం కోసమని పెళ్లిళ్లు చేసుకుంటారు, సంఘంలో గొప్ప కోసం యింకొకత్తిని వుంచుకుంటారు. వీళ్ల బుద్ధి కుక్క బుద్ధి. కొట్టండి, ముడు

చుకుపోయి మూలుగుతూ మూలకి పోతారు. ఋజ్జగించండి, వెల్లకిలా పడుకుని, కాళ్ళు పైకెత్తి తోకలు ఆడిస్తారు.''

యీ మాటల వెనక ఒక లనార్ద్ర, విచారభరిత తృణీకారం వుంది. కాని తృణీకరించుకుంటున్నప్పుడు కూడా ఆయన జాలి పడగలడు. ఎవళ్లనేనా ఆయన ముందు నిందిస్తే చేహోవ్ ఖాయంగా ఆ వ్యక్తి పక్షం వహిస్తాడు:

''పోన్లెండి! ఆయన ముసలాడు, డెబ్బై యేళ్లు వున్నాయి....''

లేదా:

''అబ్బే అతనింకా కుర్రాడు, పూరికే తెలియనితనం అంతే....''

ఆయన యిలా మాట్లాడేటప్పుడు ఆయన ముఖంలో యే యేవగింపూ కని పించేది కాదు.

యెవళ్లేనా చిన్న వయసులో వున్నప్పుడు, సంకుచితత్వం అనేది సరదాగా, అప్రాముఖ్యంగా కనిపించవచ్చు కాని అది క్రమేపీ మనిషిని చుట్టు ముడుతుంది. బొగ్గు ధూపం లాంటి విషంలాగా దాని వెలిబూది ఆవిరి బుర్రలోకీ, రక్తం లోకీ పాకుతుంది. మనిషి తుప్పు పట్టిపోయిన కుల్లుదుకాణం పాత బోర్డులాగా అవుతాడు — ఆ బోర్డుమీద యేదో రాసినట్టే వుంటుంది, కాని యేమిటైందీ ఆనవాలు పట్టడం అసాధ్యం.

మొదటినుంచీ కూడా సంకుచిత ప్రవర్తన వెలిబూది మహా సముద్రంలో దాని విషాదభరిత మసక విషయాలని వెల్లడించేవాడు చేహోవ్. యెవళ్లేనా గానీ ఆయన ''హాస్యపూరిత'' కథలని జాగ్రత్తగా చదవాలంతే — రచయిత తన వినోద భరిత వర్ణనలోనూ, పరిస్థితుల్లోనూ యెంత క్రూరమైందాన్ని చూసిందీ, సిగ్గు పడుతూ దాచిందీ గుర్తించాలంటే.

ఆయనకి దాదాపుగా కన్యాత్వపు అణకువ వుంది. ఆయన యెన్నడూ మను షుల్ని బహిరంగంగా, గట్టిగా సవాలు చేసే స్థితికి పోలేదు. వాళ్లు తమంతట తామే యింకా మర్యాదగా వుండాల్సిన అత్యవసరాన్ని గుర్తిస్తారని వృథాగా విశ్వ సిస్తూ ''యింకొంచెం మర్యాదగా వుండండి, వుండలేరూ?'' అని అనలేదు. అస భ్యంగా అపరిశుభ్రంగా వున్నదాన్నంతా యేవగించుకుంటూనే, ఆయన జీవితపు అనాకర్షక భాగాల్ని కవికి వుండే ఉదాత్త భాషతో, హాస్య చతురుని మృదువైన లాస్యంతో వర్ణించాడు. ఆయన కథల్లో మెరుగుపెట్టిన పై పూత కింద అంత ర్లీనంగా వుండే మందలింపు కనిపించీ, కనిపించకుండా వుంటుంది.

మాననీయులైన ప్రజలు ''ఇంగ్లీషు ఆడపడుచు'' చదివి నవ్వుకుంటారు.

యిందులో పరిత్యక్త వ్యక్తి పట్ల, ప్రతివాళ్ళకీ, ప్రతిదానికీ పరాయి అయిన వ్యక్తి పట్ల, బాగా పెరిగిన జమీందారుగారి యేహ్యమైన యెగతాళిని బహుశా చూడ లేరు. చేహొవ్ రాసిన అన్ని హాస్యపూరిత కథల్లోనూ నిష్కళంకమైన నిజమైన మానవ హృదయపు మృదు, గంభీర నిశ్వసనం వినిపిస్తూ వున్నట్టే వుంటుంది నాకు. తమ ఆత్మగౌరవాన్ని కాపాడుకోలేక, పాశవిక శక్తికి లొంగిపోతూ, బానిస ల్లాగా బతుకుతూ, ప్రతిరోజూ నోరూరించే కాబేజీ పులుసు యెంత వీలైతే అంతా జుర్రుకోవడపు అవసరాన్ని తప్ప మరి దేన్నీ విశ్వసించకుండా, బలవంతులూ పొగరు మోతులూ తమని బాధిస్తారన్న భయం తప్ప మరి యే అనుభూతులు లేకుండా వుండే మానవుల పట్ల సానుభూతిభరిత నిరాశా నిశ్వసనం వినిపిస్తూ వున్నట్టే వుంటుంది నాకు.

జీవితపు అప్రాముఖ్య విషయాల విషాద స్వభావాన్ని చేహొవ్ అంత స్పష్టంగా, సహజాతంగా యే రచయితా అర్థం చేసుకోలేదు. మధ్యతరగతి జీవితాల మలిన కల్లోలంలోని అవమానకరమూ, జాలి పడదగనిదీ అయిన దాని మొత్తం నిర్దా క్షిణ్య, సత్యపూరిత చిత్రాన్ని మానవాళి ముందు యే రచయితా యింతకు ముందు పెట్టి వుండలేదు.

ఆయన శత్రువు అసభ్యత. ఆయన తన యావజ్జీవితం దానికి వ్యతిరేకంగా పోట్లాడాడు, దాన్ని అధిక్షేపిస్తూ యెత్తిపట్టాడు. పైకి అంతా సవ్యంగా, సౌకర్యంగా యింకా చెప్తే అద్భుతంగా వుంటుందనుకునే చోట కూడా అసభ్యత అనే నాచుని చూసి నిష్పాక్షిక రచనలలో ప్రదర్శించాడు; ఆయన మృతకాయాన్ని — కవి శరీరాన్ని — సీపిగుల్లలు రవాణా చేసే రైలు వాగన్లో పెట్టడంద్వారా అసభ్యత వికారమైన కుయుక్తితోటి ఆయనమీద పగతీర్చుకుంది.

మలినంగా ఆకుపచ్చగా వున్న రైలు వాగన్ డస్సిన తన శత్రువుమీద అస భ్యత సాధించిన విశాల విజయాట్టహాసంగా కనిపిస్తుంది నాకు. అసభ్య పత్రికల అసంఖ్యాక ''జ్ఞాపకాలు'' — వొట్టి కపట శోకం; తన శత్రువు మరణం పట్ల లోపల్లోపల సంతోషపడుతున్న అదే అసభ్యత శీతల దుర్గంధపూరిత శ్వాస వాటి వెనక తగులుతున్నట్టు వుంటుంది నాకు.

చేహొవ్ రచనలని చదివితే అదేదో ఆకురాలు కాలం బాగా గడిచిపోయిన తర్వాత వుండే విచారకరమైన రోజు లాగా వుంటుంది నాకు. గాలి స్వచ్ఛంగా వుండి, ఆకాశపు నేపథ్యంలో ప్రస్ఫుట ఆకార రేఖా వైశిష్ట్యంతో బోసిపోయిన

చెట్లన్నీ నిటారుగా వుండి యిళ్లన్నీ గుబురుగా వుండి ప్రజలు అంతా మబ్బుగా జావుకు మంటూ వున్నట్టుండే రోజులాంటిది. ప్రతీదీ కూడా యెంతో వింతగా, ఒంటరిగా, నిశ్చలంగా, శక్తిహీనంగా వుంది. సుదూర ప్రాంతం నీలంగా, శూన్యంగా వుండి నిస్తేజపు ఆకాశంతో అర్ధఘనీభూత మృత్తికమీద విషాద శీత శ్వాస పీలుస్తూ మిళితం అయిపోతోంది. రద్దీగా నడిచే రోడ్లు, మెలికలు తిరిగిన వీధులు, మురికిగా, కిక్కిరిసిపోయిన యిళ్లు, ఆ యిళ్లల్లో జాలిగొలిపే సామాన్య జనం, విసుగుదలతోటీ, సోమరితనంతోటీ, తమ వాసస్థానాల్ని అర్థరహితంగా, మగతగా వుండే సందోహంతో నింపేస్తూ రొప్పుతూ వుంటారు. దీన్నంతటినీ అకురాలు కాలపు యెండలాగా, రచయిత మనసు నిర్దాక్షిణ్యమైన స్పష్టతతో ప్రకాశింపచేస్తూ వుంటుంది. అక్కడ చిన్న బూడిద రంగు చుంచులాగా పిరికిగా, అపరిమితంగా దాస్య తత్వంతో ప్రేమించే మధురమైన, అణకువ అయిన ఆడమనిషి ''ది డార్లింగ్'' చరిస్తుంది. ఆమె చెంపమీద ఒక లెంపకాయ కొట్టండి, పాపం అణకువైన దాసి, ఆమె అరవను కూడా అరిచే ధైర్యం చెయ్యదు. ఆమె పక్కన ''ముగ్గురు అక్కచెల్లెండ్లు''లోని శోకభరిత ఓల్గా వుంటుంది. ఆమె కూడా అపరిమితంగా ప్రేమించ గలది. సోమరిపోతు అన్నగారికి పతనమైన, నీచమైన భార్య ఓల్గా ఆ వదినగారి తిక్కలన్నిటికీ ఓపిగ్గా తల ఒగ్గుతుంది. తన తోబుట్టువుల జీవితాలు ఆమె పక్కనే నాశనం అయిపోతున్నాయి, ఆమె యేమీ చెయ్యలేని నిస్సహాయతతో రోదిస్తుంది అంతే; అసభ్యతకి వ్యతిరేకంగా నిరసన తెలియచేసే సజీవమైన శక్తివంతమైన మాట ఒక్కటి కూడా ఆమెలో రూపు తీసుకోదు.

అదుగో అక్కడున్నారు ''చెర్రీ ఆర్చర్డ్'' పూర్వపు యజమానులు, రనేవ్స్కయా, యితరులు — పిల్లల్లాగా స్వార్థపూరితంగా, పెద్ద వాళ్లల్లాగా బిగువు సడలీ వున్న వాళ్లు. తమ చుట్టూతా యేం జరుగుతోందో చూడలేనంత గుడ్డిగా, యేమీ గ్రహించలేకుండా, తమ చోషకాలని తిరిగి జీవితంతో బంధించుకోలేని పరాన్నభుక్కులు, యేనాడవగానో చచ్చిపోయి వుండాల్సిన వాళ్లు, రాగాలు తీస్తూ శోకన్నాలు పెడుతూ వుంటారు. పనికి మాలిన విద్యార్థి త్రొఫిమొవ్ శ్రమించాల్సిన అవసరం గురించి ధారాళంగా చెపుతూ, తన కాలాన్ని జులాయిగా తగలేస్తూ, వార్యాని మందబుద్ధి యెత్తిపొడుపు మాటలు అని సరదా పడుతూ వుంటాడు. ఆమె సోమరిపోతుల బాగు కోసం గుక్క తిప్పుకోకుండా పనిచేస్తూనే వుంటుంది.

వెర్షినిన్ (''ముగ్గురు అక్కచెల్లెండ్లు'' నాయకుడు) మూడు వందల యేళ్లల్లో రాబోయే మంచి జీవితాన్ని గురించి కల గంటాడు గాని యీ లోపున తన చుట్టూతా వున్నది శిథిలమై పోతోందనీ, జాలిగొలిపే బారన్ తుసెన్‌బాఖ్‌ని విసుగు

దలవల్లా మూర్ఖత్వంవల్లా సొల్యోనీ తన కళ్లముందే చంప సిద్ధపడుతున్నాడనీ గుర్తించడు.

ప్రేమకి, మూర్ఖత్వానికి, సోమరితనానికి, ఐహిక సుఖాలకోసం వెంపరలాటకి బానిసలైన వాళ్ల పెద్ద శ్రేణి పాఠకుల కళ్ల ముందు పోతుంది. జీవితపు అదృశ్య భయానికి బానిసలైన వాళ్లు, అస్పష్టమైన ఆందోళనతో చరిస్తూ, భవిష్యత్తుని గురించిన అవ్యక్త ప్రలాపాలతో నభోంతరాళాన్ని దద్దరిల్ల జేస్తూ, వర్తమానంలో తమకి స్థానం లేదని భావిస్తూ వుండే బానిసలు యిక్కడ వున్నారు.

ఒకో అప్పుడు యీ బూడిదరంగు సమూహంలో ఓ తుపాకీ పేలుడు విని పిస్తుంది — యిక చెయ్యాల్సిన పని అల్లా ఒకటేనని కనిపెట్టిన ఇవానొవో (''ఇవానొవ్'' నాటకం), త్రేప్లెవో (''సముద్ర పక్షి'' నాటకం) చనిపోవడం అది.

వాళ్లల్లో చాలా మంది రెండు వందల యేళ్లల్లో రాబోయే వైభవోపేత జీవితాన్ని గురించి కమ్మని కలలు గంటారు కాని అతి సామాన్యమైన యీ ప్రశ్నని అడగడం గురించి మాత్రం యెవరూ ఆలోచించరు: మనం కలలు గనడం తప్ప మరేమీ చెయ్యకపోతే యెవరు దీన్ని వైభవోపేతం చేసేవాళ్లు?

యీ జడ, విషాదభరిత, శక్తిహీనుల గుంపు పక్క నుంచి ఒక గొప్ప, తెలి వైనవాడు వెడతాడు. వీళ్లందరి కేసీ, తన మాతృదేశంలో నివశించే విషాదభరితులైన వీళ్ల కేసి శ్రద్ధగా చూసి, విచారకరమైన చిరునవ్వుతో వదనంమీదా, హృదయం లోనూ నిరాశాభరిత దుఃఖం వుండగా, పరమచిత్తశుద్ధిగల స్వరంతో, మృదువైనా గానీ గాఢమైన మందలింపు మాటలతో అంటాడు:

''యేం జడజీవితం గడుపుతున్నారండీ, మీరు!''

అయిదు రోజులుగా జ్వరం, అయినా విశ్రాంతి తీసుకోవాలనే కోరిక లేదు. ఫిన్నిష్ వాన చెమ్మధూళి వున్న నేలమీద జల్లులుగా పడుతోంది. ఫోర్ట్ ఇన్నొ ఫిరంగిలు విరామం లేకుండా దద్దరిల్లుతున్నాయి. రాత్రి పూట సెర్చ్‌లైట్ దీర్ఘ నాలిక మేఘాలని నాకుతుంది. దరిద్రపు దృశ్యం, యేమంటే అది కర్కోటక వ్యాధిని — యుద్ధాన్ని[2], గుర్తుచేస్తుంది.

నేను చేహోవ్ పుస్తకం చదువుతున్నాను. ఆయన పదేళ్ల కితం చచ్చిపోయి వుండనట్టయితే యుద్ధం బహుశా ఆయన్ని చంపేసి వుండేది, మొదటగా ఆయన్ని మనుష్యుల పట్ల ద్వేషంతో విషపూరితం చేస్తూ. ఆయన అంత్యక్రియలు గుర్తుకు వచ్చాయి.

మాస్కో అంత ''మార్దవంగా ప్రేమించిన'' యీ రచయిత శవపేటిక ''ఆయిస్టర్లు'' అని తలుపుమీద పెద్ద అక్షరాలతో రాసివున్న ఆకుపచ్చ వాగన్‌లో వచ్చింది. రచయితని దర్శిస్తామని స్టేషన్‌కి వచ్చిన జనంలో కొంతమంది అప్పుడే మంచూరియానుంచి తీసుకువచ్చిన జనరల్ కెల్లర్ శవపేటికతో వెనకాల వెళుతూ, చేహొవ్‌ని మిలిటరీ బాండ్‌తోటి శ్మశానికి తీసుకుపోతున్నారేమో అని ఆశ్చర్యపోయారు. పొరపాటు గుర్తించగానే కొందరు సరసులు నవ్వడమూ, వ్యంగ్యంగా హాసం చెయ్యడమూ మొదలుపెట్టారు. చేహొవ్ శవపేటిక వెనక్కాల ఓ వంద మంది వెళ్లి వుంటారేమో, అంతే. యిద్దరు లాయర్లు మాత్రం నాకు బాగా గుర్తున్నారు. యిద్దరూ కూడా కొత్త బూట్లు తొడుక్కుని, మెరిసిపోయే టైలు కట్టుకుని పెళ్లి కొడుకుల్లాగా వున్నారు. వాళ్లిద్దరి వెనక్కాల నడుస్తూ వెళ్లాను. వాళ్లల్లో ఒకతను కుక్కల తెలివితేటల గురించి మాట్లాడ్డమూ, రెండో అతను తన వేసవి విడిది సౌకర్యాన్నీ, దాని పరిసరాల అందాన్నీ వర్ణించడమూ విన్నాను. గులాబీ రంగు బట్టలు తొడుకున్న ఆడావిడ నీడ కోసం లేసు గొడుగు పట్టుకుని కొమ్ము అంచుగల కళ్లజోడు పెట్టుకున్న ముసలి పెద్దమనిషి యెవరితోనో అంటోంది:

''పాపం, అతను యెంత ప్రేమాస్పదుడు, యెంత చమత్కారంగా వుండేవాడు....''

ఆ ముసలాయన నమ్మలేనట్టు దగ్గాడు. ఆవేళ వేడిగా వుంది, దుమ్ము లేస్తూ వుంది. వూరేగింపు ముందు ఒక లావాటి పోలీసు ఆఫీసరు లావాటి తెల్లని గుర్రంమీద కూర్చుని దారితీస్తున్నాడు. యిదంతా కూడా ఆ మహత్తర, సునిశిత రచయిత స్మృతికి శుద్ధ అనుచితంగానూ, వెలపరం పుట్టేటంత అసభ్యంగానూ వుంది.

వృద్ధ ఎ. సువోరిన్[4]కి చేహొవ్ రాసిన ఒక ఉత్తరంలో యిలా వుంది:

''జీవితానందాన్ని ధ్వంసం చేస్తూ, విముఖతని కలిగిస్తూ, జీవించడం కోసమే రసహీనమైన పోరాటం చెయ్యడం కంటే నిరుత్సాహభరితమైందీ, విషాద భరితమైందీ మరొకటి లేదు.''

యీ మాటలు పరమ రష్యన్ స్వభావాన్ని వ్యక్తం చేస్తాయి. నా అభిప్రాయంలో చేహొవ్ అలాంటి వాడు కానే కాదు. రష్యాలో ప్రతీదీ అంతగా వున్నప్పుడు, కాని ప్రజలకి పని చెయ్యాలనే యిచ్ఛలేనప్పుడు, అధిక సంఖ్యాకులు అలానే భావిస్తారు. రష్యన్లు శక్తిని మెచ్చుకుంటారు, కాని నిజంగా అదంటే వాళ్లకి నమ్మకం వుండదు. క్రియాత్మక స్థితిని ప్రవచించే రచయిత, ఉదాహరణకి జాక్ లండన్[5] లాంటి వాడు, రష్యాలో అసంభవం. జాక్ లండన్ పుస్తకాలు రష్యాలో

చాలా ప్రచారం పొందాయి. కాని అవి రష్యన్ల సంకల్పాన్ని క్రియకి ప్రేరేపిస్తా యని అనుకోను, అవి వూరికే వాళ్ళ వూహల్ని రేపుతాయంతే. కాని చేహోవ్ ఆ అర్థంలో అంత రష్యన్ కాదు. ఆయన చిన్నతనంనుంచీ ఒక రొట్టె ముక్క కోసం నిత్యం రొష్ఠు పడే సంతోషరహిత, కాంతిహీన రూపంలో ''జీవన పోరాటం'' సాగించాల్సి వచ్చింది – తను పోషించాల్సిన కుటుంబానికి పెద్ద రొట్టె ముక్క అవ సరం. యీ యాతనలకే, సంతోషం లుప్తమైన వీటికే, ఆయన యువ శక్తులన్నీ ధారపోశాడు. చిత్రం యేమిటంటే ఆయన హాస్య చతురతని నిలబెట్టు కోవడం. తగినంత తిండి కోసం, శాంతి కోసం రెక్కలు ముక్కలు చేసుకునే శ్రమగా తప్ప మరోలా జీవితం ఆయనకి కనిపించలేదు. జీవితపు మహత్తర సంఘటనలూ విషాదాలూ నిస్సార విషయాల మందమైన పొర మాటున కప్పడి పోయాయి. యితరులని పోషించడం కోసం తను సంపాదించాల్సిన ఆందోళన తొలగి పోయినప్పుడే ఆయన యీ సంఘటనల గురించిన సత్యాన్ని నిశితంగా చూడ గలిగాడు.

సంస్కృతికి పునాదిగా శ్రమ వుండడం అనే దాని ప్రాముఖ్యాన్ని చేహోవ్ అంత గాఢంగా, వైవిధ్యభరితంగా చూసిన వాళ్లెవరూ నాకు కనిపించలేదు. యీ అనుభూతి కుటుంబ జీవితపు చిల్లర మల్లర విషయాలన్నిటిలోనూ, వస్తువులని వస్తువులుగానే ప్రేమించడంలో ద్యోతకం అయింది. కూడబెట్టుకోవాలనే కాంక్షవల్ల యేం మలినం కాకుండా ఆయన వాటిని మానవుడి సృజనాత్మక శక్తి ఉత్పత్తిగా విసుగు లేకుండా అభినందించేవాడు. యిళ్లు నిర్మించడాన్ని, తోటలు నాటడాన్ని, నేలని అలంకరించడాన్ని ప్రేమించాడు. ఆయన శ్రమలోని రసాన్ని అనుభూతి చెందేవాడు. తను స్వయంగా నాటిన పళ్ల చెట్లూ, పూల మొక్కలూ యెదు గుతూ వుంటే ఆయన యెంతో హత్తుకునే శ్రద్ధతోటి పరిశీలించేవాడు. తన యిల్లు కట్టుకోడానికి సంబంధించిన అనేక బాధల్లో వుండి ఆయన అన్నాడు:

''ప్రపంచంలోని ప్రతి ఒక్కడూ తన సొంత మడిమీద తను చెయ్యగలిగి నంతా చేస్తే యీ ప్రపంచం యెంత యింపుగా వుంటుంది!''

సరిగ్గా ఆ సమయంలోనే నేను నా నాటకం ''వసీలీ బుస్లాయెవ్''[6] రాసే యాతనలో వున్నాను. వసీలీ దాంభికంగా అనే స్వగతాన్ని ఆయనకి చదివి విని పించాను:

మరింత శక్తే నాలో వుంటే!
వేడి నిట్టూర్పుతో చుట్టూ వున్న మంచుని కరిగిస్తా,
ప్రపంచమంతా తిరిగి భూముల్ని దున్నుతా;

తీవిగల పట్టణాలనీ, నగరాలనీ స్థాపిస్తా,
చర్చిలని కడతా, పళ్ల తోటల్ని నాటతా.
అందమైన అమ్మాయిలా అగుపిస్తుంది అవని!
ఒక వధువులాగా దీన్ని గ్రహిస్తా నా హస్తాల్తో
ఆక్కున హత్తుకుంటా నీభూతలాన్ని.
దాన్ని మోసుకుపోతా ప్రభువు దగ్గరికి.
''చూడు, ప్రభూ, దేవా, యిలాతలం చూడు
యెంత మనోహరంగా మలిచానో చూడు!
ఆకాశం పైకి దీన్ని రాతిలాగ విసిరావు నువ్వు
వెలగట్టలేని వజ్రంగా నేను దీన్ని మార్చా!
దీన్ని చూడు, నీ హృదయం పులకలెత్తి పరవశించు
సూర్య కాంతిలో యెంతటి హరితంగా వుందో కదు!
సంతోషంగా నీకు దీన్ని అర్పణ కావింతు, గాని
యివ్వను, యివ్వలేను — యిది నాకు అమిత ప్రియం.

చేహొవ్‌కి యీ స్వగతం నచ్చింది, వణుకుతూ దగ్గి ఆయన నాతోటీ, డా. ఎ. అలెక్సిన్‌తోటీ అన్నాడు:

''బాగుంది.... చాలా బాగుంది.... నిజంగా, మానవుడి లక్షణంతో వుంది. సరిగ్గా అక్కడే ''సకల తత్వశాస్త్రాల అర్థం'' వుంది. మానవుడు ప్రపంచంమీద వున్నాడు, అతను దాన్ని వాసయోగ్యమైన స్థలంగా చేస్తాడు.'' నిశ్చయంగా తల పంకించి ఆయన రెట్టించాడు: ''చేస్తాడు!''

మళ్లీ చదవమని ఆయన నన్ను అడిగాడు, విని, కిటికీలోనుంచి చూస్తూ:

''ఆఖరి రెండు పాదాలూ లాభం లేదు. అవి ధిక్కరిస్తున్నట్టు వున్నాయి. అతిరిక్తం.''

తన సాహిత్య కృషిని గురించి తక్కువగానూ, అయిష్టంగానూ ఆయన మాట్లాడేవాడు. లియో టాల్‌స్టాయ్‌ని గురించి ఆయన అంతటి మోహమాటంగానూ జాగ్రతగానూ మాట్లాడేవాడు. యెప్పుడేనా, హుషారుగా వున్నప్పుడు, ఆయన ఓ కథ యితివృత్త నిర్మాణం చెప్పేవాడు, నవ్వుతూ — అది యెప్పుడూ హాస్యభరితమైన కథే.

''ఓ నాస్తికురాలు బడిపంతులమ్మ గురించి కథ రాస్తాను. ఆమె డార్విన్[7]ని

ఆరాధిస్తుంది, జనంలో వున్న దురభిప్రాయాలనీ, మూఢ నమ్మకాలనీ యెదిరించాల్సిన అవసరం గురించి నమ్మకం వున్న మనిషి. తనే ఓ అర్ధరాత్రి స్నానాల గదికి నల్ల పిల్లిని ఉడికించడానికి పోతుంది, యెవడేనా మగాణ్ణి ఆకర్షించి, తన పట్ల ప్రేమ కలిగించే మంత్రమయమైన అస్థిక కోసం* — ఎలాంటి యెముకో తెలుసా....''

ఆయన తన నాటకాలు ''సరదా''గా వుంటాయనే యెప్పుడూ అనేవాడు. నిజంగా తను ''సరదా నాటకాల''ని రాసాననే ఆయన మనస్ఫూర్తిగా అనుకునేవాడు. ''చేహొవ్ నాటకాలని లాలిత్యభరిత మోదాంతాలుగా ప్రదర్శింపచెయ్యాలి'' అని మొండిగా అంటున్నప్పుడు సవ్వ మొరోజొవ్[8] చేహొవ్ మాటల్నే తిరిగి వల్లిస్తున్నాడనడంలో సందేహం లేదు.

కాని సాహిత్యం పట్ల సామాన్యంగా ఆయన అతి నిశితమైన శ్రద్ధ చూపించేవాడు, మరీ ముఖ్యంగా ''కొత్త వాళ్ల'' విషయంతో స్పందించేటట్టు అది వుండేది.

''మనకి యింకా రచయితలు కావాలి'' అన్నాడాయన. ''మన నిత్య జీవితంలో సాహిత్యం యింకా కొత్తది, ''పర్రసపాడు''లకి కూడా. నార్వేలో ప్రతి రెండు వందల ఇరవైయారు మందికీ ఒక రచయిత వున్నాడు, యిక్కడ మిలియన్‌కి ఒకడు.''

ఆయన జబ్బు ఒకో అప్పుడు అకారణ నిర్వేద సంబంధమైనా, మానవద్వేష సంబంధమైనా మానసిక స్థితిని ఆయనకి కలిగించేది. అలాంటప్పుడు ఆయన మహా విమర్శనాత్మకంగా తయారయేవాడు, ఆయనతో నెగ్గుకు రావడం చాలా కష్టంగా వుండేది.

ఓ రోజున సోఫామీద పడుకుని, పొడి దగ్గుదగ్గుతూ, థర్మామీటరుతో ఆడుతూ, ఆయన అన్నాడు:

''వూరికే చచ్చిపోవడం కోసం బతకడం అనేది యేం ఉల్లాసంగా వుండదు, కాని మీరు అకాలంగా చచ్చిపోతారు అనే యెరుకతో బతకడం వుందే అది నిజంగా అవివేకం....''

---

* యింగ్లీషులో wish bone అంటారు. కోడి లాంటి వాటి పంగ యెముకని చెరి ఒక వేపూ లాగుతూ వుంటే యెవరికి పెద్ద యెముక వస్తే వాళ్లకి కోర్కెలు తీరతాయట. — అను.

యింకో సారి తెరిచిన కిటికీ ముందు కూర్చుని, దూరంగా సముద్రం కేసి చూస్తూ ఆయన హఠాత్తుగా, ముక్కోపంగా అన్నాడు:

"వాతావరణం బాగా వుంటుందనీ, యీ యేడు పంట దిగుబడి బాగా వుంటుందనీ, ప్రేమ వ్యవహారం సజావుగా వుంటుందనీ ఆశిస్తూ బతకడానికీ, ధనవంతుల మవుతామనీ, పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ అయిపోతామనీ ఆశిస్తూ బతకడానికీ మనం అలవాటు పడ్డాం. కాని తెలివైన వాళ్లుగా అవాలని ఆశించిన వాడెవడూ నాకు తగల్లేదు. మనకి మనమే అనుకుంటాం: చక్రవర్తి మారితే పరిస్థితి బాగుంటుంది, రెండు వందల యేళ్లల్లో యింకా మెరుగ్గా వుంటుంది అని. యీ శుభఘడియని రేపే తీసుకురావడానికి యెవళ్లూ ప్రయత్నించరు. మొత్తంమీద జీవితం రోజు రోజుకీ సంక్లిష్టం అవుతోంది, తన దారిన తను గడుస్తోంది, జనం యింకా యింకా బడుద్ధాయిలవుతున్నారు, జీవితంనుంచి యింకా యింకా దూరం అయిపోతున్నారు."

నుదురు ముడుచుకుని, ఒక క్షణం ఆగి, ఆయన మళ్లీ అన్నాడు:

"ఒక మతం వూరేగింపులో అవిటి భిక్షుకుల్లాగా."

ఆయన డాక్టరు. డాక్టరు జబ్బు అతని రోగుల జబ్బు కంటే యెప్పుడూ అధ్వాన్నమే మరి. రోగులు వూరికే బాధపడతారు అంతే, డాక్టరుకి బాధతో బాటుగా తన శరీర నిర్మాణంమీద ఆ జబ్బుకి వున్న వినాశకర ఫలితం గురించి కూడా తెలుస్తుంది. జ్ఞానం మృత్యువుని చేరువకు తెస్తుంది అనడానికి యిదో దాఖలా.

ఆయన నవ్వినప్పుడు ఆయన కళ్లు చాలా అందంగా వుంటాయి — అప్పుడు వాటిల్లో ఒక స్త్రీత్వపు మృదుత్వం, యేదో మెత్తనిదీ, మార్దవమైందీ వుంటుంది. ఆయన నవ్వులో, దాదాపు యే సద్దూ చెయ్యకుండా, ప్రత్యేకం ఆకర్షకమైందేదో వుంది. నిజంగా ఆయనకి నవ్వడం అంటే సంతోషం. అంత "ఆధ్యాత్మికంగా," యీ పదాన్ని వాడే అభ్యంతరం లేకపోయినట్లయితే, నవ్వగలిగే వాళ్లెవరూ నాకు తెలియదు.

అశ్లీలకరమైన కథలెప్పుడూ ఆయనకి నవ్వు తెప్పించలేదు.

ఒక సారి ఆయన ఆహ్లాదకరమైన, దయాన్వితమైన చిరునవ్వు నవ్వుతూ అన్నాడు:

"టాల్‌స్టాయ్ మీ విషయంలో అంత చంచలంగా యెందుకు వుంటాడో మీకు తెలుసా? ఆయనకి అసూయ. సులెర్‌జీత్‌స్కీ[9] మిమ్మల్ని తన కంటే యెక్కువ ప్రేమిస్తాడని. నిజంగా అంతే! ఆయన నిన్న నాతో అన్నాడు: 'ఇది యెందుకనో నాకు తెలీదు గాని గోర్కీతోటి నేను నేనులాగా వుండలేను. సులెర్‌జీత్‌స్కీ

అతనితో వుండటం నాకు యిష్టం లేదు. అది సులెర్‌జీత్‌స్కీకి సంబంధించింది కాదు. గోర్కీ దుష్టుడు. సకల ప్రపంచం పట్ల కసి వుంచి, బలవంతంగా పవిత్ర ప్రమాణం తీసుకొనేటట్టు చేసిన భగవచ్ఛాస్త్ర విద్యార్థి లాంటి వాడతను. అతనిది విధినిర్వహణ దూతల లక్షణం. అతను యెక్కడినుంచో కనానుకి* వచ్చాడు. అతనికి అది పరాయి దేశం. అతను ప్రతిదాన్నీ గమనిస్తూ, చుట్టూ జరుగుతున్న వాటిని, దీన్నంతటినీ తన దేవుడెవరికో చెప్పాలని. అతని దేవుడు దానవుడు, పల్లెటూరి ఆడవాళ్లు భయపడేలాంటి వనదేవతో, జలదేవతో."

చేహొవ్ దీన్ని నాకు చెప్తూ కళ్లనుంచి నీళ్లు తిరిగే దాకా నవ్వాడు; కళ్ళ నీళ్లు తుడుచుకుని అన్నాడు:

"'గోర్కీ మంచివాడు' అన్నాన్నేను. కాని ఆయన అన్నాడు: 'వద్దు, వద్దు, నాకు చెప్పొద్దు! బాతు ముక్కు లాంటి ముక్కు వుంది అతనికి, దురదృష్ట వంతులకీ, చిర్రు బుర్రులాడే వాళ్లకీనే అలాంటి ముక్కు వుంటుంది. ఆడవాళ్ళు అతనంటే యిష్టపడరు. ఆడవాళ్లు కుక్కల్లాంటి ఘ్రాణశక్తి గల వాళ్ళు, వాళ్ళకి యెప్పుడూ మంచి మనిషి యెవరో తెలుసు. సులెర్‌జీత్‌స్కీ వున్నాడు, అతనికి స్త్రీలపట్ల నిష్కామ ప్రేమ అనే అమూల్యమైన వరం వుంది. ఆ విషయంలో అతను మేధావి. ప్రేమించగలిగి వుండటం అంటే దేనికైనా సామర్థ్యం వున్నట్టే...."

కొంచెం సేపు ఆగి చేహొవ్ మళ్ళీ అన్నాడు:

"అవును ఆ ముసలాయనకి అసూయ.... ఆయన అద్భుతమైన నటుడు కాడూ..."

ఆయన టాల్‌స్టాయ్‌ని గురించి మాట్లాడేటప్పుడు దాదాపుగా యెప్పుడూ ఆయన కళ్లల్లో, తక్షణం మార్దవంగా, వెలుగ్గా వుండే కనిపించని చిరునవ్వు వుండేది. ఆయన యేదో మర్మంగా, సూక్ష్మంగా వుండే దాన్ని గురించి మాట్లాడు తున్నట్టూ, బహు జాగ్రత్తగా, ఆప్యాయంగా వ్యవహరించాల్సిన దాన్ని గురించి మాట్లాడుతున్నట్టూ గొంతు తగ్గించేవాడు.

టాల్‌స్టాయ్ పక్కన ఆ వృద్ధుని అప్ప నిశితమైన, వూహించని, తరచుగా స్వవచోవ్యాఘాతంగా వుండే మాటలని రాసి వుంచేటువంటి ఎక్కెర్‌మాన్[10] యెవరూ లేకపోయారే అని చేహొవ్ యెప్పుడూ బాధపడుతూ వుండేవాడు.

"మీరు ఆ పని చేసి వుండాలి" అని ఆయన సులెర్‌జీత్‌స్కీని ఒప్పించ

* యూదు మతస్థులు భగవంతుడు వాగ్దానం చేసిన భూమి. — అను.

ప్రయత్నించాడు. ''టాల్‌స్టాయ్‌కి మీరంటే యెంతో యిష్టం, ఆయన మీతో యెంతో మాట్లాడతాడు, అంత అద్భుతమైన విషయాలు చెప్తాడు.''

సులెర్‌జీత్‌స్కీ గురించి చేహొవ్ నాతో అన్నాడు:

''విజ్ఞుడైన బాలుడు.''

బాగా అన్న మాట.

ఒక సారి టాల్‌స్టాయ్ చేహొవ్ కథనొక దాన్ని పొగడ్డం విన్నాను — ''ది డార్లింగ్'' అనుకుంటాను.

''శీలవంతురాలైన కన్య అల్లిన లేసులాంటిది అది'' అన్నాడాయన. ''పూర్వం రోజుల్లో లేసు అల్లే ఆడపిల్లలు వుండేవాళ్లు. జీవితాంతం వాళ్లు తమ ఆనంద స్వప్నాలని ఒక పద్ధతిలో అల్లుకునే వాళ్లు. తమ ప్రియాతి ప్రియమైన కలలని అల్లుకునే వాళ్లు. వాళ్ల లేసు ప్రేమని గురించిన అస్పష్ట శుద్ధ అభిలాషతో నిండిపోయి వుండేది.'' టాల్‌స్టాయ్ నిజమైన ఆవేశంతో, కళ్లల్లో నీళ్లు తిరుగుతూ మాట్లాడాడు.

కాని ఆ రోజున చేహొవ్‌కి జ్వరంగా వుంది. ఆయన తల వంచుకుని కూర్చు న్నాడు. బుగ్గలమీద రంగు మచ్చలు స్పష్టంగా వున్నాయి. తన పిన్స్-నెజ్ కళ్ల జోడుని తుడుచుకుంటూ కూర్చున్నాడు. కొంచెం సేపు ఆయన యేమీ మాటా డ్లేదు. ఆఖరికి నిట్టూర్పు విడుస్తూ, మెల్లిగా, యిబ్బందిగా అన్నాడు:

''అందులో అచ్చుతప్పులు వున్నాయి.''

చేహొవ్‌ని గురించి చాలా రాయవచ్చు. దానికి సూటి అయిన వివరణ కావాలి, మరి నా లోపం అదే. ఆయన్ని గురించి, ఆయన తన ''స్తెప్‌మైదానం'' రాసుకు న్నట్టుగా రాయాలి. అది పరిమళభరిత, స్వచ్ఛ వాయువులు వీచే యెంతో రష్యన్ కథ, ఆలోచనాయుతంగా, తీరని అస్పష్టమైన కోరిక గల కథ. యెవళ్లదేనా ఆత్మ కథ.

అలాంటి మనిషిని గుర్తుచేసుకోవడం యెవళ్లకేనా హాయినిస్తుంది. హఠాత్తుగా ఉల్లాసం దర్శించినట్టు వుంటుంది, జీవితపు పరమార్థాన్ని మళ్లీ అది అంది స్తుంది.

మానవుడు విశ్వానికి అక్షం.

మరి అతని చెడు, అతని లోపాలు? అని మీరడగవచ్చు.

మనం అంతా మనతోటి మనిషిపట్ల ప్రేమ కోసం ఆకలితో వుంటాం. మరి యెవళ్లకేనా గాని ఆకలిగా వున్నప్పుడు ఉడికీ ఉడకని అన్నం ముద్ద కూడా అమృతంలాగే వుంటుంది.

# బాల్జాక్

నిస్తేజమైన, ఊషర మైదానంమీద పోయే పథికుడు, ఒకప్పుడు తాను నడిచి వెళ్లినటువంటి సారవంతమైన, అందమైన, శోభాయమానమైన క్షేత్రాన్ని గుర్తుకు తెచ్చుకోవడంలా ఆనందంగా వుంటుంది బాల్జాక్[11] నవలల్ని జ్ఞాపకం చేసుకోవడమంటే.

ఒక ఫ్రెంచి రచయిత రాసిన పుస్తకాన్ని నేను తొలిసారిగా చదివినప్పుడు నాకు పదమూడేళ్లు. యిది ఎడ్మాం గొన్‌కూర్[12] రాసిన ''జెంగాన్నో సోదరులు''. నటుల గురించి, విద్వేషభరిత జిజ్ఞాసకత అనే పరిమిత, ఆత్మనాశక ప్రపంచంలో మానసిక యేకాంతం పాలబడిన మనుషుల గురించిన స్పందనాత్మక గాథ. మానవసహజమైన విషాదం వున్న ఆ పుస్తకం నన్ను కదిలించి వేసింది. తనకి గల ఉత్తమమైన దాన్నంతటినీ ప్రపంచానికి అర్పించిన ప్రతివాడి పట్లా దయాపూరిత, తీవ్రోద్రేక, సానుభూతి పూర్వక గౌరవం నాలో శాశ్వతంగా కలిగేటట్టు చేసింది.

అదే సమయంలో ఫ్రాన్స్ దేశపు సాహిత్యాన్ని గురించి యెక్కువగా తెలుసుకోవాలన్న కాంక్షని ఎడ్మాం గొన్‌కూర్ నాలో ఉద్దీపనం చేశాడు. దాని చరిత్రని గురించి నాకు కొద్దిగా, చిన్న తునకలు తెలుసు. ఆ దేశాన్ని యోధుల గడ్డగా, వీర భూమిగా నేను చిత్రించుకున్నాను. నాకు తెలిసినటువంటి బడి పిల్లల్ని ఫ్రాన్స్‌లో యే రచయితలున్నారో చెప్పమనీ, తమకి దొరికిన ఫ్రెంచి నవలల రష్యన్ అనువాదాన్ని నాకు యిమ్మనీ కూడా అడిగాను.

అలెగ్జాండర్ డ్యూమా,[13] పోంసాన్ డ్యు టెరైల్, ఫార్చున్ దు బొయిస్ గాబె, పీర్ జాకోనే, ఎమిలీ గబోరియో[14] మరో డజను మంది రాసిన ఉద్గ్రంథాలని ఆపోశన పట్టేశాను, నాకు యెవరోగాని బాల్జాక్ పుస్తకం ఒక దాన్ని యిచ్చే దానికి ముందే — అది ''మేక తోలు ముక్క.''

బాల్జాక్ పాతవస్తువుల అంగడిని వర్ణించిన పేజీలని యెంతటి చెప్పలేని సంతోషంతో చదివిందీ నేను మర్చిపోలేను. మాటలని యెలా పడితే అలా మలుచుకోడానికి తగ్గ అతి చక్కటి ఉదాహరణగా ఆ వర్ణనని నేను యెన్నటికీ మర్చిపోలేను. యీ పుస్తకంలో ఆశ్చర్యకరమైన నేర్పుతో రాసిన మరో భాగం విందు దగ్గర సంభాషణ: భోజనాల బల్ల దగ్గర జరిగే సంభాషణలో ఒక్కడొకటీ, యిక్కడొకటీ పాడి ముక్కల్ని మాత్రమే వాడి, బాల్జాక్ మనుషుల ముఖాలకీ, వాళ్ల పాత్రలకీ సంబంధించిన ఆశ్చర్యకరమైన స్పష్టమైన చిత్రాన్ని రూపు కట్టిస్తాడు.

నేను బాల్జాక్ పుస్తకాల కోసం చూడ్డం మొదలుపెట్టాను. నేను చదివిన ఆయన మరో పుస్తకం ''తండ్రి గొరియో''. నేను వివశుడినైపోయాను. యిక చాలా కాలం నేనే ఆ రస్టిన్యాక్‌ని అనీ, మానవుడి గౌరవాన్ని అణగదొక్కినందుకూ, తను పడే మానసిక వ్యథలన్నిటికీ కారకమైనందుకూ ప్రపంచాన్ని కసితో బెదిరించే ఆ వ్యక్తిని అనీ, భావించుకున్నాను. ఆ రోజుల్లో నేను నికృష్టంగా బతికాను. అయినా మంచి ఆరోగ్యంగా వుండేవాణ్ణి. అంచేత కాల్పనికవాదిని అయాను.

''మానవ ప్రహసనం'' చదివేటప్పటికప్పుడే నాకు దగ్గరదగ్గర యిరవై యేళ్లు. వాలో రూపు తీసుకోని కాల్పనికత్వంమీద ఆ పుస్తకం చావుదెబ్బ కొట్టింది. ఆ పుస్తకంలో నాకు బాల్జాక్ ప్రతిభ తెలిసింది. యిక ఆయన్ని నేను మహా తీవ్రమైన ఆరాధనతోటి, ఉదాహరణకి ఒక గురువు పట్లా, స్నేహితుడి పట్లా వుండేటువంటి భావంతోటి, ప్రేమించాను.

రెండేళ్ల తర్వాత ఆయన పూర్తి రచనల అనువాదం రష్యాలో వచ్చింది. అన్నిటినీ రెండు సార్లు చదివాను. నిజంగా యీ రచయిత గొప్పతనాన్ని అభినందించాను. ఆశ్చర్యకరమూ సమ్మోహనకరమూ అయిన ప్రతిభగల ఆ నిరోచిత యీసాన్ని అభినందించాను. ఆయన ప్రణాళికల పరిధి, ఆలోచనల్లోని సాహసం, వాక్కులోని సత్యసంధత, భవిష్యత్తుని గురించిన జోస్యాలు — వాటిల్లో యిప్పటికే చాలా మట్టుకు నిజమయ్యాయి — అన్నీ కూడా ఆయన్ని ప్రపంచపు మహా బోధకుల్లో ఒకణ్ణిగా చేస్తున్నాయి.

షేక్స్పియర్, బాల్జాక్, టాల్‌స్టాయ్ — నా మట్టుకి నాకు వాళ్లు ముగ్గురూ మానవాళి తనకిగా స్థాపించుకున్న మహత్తర శిఖరాలులాగా కనిపిస్తారు. బాల్జాక్ లేకపోయినట్లయితే ఫ్రాన్స్ గురించిన నా అవగాహన తక్కువగా వుండేది. ఆ దేశం మానవాళికి పథనిర్దేశకంగా యెప్పుడూ నడిచింది, యింకా నడుస్తూనే వుంది. సర్వదా సృజనాత్మకతలో నూతన రూపాలనీ, యేదో ఒక రంగంలో జీవితపు

నూతన రూపాలనీ వికసింపచేస్తూనే వుంది. తన వడ్డీ వ్యాపారస్థులవల్ల ఫ్రాన్స్ అవమానం పాలైంది. దాన్ని గురించి ఒక సారి నేను మాట్లాడాను. ఆ మాట్లాడడం నేను ప్రేమించిన దేశంలో కోపకారణమైంది. అలా కోపం కలగడం నాకు అర్థం కాలేదు, దాన్ని గురించి నేను పశ్చాత్తాపపడడమూ లేదు. కాని ఫ్రెంచి స్టాక్ ఎక్స్ఛేంజి చేసే సంస్కృతీ వ్యతిరేక, మానవ వ్యతిరేక కార్యకలాపాలు — స్వేచ్ఛా పథంమీద వెళ్లకుండా కాళ్లడ్డం పెట్టి రష్యన్ ప్రజల్ని తొట్రుపడజేసిన ఆ కార్యకలాపాలు — హ్యూగో,[15] బాల్జాక్, ఫ్లొబెర్[16] లాంటి ధగద్ధగాయమానమైన తేజస్సు మీద యెన్నటికీ నీడని కమ్మలేవు. మహత్కార్యాలకీ, మహత్తర మనుషులకీ గడ్డ అయిన ఫ్రాన్స్‌కి వాళ్లు నిజమైన పుత్రులు.

యెందుకనో కారణం చెప్పలేను, గాని వ్యక్తిగతంగా దేనికి నేను బాల్జాక్‌కి రుణపడి వున్నదీ నాకు తెలీదు. కాని మొత్తం రష్యన్ సాహిత్యంమీద ఆయన ప్రభావం, టాల్‌స్టాయ్ చెప్పినట్టు గణనీయంగా వుందన్న విషయం నిస్సందేహం. టాల్‌స్టాయ్ ఒక సారి నన్నడిగాడు:

''మీరు యెక్కువగా యేం చదువుతారు?'' అని.

నేను చెప్పాను.

''బాగుంది'' అన్నాడాయన. ''కాని యింకా ఫ్రెంచి రచయితలని చదవండి. బాల్జాక్‌ని చదవండి. అతన్నుంచే ప్రతివాళ్లూ రాయడం నేర్చుకున్నారు. స్టెండాల్[17]ని, ఫ్లొబెర్‌ని, మపాసా[18]ని చదవండి. ఎలా రాయాలో వాళ్లకి తెలుసు. రూపానికి సంబంధించి వాళ్లకి అద్భుతంగా పరిణతి చెందిన అనుభూతి వుంది, తాము తీసుకున్న వస్తువుమీద కేంద్రీకరించే సామర్థ్యమూ వుంది. ఒక్క డికెన్స్[19]ని మాత్రమే, బహుశా థాకరేని,[20] వాళ్ల తర్వాత చెప్పకోవచ్చు. నేను గనక స్టెండాల్ రాసిన ''పర్మలో వున్న ఆశ్రయం'' చదవకపోయి వున్నట్టయితే 'యుద్ధమూ — శాంతీ' అన్న నా నవలలోని యుద్ధరంగాలు రాయలేకపోయి వుండేవాణ్ణి.''

బాల్జాక్ అనంతం, నాకు ఆయన్ని గురించి చెప్పేటంతటి శక్తి లేదు. ఆయన్ని గురించిన నా జ్ఞాపకాలతో బాటుగా నా జీవితంలోని పరమ గడ్డు రోజులు పెన వేసుకుని పోయివుంటాయి. అది ఉద్రేకాలని కల్లోల పరుస్తుంది.

నా జీవితంలో సాహిత్యం తల్లిలాంటి పాత్ర వహించింది. మనుషుల పట్ల తనకి గల ప్రేమ వల్లా, జీవితం గురించి తనకి గల అద్భుత పరిజ్ఞానం వల్లా నేను బాల్జాక్ పుస్తకాలని అత్యంత ప్రియమైన వాటినిగా యెంచుతున్నాను. యీ ప్రేమ, అద్భుతపరిజ్ఞానం ఆయన నవలల్లో యెప్పుడూ యెంతో గాఢంగా, ఆనంద దాయకంగా నాకు అనుభూతం అయాయి.

# శ్రామికవర్గ రచయితల సంకలనానికి ముందుమాట

పుస్తకాన్ని పాఠకుడు సులభంగా అర్థం చేసుకొనే వీలు కల్పించేందుకే ముందు మాటలని రాస్తారు. యీ లక్ష్యం కోసమే అయితే నేను పీఠిక రాయనవసరం లేదు యేమంటే కామ్రేడ్స్, యీ సంకలనపు అంతరార్థం నాకు అర్థమైనంత స్పష్టంగానూ మీకూ అర్థం అవుతుందని నా నమ్మకం. రచనా వ్యాసంగంలో వున్న వాణ్ణి అవడంవల్ల యీ సంకలనంలో వున్న గద్య, పద్యాల శిల్పసంబంధమైన, సాహిత్యపర లోపాలని గురించి నాకు మరింత నిశితంగా తెలిసి వుండవచ్చు. కాని, అందుకు భిన్నంగా మీకు, యీ పుస్తకపు ప్రచురణలో నివిడమై వున్న అర్థాన్ని గురించి యెక్కువ నిశితంగా తెలుస్తుందని నాకు అనిపిస్తుంది.

యీ పుస్తకాన్ని మీ కామ్రేడ్లు రాశారు. మన గడ్డు పరిస్థితుల్లో యిది నూతనమూ, అత్యంత ప్రముఖమూ అయిన దృగ్విషయం. యేమంటే యిది శ్రామికవర్గ మేధాశక్తుల పెరుగుదల గురించి ధారాళంగా చాటుతోంది. వృత్తి రచయితకి లక్షా యిరవై వేల మాటల నవల రాయడంకంటే సొంత కృషివల్ల రచయిత అయినవాడికి ఒక కథానికని రాయడం చెప్పలేనంత కష్టం అని మీకు స్పష్టంగా తెలుసు. యీ కష్టాలని గురించే ''కానీ...'' అనే స్కెచ్ రచయిత అంతటి కటువైన వ్యంగ్యంతో సూచిస్తూ వున్నాడు.

శ్రామికవర్గ రచయితకి తీరిక లేకపోవడంతో బాటుగా తన అనుభూతులని స్పష్టంగా, సూటిగా వర్ణించడంలో — వేరే మాటల్లో చెప్పాలంటే కళాత్మకంగా వర్ణించడంలో — రచయిత పనిముట్టు అయిన కలాన్ని వాడే నేర్పు కొరవడ్డం అనే ప్రతిబంధకం వుందని మీకు తెలుసు. శిల్పాన్ని గురించిన అజ్ఞానం అతనికి ప్రతిబంధకం. కాని అన్నిటినీ మించిన పెద్ద ప్రతిబంధకం పదుల సంఖ్యలో వున్న పర్యాయ పదాలలోనుంచి అతి సామాన్యమైన, శక్తివంతమైన, అందమైన మాటలని యెంచుకోలేని అతని పరిమిత పదజాల జ్ఞానం.

యిన్ని కష్టాలున్నప్పటికీ కూడా, యీ సంకలనం ఆసక్తికరంగా వుందనీ, యిది మీకు సంతృప్తి కలిగించదగ్గ సబబు వుందనీ, రష్యన్ శ్రామికవర్గం తన సొంత సాహిత్యాన్ని సృష్టించుకునే దిశలో వేసే తొలి అడుగుల్లో ఒకటిగా యీ చిన్న పుస్తకాన్ని యేదో భవిష్యత్తులో పేర్కొనడం జరుగుతుందనీ పిష్టపేషణం లేకుండా మీరు అంటారనే నాకు అనిపిస్తుంది.

''చెత్త! అలాంటి సాహిత్యం యెప్పుడూ యెక్కడా లేదు'' అంటారు సందేహ భావుకులు బహుశా.

కావచ్చు, గతంలో లేనివి బోలెడు యిప్పుడు ఉనికిలో వున్నాయి. యింతా చేస్తే మన రోజుల్లో వున్నట్టుగా యిదే రీతిలో, మానసిక నిర్మాణంలో శ్రామిక వర్గం అన్నదే గతంలో యెన్నడూ వుండి వుండలేదు. తన సంకల్ప శక్తిమీదా, బుద్ధి శక్తిమీదా మానవుడికి విశ్వాసం వుండివుండక పోయినట్లైతే యీవాళ తాము యెగురుతున్నట్టు పకుల్లా గాలిలో యెగరలేక పోయివుండే వాళ్ళు మానవులు.

సంవేదనలని, అనుభూతులని, ఆలోచనలని అందమైన రూపంలో వెల్లడించాలనే కామన మానవులందరికీ సహజం. యీ కామన శ్రామికవర్గపు మనసులో యితోధిక గాఢత్వంతో అభివృద్ధి చెందాల్సి వుంది. శ్రామికవర్గం, తన మేధాశక్తుల పెరుగుదల నిష్పత్తితో సమంగా, తన సమష్టి ఆశ్చర్యకర ఘటనా పరంపరని, తన వర్గపు విడివ్యక్తులలోని అలాంటి ఘటనా పరంపరలని యెప్పటికంటే యెక్కువైన, యితోధిక బాధాత్మక స్పష్టతతోటి చూస్తుంది, అనుభూతి చెందుతుంది.

ఆత్మభషకం పొంగిపొర్లేటంత నిండుగా వున్నప్పుడు తన కష్టసుఖాలని విధిగా ప్రపంచంలోకి, మానవ కర్ణాలలోకి ఒంపుకుంటుంది.

తను తన సొంత దైనందిన పత్రికలని బ్రహ్మాండమైన ప్రయత్నాలతోటీ, బృహత్తరమైన త్యాగాలతోటీ సృష్టించుకున్నట్టుగానే శ్రామికవర్గం, తన సొంత సాహిత్యాన్ని సృష్టించుకుంటుంది అని నా దృఢ విశ్వాసం.

యీ విశ్వాసం యెన్నో సంవత్సరాల పరిశీలనా ఫలితం. ఆ కాలంలో నేను, వందలాది ఫాక్టరీ పనివాళ్ళు, చేతి పనుల్లో నిపుణులైన కార్మికులు, రైతులు జీవితాన్ని గురించిన తమ ఆలోచనలనీ, అనుభూతుల్నీ, అనుభవాలనీ కాగితంమీద పెట్టాలని యెడతెగకుండా చేసే ప్రయత్నాలని పరిశీలించాను.

స్వయంకృషివల్ల రచయితలైన వాళ్ళు రష్యాలో వున్నంత మంది యూరప్‌లో మరే దేశంలోను లేరన్న వాస్తవం, 1906 నాటిమంచీ వాళ్ల సంఖ్య లెక్క లేనంతగా పెరుగుతోందన్న తిరుగులేని వాస్తవం మన ముందు వుంది.

యీ విషయానికి గల కారణాలని పరిశీలించడానికి తగ్గ చోటు యిది కాదు.

కాని రష్యా ప్రజలా, రష్యన్ శ్రామికవర్గమూ చారిత్రక, రాజకీయ యువతకి దానితో సంబంధించింది చాలా వుంది. యువకులే యెప్పుడూ అనుభూతులకి యెక్కువ స్పందిస్తారు, సాంఘిక ఆదర్శాలపట్ల యెక్కువ పడిస్తారు. ఒక యువ జాతిలో, యువ వర్గంలో సాంఘిక ఆదర్శవాదానికిగల ఆధారం సాంఘిక పునర్నిర్మాణ ఆచరణాత్మక ప్రయోగాలలో యింకా వ్యయం గాని తమ శక్తిపట్ల వాళ్లకి గల అనుభూతి. తాము ఉద్భూతమైన ప్రజాసమూహంతో ఆధ్యాత్మిక సంబంధానికి యింకోలా చెప్పాలంటే సాహిత్య సృష్టికి చేసే ప్రయత్నాలకి వందలాది వ్యర్థులని నడిపించే శక్తి యీ ఆదర్శవాదమేనని నేను అనుకుంటున్నాను.

యీ శక్తి అద్భుతావహమైన మేరకి అస్తిత్వంలో వుంది. యిటీవలనే మేధావి వర్గం చేతిలో ఓడిపోయి, పరాజితులై, పరిత్యక్తులైన శ్రామికవర్గాన్ని యీ శక్తి యెంత వేగంగా జాగృతంచేసి, సన్నిహితం చేస్తోందో మనం చూస్తున్నాం. మేధావుల్లో కొంతమంది జైళ్లల్లోనూ, ప్రవాసంలోనూ పడి సొలకువ లేకుండా పోయారు, మరి కొంతమంది శ్రామికవర్గాన్ని దగా చేసి బూర్జువాల దగ్గర కొలువులో చేరారు. వీళ్ల ప్రస్తుతం ప్రజాస్వామ్యంపట్ల బూర్జువాల వైఖరిని సమర్థించ గలిగేటటువంటి భావజాలాన్ని సృష్టించే వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నారు.

శ్రామికవర్గంలోని క్రియాశీల శక్తులు రాశిలో పెరుగుతున్నాయి. అదే సమయంలో ఉన్నత సాంస్కృతిక శిఖరాల నధిరోహిస్తున్నాయి. రష్యన్ శ్రామికులు తమ జీవన పరిస్థితులు దుర్భరంగా వున్నప్పటికీ కూడా వాళ్ల తమ భౌతిక శక్తులలో కొన్నింటిని కేటాయింపుగా పెట్టుకుని వాటిని మానసిక, మేధా శక్తిగా మార్చుకుంటూ తమ సొంత మేధావి వర్గాన్ని యదార్థంగా సృష్టించుకుంటున్నారని మనం యిప్పటికే చెప్పవచ్చు. శ్రామికవర్గంలో రచనపట్లా, సాహిత్యంపట్లా నిత్య ప్రవర్థమానమవుతూ వున్న కోరికకి పుట్టుక అదీ. రాయాలన్న సామర్థ్యాన్ని కొంత వ్యక్తంచేసి, సాహిత్య కృషికి తప్పనిసరిగా అవసరమైన జ్ఞానాన్ని సంపాదించుకోవాలనే ప్రయత్నం చేస్తూ వున్న కామ్రేడ్లకి తమకి వీలైనన్ని పద్ధతులద్వారా శ్రామిక వర్గం సహాయంచేసి తీరాలి అని నాకు అనిపిస్తుంది.

ఒక రచయితకి ప్రతీదీ తెలిసి వుండాలి. లేదా కనీసం అవకాశం వున్నంత తెలిసి వుండాలి. అనుభూతుల సందోహంలోనుంచి, ఉద్రేకాల కీకారణ్యంలోనుంచి సర్వసామాన్య ప్రాముఖ్యమూ, నమూనా ప్రాయమూ అయిన వాటిని అతను యెంచుకోగలిగి వుండాలి. నిత్యచలితంగా వుంటూ, త్వరలోనే జాడలేకుండా పోయేటటువంటి సంకుచిత, వైయక్తిక, స్వీయాత్మక, అశాశ్వత విషయాలని అతను వర్జించ కలిగివుండాలి. మొదటి దాన్ని అతను సాధించగలిగితే అతని కృషి కళా

త్మకంగా, సాంఘిక ప్రాముఖ్యం గలదిగా వుంటుంది. రెండవ దాన్ని సాధించ లేకపోయినట్లయితే అతను యే సాంఘిక, బోధనాత్మక సారమూ లేని ఐతిహ్యాలని రాస్తాడు. ఉద్దేశపూర్వకంగా గాని, అనుద్దేశపూర్వకంగా గాని సర్వకళలకీ వుండే ప్రయోజనం యేమిటంటే మానవుడిలో కొన్ని అనుభూతులని జాగ్రుతం చెయ్యడం, ఒక ప్రత్యేక జీవిత దృగ్విషయంపట్ల ఒక ప్రత్యేక దృక్పథాన్ని పెంపొందించడం. ''నిర్నిబంధ కళ కళకోసమే'' అని పిలిచేదాని అనుయాయులు కూడా ఉద్దేశ పూర్వకంగా యిదే తమ లక్ష్యం అంటారు, సామాజిక ధోరణులపట్ల వాళ్ల వైఖరి ప్రతికూలంగా, యింకా చెప్పాలంటే వైషమ్యపూరితంగా, వున్నప్పటికీ కూడా.

రచయిత పని పరమ కష్టభూయిష్టమైంది. ప్రజల గురించి కథలు రాయ డమనేది వూరికే ''కట్టుకథలు అల్లడం'' కాదు. పెన్సిలుతోటి గియ్యడం లాగానో, కుంచెతోటి చిత్రించడంలాగానో మాటలతోటి మనుషుల్ని వర్ణించడమన్నమాట. యిలా చెయ్యాలీ అంటే యెవడేనా గానీ తన వస్తువుకిగల ముఖ్య లక్షణాలేమిటో కని పెట్టాలి, అతని చర్యల గూఢార్థాన్ని అర్థంచేసుకోవాలి. దీన్నంతటినీ యెంతో స్పష్ట మైన కచ్చితమైన మాటలలో వర్ణించాలి. అప్పుడు పుస్తకంలోని పేజీల వెనకాల, వాటి నల్లని అచ్చు వెనకాల, మాటల చిక్కుదారి వెనకాల పాఠకుడికి సజీవ మానవుడి వదనం ద్యోతకమవుతుంది, ఆ మానవుడి చర్యలకీ అనుభూతులకీ మధ్య వున్న సంబంధం తేటతెల్లమవుతుంది. తను చదివింది అంతా అలానే జరిగిందనీ, మరోలా జరిగి వుండలేదనీ, పాఠకుడు భావించి తీరాలి.

రచయితకీ పాఠకుడికీ మధ్యన సంపూర్తి విశ్వాసం యేర్పడ్డప్పుడే నిజమైన కళ ఉద్భూతమవుతుంది. మనుషులు హృదయం అని పిలిచే అనుభూతి భాషకంలో నిండిన దాన్నంతటినీ ప్రపంచంలో గుమ్మరించడమే రచయిత పని. మన జీవిత సుఖ దుఃఖాలని గురించి, మంచిచెడ్డల గురించి, పరిహాసాస్పదమూ దుష్టమూ అయిన వాటి గురించి రచయిత మాట్లాడేటప్పుడు, అతను గనక ప్రాణ మిత్రుడితో మాట్లాడుతున్నట్టు గుండె లోతుల్లోనుంచి మాట్లాడితే అతన్ని పాఠకుడు అర్థం చేసుకుంటాడు, మిత్రునిగా పరిగణిస్తాడు.

నేనిప్పుడు చెప్పిందంతా సాహిత్య కృషిలో వుండే కష్టాల గురించి సుమారుగా తెలియచేస్తుందనీ, ఒక రచయిత యెంత తెలుసుకుని వుండాలో యెంత ఆలోచించాలో అనేదాన్ని గురించి ఓ రకంగా కచ్చితంగా సూచిస్తుందనీ అనుకుంటున్నాను.

శ్రామికవర్గ రచయితకి వుండే జీవన పరిస్థితుల దృష్ట్యా ఆ రచయితకి అన్వయించలేవనే సాకుతోటే, నా వాదనలన్నీ కూడా మీకు అతిరిక్తంగా కనిపించ వచ్చు.

ఆ విషయం నేను ఒప్పుకోను. ఒకళ్లనుంచి ఒకళ్లం యెంత అధికంగా అపేక్షిస్తూ వుంటే, అంతగా మనల్ని అణగార్చే నిత్య జీవిత విషయాలకి అతీతంగా మనం యెదుగుతాం. అంతగా ఆంతరికంగానూ, బయటా వున్న మన జీవిత దృగ్విషయాల్ని పరిశీలించే దృష్టి విశాలమవుతుంది.

ప్రపంచంతోటి తమ పేరుమీద మాట్లాడాలని ప్రయత్నం చేసే వ్యక్తులకి ఆచరణాత్మక సహాయాన్ని ప్రజా సమూహాలు యెలా యివ్వగలవు?

ప్రతి వ్యక్తిపట్లా శ్రద్ధ చూపించడం అవసరమనీ, తమ కృషికి గాను అందరికీ గౌరవార్హత వుంటుందనీ నేను యిక్కడ చెప్పదలచుకోలేదు. యీ విషయాన్ని చెప్పాల్సిన అవసరం లేదు, జీవితపు సకల విలువలనీ, నాగరిక సమాజం గర్వపడదగ్గ వాటినన్నిటినీ సృష్టిస్తూ, సృష్టించ సహకరిస్తూ వుండే శ్రమ జీవులందరికీ ముఖ్యంగా యిది అర్థం అవుతుంది. స్వయం కృషివల్ల రచయిత లైన వాళ్లందరి కోసమూ ఒక పత్రికని, రచనా శిల్పం గురించి ప్రధానంగా చెప్పే పత్రికని ప్రచురిస్తే బాగుంటుందని అనుకుంటున్నాను. రచనా శిల్పం అనేది శ్రామికవర్గ రచయితలకి లేనిదీ, యెంతగానో అవసరం అయిందీనీ. అలాంటి పత్రికలో శైలిని గురించీ, భాషని గురించీ, కథానిక, నవల, నాటకం అనే ప్రక్రియల గురించీ, పద్యాలు అల్లడం గురించీ యింకా అలాటి వాటి గురించీ నలుగురికీ ఉపయోగపడే వ్యాసాలని ప్రచురించవచ్చు.

స్వయం కృషివల్ల రచయితలైన వాళ్ల రచనలమీద నమూనా ప్రాయపు సమీక్షలని, శిల్పానికి సంబంధించీ విషయానికి సంబంధించీ యెంతో విపులంగా చర్చించే సమీక్షలని, కూడా ఆ పత్రిక ప్రచురించాలి. యిది ఒక పాఠశాలగా వుంటుంది. ప్రతిభా సమన్వితులైన, అనుభవజ్ఞులైన, పరిశీలనాత్మక భవిష్యత్ రచయితలకి యెంతో మందికి యెంతో జ్ఞానాన్ని అందించే పాఠశాలగా వుంటుంది. వాళ్లకి తమ మనసుల్లో వున్న వాటిని, మనం తెలుసుకోవాల్సి వున్న వాటిని, స్పష్టంగా నమ్మకంగా సంధించగలిగే సామర్థ్యం యింకా లేదు.

సాహిత్య శిల్పాన్ని గురించిన ఆ జ్ఞానం వల్లనే ఒక శక్తిలుప్తతని అధిగమించడం సులభం.

•

కామ్రేడ్స్! ఎనిమిది సంవత్సరాల అభివృద్ధినిరోధక దాడి కాలంలో[1] మనం అనుభవించిందీ, బాధపడ్డదీ అంతటినీ కూడా ప్రపంచ శ్రామికవర్గానికి చరిత్ర చాటి చెప్పినప్పుడు ఆ శ్రామికవర్గం మీ జీవశక్తికీ, మీ ఆత్మ స్థైర్యానికీ, వీరోచిత సాహసానికీ ఆశ్చర్యపోతుంది.

బహుశా మీకు మీరే గుర్తించి వుండరు, యెంత కృషి చేసిందీ యెరిగి వుండరు. కాని రష్యన్ శ్రామికుల రాబోవు తరాలవాళ్లు, మన భూగోళంమీద వున్న సకల శ్రామికులూ నిస్సందేహంగా మీ ఒరవడినుంచి నూతన సంస్కృతి కోసం జరిగే పోరాటంలో కొత్త శక్తిని పుంజుకుంటారు.

యిది అలా అవుతుందనడంలో యేమీ సందేహం లేదు. యీ యెనిమిదేళ్ల లోనూ మీరు సాధించిన కృషికి గల సార్వజనీన సాంస్కృతిక ప్రాముఖ్యాన్ని గుర్తించడంలో విఫల మయ్యేది మృతులే.

యీ సంకలనంలోని కవుల్లో ఒకరు అంటున్నారు:

"ప్రపంచ సంస్కృతి కేసి సాగండి!"

సుఖవంతమైన ప్రయాణం, కామ్రేడ్స్!

సర్వప్రపంచాన్నీ ఆలింగనం చేసుకునే సంస్కృతిని సృష్టించిన యిచ్ఛా హేతువులు వర్థిల్లాలి!

# రష్యన్ కళా సమీక్ష

ప్రపంచానికి ఆహ్లాదం కలిగించే అద్భుతమైన సాహిత్యాన్నీ, ఆశ్చర్యం కలిగించే చిత్రకళనీ, సొంత సంగీతాన్నీ మహా ఘోరమైన పరిస్థితుల్లో సృష్టించడంలో నెగ్గి, హృదయం సృష్టి స్థానంగా కలిగినటువంటి కళారంగంలోనే రష్యన్ ప్రజలు సంభ్రమాన్విత శక్తితో దర్శనమిచ్చారు. ఆ ప్రజల నోళ్లకి తాళం వేశారు, వాళ్ల మనసు రెక్కల్ని విరిచికట్టేశారు. కాని వాళ్ల హృదయాలు మహా మాటల, ధ్వనుల, వర్ణాల కళాకారుల్ని డజన్ల కొద్దీ సృష్టించాయి.

మనకి మహత్తర గర్వకారణమూ, రష్యా జీవనాడిని సంపూర్తిగా వెల్లడించినవాడూ అయిన ఒక మేరువు లాంటి పూష్కిన్[22] – ఆయన సరసనే, మంత్రగాడు గ్లింక,[23] అద్భుతమైన బ్రుల్లోవ్[24] తన పట్లా యితరుల పట్లా నిర్దాక్షిణ్యంగా వుండే గోగొల్[25], విషణ్ణుడైన లేర్మొంతొవ్[26], విచారగ్రస్తుడైన తుర్గేనెవ్[27], అగ్రమహోదగ్రుడైన నెక్రాసొవ్, గొప్ప తిరుగుబాటుదారుడు టాల్‌స్టాయ్, ఘన వుందుపడ్డ అంతరాత్మ దొస్తొయేవ్‌స్కీ[28], క్రామ్‌స్కొయ్[29], రేపిన్[30], అసమానమైన మూసొర్గ్‌స్కీ[31] తన జీవితమంతా, శక్తినంతా రష్యన్ మానవుడి "గుణయుక్తమైన నమూనా"ని సృష్టించడం కోసం వ్యయం చేసిన లెస్కొవ్, ఆఖరికి మహా లాలిత్య భరితుడైన చైకోవ్‌స్కీ[32] భాషా మాంత్రికుడు ఒస్త్రోవ్‌స్కీ[33] – వీళ్లంతా కూడా ఒకళ్లతో ఒకళ్లు యేమీ పోలిక లేకుండా యెంతలా వుంటారంటే – భిన్న యుగాలకి చెందిన మనుషుల్లా కనిపించేవాళ్లు, మానసికంగా అంత విభేదంతో వుండేవాళ్లు, పొసగని వాళ్లు, ఒకళ్లని ఒకళ్లు యిక్కడ మాత్రమే, రష్యాలోనే, ఒకే తరంలో కలుసుకోగలరన్నట్టు వున్నారు.

యిదంతా కూడా రష్యాలో ఒక వంద యేళ్ల లోపునే సృష్టి అయింది. 19వ శతాబ్దంలో రష్యాలో ఉద్భవించిన ప్రతిభా సమన్వితుల పౌష్కల్యమే కాదు, అద్భుతావహమైన వాళ్ల వైవిధ్యం, – దీన్ని మన కళా చరిత్రకారులు సరిగా

గుర్తించడం లేదు — అదీ సంతుష్టికరంగా వుండేదీ, మనల్ని స్పందింపచేసి, మహా గొప్పగా భావించుకునేటట్టు చేసేదీని.

ఊహాతీత సౌందర్యంతో తేజోవంతంగా వెలిగే మన రష్యన్ జీవనాడి వైవిధ్యం చూసి గర్వపడే హక్కు మనకి వుంది. దాన్ని మన దేశపు ఆధ్యాత్మిక శక్తిలో మనకి వున్న విశ్వాసాన్ని శక్తివంతం చేయనీయండి!

వర్ణించలేనంతటి కష్టభూయిష్టమైన పరిస్థితుల్లో ఉద్భవించిన యీ సంభ్రమకర సృజనాత్మక కృషి విశ్వసించలేనంతటి వేగంతో జరిగింది.

వూరికే వూహించండి: పూష్కిన్, లేర్మొంతొవ్‌లు చంపబడక పోయినట్లయితే వాళ్లు నిన్ననే మనని విడిచి వెళ్లిపోయిన చేహొవ్ దాకా బతికేవాళ్లు; మనతో బాటుగా యింకా చాలా కాలం వుండే అద్భుతమైన కొరొలేంకొ[34] దాకా బతికేవాళ్లు! మనం హేతుబద్ధంగా జీవించడం లేదనీ, మనం సరిగా కృషి చేయడం లేదనీ యెవరేనా మనతో అనవచ్చు. కాని మనం హృదయంతో జీవితంలో నెగ్గుతున్నాం. రష్యన్ కళ అంటే మొదటగా హృదయ స్థితమైన కళ అని అర్థం. మానవుడి పట్ల ఒక రొమాంటిక్ ప్రేమ అందులో జ్వలిస్తోంది. మన కళాకారుల సృజనాత్మక కృషి, పెద్ద వాళ్లదీ, చిన్న వాళ్లదీ — సాహిత్యంలో "నరోద్నిక్కుల"[35]ది, చిత్రకళలో "పెరెద్విజ్నిక్కుల"[36]ది, సంగీతంలో "కుచ్కిస్టుల"[37]ది — యీ ప్రేమ జ్వాలతో దీప్తం అవుతోంది.

యీ సామాజిక రొమాంటిసిజపు శక్తి వల్లనే మనం సజీవంగా వున్నాం, రాజరికపు పదఘట్టనల్లో కుళ్లిపోయీ, హింసవల్ల చితికిపోయీ చావలేదు.

# లియో టాల్‌స్టాయ్

నేను ఒలెయీజ్*లో వున్నప్పుడు యథాలాపంగా రాసుకున్న నోట్సుమీద ఆధారపడి దీన్ని రాశాను. లియో టాల్‌స్టాయ్ అప్పుడు గాస్ప్రా*లో వున్నాడు. మొదట్లో తీవ్రంగా జబ్బుపడి తర్వాత కోలుకుంటూ వున్నాడు. నానా రకాల కాగితం ముక్కలమీదా రాసుకున్న యీ నోట్సు పోయింద నే అనుకున్నాను. కాని యీ మధ్యనే కొంత దొరికింది. యాస్నయా పొల్యానానుంచి టాల్‌స్టాయ్ ''నిష్క్రమిం''చాడనీ, ఆయన చనిపోయాడనీ అనుకుని నేను రాసిన అసంపూర్తి ఉత్తరాన్ని ఒక్క అక్షరం కూడా మార్చకుండా యథాతథంగా ఉంచేస్తున్నాను. నేను దాన్ని పూర్తి చెయ్యలేదు, యేమంటే చెయ్యలేను....

## 1

భగవద్భావం అనేది మరి దేనికంటేనూ కూడా యెక్కువ తరచుగా ఆయన మనశ్శాంతిని భగ్నం చేసినటువంటిది. ఒకో అప్పుడు అది ఒక భావనగా కాకుండా తనమీద ప్రబలంగా వున్న దనుకునే దేని మీదనో ఉద్విగ్నమైన ప్రతిఘటనగా కనిపిస్తుంది. తను మాట్లాడాలని అనుకుంటున్నంతగా ఆయన దాన్ని గురించి మాట్లాడడు. కాని దాన్ని గురించే పదేపదే అనుకుంటూ వుంటాడు. అది వార్ధక్య లక్షణమనో, ఆసన్న మృత్యు అనుమానమనో నేను అనుకోను. శ్రేష్ఠమైన మానవ అహంవల్ల వచ్చి వుండవచ్చు. ఆయన, లియో టాల్‌స్టాయ్, అవమానకరంగా యేదో స్ట్రెప్టోకోకస్** యిచ్చకి లొంగిపోవడం అనేది బహుశా కొంత అన్యాయం జరిగిందన్న దాని ఫలితమూ కావచ్చు. ఆయన గనక ప్రకృతి శాస్త్రజ్ఞుడు అయి వుంటే అద్భుతమైన పరికల్పనలు చేసి మహత్తరమైన ఆవిష్కరణలు చేసి వుండేవాడు.

---

* ఒలెయీజ్, గాస్ప్రా — క్రైమియాలో గ్రామాలు. — అను.

** ఒక బాక్టీరియా. — అను.

## 2

ఆయన చేతులు ఆశ్చర్యకరంగా వున్నాయి — అందవికారంగా, నరాల పొంగరింపు వల్ల రూపం కోల్పోయి. అయినా మహాద్భుతంగా వ్యక్తీకరంగా, స్ఫూర్తి సృజనాత్మక శక్తితో వుంటాయి. బహుశా లియొనార్డో డా విన్చికి[38] అలాంటి చేతులు వుండి వుంటాయి. అలాంటి చేతులతో దేన్నైనా చెయ్యవచ్చు. ఒకో అప్పుడు మాట్లాడుతూ వుండగా ఆయన వేళ్లని కదిలిస్తాడు. మెల్లిగా వేళ్లని ముడుస్తూ, ఒక బరువైన అద్భుతమైన మాటని అనేటప్పుడు మళ్లీ చాస్తూ వుంటాడు. ఆయన ఒక దేవుడి లాగా వుంటాడు; ఒక శాబత్ కాదు, లేకపోతే ఒలింపస్ నుంచి వచ్చే దేవుడూ కాదు, కాని ''బంగారు లైమ్ చెట్టుకింద మేపిల్ కొయ్య సింహాసనం మీద కూర్చున్న'' ఓ రష్యన్ దేముడిలాగా వుంటాడు. ఆయన అంత ఠీవిగా వుండకపోవచ్చుగాని, దేవుళ్లందరికంటే కూడా అధికంగా జిత్తులమారిగా వుంటాడు బహుశా.

## 3

సులెర్‌జీత్‌స్కీ పట్ల ఆయనకి మార్దవం వుంది. చేహోవ్ పట్ల ఆయనకి పితృవాత్సల్యం వుంది. యీ ప్రేమలో సృష్టికర్త అహం గోచరించవచ్చు. కాని సులెర్‌జీత్‌స్కీకి సంబంధించి ఆయన అనుభూతి మార్దవమైందే; నిరంతర ఆసక్తి కరమైందే, యీ మంత్రగాణ్ణి యెన్నటికీ విసుగెత్తించలేని అద్భుతావహమైందే. యీ అనుభూతిలో యేదో అసంబద్ధమైంది వుంది, తన రామచిలక పట్లా, కుక్క పట్లా, పిల్లి పట్లా ఓ వృద్ధకన్యకి వుండే ప్రేమ లాంటిది. యేదో తెలియని వింత ప్రపంచంనుంచి వచ్చిన ఆశ్చర్యకరమైన స్వేచ్ఛా విహంగం సులెర్‌జీత్‌స్కీ. అతనిలాంటి ఓ వందమందికి ఒక స్థానిక పట్టణపు స్వరూప స్వభావాలని మార్చేసే శక్తి వుంటుంది. వాళ్లు దాని ఆకారాన్ని చెదర గొట్టేస్తారు; ఒక అవిశ్రాంత, అప్రతిహత మేధ కోసం కాంక్షతోటి దాని స్వభావాన్ని నింపేస్తారు. సులెర్‌జీత్‌స్కీని ప్రేమించడం సులభమూ సంతోషమూనూ. ఆడవాళ్లు అతన్ని అలక్ష్యం చెయ్యడం చూస్తే నాకాశ్చర్యమూ, ఆగ్రహమూ కలుగుతాయి. కాని బహుశా యీ అలక్ష్యం మాటున యుక్తిగా దాగిన హెచ్చరిక వుందేమో. సులెర్‌జీత్‌స్కీమీద నమ్మకం పెట్టుకోవడం అనేది లేదు. రేపటికి అతను యెలా వుంటాడో? అతను బహుశా ఒక బాంబు విసరచ్చు, కల్లుదుకాణం పాటగాళ్ల బృందంలో చేరవచ్చు. అతనిలో మూడు యుగాలకి సరిపడా శక్తి వుంది. అతనిలో యెంత

జీవితాగ్ని ప్రజ్వలిస్తోందంటే యెర్రగా కాలిన యినుమునుంచి వచ్చినట్టుగా అతను రవ్వలు చిమ్ముతున్నట్టు వుంటాడు.

కాని ఒక సారి ఆయనకి సులెర్‌జీత్‌స్కీమీద చెడ్డ కోపం వచ్చేసింది — సులెర్‌జీత్‌స్కీ యెప్పుడూ అరాచకత్వం వేపే మొగ్గివుంటూ, వ్యక్తి స్వేచ్ఛని గురించి తీవ్రంగా వాదించడం పట్ల యిష్టపడ్డాడు. అతను అలా చేసినప్పుడల్లా టాల్‌స్టాయ్ వేళాకోళం చేసేవాడు.

క్రోపోత్కిన్[39] రాకుమారుడి సున్నితమైన కరపత్రం ఒక దాన్ని సులెర్‌జీత్‌స్కీ దొరకపుచ్చుకోవడం నాకు గుర్తు. దానితోటి ఉత్సాహపడిపోయి, రోజంతా అరాచకత్వపు వివేకంమీద, మహా ఉపద్రవకరమైన పద్ధతిలో తాత్వీకరిస్తూనే వుండిపోయాడు.

''అబ్బబ్బ, యింక చాలు, నేను భరించలేకుండా వున్నాను'' అన్నాడు టాల్‌స్టాయ్ చిరచిరలాడుతూ. ''చిలకలాగా ఒకే మాట, స్వేచ్ఛ, స్వేచ్ఛ అని వల్లిస్తున్నావు. దానర్థం యేమిటి? ఉదాహరణకి నువ్వనుకున్నట్టే, ఆ మాటకి నీ అర్థంలోనే నీకు స్వేచ్ఛ వచ్చిందీ అనుకో, దాని ఫలితం యేమిటి? తాత్వికంగా చెప్పాలంటే, మట్టులేని శూన్యం, జీవితంలో ఆచరణలో నువ్వు సోమరిపోతుగా, బైరాగిగా తయారవుతావు. నువ్వు భావించుకున్న రీతిలో నువ్వు స్వేచ్ఛాయుతుడివి అయితే నిన్ను జీవితానికి, మానవులకి బంధించేది యేమిటి వుంటుంది? చూడు — పక్షులు స్వేచ్ఛగానే వున్నాయి, కాని అవి గూళ్ళు కట్టుకుంటాయి. నువ్వు గూడు కట్టుకోవుగాని, యెక్కడ వీలుంటే అక్కడ గండు పిల్లిలాగా కామేచ్ఛని తీర్చుకుంటావంతే. ఒక్క క్షణం గంభీరంగా ఆలోచించుకో, నీకు తెలుస్తుంది, అంత్య అర్థంలో స్వేచ్ఛ అనే పదానికి అర్థం శూన్యం, ఉత్తది, నిరాకారమైన ఖాళీ అని.''

కోపంతో కనుబొమలు ముడుచుకుని ఆయన ఒక క్షణం ఆగి, యింకొంచెం మృదువుగా అన్నాడు:

''క్రీస్తు స్వేచ్ఛాయుతుడే, అలాగే బుద్ధుడూనూ. వాళ్లిద్దరూ ప్రపంచపు పాపాలని తాము భరించి, ఐచ్ఛికంగా ప్రాపంచిక జీవిత కారాగృహంలోకి ప్రవేశించారు. మరి యెవళ్ళూ యింక అది దాటి ముందుకు పోలేదు — ఎవ్వరూ! నువ్వూ నేనూ — మనం యేం చేశాం? మనమంతా మన పొరుగు వాడి పట్ల మన బాధ్యతనుంచి స్వేచ్ఛని కోరుతున్నాం, కచ్చితంగా మనల్ని మానవులనిగా చేసింది యీ విధే అయినప్పటికీ, యిది లేకపోయినట్లయితే మనం జంతువుల్లా బతకాల్సినప్పటికీ....''

ఆయన పెదాలు చప్పరించాడు.

''అయినా ఉన్నతంగా యెలా బతకాలా అనేదాన్ని గురించి నువ్వు వాదిస్తున్నావు. దానివల్ల యేం పెద్ద లభించదు, అదే సమయంలో మరీ కొంచెమూ కాదు. ముఖం అంతా నల్లబడి పోయే దాకా నాతో వాదిస్తున్నావు గాని నన్ను కొట్టవు, కనీసం తిట్టవు. నిజంగా నువ్వు స్వేచ్ఛాయుతుడివని భావిస్తే, నువ్వు నన్ను చంపెయ్యాలి — అంతే.''

యింకో సారి ఆగి ఆయన మళ్లీ అన్నాడు:

''స్వేచ్ఛ — అంటే ప్రతీదీ, ప్రతివాడూ నాతో ఏకీభవించినట్టన్న మాట. అయితే అప్పుడు నేనింక యెంత మాత్రమూ వుండను, యేమంటే మనం పోటీలోనూ, వైరుధ్యంలోనూ వున్నప్పుడు మాత్రమే మనల్ని గురించిన స్పృహతో వుంటాం.''

## 4

''అల్ప సంఖ్యాకులకి భగవంతుడు కావాలి యేమంటే వాళ్లకి మిగతా అన్నీ వున్నాయి; అధిక సంఖ్యాకులకి భగవంతుడు కావాలి యేమంటే వాళ్లకి యేమీ లేదు.''

లేకపోతే నేను యింకోలా చెబుతాను: అధిక సంఖ్యాకులు పిరికితనం వల్లనే భగవంతుణ్ణి నమ్ముతారు. కొద్ది మంది మాత్రమే ఆత్మ పూర్ణత్వం వల్ల నమ్ముతారు.*

''మీకు హాన్స్ ఏండర్సన్[40] అద్భుత కథలు యిష్టమేనా?'' అని ఆయన సాలోచనగా అడిగాడు. ''మార్కో వొవ్‌చోక్[41] అనువాదంలో అవి ప్రచురితమైనప్పుడు నాకు అర్థం కాలేదు. కాని పదేళ్ల తర్వాత ఆ పుస్తకం తీసుకుని మళ్లీ చదివాను. ఏండర్సన్ ఒంటరి జీవి అని నాకు వున్నట్టుండి అవగతం అయింది. చాలా ఒంటరి మనిషి. అతని జీవితం గురించి నాకు యేమీ తెలీదు. అతను శుద్ధ విలాస పురుషుడు, తిరుగుబోతు అనుకుంటాను. కాని అది అతను ఒంటరిగాడు అనే నా విశ్వాసాన్ని దృఢ పరుస్తుందంతే. అందుకనే అతను పిల్లల వేపు దృష్టి సారించి వుంటాడు, పిల్లలు పెద్ద వాళ్లకంటే యెక్కువ దయగా

* అపార్థానికి దారితియ్యకుండా వుండేందుకుగాను మతపరమైన రచనలన్నిటినీ నేను శుద్ధ సాహిత్యపరంగానే దర్శిస్తాననీ, బుద్ధుడూ, క్రీస్తూ, మహమ్మద్ లాంటి వాళ్ల జీవిత చరిత్రలన్నిటినీ ఊహాకల్పితాలుగా భావిస్తున్నాననీ వివరిస్తున్నాను (రచయిత వివరణ).

వుంటారనుకుని. కాని అది తప్పు. పిల్లలు ఎవళ్ల పట్లా జాలిపడరు, వాళ్లకి జాలి అంటే తెలీదు.''

## 5

బౌద్ధమత ప్రశ్నోత్తర రూపబోధని చదవమని ఆయన నాకు సలహా యిచ్చాడు. క్రీస్తుని గురించీ, బుద్ధుణ్ణి గురించీ ఆయన మాట్లాడే దాంటో యెప్పుడూ యేదో భావావేగభరితమైంది వుండేది. ఆయన మాటల్లో ఉత్సాహం గాని కరుణ గాని వుండేది కాదు, హృదయ జ్వాలనుంచి పుట్టిన కణం ఒక్కటే వుండేది కాదు. క్రీస్తుని అమాయకునిగా దయార్ద్రునిగా ఆయన భావిస్తున్నా డనుకుంటాను. ఆయన క్రీస్తుని సంభావించినా ప్రేమిస్తూ వుండటం సందిగ్ధం. క్రీస్తు గనక ఒక రష్యన్ పల్లెకి వస్తే ఆడపిల్లలు పరిహాసంగా చూస్తారని ఆయన భయ పడుతున్నట్టుంది.

## 6

ప్రతిదానికీ, ప్రతివాళ్లకీ పరాయిగా వుండి యిల్లూ వాకిలీ లేకుండా గుడి నుండి గుడికి, మఠంనుండి మఠానికి వేలాది మైళ్లు, చేతిలో కఱ్ఱలు పట్టు కుని జీవితమంతా తిరుగుతూ భూమ్మీద సంచరించే యాత్రీకుల్ని ఆయన స్ఫురింప చేస్తాడు. యీ ప్రపంచం వాళ్లకి సంబంధించింది కాదు — భగవంతుడూనూ. వాళ్లు అలవాటు కొద్దీ ప్రార్థిస్తారు. కాని హృదంతరాళంలో పరమేశ్వరుని ద్వేషి స్తారు. ఎందుకు దేముడు వాళ్లని భూమ్మీదకి, ప్రపంచపుటంచులకి తరుము తాడు — యెందుకు? వాళ్లు మానవులని వూరికే మొద్దుల్లాగా, వృక్షాల వేళ్లలాగా, రోడ్డుమీద పడివుండే రాళ్లల్లాగా పరిగణిస్తారు -- వాటిమీద యెవళ్లేనా తొట్రుపడ తారు, ఒకో అప్పుడు వాటివల్ల దెబ్బలు తగిలించుకుంటారు. అవి లేకుండానే యెవళ్లేనా గడపవచ్చు, కాని ప్రజలతో పోలిక లేనట్టుగా, వాళ్లతో తమ విభేదం పట్ల గర్విస్తూ వున్నట్టుగా వాళ్లని ఆశ్చర్యపరచడం ఒకో అప్పుడు తమాషాగా వుంటుంది.

## 7

''ఫ్రెడరిక్ ప్రష్యా[42] యుక్తిగా ఒకటి చెప్పాడు: 'ప్రతివాళ్లూ తమ ఆత్మని a sa façon* రక్షించుకోవాలి.' 'మీకిష్టమైన దాన్ని వూహించుకోండి, కాని

---

* తమకిగా (ఫ్రెంచి).

విధేయత చూపించండి,' అనీ ఆయనే అన్నాడు. చనిపోతూ ఆయన అంగీకరించాడు: 'బానిసలని పరిపాలించడంతోటే నాకు అలుపు వచ్చింది.' గొప్ప వాళ్లనుకునే వాళ్లంతా యెప్పుడూ స్వపరవ్యాఘాతానికి గురవుతూనే వుంటారు. వాళ్లకి వుండే మిగతా దోషాలలాగానే దీన్ని వాళ్లలో క్షమించడం జరుగుతుంది. అయినా స్వపరవ్యాఘాతం దోషం కాదు కదా: మూర్ఖుడే మొండిగా వుంటాడు, తను అన్న దాన్ని ఖండించుకోడు. అసలు. ఫ్రెడరిక్ వింత మనిషి — ఆయన్ని జర్మన్లు తను అత్యుత్తమ చక్రవర్తిగా పరిగణించారు, అయినా, ఆయన వాళ్లని భరించలేక పోయాడు; ఆయనకి గ్యోతే[43] అన్నా వైలేండ్ అన్నా కూడా యిష్టం లేకపోయింది...."

## 8

బాల్‌మంట్[44] పద్యాల గురించి మాట్లాడుతూ "కాల్పనికత్వం అనేది సత్యం కళ్లల్లోకి చూడాలంటే వుండే భయమే" అన్నాడాయన రాత్రి. సులెర్‌జీత్‌స్కీ దాంతో యేకీభవించలేదు, కొన్నిటిని యెంతో అనుభూతితో చదినాడు, తన ఉద్రేకంలో తడబడుతూ.

"అది కవిత్వం కాదు, అది పాండిత్య ప్రకర్ష, తుచ్ఛ చెత్త మాటల గారడీ. కవిత్వం నిసర్గంగా వుంటుంది.

నేనేం పాడతానో నాకు తెలీదు,
కాని నా పాట నాలోనే పొంగుతుంది,

అని ఫేత్[45] రాసినప్పుడు అతను కవిత్వాన్ని గురించి ప్రజల నిజమైన అనుభూతిని వ్యక్తం చేస్తున్నాడు. తను యేం పాడుతున్నదీ రైతు క్కూడా తెలీదు; వూరికే అతను ఓయ్, హోయ్, ఓలాలాయ్ అని పాడతాడంతే. అతని హృదయపు అడుగునుంచి నిజమైన పాట వెలువడుతుంది పక్షులు పాడినట్టు. మీ కొత్త కవులు కల్పించడం తప్ప. మరేం చెయ్యరు.

## 9

ఆయన జబ్బు ఆయన్ని యెండగట్టేసింది. ఆయనలో వున్నదేన్నో మండించేసింది. ఆయన యింకా తేలిగ్గా, యింకా స్వచ్ఛంగా, ఆంతరంగికంగా మరింత యెక్కువగా జీవితానికి అలవాటు పడ్డట్టుగా వున్నాడు. ఆయన నేత్రాలు యింకా నిశితం అయాయి, ఆయన చూపు యింకా తీక్ష్ణం అయింది. ఆయన శ్రద్ధగా

వింటున్నాడు, ఎన్నడనగానో మరిచిపోయిందాన్ని గుర్తు చేసుకుంటున్నట్టు వుంది లేదా నూతనమైంది దేని కోసమో, యింతకు ముందు తెలియని దాని కోసం నిబ్బరంగా నిరీక్షిస్తున్నట్టు వుంది. యాస్నయా పొల్యానాలో ఆయన తన ప్రశ్నలన్నిటికీ సమాధానం దొరికి, తెలుసుకోవాల్సిందంతా తెలుసుకున్న వాడిలాగా నాకు కనిపించాడు.

## 10

ఆయన గనక మత్స్యం అయివుంటే ఆయన వాసం ఖాయంగా మహా సముద్రం అయివుండేది, ఆయన ఎన్నటికీ తీరస్థ సముద్రంలో యీది వుండేవాడు కాదు, నదుల్లో సంగతి సరేసరి. యిక్కడ బోలెడు పరిగలు చుట్టు పక్కల దూసుకుపోతున్నాయి. ఆయన చెప్పేదాంట్లో వాటికి ఆసక్తి లేదు. వాటికా అవసరమూ లేదు. ఆయన మౌనం వాటిని భయపెట్టదు, మరేవిధంగానూ దానిమీద ప్రభావమూ చూపించదు. ఆయనకి నిజమైన మౌనిలాగా మహా గంభీరంగా, సమర్థవంతంగా మౌనంగా వుండటం తెలుసు. తనని పట్టి పీడించే విషయాల గురించి యెంతో యెక్కువగా ఆయన మాట్లాడతాడు, అయినా ఆయన చెప్పంది యెంతో మిగిలి పోయిందనే యెవళ్లేనా అనుకుంటారు. ఆయన యెవ్వరికీ చెప్పలేనివీ వున్నాయి. బహుశా తను భయపడే ఆలోచనలూ ఆయనకి వున్నాయి.

## 11

క్రీస్తు బాప్తిజం చేయించిన కుర్రవాడి కథకి సంబంధించిన ఆసక్తికరమైన పాఠాంతరాన్ని ఆయనకి యెవరో పంపారు. ఆయన ఆ కథని సులెర్‌జీత్‌స్కీకీ చేహొవ్‌కీ యెంతో ఉత్సాహంతో చదివి వినిపించాడు — అద్భుతంగా చదివాడు! భూస్వాములని పిశాచాలు పీడించే పద్ధతిలో ఆయనకి ప్రత్యేకం ఆసక్తి కలిగించింది యేదో వుండింది, సరిగా రుచించనిది యేదో నాకు అందులో వుండింది. ఆయన నిజాయితీరహితంగా వుండ గలగలేదు, కాని యిది నిజాయితీ అయితే యింకా అధ్వాన్నం.

అప్పుడు ఆయన అన్నాడు:

''చూడండి రైతులు యెంత బాగా కథలు చెప్తారో. ప్రతీదీ సులభంగా, కొద్ది మాటలతో, యెంతో అనుభూతితో నిండి వుంటుంది. సిసలైన తెలివి యెల్లప్పుడూ సంక్షేపంగా వుంటుంది — 'ప్రభూ మా మీద దయచూపించు'లో లాగా.''

కాని అది క్రూరమైన కథ.

## 12

నా పట్ల ఆయన ఆసక్తి మానవజాతిశాస్త్ర పరమైంది. ఆయనకి సంబంధించి నేను తనకి బాగా తక్కువ తెలిసిన తెగ సభ్యుణ్ణి — యింకేం కాదు.

## 13

నా కథ "అంబోతు" ఆయనకి చదివి వినిపించాను. ఆయన యెంతగానో నవ్వి "భాషా చాతుర్యం" తెలిసినందుకు నన్ను మెచ్చుకున్నాడు.

"కాని మాటలని యెలా వాడాలో మీకు తెలీదు. మీ రైతులంతా పటాటోపంగా మాట్లాడతారు. వాస్తవ జీవితంలో రైతులు బడుద్ధాయిల్లాగా, మోటుగా మాట్లాడతారు, వాళ్లేం అంటున్నదీ మొదట్లో మీరు చెప్పలేరు. అలా కావాల్సికే చెయ్యడం జరుగుతుంది, అవతలి వాణ్ణి నడిపించుకుని పోవాలీ అన్న కోరిక వాళ్ల మాటల జడత్వం మాటున కప్పడిపోయి వుంటుంది. నిజమైన రైతు యెవ్వడూ తన మనసులో వున్న దాన్ని నేరుగా చెప్పడు, అలాంటిది అతనికి నప్పదు. మనుషులు ఓ బడుద్ధాయి దగ్గరకు అమాయకంగా కపటం లేకుండా వస్తారని అతనికి తెలుసు, అదే సరిగ్గా అతనికి కావాల్సింది. అతని ముందు ఆవులించినట్టు వుంటారు, అతను తక్షణం మీ పేగులు లెక్క పెట్టేస్తాడు. అతను అనుమానస్తుడు, తన రహస్య ఆలోచనలని భార్యకి చెప్పడానికి కూడా భయపడతాడు. కాని మీ కథల్లో ప్రతీదీ నేరుగా వుంటుంది, ప్రతి కథలోనూ పండితమ్మన్యుల గుంపు వుంటుంది. వాళ్లు చమత్కార భరితమైన సూక్తులు మాట్లాడతారు. అదీ సరిగాదు, ఆ మాట కొస్తే — సూక్తులు రష్యన్ భాషకి నప్పవు."

"మరి సామెతలు, ఉక్తులు మాట యేమిటి?"

"అది వేరు, వాటిని నిన్న గాక మొన్ననే యేం కనిపెట్టలేదు."

"మీరే సూక్తులతో మాట్లాడతారే."

"ఎన్నడూ లేదు! యేం, మీరు ప్రతిదాన్నీ నగిషీ చెక్క ప్రయత్నిస్తారు — మనుషుల్నీ ప్రకృతినీ. ముఖ్యంగా మనుషుల్ని. లెస్కోవ్ కూడా అలాగే చేశాడు. ఎవరికీ లొంగకండి, ఎవరన్నా భయపడకండి — అప్పుడు మీరు సజావుగా వుంటారు...."

## 14

నన్ను చదవమని ఆయన యిచ్చిన డైరీలో ఒక వింత సూక్తి నాకు ఆశ్చర్యం కలిగించింది. ''భగవంతుడు నా కామన.''

డైరీ తిరిగి యిచ్చేసేటప్పుడు దాని అర్థం యేమిటని అడిగాను.

''ఓ అసంపూర్తి ఆలోచన'' అన్నాడాయన, ఆ పేజికేసి చూస్తూ కళ్లు లగ్నం చేసి. ''నేను చెప్పాలనుకున్నది — భగవంతుడు నా కామన, ఆయన్ని నేను అందుకోవాలని.... వుహుఁ, అది కాదు....'' ఆయన నవ్వాడు, నోటు పుస్తకాన్ని ముడిచేసి తన అంగీ పెద్ద జేబులో పెట్టేసుకున్నాడు. భగవంతుడితో ఆయన సంబంధాలు అనిర్దిష్టంగా వున్నాయి. ఒకో అప్పుడు అవి ''ఒకే గుహలో వున్న రెండు ఎలుగుబంట్లు'' లాగా నాకు అనిపిస్తాయి.

## 15

విజ్ఞానశాస్త్రంమీద.

''ఓ నాటు రసవాది కల్పించిన పోతకడ్డీ బంగారం శాస్త్రం అనేది. మీరు దాన్ని సులభతరం చేసి, ప్రతి ఒక్కళ్లకీ అవగతం అయేటట్టు చెయ్యాలనుకుంటారు — వేరే మాటల్లో చెల్లని డబ్బుని ముద్రించాలని. ప్రజలు యీ డబ్బుకి వున్న అసలు విలువని గుర్తించినప్పుడు మిమ్మల్ని అభినందించరు.''

## 16

సంభాషణలో ఆయనకిష్టమైన విషయాలు భగవంతుడూ, రైతూ, స్త్రీ. సాహిత్యాన్ని గురించి ఆయన అరుదుగా, తక్కువగా మాట్లాడేవాడు, అదేదో తనకి పరాయి విషయం అయినట్టు. ఆడవాళ్ల పట్ల ఆయనకి వున్న దృక్పథం పరమ శత్రుత్వ వైముఖ్యం. వాళ్లని శిక్షించడమంతగా మరిదేన్నీ ఆయన యిష్టపడడు — వాళ్లు కిట్టీ[46]లాగా, నతాషా రోస్తోవా[47]లాగా సామాన్యమైన ఆడవాళ్లయితే తప్ప. తను పొందడానికి సాధ్యమైనంత ఆనందాన్ని పొందని మగవాని పగా యిది? లేకపోతే ''శరీరపు అవమానకరమైన సహజ ప్రేరణల'' పట్ల జీవాత్మ వైమనస్యమా? యేది యేమైనా అది శత్రుత్వం, అదీ చాలా చేదైనది, ''అన్నా కరేనినా''లో లాగా. ఆదివారం నాడు రూసో[48] ''కన్ఫెషన్సు''ని గురించి చేహొవ్‌తోనూ, యెల్‌పాతియేవ్‌స్కీ[49]తోనూ చర్చిస్తూ ''శరీరపు అవమానకరమైన సహజ ప్రేరణల''ని గురించి ఆయన చాలా బాగా మాట్లాడేడు. సులెర్‌జీత్‌స్కీ ఆయన మాటలని రాసిపెట్టాడు. కాని తర్వాత కాఫీ తయారు చేస్తూ, అతను తన

నోట్సుని స్పిరిట్ లేంప్ మంటలో కాల్చేశాడు. అంతకు ముందు అతను ఇబ్సెన్[50]ని గురించి టాల్‌స్టాయ్ అన్న మాటలనీ కాల్చేశాడు, అలాగే వివాహ క్రతువులోని ప్రతీకలమీద తల నోట్సునీ పోగొట్టుకున్నాడు, వివాహ క్రతువులోని ప్రతీకలమీద టాల్‌స్టాయ్ విపరీతమైన క్రైస్తవేతర వ్యాఖ్యలు చేశాడు, అవి వి. రొజానొవ్[51] వ్యాఖ్యలతో సరిపోతాయి.

## 17

యీ ఉదయం ఫెయొదోసియానుంచి కొంతమంది ష్టుందిస్తులు[52] యిక్కడికి వచ్చారు. రోజంతా ఆయన రైతులు గురించి ఉత్సాహంగా మాట్లాడుతూనే వున్నాడు.

మధ్యాహ్నం భోజనాల వేళప్పుడు ఆయన అన్నాడు:

''మీరు వాళ్లని చూసి వుండాల్సింది — యిద్దరూ దారుఢ్యంగా గుండుల్లా వున్నారు. వాళ్లల్లో ఒకతను అన్నాడు: 'మేం రమ్మన కుండా వచ్చాం' అని. రెండో అతను 'పొమ్మనకుండానే పోమా మరి' అన్నాడు.'' ఆయన పసిపిల్లల్లాంటి నవ్వునవ్వుతూ వూగిపోయాడు.

భోజనాల తర్వాత, వరండాలో:

''మనం మొత్తానికి ప్రజల భాషని త్వరలోనే అర్థం చేసుకోకుండా పోతాం. మనం యిప్పుడు 'అభివృద్ధి సిద్ధాంతం' గురించీ, 'చరిత్రలో వ్యక్తి పాత్ర' గురించీ, 'శాస్త్ర పరిణామం' గురించీ 'అతిసారం' గురించీ మాట్లాడతాం. 'అయ్యా, గడ్డి మేటులో సూదికోసం వెదకి లాభం లేదు' అంటాడు రైతు. సకల సిద్ధాంతాలూ, చరిత్రా, పరిణామం యెందుకూ కొరగాకుండా, పరిహాసాస్పదం అయిపోతాయి. యేమంటే రైతు వాటిని అర్థం చేసుకోలేడు, వాటి అవసరం అతనికి లేదు. కాని రైతు మనకంటే గట్టిగా వుంటాడు, యెక్కువగా నిలుస్తాడు. మరి మనం (యేమో, యెవరికి తెలుసు?) అస్త్రూరీ తెగలాగా అయిపోతామేమో. వాళ్లని గురించి ఒక పండితుడికి చెప్పార్ట: 'అస్త్రూరీలందరూ నాశనం అయి పోయారు, కాని వాళ్ల భాషలోని కొన్ని పదాలు తెలిసిన చిలక మాత్రం ఒకటి యింకా వుంది' అని.''

## 18

''ఆడది మగవాడికంటే భౌతికంగా యెక్కువ నిజాయితీతో వుంటుంది. కాని ఆమె ఆలోచనలు అనృతమైనవి. ఆమె అబద్ధం ఆడినప్పుడు తనే నమ్మదు. రూసో అయితే అబద్ధమూ ఆడాడు, నమ్మనూ నమ్మాడు.''

## 19

''తను నమ్మని దాన్ని కొలిచినందుకు తన జీవితమంతా తననీ, యితరుల్నీ శిక్షించుకున్నట్టు దొస్తొయేవ్‌స్కీ తన ఉన్మత్త పాత్రలలో ఒక పాత్ర గురించి రాశాడు. అది అతను తన గురించే రాసుకున్నాడు లేదా అతను తన గురించే అలా సులభంగా చెప్పగలిగి వుండేవాడు.''

## 20

ఆయనకి నంగనాచిలాగా చిక్కుపెట్టే ప్రశ్నలు వెయ్యడం అంటే యిష్టం:

''మిమ్మల్ని గురించి మీరే మనుకుంటున్నారు?''

''మీరు మీ ఆవిడ్ని ప్రేమిస్తున్నారా?''

''మా అబ్బాయి లెవ్[53] ప్రతిభావంతుడేనను కుంటున్నారా?''

''మీకు సోఫ్యా[54] అంటే యిష్టమేనా?''

ఆయనతో అబద్ధం చెప్పడం అసాధ్యం.

ఒక సారి ఆయన అడిగాడు:

''మీకు నేనంటే యిష్టమేనా?''

యిది రష్యన్ వీరుడి వినోదం. ఆయన యేదో కుస్తీకి తయారవుతున్నట్టు పరీక్షపెట్టేవాడు. యెప్పుడు యేదో ప్రయత్నించేవాడు. యిది సరదాగానే వుంది, కాని నేను దాన్ని గురించి పట్టించుకున్నానని అనుకోను. ఆయనో రాక్షసుడు, నేనింకా పసివాణ్ణి, నన్ను ఆయన ఒంటరిగా వదిలి పెట్టెయ్యాలి.

## 21

''డికెన్స్ చాలా తెలివైన సంగతి ఒకటి చెప్పాడు: 'కడదాకా మీరు దాని కోసం పోరాడుతూనే వుండాలి అన్న షరతుమీదనే మీరు జీవిస్తున్నారు' అని. మొత్తంమీద అతను భావావేగపూరిత, వాగ్బాహుళ్య రచయిత, అంత తెలివైన వాడు కాదు. ఆయన మరెవ్వళ్ళూ చెయ్యలేనట్టుగా నవలా నిర్మాణం చేస్తాడనుకోండి, ఖాయంగా బాల్జాక్ కంటే బాగా చేస్తాడు. ఎవరో అన్నారు: 'పుస్తకాలు రాయాలీ అనే యావతో చాలా మందే వుంటారు, కాని ఎవరూ లవంటే సిగ్గుపడరు.' బాల్జాక్‌కి లేదు, డికెన్స్‌కి లేదు. యిద్దరూ కూడా చెత్త చాలా రాశారు. అయినా బాల్జాక్ మేధావి, అంటే మేధావి అని పిలవగలిగేది వున్నవాడు....''

## 22

''అధోజనం''నుంచి కొన్ని రంగాలని చదివి వినిపించాను. ఆయన శ్రద్ధగా విని, అప్పుడు అడిగాడు:

''యిది రాయాలని యెందు కనిపించింది మీకు?''

నేను చెప్పగలిగినంత మేరకి ఆయనకి వివరించి చెప్పాను.

''మీరు పందెం కోడిలాగా అన్నిటి కేసీ దూసుకుపోతారు. యేం, యింకో విషయం — మీరెప్పుడూ కూడా పొరలనీ, పగుళ్లనీ మీ రంగుతోనే సాపు చెయ్య ప్రయత్నిస్తున్నారు. హాన్స్ ఏండర్సన్ తను రాసిన ఓ కథలో అంటాడు: 'బంగారు పూత పోతుంది, తోలు అట్టు మిగులుతుంది' అని. మన రైతులు అంటారు: 'ప్రతిదీ నశించి పోతుంది, సత్యం ఒక్కటే నిలుస్తుంది' అని. రంగు పులమకండి, తర్వాత అది మీకే యెక్కువ చెరుపు. తర్వాత, మీ భాష మరీ వడిగా వుంది, చమక్కులతో నిండి వుంది, అది బాగోదు. మీరు యింకా తేలిగ్గా రాయాలి, మనుషులు యెప్పుడూ సాదాగానే మాట్లాడతారు. పైకి పొంతన లేనట్టు కనిపించినా వాళ్లు చెప్పదలచుకున్నది బాగానే చెప్తారు. ఎవరో చదువుకున్నావిడ అన్నట్టు 'నాలుగు మూడు కంటే యెక్కువైనప్పుడు మూడవది నాలుగవ దాని కంటే గొప్పది యెలా అవుతుంది?' అని రైతు యెవడూ అడగడు. చమక్కుల రాత అవసరం లేదు.''

ఆయన సంతృప్తి చెందినట్టు లేదు, నేను చదివి వినిపించింది ఆయనకి నచ్చనే లేదని తెలుస్తూనే వుంది. కొంచెం సేపు అయిం తర్వాత ఆయన నా పైగా చూస్తూ, చిరచిరలాడుతూ అన్నాడు:

''మీ ముసలతను ప్రేమాస్పదుడు కాడు. అతని మంచితనంతో యెవరికీ నమ్మకం లేదు. ఆ నటుడు బాగా వున్నాడు. మీరు 'చదువు ఫలితం' చదివారా? అందులో సరిగ్గా మీ నటుడిలాంటి వంటవాడు ఒకడున్నాడు. నాటకాలు రాయడం మహా కష్టం. మీ జారిణి బాగుంది. వాళ్లు బహుశా వాస్తవానికి అలానే వుంటారు. అలాంటి వాళ్లని కలుసుకున్నారా?''

''ఆఁ.''

''తెలుస్తూనే వుంది. సత్యం యెప్పుడూ మరుగున వుండదు. కాని మీరు రచయిత దృష్టినుంచి అమితంగా మాట్లాడుతున్నారు. అందుకనే మీ నాయకులు నిజమైన పాత్రలు కారు, వాళ్లంతా మరీ ఒక్క లాగే వుంటారు. మీరు బహుశా ఆడవాళ్లని అర్థం చేసుకోలేరు, మీరు ఆడవాళ్లని గురించి రాయలేరు. మీ ఆడ వాళ్లు యెవళ్లకీ గుర్తువుండరు....''

మమ్మల్ని టీ తాగడానికి రమ్మని పిలవడానికి టాల్‌స్టాయ్ కోడలు వచ్చింది. ఆయన లేచి గబగబా అవతలికి వెళ్లిపోయాడు, ఆ సంభాషణని ముగించేస్తున్నందుకు సంతోష పడుతున్నట్టుగా.

## 23

"మీకు వచ్చిన అతి భీకరమైన కల యేమిటి?"

నాకు యెప్పుడో గాని కలలు రావు, నా కలల్ని గుర్తుపెట్టుకోవడమూ కష్టం నాకు. కాని రెండు మాత్రం గుర్తుండిపోయాయి. బహుశా వాటిని నా జీవితాంతం మర్చిపోనేమో.

కాంతి విహీనంగా, కిరణరహితంగా, క్షుధార్తుడి వంటిమీద పుళ్లలాగా గుండ్రంగా, చదునుగా వున్న నక్షత్రాలతోటి జబ్బు పడి, మురిగిపోయి, ఆకుపచ్చ పసుప్పచ్చ రంగుగా వున్న ఆకాశం నా కలలోకి వచ్చింది. మురిగిపోయిన ఆకాశంమీద నక్షత్రాలకి మధ్యగా ఎర్రటి మెరుపు తీగ పాకుతోంది. ఆ మెరుపు దాదాపు పాము లాగా వుంది. అది యే నక్షత్రాన్నైనా తాకితే, ఆ నక్షత్రం ఒక గోళం లాగా ఉబ్బిపోయి, నిశ్శబ్దంగా బద్దలైపోయేది. దాని జాగాలో పొగదమ్ములాగా మిగిలిపోయి ఒక నల్లని మచ్చ, తక్షణం మురిగిపోయిన, నీటిలాంటి ఆకాశంలో మాయమైపోయేది. అలా అన్ని నక్షత్రాలూ ఒక దాని తర్వాత ఒకటి పేలిపోయాయి. ఆకాశాన్ని యింకా యెక్కువగా తమస్సు ఆవరించింది, ఆకాశం యింకా యెక్కువ భీకరంగా కనిపించింది. అప్పుడు అంతా ముద్దగట్టుకు పోయినట్టూ, ఉడికిపోయినట్టూ కనిపించి, ఓ రకమైన నీటి హల్వాలాగా ముక్కలై నా నెత్తిమీద పడిపోయింది. ఆ ఖాళీ జాగాల మధ్యన యీ ముక్కలు నగిషీ చేసిన యినప నల్లని ఉపరితలం లాగా ప్రకాశించాయి.

టాల్‌స్టాయ్ అన్నాడు:

"మీరు ఖగోళశాస్త్రం గురించి యేదో విజ్ఞానశాస్త్ర గ్రంథం చదువుతూ వుండి వుండాలి. అందుకనే మీకీ పీడకల వచ్చి వుంటుంది. యిక ఆ రెండోకల యేమిటి?"

రెండోకల: మంచు కప్పిన బయలు. కాగితం లాగా చదునుగా వుంది, ఓ గుట్టగాని, చెట్టుగాని, పొదగాని లేవు. వూరికే ఒక్క కొమ్మ రెమ్మ మాత్రం మంచులో నుంచి బయటికి చొచ్చుకుని వచ్చింది. ఆ నిర్జీవపు బీటి మధ్యగా యీ అంచునుంచి ఆ అంచుకు కనిపించీ కనిపించని పసుప్పచ్చని రోడ్డు పీలిక విస్తరించుకుంది. ఒక జత బూడిద రంగు ఫెల్టు బూట్లు వాటంతటవే మెల్లిగా దానిమీద అంగలు వేసుకుంటూ పోయాయి.

ఆయన గుబురుగా, జీమూతంలా వుండే కనుబొమల్ని పైకెత్తి, నాకేసి తదేక ధ్యానంగా చూశాడు. కొంచెంసేపాగి అన్నాడు:

"అది భయంకరంగా వుంది. నిజంగా మీరు కలగన్నారా — కల్పించలేదు కదా? పుస్తక సంబంధమైందేదో యిందులో వుంది."

వున్నట్టుండి ఆయన ఆగ్రహపడుతున్నట్టనిపించింది. ఒక వేలితో మోకాలిమీద తాటించుకుంటూ, కటువుగా చిరచిరలాడుతూ అన్నాడు:

"మీరు తాగరు కదా. మీరు యెప్పుడేనా తాగుడుకి అలవాటు పడ్డట్టూ కనిపించరు. అయినా యీ కలల్లో యేదో తాగుడుకి అలవాటు పడినటువంటిది వుంది. హాఫ్‌మన్[55] అని ఒక జర్మన్ రచయిత వుండేవాడు. ఆయన పేకాట బల్లలు అటూ యిటూ పరిగెత్తిపోతున్నట్టుగా, ఆ బాపతుదంతా వుండేదట — సరే, ఆయన బాగా తాగేవాడనుకోండి. బూట్లు వాటంతటఅవే అంగలు వేసుకుంటూ పోవడం — నిజంగా భయంకరంగా వుంది. ఒక వేళ మీరు దీన్ని కల్పించినా — యిది చాలా బాగుంది. భీకరంగా వుంది!"

గడ్డం నిండుగా ఆయన చిరునవ్వు నవ్వాడు, దాంతోటి ఆయన చెక్కిళ్లు కెంపెక్కాయి.

"వూహించండి. హఠాత్తుగా ఓ పేకాట బల్ల వీధిలో పరిగెట్టుకుంటూ వచ్చేస్తుంది — తెలుసుగా, కొయ్య కాళ్లు వంగిపోయి, దాని పలకలు టపటప కొట్టుకుంటూ వుంటే, సుద్దపొడి రేగుతూ — మీరు ఆ ఆకుపచ్చ ముతక ఉన్ని గుడ్డ మీద ఆకారాలని కూడా స్పష్టం చేసుకోగలరు. అది పరిగెత్తిపోయింది, యేమంటే కొందరు ఎక్సైజ్ వాళ్లు వరసగా మూడు రోజులు దానిమీద వింట్ పేకాట ఆడారు. దాంతో అది యిక తట్టుకోలేకపోయింది."

ఆయన నవ్వాడు. నామీద ఆయనకి నమ్మకం లేకపోబట్టి నేను కొంచెం కష్టపెట్టుకున్నానని ఆయన గమనించే వుంటాడు.

"మీకు కష్టం కలిగింది, మీ కల గ్రంథస్థంగా నాక్కనిపించ బట్టి. కష్ట పెట్టుకోకండి. ఒకో అప్పుడు యెవళ్లేనా యెలా తెలియకుండా కల్పనలు చేసేస్తారో నాకు తెలుసు. అవి యెంత వింతగా వుంటాయంటే, వాటిని వూరికే నమ్మలేం అంతే. అప్పుడు వాటిని కలగన్నా మనుకుంటారు."

యీ సాయంత్రం మేం బయట నడుస్తూ వుంటే, ఆయన నా చెయ్యి పట్టుకుని అన్నాడు:

"బూట్లు నడవడం — దుస్స్వప్నం కదూ? వాటంతటవే, తపా, తపా — కింద మంచు కరకరమంటూ వుంటుంది. అవును, యిది చాలా బాగుంది. అయినా

మీరు చాలా చాలా పుస్తక పాండిత్యం వాళ్లు. కోప్పడకండి — కాని అది మంచిది కాదు, తెలుసా అది మీకు ఆటంకం.''

ఆయన కంటే యెక్కువ పుస్తక జ్ఞానిగా వుంటాడని నేను అనుకోను. సరిగా నాకు ఆయన, తనేం చెప్పినప్పటికీ కూడా, పరమ హేతువాదిగా కనిపించాడు.

## 24

ఆయన యెక్కడినుంచో దూరంనుంచి, మనుషులు విభిన్నంగా ఆలోచించి, అనుభూతి చెందే చోటినుంచి, ఒకొళ్లనొకళ్లు భిన్నంగా ఆదరించుకునే చోటినుంచి, మనం చరించినట్టుగా చరించను కూడా చరించని చోటినుంచీ, ఒక భిన్నమైన భాషని మాట్లాడే చోటినుంచీ అప్పుడే దిగివచ్చినట్టుగా కనిపించేవాడు. అలిసిపోయి, నెరిసిపోయి, మరో భూమినుంచి వచ్చిన దుమ్ముతో దుమ్ము కొట్టుకుపోయి ఆయన ఒక మూల కూర్చుంటాడు. ప్రతివాళ్ల కేసీ ఒక పరాయివాడి లాగానో, లేకపోతే మూక బధిరుడి లాగానో గుడ్లప్పగించి శ్రద్ధగా చూస్తూ వుండేవాడు.

నిన్న సాయంత్రం భోజనానికి ముందు, సరిగ్గా అలాగే, యెక్కడినుంచో సుదూర తీరంనుంచి వచ్చినట్టుగా డ్రాయింగు రూములోకి వచ్చి చూస్తూ వున్నాడు. అప్పుడు నిశ్శబ్దంగా సోఫామీద ఓ క్షణం కూర్చుని, వూగుతూ, అరచేతులతో మోకాళ్లని రుద్దుకుంటూ, ముఖం ముడతలు పడేట్టు చేసుకుని, హఠాత్తుగా అన్నాడు:

''అది అంతం కాదు, కాదు, కాదు.''

ఎవరో ఒకతను నార బట్టల యిస్త్రీ పెట్టెలాగా బండగా, గమ్మగా వుండే అతను ఆయన్ని అడిగాడు:

''అంటే యేమిటి?''

ఆయన అతని కేసి నిశ్చలంగా చూసి, వంగి, డా. నికీతిన్, యెల్‌పాతియేవ్‌స్కీ, నేనూ కూర్చుని వున్న వరండా కేసి చూసి మమ్మల్ని అడిగాడు:

''మీరు యేమిటి మాట్లాడుకుంటున్నారు?''

''ప్లేవె[56] గురించి.''

''ప్లేవె.... ప్లేవె....'' అని ఆయన సాలోచనగా రెట్టించాడు. మాటమాటకీ మధ్యన, తనెప్పుడూ ఆ పేరు వినివుండనట్టు, ఆగుతూ అన్నాడు.

## 25

''నాకు తాగుబోతులంటే యిష్టం లేదు. కాని ఒకటి రెండు గ్లాసుల తర్వాత ఆసక్తికరంగా తయారయే వాళ్లని నేను యెరుగుదును. వాళ్లకి హాస్యం

వస్తుంది. ఆలోచనకి అందం వస్తుంది. ఒక సూటిదనం, ఒక వాగ్ధాటి వస్తాయి. అవి వాళ్ళ మామూలుగా వున్నప్పుడు వుండవు. అప్పుడు నేను వైన్‌ని అభినందించగలను."

తనూ, టాల్‌స్టాయ్ కలిసి వీధిలో వెడుతూ వుంటే, టాల్‌స్టాయ్ దూరంలో కవచధారులైన యిద్దరు అశ్విక సైనికుల్ని గమనించాడని సులెర్‌జీత్‌స్కీ అన్నాడు. వాళ్ళు ధరించిన యిత్తడి ఛాతీ ఫలకాలు యెండలో మెరుస్తూ వుంటే, వాళ్ల బూటు మడమల్లోని లోహపు ముళ్ళు గణగణమంటూ వుంటే వాళ్లిద్దరూ కలిసి యెదిగినట్టుగా నడిచారు. వాళ్ల ముఖాలు కూడా యౌవనంతోటీ దారుఢ్యంతోటీ కళకళలాడిపోయాయి.

టాల్‌స్టాయ్ వాళ్లని తిట్టడం మొదలెట్టాడు.

"యేం దాంభికమైన మౌఢ్యం! కొరడాతోటి శిక్షితమైన జంతువులు తప్ప...."

ఆ అశ్విక సైనికులు పక్కనుంచి పోయినప్పుడు ఆయన నిశ్చలంగా నుంచుండిపోయాడు, వాళ్లని ఆదరపూర్వకమైన చూపుతో దర్శిస్తూ, అభినందన పూర్వకంగా అన్నాడు:

"అయినా, వాళ్ళ అందంగా లేరూ! ప్రాచీన రోమన్లు, ఏహ్? దారుఢ్యం, అందం — ఓరి దేముడా! మానవుడిలో అందం యెంత అద్భుతం — యెంత అద్భుతం!"

## 26

బాగా యెండగా వున్న ఓ రోజున ఆయన దిగువ రోడ్డుమీద నన్ను దాటిపోయాడు. ఆయన లివాదియా* దిశలో స్వారీ చేసుకుపోతున్నాడు, కుదురుగా వుండే చిన్న తాతార్ గుర్రం యెక్కాడు. నెరిసిపోయి, కేశ భూయిష్ఠంగా, పుట్టగొడుగులాంటి తెల్లటి పల్చని ఫెల్ట్ టోపీ పెట్టుకుని భూతంలాగా వున్నాడు.

ఆయన గుర్రం కళ్లెం పట్టుకుని ఆపి నాతో మాట్లాడాడు. ఆయన రికాబు పక్కనే వెడుతూ, మిగతా విషయాలతోబాటుగా, నాకు వి. కొరొలేంకొ నుంచి ఉత్తరం వచ్చిందని చెప్పాను. టాల్‌స్టాయ్ కోపంతో గడ్డాన్ని ఆడించాడు.

"అతనికి దేవుడంటే నమ్మకం వుందా?"

"నాకు తెలీదు."

"మీకు అతి ముఖ్యమైన విషయం తెలీదు. ఆయనకి విశ్వాసం వుంది. కాని నాస్తికుల ముందు ఒప్పుకోవడానికి సిగ్గు".

* క్రైమియాలో ఒక చోటు. — అను.

ఆయన గొణుగుతూ, అసహనంగా, కళ్లని కోపంగా ముడుస్తూ మాట్లాడాడు. నేను ఆయనని ఆపు చేస్తున్నానని నాకు తెలుసు, ఆయన్ని వెళ్ల నివ్వడాని కన్నట్టు నేను దారియిస్తే, ఆయన నన్ను ఆపాడు.

"యేమిటి సంగతి? నేను మెల్లిగా స్వారీ చేస్తున్నాను."

మళ్లీ గుర్రుమన్నాడు:

"మీ అంద్రేయెవ్‌కి[57] నాస్తికులన్నా బెరుకే, కాని అతను దేముడున్నాడని నమ్ముతాడు, అతనికి దేముడంటే భయం."

గ్రాండ్ డ్యూక్ ఎ. రొమానొవ్ ఎస్టేట్ శివారులో రోడ్డు మీద ముగ్గురు రొమానొవ్‌లు దగ్గరగా నుంచున్నారు, మాట్లాడుకుంటూ — ఆయ్-తోడర్ ఎస్టేట్ యజమాని, గియోర్గీ, యింకో ఆయనా ముగ్గురూ కూడా చక్కగా పొడుగ్గా వున్న మనుషులు. రోడ్డుకి అడ్డంగా ఒంటి గుర్రపు బండీ, ఓ జీను గుర్రం వున్నాయి. టాల్‌స్టాయ్ వెళ్లలేకపోయాడు. ఆయన రొమానొవ్‌ల కేసి కటువుగా, నిర్బంధంగా చూశాడు. కాని వాళ్లు మాకు వెనక్కి తిరిగి నుంచున్నారు. జీను గుర్రం కాళ్లు కదిల్చి, పక్కకి మళ్లింది, టాల్‌స్టాయ్ గుర్రాన్ని వెళ్లనిస్తూ.

నిశ్శబ్దంగా ఓ క్షణమో, రెండు క్షణాలో స్వారీ చేశాక ఆయన అన్నాడు:

"వాళ్లు నన్ను గుర్తుపట్టారు, మొరటు మనుషులు!"

యింకో క్షణం తర్వాత:

"గుర్రానికి తెలిసింది తను టాల్‌స్టాయ్‌కి దారి యివ్వాలని."

## 27

"మీ సంగతి మీరే జాగ్రత్త పడండి, మొట్టమొదటగా మీ కోసం, అప్పుడు మీరు యితరుల కోసం యెంతో చేస్తారు."

## 28

"మాకు 'తెలుసు' అని మనం అంటున్నప్పుడు మన ఉద్దేశం యేమిటి? నేను టాల్‌స్టాయ్‌ననీ, రచయితననీ, నాకు భార్య వుందనీ, పిల్లలు వున్నారనీ, నెరిసిన జుట్టు వుందనీ, అందవిహీనమైన ముఖం వుందనీ, గడ్డం వుందనీ నాకు తెలుసు — అదంతా నా పాస్‌పోర్ట్‌లో వుంది. కాని పాస్‌పోర్టుల్లో వాళ్లు ఆత్మల్ని యెక్కించలేరు. నా ఆత్మని గురించి నాకు తెలిసిందల్లా యేమిటంటే అది భగవత్సాన్నిధ్యం కోసం తహతహలాడుతోందని. కాని భగవంతుడెవరు? నా ఆత్మ ఒక

అణువుగా భాగమైనదేదో అది. అంతే. ఆలోచించడం నేర్చుకున్న వాడెవడికైనా నమ్మడం కష్టం, కాని యెవరేనా గానీ విశ్వాసంద్వారానే భగవంతునిలో జీవించ గలరు. తెర్తులియాన్[58] అన్నాడు: 'ఆలోచన చెడ్డది.' ''

## 29

విసుగు తెప్పించే బోధనసున్నాగానీ, యీ ఆశ్చర్యకరమైన వ్యక్తి అపరిమితమైన బహుముఖ ప్రజ్ఞావంతుడు.

యివాళ పార్కులో గాస్ప్రా ముల్లాతోటి మాట్లాడుతూ, ఆయన, తన కడపటి రోజులని గురించి ఆలోచించుకోవాల్సిన తరుణం వచ్చిన పల్లెటూరి నాటు మనిషిలా నమ్మకం కలిగేటట్టు ప్రవర్తించాడు. అసలే చిన్నగా వున్న తను యింకా చిన్నగా అయిపో ప్రయత్నిస్తున్నట్టు కనిపించాడు. పట్టుగా, దృఢంగా వున్న తాతార్ పక్కన నుంచుని, ఉత్పన్నమైన సమస్యలతో మునిగిపోయి జీవిత పరమార్థాన్ని గురించి అప్పుడే విచికిత్స చేసుకుంటున్న చిన్న వృద్ధుడిలాగా ఆయన కనిపించాడు. తన గుబురు కనుబొమలని ఆశ్చర్యంతో యెత్తి, నిశితమైన కళ్లు బెరుగ్గా మిటకరిస్తూ, ఆయన వాటి సునిశిత తేజస్సుని మసక కమ్ముతున్నట్టు వుంది. ఆయన గవేషణాత్మక దృక్కు ఆ ముల్లాగారి వెడల్పాటి ముఖంమీదే నిశ్చలంగా వుంది. ప్రజలకి చిత్త విభ్రమం కలిగించే నిశితత్వం ఆయన కనుపాపల్లో అదృశ్యం అయింది. కొరాన్‌నుంచీ, న్యూటెస్టమెంట్‌నుంచీ పద్య భాగాలు చదువుతూ, అత్యద్భుతమైన నైపుణ్యంతోటి ప్రవక్తల ప్రవచనాలని ఉల్లేఖిస్తూ జీవిత పరమార్థం గురించీ ఆత్మని గురించీ, భగవంతుణ్ణి గురించీ ''కుర్ర తరహా'' ప్రశ్నలు ఆయన ముల్లాని అడిగాడు. వాస్తవానికి ఆయన నాటకంలో వేషం వేస్తున్నట్టు వుంది. అది కూడా యెంతో నైపుణ్యంతోటి, గొప్ప కళాకారుడికో, రుషికో సాధ్యమైనట్టు.

కొద్ది రోజుల కితం తనేయెవ్‌తోటీ,[59] సులెర్‌జీత్‌స్కీతోటీ సంగీతం గురించి మాట్లాడుతూ ఆయన దాని అందం గురించి పసితనపు పారవశ్యంలో మునిగిపోయాడు. తన పారవశ్యాన్ని ఆనందించినట్టు మీకు కనిపిస్తుంది — లేదా వాటిని అనుభూతం చేసుకోగల సామర్థ్యాన్ని. షోపెన్‌హోవర్[60] అంత బాగా, అంత గంభీరంగా యెవరూ సంగీతాన్ని గురించి రాయలేదని అన్నాడు. ఆ విషయం చెపుతూ ఆయన ఫెత్‌ని గురించి సరదా అయిన కథ చెప్పాడు. సంగీతాన్ని ''ఆత్మ చేసే మూగ ప్రార్థన'' అన్నాడు.

''మూగ యెందుకని?'' అని సులెర్‌జీత్‌స్కీ అడిగాడు.

''యెందుకంటే దానికి మాటలు లేవుగనక. ధ్వనుల్లో ఆలోచనల్లో కంటే యెక్కువ ఆత్మ వుంది. ఆలోచన అనేది రాగి నాణాలు వున్న పర్సులాంటిది, ధ్వని అనేది దేని వల్లా ఖిలం పట్టనిది, ఆంతరంగికంగా పరిశుద్ధమైంది.''

ఆయన వున్నట్టుండి అత్యుత్తమమైన అతి మృదువైన కుర్ర తరహా మాటలని హత్తుకునే వాటిని యెంపిక చేసుకుంటూ, ఆనందంతో వాటిని వాడాడు. అప్పుడు గడ్డంలోనుంచి చిరునవ్వు తొణుకుతూ వుంటే మృదువుగా, దాదాపు లాలిస్తున్నట్టుగా అన్నాడు:

''సంగీతకారులంతా బడుద్ధాయిలే. సంగీతకారుడు యెంత ప్రతిభావంతుడైతే, అంత సంకుచితంగా వుంటాడు. వింత యేమిటంటే దాదాపు వాళ్లంతా దైవభీతి పరులే.''

## 30

చేహొవ్‌కి టెలిఫోన్‌లో:

''యివాళ నాకు యెంతో ఆనందదాయకమైన రోజు నాకు యెంతో సంతోషంగా వుంది, మీరు కూడా సంతోషంగా వుండాలని కోరుతున్నాను. ముఖ్యంగా మీరు! మీరు యెంతో మంచివాళ్లు, యెంత మంచివాళ్లో!''

## 31

యెవళ్లేవా తప్పుడు విషయాలు చెప్పినప్పుడు ఆయన వినడు, నమ్మడు. వాస్తవానికి ఆయన అడగడు, ప్రశ్నిస్తాడు. అపురూపమైన వస్తువుల్ని సేకరించే వాడి లాగా ఆయన తను పోగుచేసిన వాటి సారూప్యతని చెడగొట్టని వాటినే అంగీకరిస్తాడు.

## 32

టపా చూసుకుంటూ:

''వాళ్లు పెద్ద గొడవ చేస్తున్నారు, వాళ్లు రాస్తున్నారు. నే చనిపోయాక, వాళ్లు అంటారు, ఓ యేడాది తర్వాత: 'టాల్‌స్టాయ్? చెప్పులు కుట్టబోయిన కౌంటే కదూ? తర్వాత యేదో యింకోటీ, యింకోటీ జరిగింది ఆయనకే కదూ?' ''

## 33

తను దాచుకున్న వస్తువు హఠాత్తుగా దొరికిన వాడికి వుండే కుటిల, ఆత్మ తృప్తిపూర్వక మందహాసం ఆయన వదనంమీద యెక్కువ సార్లు నాకు కనిపిం

చింది. అతను దేన్నో దాచుకున్నాడు, ఆ జాగా మర్చిపోయాడు. చాలా రోజులు రహస్య ఆందోళనలో గడిపాడు, నిరంతంగా ఆశ్చర్యపడుతూ: నాకు అంతగా అవసర మైన యీ వస్తువుని యెక్కడ పెట్టి వుంచాను? తన ఆందోళనని, నష్టాన్ని యెవరేనా చూస్తారేమోనని దాంతోటి యేదో అనిష్టకరమైంది, తనకి నచ్చని దాన్ని చేస్తారని భయం. హఠాత్తుగా ఆయనకి గుర్తువస్తుంది, అది దొరుకుతుంది. ఆనందంతో మునకలై పోయి యిక యెంత మాత్రమూ దాన్ని దాచుకోవాల్సిన బాధ లేకుండా, ఆయన దొంగగా ప్రతివాళ్ల కేసీ "యిప్పుడు మీరు నన్ను గాయ పర్చలేరు!" అంటున్నట్టు చూస్తాడు.

తనకి దొరికిందాన్ని గురించి, అది యెక్కడ దొరికిందో దాన్ని గురించీ ఒక్క ముక్క కూడా చెప్పడు.

ఆయన్ని చూసి యెప్పుడూ ఆశ్చర్యపడకుండా వుండలేను. కాని ఆయన్ని తరచుగా చూడాలంటే కష్టం. నేను ఒకే యింట్లో — ఒకే గది సంగతి చెప్పనే అక్కర్లేదనుకోండి — ఆయనతో వుండలేను. ఆయనతో వుండడం అంటే, యెండలో యేదీ నిలవకుండా మాడిపోయిన మైదానంమీద, సూర్యుడు తనే దగ్ధమైపోయి, అవధి లేని అంధకార నిశీధిని సూచిస్తూ వుండే చోట వుండటమన్న మాట.

## ఉత్తరం

మీకు సరిగ్గా ఉత్తరం పోస్టు చేసిం తర్వాత "టాల్‌స్టాయ్ కనిపించకుండా పారిపోయిన విషయం" గురించి టెలిగ్రామ్ వచ్చింది. ఆయినా మీకు రాస్తు న్నాను, మీతో యింకా మానసిక సంబంధాన్ని అనుభూతి చెందుతూ వున్నాను.

యీ వార్తకి సంబంధించి నేను చెప్పాలని భావించుకునేదంతా గందరగోళంగా వుంటుంది, బహుశా కటువుగా, నిర్దాక్షిణ్యంగా వుండవచ్చు — నన్ను మన్నించాలి — యెవరో నా పీక పట్టుకుని నులిమేస్తున్నట్టు వుంది నాకు.

ఆయన నాతో దీర్ఘంగా చాలా మాట్లాడాడు. నేను గాస్ప్రాలో, క్రైమి యాలో వున్నప్పుడు తరచుగా ఆయన్ని చూడ్డానికి వెళ్లేవాణ్ణి. ఆయనకి కూడా నన్ను చూడ్డానికి రావడం యిష్టం. నేను ఆయన పుస్తకాలని చిత్తశుద్ధితో, ప్రేమతో చదివాను. అంచేత, నేను చెప్పబోయేది చాలా సాహసభరితమైందైనా, ఆయన్ని గురించి సామాన్యంగా వుండే అభిప్రాయానికి వ్యతిరిక్తంగా వున్నా, నేను ఆయన్ని గురించి అనుకునేదాన్ని చెప్పడానికి నాకు హక్కు వున్నట్టు కనిపిస్తుంది. మేధావి అని పిలవడానికి యింతకంటే అర్హమైన మనిషి లేడనీ, యింతకంటే

సంక్లిష్టపూరితంగా, స్వీయ వైరుధ్యభరితంగా, ప్రతిదాంట్లోనూ — అవును, ప్రతిదాంట్లోనూ యెక్కువ అద్భుతావహంగా వున్న మనిషి లేడనీ నాకు మిగతా అందరికి లాగానే తెలుసు. ఆయన ప్రత్యేకార్థంలోనూ, విస్తృతార్థంలోనూ కూడా అద్భుతమైన వ్యక్తి, ఒక రకంగా మాటల్లో పెట్టలేనిలాంటిది అది. అందరికీ నానా రకాల వాళ్లకీ నేను అరిచి చెప్ప బుద్ధి పుట్టేట్టు నన్ను చేసేది యేదో వుంది ఆయనలో: చూడండి, యెలాంటి దివ్యమైన మనిషి యీ భూగోళంమీద వున్నాడో! యేమంటే ఆయన సర్వవ్యాపకుడు, తొట్టతొలిగా మానవుడు — మానవాళిలో మనిషి.

కౌంట్ లియో టాల్‌స్టాయ్ అనే మనిషి జీవితాన్ని ''మునిపుంగవుడైన లియో'' జీవితంగా మార్చాలని ఆయన చేసే నిరంకుశ మూర్ఖ ప్రయత్నాలంటే నాకు యెప్పుడూ వైముఖ్యమే. చాలాకాలం ''బాధ'' పడడానికి ఆయన తన మట్టుకి తను యాతనపడుతున్నాడు, తెలుసా. తను దాన్ని యింకా సాధించలేక పోయినందుకు యెంత విచారిస్తున్నదీ ఆయన యెవ్‌గేని సొలొవ్యోవ్‌తోటీ,[61] సులెర్‌జీత్‌స్కీతోటీ చెప్పాడు. తన సంకల్ప బలాన్ని పరీక్షించుకుందామనే సహజమైన కోరికవల్లనే వూరికే ఆయన బాధపడదామనుకోలేదు. కాని తన సిద్ధాంతాల కండపుష్టిని పరీక్షించుకోవాలన్న — నేను రెట్టించి అంటున్నాను — మొండి ఉద్దేశ్యంతోటి తన బోధనని ప్రబలంగా వుంచుకోవడానికి, బాధపడ్డంద్వారా దాన్ని జనం దృష్టిలో పవిత్రం చెయ్యడానికి, వాళ్లు దాన్ని అంగీకరించేటట్టు చెయ్యడానికి — ఒత్తిడి చెయ్యడానికి, ఆయన బాధపడబోయాడు, తెలిసిందా, — ఒత్తిడి చెయ్యడానికి. యేమంటే ఆయనకి తెలుసు, తన బోధన విశ్వాసం కలిగించేటట్టుగా వుండదని. ఆయన డైరీలు ప్రచురితమైనప్పుడు సంశయాత్మకత తాలూకు మంచి మచ్చుతునకల్ని కొన్నింటిని తన సిద్ధాంతానికీ, వ్యక్తిత్వానికీ అనువర్తింపచేసుకుని వుండటం మీకు కనిపిస్తుంది. ''స్వతను త్యాగులూ బాధపడేవాళ్ళూ దాదాపుగా విధిగా నిరంకుశులూ పీడకులూ'' అని ఆయనకి తెలుసు — ఆయనకి ప్రతీదీ తెలుసు. అయినా ఆయన అంటాడు: ''నేను నా భావాలకోసం బాధపడవలసివస్తే అవి పూర్తిగా భిన్నమైన ముద్రని కలిగిస్తాయి.'' ఆయనలో అది యెప్పుడూ నాకు వెగటు కలిగించింది, యేమంటే అందులో నన్ను నిర్బంధించాలన్న ప్రయత్నం, నా అంతరాత్మమీద పెత్తనం చెయ్యాలన్న కోరిక, దాన్ని అమర వీరుడి రక్తదర్శనంతో మిరుమిట్లు కొలిపేటట్టు చెయ్యడం, నా మెడ చుట్టూ మూఢ భావాల కాడిని పెట్టడం అనే ప్రయత్నం అనుభూతం చేసుకోకుండా వుండలేకపోయాను.

మరో ప్రపంచంలోని అమరత్వాన్ని కీర్తిస్తూ ఆయన స్తోత్ర గీతాలు దాదాపు ప్రతిచోటా, అస్తమానూ పాడుతూనే వున్నాడు. కాని యీ ప్రపంచంలోని అమ

యిచ్చిన రెండు డైరీల్లోనూ వుంది. ''చెప్పబడిన దాస్యంతటినీ నిరాకరించడం'' లాంటి దేనిలాగానో అది నాకు కనిపించింది — అవధిలేని నిరాశ, ఒంటరితనమూ వున్న గడ్డమీద పుట్టి పెరిగిన అత్యంత గాఢత్వమూ దుష్కీర్తిగల నాస్త్యర్థక సిద్ధాంతంగా కనిపించింది. అలాంటి నిరాశనీ, ఒంటరితనాన్నీ యేదీ నాశనం చెయ్యలేకపోయింది, దాన్ని అంతకుముందు యెవ్వరూ అంతటి హడలిపోయే స్పష్టత తోటి అనుభూతం చేసుకుని వుండలేదు. ఆయన మొండిగా, హృదంతరాళంలో మానవులపట్ల ఉదాసీనంగా వుండేవాడుగా నన్ను నిశ్చేష్టితం చేశాడు. ఆయన యెంత ఉన్నతంగా, యెంత యెక్కువ శక్తివంతంగా వాళ్లకంటే వున్నాడంటే, వాళ్లని ఆయన కీటకాలకింద చూసేవాడు. వాళ్ల వ్యాసంగాలన్నీ ఆయనకి పరిహాసాస్పదంగా, దయనీయంగా కనిపించాయి. ఆయన వాళ్లనుంచి యెక్కడికో దూరంగా నిర్జన ప్రాంతంలోకి వెళ్లిపోయాడు. అక్కడ తన సర్వ ఆత్మశక్తుల కేంద్రీకరణతోటీ, ఆయన ''అన్నిటికంటే అతిముఖ్యమైందాన్ని'' యేకాంతంలో పరిశీలిస్తాడు — అది మృత్యువు.

తన యావజ్జీవితమూ ఆయన మృత్యువంటే భయపడ్డాడు, అసహ్యించుకున్నాడు. యావజ్జీవితమూ ఆయన్ని ''అర్జమాస్ భీతి''* వెంటాడుతూనే వుంది — తను, టాల్‌స్టాయ్, చనిపోవాల్సిందేనా? సర్వప్రపంచమూ, విశ్వమూ ఆయనకేసి చూస్తోంది. చైనానుంచి, ఇండియానుంచి, అమెరికానుంచి సజీవ, కంపిత తంత్రులు ఆయనకేసి విస్తరించుకున్నాయి. ఆయన ఆత్మ అందరిదీ, అన్ని కాలాలదీ. ప్రకృతి తన నియమాలకి మినహాయింపు చేసి ఆయనమీద — మానవులందరిలోకీ యీ ఒక్కని మీదే — భౌతిక అమరత్వాన్ని ప్రసాదించకూడదటూ? అద్భుతాల్లో నమ్మకం పెట్టుకునే అవివేకి కానంతటి హేతుబద్ధుడే అనుకోండి ఆయన. అయినా, మరో పక్క ఆయన తిరుగుబాటుదారుడు, పరిశోధకుడు, అజ్ఞాతమైన బారకాసులు యెదురుపడితే భయంతోటీ, విచారంతోటీ కకావికలైన నూతన అశిక్షిత సైనికుడిలాగా వున్నాడు ఆయన. గాస్ప్రాలో, జబ్బునుంచి కోలుకున్నాక, లెవ్ షెస్తోవ్[62] పుస్తకం ''నిచ్చే[63], కౌంట్ టాల్‌స్టాయ్‌ల బోధనల్లోని మంచీ, చెడూ'' అన్న పుస్తకం చదివాక, తనకి ''ఆ పుస్తకం నచ్చలేదు'' అన్నాడు. చేహోవ్ ఆ వ్యాఖ్యకి జవాబుగా ఆయన అన్నమాటలు నాకు గుర్తువున్నాయి:

''మరి నాకు యిది సరదాగా వుండింది. కృతకంగా రాసిందే, కాని చెడ్డగా లేదు, యిది ఆసక్తికరంగానే వుంది. వాళ్లు గనక చిత్తశుద్ధితో వుంటే, నాకు

* టాల్‌స్టాయ్‌కి తను చనిపోతాననే భీతి మొదట అర్జమాస్‌లో కలిగింది. — అను.

సినిక్‌లంటే యిష్టమే, తెలుసా? అతను యెక్కణ్ణో అంటాడు — 'సత్యం అవసరం లేదు' అని. అతను నూటికి నూరుపాళ్లూ ఒప్పు — సత్యం యేమిటి అతనికి? అతను యెలాగేనా చనిపోతాడు.''

''ఒక సారంటూ మనిషి ఆలోచించడం నేర్చుకుంటే, అతని సకల ఆలోచనలూ తన మృత్యువుతోనే ముడిపడి వుంటాయి. వేదాంతులంతా అంతే. మరి సత్యాలవల్ల మంచి యేమిటి, మృత్యువు ఖాయంగా సమీపించేటప్పుడు?''

సత్యం అందరికీ సమమేనని ఆయన వివరించడం మొదలుపెట్టాడు — భగవంతుడిపట్ల ప్రేమ. కాని ఆయన యీ విషయం గురించి మొక్కుబడిగా, అలసటగా మాట్లాడాడు. భోజనాలయ్యాక, వరండాలో ఆయన మళ్లీ ఆ పుస్తకాన్ని తీసుకుని రచయిత ''టాల్‌స్టాయ్, దొస్తొయేవ్‌స్కీ, నిచ్చేలాంటి వాళ్లు తమ ప్రశ్నలకి సమాధానం లేకుండా బతకలేరు. మరి యేదీ లేకపోవడం కంటే యేదో ఒక సమాధానం మెరుగు'' అన్న మాటలు చెప్పిన భాగం తీసి నవ్వుతూ అన్నారు:

''యేం గుండెలు దీసిన టురకారుడు. నేను నన్ను మోసం చేసుకుంటున్నానని అంటాడు, అంటే నేను యితరుల్ని కూడా మోసం చేస్తున్నట్టే కదా. యిదే స్పష్టంగా వుండే తీర్పు...''

సులెర్‌జీత్‌స్కీ అడిగాడు: '''టురకారు'డెందుకని?''

''యేముందీ,'' అన్నాడాయన సాలోచనగా, ''అతను షోకైన విలాస పురుషుడు అని నాకు వూరికే అనిపించిందంతే. పల్లెలో తన రైతు మేనమామ పెళ్లికి మాస్కోనుంచి వచ్చిన టురకారుడు నాకు గుర్తువచ్చాడు. అద్భుతమైన నడవడిక అందుకనే యెవరన్నా అసహ్యించుకుంటాడు.''

నేను యీ సంభాషణని మక్కికి మక్కీ యిస్తున్నాను. నాకు అది చాలా స్పష్టంగా గుర్తుంది. నేను దాన్ని రాసి పెట్టుకున్నాను కూడానూ, నన్ను తాకిన ప్రతిదాని లాగా. సులెర్‌జీత్‌స్కీ, నేనూ చాలా నోట్సు రాసుకున్నాం. కాని సులెర్‌జీత్‌స్కీ తన నోట్సు పోగొట్టుకున్నాడు. అతను మహా అజాగ్రత్త మనిషి. అతను టాల్‌స్టాయ్‌ని అభిమానించినా ఆయనపట్ల అతని వైఖరి కొంచెం వింతగా, దాదాపు అనుగ్రహ పూర్వకంగా వుండేది. నేను కూడా నా నోట్సు యెక్కడ్నో పెట్టాను, దొరకలేదు. బహుశా రష్యాలో వుందేమో. నేను టాల్‌స్టాయ్‌ని చాలా సన్నిహితంగా పరిశీలించాను. యేమంటే నేను ఒక వాస్తవమైన, సజీవమైన విశ్వాసం వున్న మనిషి కోసం యెప్పుడూ అన్వేషించాను, జీవితాంతం అన్వేషిస్తూనే వుంటాను. పైగా, మన సంస్కృతీ రాహిత్యం గురించి, ఒకప్పుడు చేహోవ్ ఫిర్యాదు చేసినందుకూను:

''చూడండి, గ్యోతే అన్న ప్రతి మాటనీ రాసిపెట్టేశారు, కాని టాల్‌స్టాయ్

మాట అలిఖితంగా వుండిపోతుంది. అది భయంకరమైన రష్యన్ స్వభావం, యేమంటారు! తర్వాత జనం కళ్లు నులుముకుని లేచి జ్ఞాపకాలు రాయడం మొదలుపెడతారు, శుద్ధ వక్రీకరణలతో."

సరే సంగతి మాద్దాం — షెస్తోవ్ విషయం:

"'అస్తమానూ భయంకరమైన మాయ దృశ్యాలకేసి చూస్తూ యెవరూ జీవించలేరు' అంటాడాయన — ఒకడు యేం చెయ్యగలిగేదీ, యేం చెయ్యలేకపోయేదీ ఆయనకి యెలా తెలుసు? తను మాయ దృశ్యాలని చూసినట్టు అతనికి తెలిస్తే, తను చిల్లర విషయాలు రాయడు. యేదో గంభీరమైందాంతోటే వ్యాపకం పెట్టుకుంటాడు, తన జీవితాంతం బుద్ధుడు చేసినట్టు..."

యీ వృద్ధమంత్రగాడు మృత్యువుతో క్రీడిస్తున్నట్టూ, దానితో సల్లాపం ఆడుతున్నట్టూ, యేదో రకంగా దానినుంచి యెక్కువ కొట్టెయ్యాలనుకుంటున్నట్టూ నువ్వంటే నాకు భయంలేదు, నువ్వంటే నాకిష్టం, నీకోసమే నేను నిరీక్షిస్తున్నాను అంటున్నట్టూ ఒకో అప్పుడు అనిపిస్తుంది. మళ్లీ అంతసేపూ ఆయన చిన్న, నిశిత నేత్రాలు వెదుకుతూనే వుంటాయి — నువ్వెలాంటి దానివి? నీ వెనక్కాల యేముంది? నువ్వు నన్ను సమూలం నాశనం చేసేద్దామనుకుంటున్నావా? లేకపోతే నాలో యేదేనా మిగుల్తుందా?

"నేను సంతోషంగా వున్నాను, చెడ్డ ఆనందంగా వున్నాను, యెంతో ఆనందంగా వున్నాను!" అనే ఆయన మాటలు వింత అనుభూతిని కలిగిస్తాయి. మరి — తక్షణం తర్వాత: "అయ్యో, బాధపడ్డమా!" బాధపడ్డం — అది కూడా ఆయనలో నిజాయితీగా వున్నదే. యింకా రోగంనుంచి కోలుకుంటూ వుండగానే, ఆయన జైల్లో వుండడానికో, ప్రవాసం పోవడానికో, ఒక్క ముక్కలో చెప్పాలంటే అమరత్వ కిరీటం ధరించడానికో చిత్తశుద్ధిగా సంతోషిస్తాడనే. అమరత్వం అనేది మృత్యువుని సమంజసం చేస్తుందనీ, దాన్ని యింకా అవగతం చేస్తుందనీ, ఆమోదయోగ్యం చేస్తుందనీ — బాహ్య, లాంఛన దృక్పథంనుండి — ఆయన అనుకుంటున్నాడా? ఆయన యెన్నడూ ఆనందాన్ని పూర్తిగా చూడలేదని నాకు నమ్మకం — "వివేకవంతమైన పుస్తకాల్లో" గాని, "అశ్వాన్ని అధిరోహించినప్పుడు" గాని, "మగువల బాహుబంధాల్లో" గాని ఆయన "ఐహిక స్వర్గపు" సంపూర్ణ ఆనందాన్ని అనుభవించలేదు. దానికి ఆయన మరీ హేతుబద్ధ మనస్తత్వంతో నిండిపోయాడు, జీవితాన్నీ ప్రజలనీ బాగా అవగతం చేసుకున్నాడు. ఆయన మాటలు మరి కొన్ని:

"కాలిఫ్ అబ్దుర్ రహమాన్‌కి జీవితంలో పద్నాలుగు ఆనందదాయకమైన రోజులు వున్నాయి, నాకు అన్ని వున్నాయని నేను అనుకోను. అంతా యెందుకంటే

నేను యెప్పుడూ నాకోసం బతకలేదు, నా ఆత్మకోసం బతకలేదు — నాకు తెలీదు యెలా బతకాలో — యెప్పుడూ ప్రదర్శన కోసం, యితరుల కోసం బతికాను.''

మేం వచ్చేస్తూ వుంటే చేహొవ్ అన్నాడు: ''ఆయన యెన్నడూ ఆనందంగా లేడంటే నేను నమ్మను'' అని. నేను నమ్ముతాను. ఆయన లేడు. కాని ''ప్రదర్శన కోసం'' ఆయన బతికాడన్నది నిజం కాదు. ఆయన యెప్పుడూ తనకి అధికంగా వున్నదాన్ని, భిక్షుకులకి మాదిరీ, యితరులకి యిచ్చాడు. వాళ్లచేత పనులని ''చేయించడం'' — చదవడం, నడవడం, శాకాలమీద జీవించడం, రైతుని అభిమానించడం, లియో టాల్‌స్టాయ్ హేతుభరిత, మతపర భావాల నిర్దుష్టతని విశ్వసించడం లాంటివి చేయించడం ఆయనకి యిష్టం. వాళ్లని వదిలించుకోవాలంటే మనుషులకి వాళ్లని తృప్తిపరిచేదో, వ్యాపకం కలిగించేదో దేన్నో వాళ్లకి యివ్వాలి. వాళ్లు ఆయన్ని యేకాంతంగా అలవాటు పడిన హింసకి, కాని ఒకో అప్పుడు సుఖవంతమైన యేకాంతానికి, మట్టులేని బురదని యెదుర్కొంటూ — ''ఆ మహత్తరమైన విషయపు'' సమస్యని యెదుర్కొంటూ వుండేట్టు యెందుకు వదలరు?

రష్యన్ బోధకులంతా, ఒక్క అవ్వకూమ్[64] తప్పిస్తే, ఒక మేరకి తీఖన్ జదోన్‌స్కీ కూడా, చురుకైన, సజీవమైన విశ్వాసం లేని స్తబ్ధులు. నా ''అధోజనం''లో అలాంటి ముసలాణ్ణి చిత్రించ ప్రయత్నించాను — లుకా. ఆయనకి ఆసక్తి కలిగించింది మనుషులు కాదు ''నానా రకాల జవాబు''లూనూ. ఆయనకి ప్రజలు తారస పడకుండా లేరు, వాళ్లని వూరడించేవాడు, కాని వాళ్లు తన దారిలో వుండకుండా వుండేందుకనే. కాని అలాంటి వ్యక్తుల మొత్తం వేదాంతం, మొత్తం బోధన గుప్త యేహ్యంతో వాళ్లు వితరణ చేసే దానమే అవుతుంది. వాళ్ల బోధన మాటున శోకభరితమూ క్షుద్రమూ అయిన మాటలు వినిపిస్తాయి:

''నన్ను ఒంటరిగా వదిలిపెట్టండి! భగవంతుణ్ణీ మీ పొరుగువాళ్లనీ ప్రేమించండి, కాని నన్ను మాత్రం ఒంటరిగా వదిలిపెట్టండి! భగవంతుణ్ణి నిందించండి, దూరంగా విసిరేసిన వాళ్లని ప్రేమించండి, కాని నన్ను ఒంటరిగా వదిలిపెట్టండి! నన్ను వంటరిగా వదిలిపెట్టండి యేమంటే నేను మానవుణ్ణి, మరి... చనిపోవాలని రాసిపెట్టి వున్నవాణ్ణి.''

అయ్యో! జీవితం యిలా వుంది, వుండబోతుంది! యిది మరోలా యెన్నటికీ వుండదు, యేమంటే మానవ మాత్రులు పీడనకి, చిత్రహింసకి గురవుతారు, భయంకరంగా వేర్పాటై పోతారు, తమ ఆత్మలని రసహీనం చేసే యేకాంతంతో ఒంటరితనంతో సర్వబంధితులైపోతారు. టాల్‌స్టాయ్ చర్చితో రాజీ పడిపోతే నేనేం ఆశ్చర్యపడను. దాని తర్కం దానికి వుంటుంది — మనుషులంతా సమంగానే అల్ప ముఖులు, బిషప్పులు కూడా. నిజం చెప్పాలంటే యిది ఆయనకి రాజీపడ్డం కాదు,

వ్యక్తిగతంగా ఆయనకి యీ చర్య పూరికే ఒక తార్కికమైన అడుగు: ''నన్ను అసహ్యించుకునే వాళ్లని నేను క్షమిస్తాను.'' ఒక క్రైస్తవ చర్యే. కాని దానికింద ఒక తేలికైన, నిశితమైన యెత్తిపొడుపు వుంది. మూర్ఖులమీద తెలివైన వాని ప్రతీకారంగా దీన్ని అర్థం చేసుకోవచ్చు.

కాని నేను రాయాలనుకున్నట్టు రాయటం లేదు, లేదా నేను రాయాలనుకున్న వాటిని గురించీ రాయటం లేదు. నా ఆత్మ ఘోషిస్తోంది, నాముందు వినాశనం మిణుకుమంటోంది. పత్రికలు యిప్పుడే వచ్చాయి, యెలా వుండేదీ నేను చూడ గలను. ప్రపంచపు మీ భాగంలో ఒక ఐతిహ్యం నిర్మిత మవుతోంది — ''అనగా అనగా ఒకప్పుడు సోమరులు, పరాన్న భుక్కులూ వుండేవాళ్లు, వాళ్లు సృష్టిం చారు — ఒక ఋషిని.'' యిది మన దేశానికి యెంత అనర్థం దాపురింపచేస్తుందో వూహించండి, అదీ సామాన్య జనం తమ తలల్ని నిరాశతో వేలాడేసుకుంటూ వున్న ప్పుడు; అధికుల ఆత్మలు శూన్యంగా, నిష్ఫలంగా వున్నప్పుడు; యెంపిక అయిన వాళ్ల ఆత్మలు విచారంతో నిండిపోయినప్పుడు. యీ క్షుధార్త, ధ్వంసిత హృద యాలు అభూతకల్పన కోసం వెంపరలాడుతున్నాయి. తమ బాధని పోగొట్టుగో డానికి, తమ చిత్రహింసలనుంచి వూరట పొందడానికి జనం తహతహ లాడుతున్నారు. అది సరిగ్గా ఆయన కోరుకొన్న అభూతకల్పనే, సరిగ్గా అంత అవాంఛితమైందే — ఒక పవిత్ర మానవుడి జీవితం, ఒక ఋషి జీవితం — మరి ఆయనలో వుండే గొప్పదనమూ, పవిత్రతా యేమిటంటే ఆయన మానవుడు, ఉన్మత్తకర, వేదనా త్మక సౌందర్యపు మానవుడు, మనుషులలోని మానవుడు. నేను యిక్కడ స్వవ చోవ్యాఘాత దోషానికి గురవుతున్నట్టు వుంది, అయినా ఫరవాలేదు. తన కోసం కాకుండా యితరుల కోసం భగవంతుణ్ణి అన్వేషిస్తున్న మనిషి ఆయన, అలా అయితే తను తన నిర్జన స్థలంలో శాంతితో వుండచ్చు. ఆయన మనకి నూతన నిబంధనని యిచ్చాడు. క్రీస్తులోని అంతర్గత వైరుధ్యాలని మనం మరచిపోయేటం దుకు గాను, తను క్రీస్తు రూపాన్ని సులభతరం చేశాడు, ఆయనలోని తీవ్ర అంశాల్ని తగ్గించాడు, వాటి స్థానంలో ''నన్ను పంపించిన ఆయన యిచ్ఛకి విధే యం''గా వుండటాన్ని పెట్టాడు. టాల్‌స్టాయ్ నూతన నిబంధన యింకా అధి కంగా ఆమోదయోగ్యమనీ, రష్యన్ ప్రజల ''వ్యాధుల''కి బాగా నప్పుతుందనీ అవడాన్ని వ్యతిరేకించ నక్కర్లేదు. యీ ప్రజలకి యేదేనా యివ్వాలి, యేమంటే వాళ్లు మూల్గులతో యీ భూమిని కుదిపేస్తున్నారు, ఆ ''మహత్తర విషయం'' నుంచి టాల్‌స్టాయ్ దృష్టిని పక్కకి మళ్లిస్తున్నారు, ఫిర్యాదుచేస్తున్నారు. మరి

''యుద్ధమూ – శాంతీ'' యింకా ఆ పంథాలో యీ వ్యధిత రష్యా గడ్డకి వున్న బాధనీ, దుఃఖాన్నీ ఉపశమింప చెయ్యడానికి యేమీ చెయ్యలేదు.

''యుద్ధమూ – శాంతీ'' గురించి ఆయనే అన్నాడు: ''అనవసరమైన వినయాన్ని పక్కన పెట్టి చెపితే, అది మరో 'ఇలియడ్'.''[65] ఎమ్. చైకోవ్‌స్కీ టాల్‌స్టాయ్ ముఖతః ఆయన ''బాల్యం,'' ''యుక్తవయస్సు''[66] గురించి అలాంటి అంచనా వేసినట్టు విన్నాడు.

కొంత మంది పత్రికా విలేకరులు యిప్పుడే నేపుల్స్‌నుంచి వచ్చారు – ఒకతను రోమ్‌నుంచి పరిగెత్తుకుని వచ్చాడు కూడానూ. టాల్‌స్టాయ్ ''పారిపోవడం'' గురించి నేను యేమనుకుంటున్నదీ చెప్పమని వాళ్లు నన్ను అడిగారు – అవును వాళ్లు అలానే అన్నారు – ''పారిపోవడం.'' నేను వాళ్లతో మాట్లాడ్డానికి ఒప్పుకోలేదు. బహుశా మీకు అర్థం అవుతుంది, నా మనస్సు అల్లకల్లోలంగా వుందని – టాల్‌స్టాయ్ ఋషి అవడం నేను కోరను. ఆయన్ని పాపాత్ముడిగానే వుండనివ్వండి. పాపమయ ప్రపంచపు హృదయానికి చేరువగా, యెప్పటికీ మన ప్రతి ఒక్కళ్ల హృదయాలకీ దగ్గరగా వుండనివ్వండి. పూష్కినూ, ఆయనా – యింతకంటే ప్రియమైందీ, అధికమైందీ లేదు మనకి....

లియో టాల్‌స్టాయ్ చనిపోయాడు.

ఒక టెలిగ్రామ్ వచ్చింది. సాదా మాటల్లో వుంది – ఆయన చనిపోయాడు.

యిది గుండెమీద కొట్టిన దెబ్బ. నేను బాధతోటే, దుఃఖంతోటే రోదించాను. యిప్పుడు అర్ధనిశ్చేష్టిత స్థితిలో నేను ఆయన్ని నాకు తెలిసినట్టుగా, నేను ఆయన్ని చూసినట్టుగా చిత్రించుకున్నాను. ఆయన్ని గురించి మాట్లాడాలనే ఒక వ్యధాకులిత కోరిక పుట్టింది. మరణశయ్యమీద, సెలయేటి పర్యంకంమీద నున్నటి రాయిలాగా వుండి, నిస్పందేహంగా ఆ వంచనాత్మక చిరునవ్వుతోటి – యెంతో సంపూర్తిగా నిర్లిప్తంగా – నెరిసిన గెడ్డం మాటున నిశ్శబ్దంగా దాగిన చిరునవ్వుతోటి చిత్రించుకున్నాను. ఆయన చేతులు ఆఖరికి ప్రశాంతంగా ముడుచుకుపోయాయి – అవి వాటి కష్టమైన పనిని పూర్తి చేశాయి.

ఆయన నిశితమైన కళ్లు గుర్తుకు వచ్చాయి – అవి ప్రతిదాని గుండానూ చొచ్చుకు చూసేవి – ఆయన వేళ్లు, యెప్పుడూ గాలిలో యేదో గీస్తున్నట్టే వుండేవి; ఆయన సంభాషణ, ఆయన ఛలోక్తులు, ఆయనకి యిష్టమైన రైతు పదాలు, మరి వింతగా అనిర్దిష్టంగా వుండే ఆయన కంఠధ్వని గుర్తుకు వచ్చాయి. ఆ మానవుడు యెంతటి జీవితాన్ని ఆలింగనం చేసుకున్నదీ, యెంత మానవా[illegible]మైన తెలివితో వున్నదీ – యెంత అధిమానుషమైనదీ గోచరమైంది.

ఒకసారి నేను ఆయన్ని బహుశా యెవ్వరూ చూసి వుండనట్టు చూశాను. గ్యాస్ప్రా వైపు సముద్రం ఒడ్డున నడుస్తూవుంటే, యుసూపొవ్ ఎస్టేట్ బయట, రాళ్లమీద కూర్చున్న ఆయన చిన్న, కోణాకార విగ్రహాన్ని హఠాత్తుగా చూశాను. ముడతలు పడిపోయిన వెలిబూది సూటు వేసుకుని, నలిగిపోయిన టోపీ పెట్టుకున్నాడు. ఆయన చేతులమీద చుబుకం ఆన్చి, వేళ్ల మధ్య నుంచి గడ్డపు నెరిసిన వెంట్రుకలు కిందకి జారుతూ వుంటే, సముద్రం కేసి చూస్తూ అక్కడ కూర్చున్నాడు. ఆయన పాదాలని శ్యామలమైన అలలు వినయ పూర్వకంగా, ఆప్యాయంగా తాకుతున్నాయి, తమ కథని ఆ వృద్ధమంత్రగానికి చెబుతున్నట్టు. ఆ రోజు వెలుతురు దోబూచులాడుతోంది. రాళ్లమీద మేఘాల నీడలు జారిపోతూ వున్నాయి, దాంతోటి ఆ ముసలాయన, కాసేపు వెలుతురులోనూ, కాసేపు ఛాయలోనూ గోచరమయాడు. ఆ రాళ్లు పెద్దవి. పెద్ద పగుళ్లు వాటిలో వున్నాయి. ఘాటైన సముద్రపు నాచు వాటిని కప్పేసింది — అంతకు ముందు రోజున పెను తుఫాన్ వీచింది. సకల విషయాల ఆరంభ ప్రయోజనాలూ తెలిసి, యీ భూమ్మీద రాళ్లకీ, గడ్డికీ మహోధధిలోని నీటికీ, మానవుడికీ, శిలనుంచి సూర్యుడిదాకా సకల ప్రపంచానికీ అంతం యేమా అని ఆశ్చర్యపడే ఒక పురాతన శిలకి హఠాత్తుగా జీవం వచ్చినట్టుగా ఆయన నాకు అనిపించాడు. సముద్రం ఆయన ఆత్మలో ఒక భాగమైపోయినట్టుగా వుంది. ఆయన చుట్టూతా ఉద్భూతమై ఆయనలో భాగమైనట్టుగా వుంది. దీర్ఘాలోచనామగ్న అచేతనత్వంలో మునిగిపోయిన ఆ ముసలాయన తన దిగువన వున్న నిర్వేదంలో, యీ భూమిపైన సమున్నత నీలి శూన్యంలో గవేషణ కోసం అదృశ్యమై అక్కడికి తనే — తన యిచ్ఛా యేకాగ్రత వల్ల — ఆ అలల్ని ఆమంత్రణం చేస్తూ, ఉచ్చాటనం చేస్తూ వున్నట్టుగా, శిలల్ని లేపుతూ వాటిని మారుస్తూ వున్నట్టుండే మేఘాలా నీడలా కదలికలకి దర్శకత్వం వహిస్తూ వున్నట్టుగా యేదో అశరీరవాణిలా, మనోహరంగా, గంభీరంగా వున్నట్టు భాసించాడు. ఆయన తన చేతిని ఆడించడానికి ఉద్భూతమవబోతున్నట్టూ, సముద్రం నిశ్చలంగా, గాజులాగా స్వచ్ఛమైనట్టూ, శిలలు స్థానభ్రంశం చెంది రోదించినట్టూ, పరివేష్టితమైన దానంతటికీ జీవం వచ్చినట్టూ, ప్రతీదీ తన స్వరాన్ని తెచ్చుకుని అగణిత జిహ్వలతో ఆయన్ని గురించి, ఆయనకి వ్యతిరేకంగా భాషించినట్టూ నాకు హఠాత్తుగా, ఒక ఉన్మత్త క్షణంలో భ్రమ కలిగింది. ఆ క్షణంలో నేనేం అనుకున్నానా అన్నదాన్ని మాటల్లో పెట్టడం అసంభవం — నా మనసులో పారవశ్యమూ, భయవిహ్వలతా రెండూ వున్నాయి. అప్పుడు సకలమూ ఆనందభరిత ఆలోచనలో మిళితం అయిపోయింది:

‘‘యీ మానవుడు యిక్కడ జీవించినంత కాలం నేనీ లోకంలో అనాథని గాను.’’

అప్పుడు కాళ్లకింద వున్న గులక రాళ్లు చప్పుడు చెయ్యకుండా, నేను జాగ్రత్తగా, ఆయన దీక్షని భగ్నం చెయ్యడానికి యిష్టపడక వెనక్కి తిరిగాను. మరి యిప్పుడు — నేను అనాథని అయినట్టు బాధపడుతున్నాను. నేను రాస్తూ వుంటే నా కళ్ళమ్మట నీళ్లు తిరుగుతూ వున్నాయి - - యింత ఓదార్పు లేకుండా, యింత నిరాశాభరితంగా, యింత కటువుగా రోదించలేదు. ఆయన్ని నేను ప్రేమించినట్టు కూడా నాకు తెలీదు, అయినా ఆయనపట్ల నా అనుభూతి ప్రేమో, పగో యేమిటి అయితేనేం? ఆయన సర్వదా నా హృదయంలో అనుభూతుల్ని కదిలించాడు, అపరిమిత, అద్భుత ఆందోళనని కలిగించాడు. ఆయన జాగృతం చేసిన అనామోదిత, వైర భావాలు కూడా పీడిత రూపాలు ధరించక, ఆత్మని విస్తృతం చేస్తూ, దాన్ని యింకా అనుభూతి నిశితం చేస్తూ, దానికి యింకా అధిక శక్తిని యిస్తూ లోపల బద్దలయేట్టు వుండేవి. తన కాలి మడమలతోటి యీ నేల యెగుడుదిగుళ్లని చదునుచేసి ఆయన ఒక దాష్టీకపు చలనంతో, హఠాత్తుగా ఒక తలుపు వెనకనుంచి గాని, ఒక మూలగాని, యీ భూమి ఉపరి తలంమీద నిరంతరంగా చలించేదానికి అలవాటుపడ్డ మనిషికి వుండే చిన్న, తేలికైన, వేగవంతమైన అడుగులతో ముందుకు వస్తూ, ఆయన బొటనవేళ్లు పటకాలో పెట్టుకుని, ఒక క్షణం ఆగి, చుట్టూతా శోధనాత్మక చూపులతో చూస్తూ — ఆ చూపు నూతనమైన ప్రతిదాన్నీ గ్రహించి, తక్షణం దాని ప్రాముఖ్యాన్ని ఆపోశన పట్టేసేది — వస్తూవుంటే ఆయన చాలా గంభీరంగా వుండేవాడు.

‘‘బాగున్నారా?’’

యీ మాటలకి నేను యెప్పుడూ యీ మాదిరిగా తాత్పర్యం చెప్పకునేవాణ్ణి:

‘‘బాగున్నారా — యిందులో మీకు అర్థం కాని, నాకు సంతోషం గాని లేవు అయినా వూరికే అదే. బాగున్నారా!’’

లోపలికి వచ్చేవాడు ఆయన — చిన్న మనిషి. తక్షణం ప్రతివాడూ ఆయనకంటే చిన్నగా కనిపించేవాడు. ఆయనకి వున్న రైతు గడ్డం, ముతకగా అయినా అసాధారణంగా వున్న చేతులు, సాదా బట్టలు, ఆయన కులాసా అయిన సర్వబాహ్య ప్రజాస్వామిక రూపం చాలా మందిని మోసగించేవి.

‘‘ఓ మీరా బాబూ! అయితే మీరేనన్నమాట! ఆఖరికి మా మాతృభూమి అత్యున్నత పుత్రుని చూసే మహత్తర సంతృప్తి నాకు దక్కింది! వందనాలు, వందనాలు, నా నతులు అందుకోండి!’’

అదీ మాస్కో — రష్యన్ పద్ధతి, సాదాగా ఆత్మీయంగా వుండేది. కాని మళ్లీ యింకో రష్యను పద్ధతి వుంది — ‘‘నిస్సంకోచంగా ఆలోచించే’’ పద్ధతి —

''టాల్‌స్టాయ్‌గారు! మీ మతపర, తాత్విక అభిప్రాయాలతో విభేదిస్తున్నాకానీ మిమ్మల్ని వ్యక్తిగా మహత్తర కళాకారుడిగా మన్నిస్తూ....''

అప్పుడు వున్నట్టుండి రైతు గడ్డం కిందనుంచి, ముడతలు పడిన మామూలు లంగీ కిందనుంచీ పాత రష్యన్ పెద్దమనిషి, అద్భుతమైన గొప్పవంశీకుడు బయట పడేవాడు — నిర్మోహమాటస్తులు, విద్యావంతులు, తదితరులు కొయ్యబారిపోయే వాళ్లు. యీ గొప్పింటివాణ్ణి చూడ్డం, ఆయన హావభావాల ఔన్నత్యాన్నీ సొగసునీ, ఆయన భాషణలోని సగర్వ ప్రత్యేకతనీ గమనించడం, ఆయన నిర్నిరోధ పదబంధపు విశిష్టమైన సూటిదనాన్ని వినడం ఆనందదాయకంగా వుండేది. భూస్వామ్య దాసులతో వ్యవహరించడానికి తగ్గంత చక్కని పెద్దమనిషి తీరు ఆయనలో వుండేది. వైభవోపేత ప్రభువుని ఆయనలో వాళ్లు ఆవాహనచేస్తే, వాళ్లు వూరికే వినమ్రులై కీచుమనేటట్టు చేసే రీతిలో వాళ్లని అధఃకరించే అలవోక అయిన తేలికతనంతో టాల్‌స్టాయ్ ప్రభువుగా వాళ్ల ముందు దర్శనమిచ్చేవాడు.

నేను ఒకసారి యాస్నయా పొల్యానానుంచి మాస్కోదాకా యీ ''సాదా'' రష్యన్లు ఒకరితో ప్రయాణం చేశాను. తిరిగి స్థిమితపడ్డానికి అతనికి చాలా వ్యవధి పట్టింది. అతను జాలిగా వుండే చిరునవ్వుతో పరధ్యానంగా అంటూనే వున్నాడు:

''అబ్బ, యేం చిత్తుగా ఓడిపోయాం! ఆయన ఉగ్రంగా లేడూ, ఆహా!''

అప్పుడు అతను అనుతాపపడుతూ అన్నాడు:

''ఆఁ, నేనేమో ఆయన అరాచకవాది అనుకున్నాను! ప్రతివాళ్లూ ఆయన్ని అరాచకవాది అనే అంటూ వుంటారు, వాళ్లు అన్నదాన్ని నేను నమ్మాను....''

ఆయన సంపన్నుడు, పెద్ద పారిశ్రామికవేత్త; ఆయనకి పెద్ద పొట్ట వుంది, అపక్వ మాంస ఖండం రంగులాంటి కొవ్వు బలిసిన ముఖం వుంది — ఆయన టాల్‌స్టాయ్‌ని అరాచకవాది అని యెందుకు అనుకున్నాడు? యిది రష్యన్ స్వభావానికి సంబంధించిన ''గాఢమైన రహస్యాల్లో'' ఒకటిగా వుండిపోతుంది.

సంతోషపెట్టాలని టాల్‌స్టాయ్ అనుకుంటే ఆయన అందమైన తెలివైన ఆడదానికంటే ఆ పనిని బాగా చేస్తాడు. ఆయన వైవిధ్యపూరితమైన బృందం పరివేష్టించి వుండగా కూర్చుంటాడు — గ్రాండ్ డ్యూక్, రంగులు వేసే మనిషి, యాల్టానుంచి వచ్చిన సోషల్ — డెమోక్రట్ ఒకాయన, ష్టుందిస్టు, ఒకాయన ఒక సంగీతకారుడు, కౌంటెస్ ఎస్టేటు మేనేజరు, ఒక కవి — అంతా ఆయన కేసి మోహపూరిత నేత్రాలతో చూస్తున్నారు. ఆయన వాళ్లకి లావోత్సె[67] తాత్విక చింతనని వివరిస్తున్నాడు. ఆయన యేకకాలమందు కొన్ని వాయిద్యాలని — మద్దెలని,

డోలుని, అకార్డియన్‌ని, పిల్లనగ్రోవిని — వాయించే సామర్థ్యం వున్న ఒంటి మనిషి వాయిద్య బృందంలాగా నాకు కనిపించాడు. యిప్పుడు ఆయన కేసి చూడాలని నేను ప్రయత్నిస్తున్నాను — నేను మరి ఆయన్ని యిక యెన్నటికీ చూడలేను.

పత్రికా విలేకరులు యిక్కడ వున్నారు. లియో టాల్‌స్టాయ్ చనిపోయాడన్నది పుకారనీ, నిజం కాదనీ రోమ్‌కి టెలిగ్రామ్ పంపించారని వాళ్లు అంటున్నారు. వాళ్లు నానా రభసా, కోలాహలమూ చేశారు. వాగాడంబరంగా రష్యాపట్ల సానుభూతి వ్యక్తం చేశారు. రష్యన్ పత్రికలు సందేహానికి తావులేకుండానే చేస్తున్నాయి.

ఆయనతో అబద్ధం చెప్పడం అసంభవం — జాలి వల్లనేనా సరే. యే సానుభూతి కలిగించకుండానే ఆయన విపరీతమైన జబ్బుతో వుండి వుండచ్చు. అలాంటి మనుషులకి జాలి చూపించడం బుద్ధిహీనం. అలాంటి వాళ్లని బాగా చూసుకోవాలి, పదిల పరచుకోవాలి. దుమ్ము కొట్టుకుపోయిన, నిర్దయాత్మక పదాలని వాళ్లమీద చిలకరించకూడదు.

''మీకు నేనంటే యిష్టం లేదు, కదా?'' అని ఆయన అడిగాడు.

''అవును, యిష్టం లేదు'' అనేదే వుండవలసిన సమాధానం.

''మీకు నేనంటే అభిమానం లేదు, వుందా?''

''ఊహుఁ, యివాళ మీరంటే నాకు అభిమానం లేదు.''

ఆయన వేసే ప్రశ్నలు నిర్దాక్షిణ్యంగా వుంటాయి, ఆయన సమాధానాలు ముభావంగా వుంటాయి, ఋషులకు సరిపోయేటట్టు.

ఆయన గతాన్ని గురించి ఘనంగా మాట్లాడాడు, అన్నిటికంటే అధికంగా తుర్గేనెవ్‌ని గురించి. ఫెత్‌ని గురించి ఆయన యెప్పుడూ సరదాగా సంతోషపు చిన్నెలని కనబరుస్తూనే మాట్లాడాడు. నెక్రాసొవ్‌ని[68] గురించి ముభావంగా, సంశయాత్మకంగా మాట్లాడేడు. కాని మామూలుగా రచయితల్ని గురించి వాళ్లు తన పిల్లలైనట్టు మాట్లాడాడు. మరి ఆయన తండ్రి, వాళ్ల దోషాలన్నీ తెలిసిన వాడులాగా వుండినా, వాళ్లల్లో మంచికంటే చెడే యెక్కువ చెయ్యడానికి కృతనిశ్చయుడైనట్టు వుండేవాడు. ఆయన యెప్పుడు యెవ్వరిని గురించి నిందాత్మకంగా మాట్లాడినా ఆయన వాళ్ల గురించి శ్రోతలకి జ్ఞాన దానం చేస్తున్నట్టే నాకు అనిపించేది. ఆయన విమర్శలని వినడం వికలం చేసేది. యెవళ్లోనాగానీ తమ కళ్లని అప్రయత్నంగానే ఆయన నిశితమైన చిరునవ్వుకింద వాల్చేవాళ్లు — ఎవళ్లకీ జ్ఞాపకంలో యేం మిగిలేది కాదు.

ఉస్పేన్‌స్కీ[69] తూల మాండలికంలో రాసాడనీ, ఆయనకి ప్రతిభ లేదనీ ఓసారి తీవ్రంగా వాదించాడు. అయినా నేను వుండగానే చేహొవ్‌తోటి అన్నాడు:

''యిదిగో రచయిత యిక్కడ వున్నాడు! చిత్తశుద్ధి వల్ల యెవరికేనా గానీ దొస్తొయేవ్‌స్కీని గుర్తుకు తెస్తాడు; కాని దొస్తొయేవ్‌స్కీకి చమత్కారం చెయ్యడమన్నా, ప్రదర్శించుకోవడమన్నా యిష్టం. ఉస్పేన్‌స్కీ యింకా చాలా సాదాగా, చిత్తశుద్ధితో వుంటాడు. ఆయనకి భగవంతునిలో విశ్వాసం గనక వుండి వున్నట్లయితే, ఆయన ఖాయంగా అసమ్మతీయుడై వుండేవాడు.''

''కాని ఆయన తూల రచయిత అనీ, ప్రతిభ లేనివాడనీ మీరు అన్నారు.''

ఆయన కళ్లు గుబురు కనుబొమలకింద అదృశ్యమై పోయాయి. ఆయన అన్నాడు:

''ఆయన బాగా రాయలేదు. దాన్ని భాష అంటారా? మాటలకంటే యెక్కువగా విరామ చిహ్నాలు. ప్రతిభ అనేది ప్రేమ. ప్రేమించేవాడు ప్రతిభావంతుడు. ప్రేమికుల కేసి చూడండి — వాళ్లంతా ప్రతిభావంతులే.''

ఆయన దొస్తొయేవ్‌స్కీ గురించి స్పష్టంగా కనిపించేటువంటి అనిష్టతతో, బిర్రుగా, దాటవేస్తూ మాట్లాడాడు, దేన్నో అధిగమించడానికి ప్రయత్నిస్తున్నట్టు.

''ఆయన కన్‌ఫ్యూషియన్‌వి[70] గాని, బౌద్ధులవి గాని సిద్ధాంతాలు చదివి వుండాల్సింది. అవి ఆయన్ని స్వస్థపరిచేవి. ప్రతి ఒక్కళ్లూ తెలుసుకోవాల్సిన గొప్ప విషయం అది. ఆయన తీవ్ర యింద్రియాసక్తి గల మనిషి — ఆయనకి ఆగ్రహం వచ్చినప్పుడు ఆయన బట్టతల భాగంమీద దద్దుర్లు కనిపించేవి, చెవులు మెలి తిరిగేవి. యెక్కువ బాధపడేవాడు, ఆలోచించడం యెలాగో ఆయనకి తెలీదు. ఆయన ఫోరియరిస్టు[71]లనుంచీ ఆలోచించడం నేర్చుకున్నాడు. తర్వాత జీవితాంతం వాళ్లని ద్వేషించాడు. ఆయన రక్తంలో యూదు సంబంధమైనదేదో వుంది. ఆయన అపనమ్మకస్తుడు, దాంభికుడు, కజ్జాకోరు, దీనుడు. అంతమంది జనం ఆయన్ని చదివారన్నది ఆశ్చర్యం — యెందుకనో నాకు అర్థం కాదు. యేమైనా అది కష్టమైందీ, వ్యర్థమైందీ — ఆ 'ఇడియట్లూ,'[72] 'యువకులూ',[73] రస్కోల్‌నికొవ్‌లూ,[74] మిగిలినవాళ్లూ ఒక్క పిసరు అలా వుండరు. ప్రతీదీ యింకా చాలా సులభంగా, యింకా యెక్కువ అవగతం అయేట్టుగా వుంటుంది వాస్తవానికి. మాటకి, యిప్పుడు లెస్కొవ్‌ని చూడండి, జనం యెందుకు చదవడం లేదు? అతను నిజమైన రచయిత — మీరు అతని పుస్తకాలు చదివారా?''

''ఓ, నాకు అతనంటే అభిమానం, ముఖ్యంగా అతని భాష!''

''అతనికి భాష అద్భుతంగా తెలుసు, దాంతోటి అతను యేమైనా చెయ్యగలడు. అతనంటే మీకు యిష్టంగా వుండటం చిత్రం. మీలో రష్యనేతరమైందేదో వుంది, మీ ఆలోచనలు రష్యన్ ఆలోచనలు కావు — అలా అంటున్నానని యేం

ఆయన భాషణలోని అవర్ణ్య ప్రత్యేక ముగ్ధత్వం, అంతటి యెడతెగని పున రుక్తులతో, రైతులకుండేలాంటి సాదాతనంతో నిండిపోయి పైకి అంత అసమంజ సంగా వుండేది. ఆయన మాట్లాడుతూ వుంటే పరిశీలించిన వాళ్లకే అది అవగతం అవుతుంది. ఆయన ఉదాత్తానుదాత్త స్వరంలోనూ, ఆయన కవళికల జీవత్వంలోనూ మాత్రమే కాదు ఆయన మాటల శక్తి వున్నది, ఆయన కళ్ళ క్రీడలో కాంతిలో వుండేది. ఆయనవి నేను యెన్నడూ చూడనటునంటి అనర్గళ భాషణాయుత నేత్రాలు. ఒక్క జత కళ్లల్లో టాల్‌స్టాయ్‌కి వెయ్యి నేత్రాలు వుండేవి.

సులెర్‌జీత్‌స్కీ, చేహోవ్, సెర్గేయ్ టాల్‌స్టాయ్[77], యెవరో యింకో ఆయనా పార్కులో ఆడవాళ్లని గురించి మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ఆయన వాళ్ల మాటలని నిశ్శబ్దంగా వింటూ చాలా సేపు కూర్చున్నాడు. అప్పుడు వున్నట్టుండి ఆయన అన్నాడు:

"ఒక కాలు శ్మశానంలో వున్నప్పుడు, ఆడవాళ్లని గురించి నిజం చెపుతాను. అప్పుడు శవపేటికలోకి దూకేసి మూత మూసేసుకుంటాను — అప్పుడు వచ్చి నన్ను పట్టుకోండి!" ఆయన కళ్లు యెంత తృణీకారంగా, భయంకరంగా మెరిసాయంటే కొన్ని క్షణాలు యెవరూ మాట్లాడలేదు.

ఆరకంగా ఆయనలో వసీలీ బుస్లాయెవ్ పొగరూ, ఫాదర్ అవ్వకూమ్ మొండి తనంలో కొంతా, వీటికిపైగా, లేకపోతే వాటికి తోడుగా, చాదాయెవ్[78] సంశ యాత్మకత కొంతా దాగి వుండి, కలిసి పోయాయని నాకు అనిపిస్తుంది. అవ్వకూమ్ అంశ కళాకారుడి ఆత్మని క్షోభపెడుతూ బోధించింది. ఆయనలో వున్న నోవ్‌గొరొద్ పొగరుమోతు డాంటెనీ[79], షేక్స్పియర్‌నీ[80] నిందిస్తాడు. చాదాయెవ్ అంశ వీటిమీద సరదాగా మురుస్తుంది — యీ ఆత్మ క్షోభలని.

విజ్ఞానశాస్త్రాన్నీ, రాజ్యసూత్రాన్నీ నిందింపచేసేటట్టు చేసేది ఆయనలో వున్న పురాతన రష్యన్ — మానవత్వ పథంమీద జీవితాన్ని నిర్మించాలని అసంఖ్యాక ప్రయ త్నాలుచేసి విఫలం కావడంవల్ల ఉదాసీన అరాచకత్వం వైపు తరుమబడ్డ రష్యన్.

యిక్కడో విశిష్టమైన విషయం వుంది: యేదో అగోచర సద్యోవబోధవల్ల, "సింప్లిసిస్సిమస్"[81] వ్యంగ్య చిత్రకారుడు ఒలాఫ్ గుల్‌బ్రాన్‌సన్ టాల్‌స్టాయ్‌లో వున్న బుస్లాయెవ్ లక్షణాన్ని కనిపెట్టాడు: అతను గీసిన ఆ బొమ్మకేసి శ్రద్ధగా చూడండి: నిజమైన లియో టాల్‌స్టాయ్‌కి యెంత పోలిక వుందో, లోతుగా వున్న కళ్లల్లోంచి యెలాంటి పొగరుమోతు మనసు మీకేసి చూస్తూ వుంటుందో మీకు తెలుస్తుంది. యే మూఢ నమ్మకాలూ, పనికి మాలిన విశ్వాసాలూ లేని వ్యక్తికిగల, దేన్నీ పవిత్రంగా యెంచని వ్యక్తికిగల మనస్సు అది.

యీాయన, యీా మాం(త్రికుడు, (పతి ఒక్కళ్ళకీ పరాయివాడు, సర్వవ్యాపక సత్యాన్ని తాను నిరర్థకంగా అన్వేషించిన ఆలోచనా నిర్జనానాసాల్లో ఒంటరిగా (పయాణిస్తూ నాముందు వున్నాడు. నేను ఆయన్ని దర్శిస్తున్నాను. ఆయనని పోగొట్టుకున్నానన్న బాధ అధికమైందే అయినా, ఆ మానవుణ్ని చూడ గలిగానన్న గర్వం నా బాధనీ, దుఃఖాన్నీ ఉపశమింప చేస్తోంది.

''టాల్‌స్టాయన్ల''[82] మధ్యలో టాల్‌స్టాయ్‌ని చూడ్డం చి(త్రంగా వుంటుంది. ఆయన వాళ్ల మధ్య సమున్నత శిఖరఘంటలాగా నుంచుంటాడు. ఆ గంట నిరంతరంగా (ప్రపంచమంతటికీ కేసీ మోగుతూనే వుంటుంది, ఆయన చుట్టూ చిన్నగా, బెరుగ్గా వుండే చిన్న కుక్కలు ఘంటా నాదానికి అనుగుణంగా అరుస్తూ ఒకదాన్ని ఒకటి అనుమానంగా, తమలో యెవరు ఉత్తమంగా అరుస్తున్నారో గమనించడానికన్నట్టుగా, చూసుకుంటూ వుంటే. యీా జనం యాస్నయా పొల్యానా యింటినీ, కౌంటెస్ పానినా భవంతినీ ఒక వంచనాత్మకతతో, పిరికితనంతో, బేరంతో, వారసత్వాల ఆశలతో నింపేశారనే నాకెప్పుడూ అనిపించేది. యీా ''టాల్‌స్టాయన్ల''కీ, ఘనకాస్ఠికలని యేదో పవి(త్ర స్మృతి చిహ్నాలని చెప్పి మోసుకుపోతూ రష్యా యీా అంచునుంచి ఆ అంచుదాకా గమించే యా(త్రికులకీ మధ్యన ఉమ్మడిగా వుండేదేదో వుంది. యీా భగవద్భూతలలో ఒకడు కోడిపెట్టమీద జాలి కొద్దీ కోడిగుడ్డుని తినడం యాస్నయా పొల్యానాలో నిరాకరించడమూ, తూలలోని స్టేషన్ కాంటీన్‌లో లంగలార్చుకుంటూ ''ఆ ముసలాడు అతిశయోక్తులు చెపుతున్నాడు'' అని మాంసాన్ని ఆబగా మెక్కడమూ నాకు తెలుసు.

దాదాపు వాళ్లంతా నిట్టూరుస్తూ, చుంబిస్తూనే వున్నారు. అందరికీ స్వేద పూరిత, అస్థిరహిత హస్తాలూ, వంచనాత్మక నే(త్రాలూ వున్నాయి. అదే సమ యంలో తమ (ప్రాపంచిక వ్యవహారాలని చాలా నేర్పుగా సవరించుకునే లౌకక జీవులూ వున్నారు.

టాల్‌స్టాయ్ యీా ''టాల్‌స్టాయన్ల''ని అసలైన విలువతోనే అంచనా కట్టాడనుకోండి. అలాగే ఆయన సుకుమారంగా (పేమించి, యెప్పుడూ యౌవనోత్సాహంతోటీ, మెప్పుతోటీ చెప్పే సులెర్‌జీత్‌స్కీ కూడానూ. తను టాల్‌స్టాయ్ సిద్ధాంతాలని అనుసరించడంవల్ల తన జీవితం యెంత సులభమైందీ, తన ఆత్మ యెంత పరిశుద్ధమైందీ అనర్గళంగా ఒకాయన యాస్నయా పొల్యానాలో వర్ణించేశాడు ఓరోజున. టాల్‌స్టాయ్ నాకేసి వంగి మెల్లిగా అన్నాడు:

''వాడు అబద్ధం ఆడుతున్నాడు, దొంగవెధవ, కాని నాకు సంతోషం కలు గుతుందని అలా చేస్తున్నాడు.''

ఆయనకి సంతోషం కలిగిద్దామని ప్రయత్నించిన వాళ్లు చాలామంది వున్నారు. నిజంగా బాగా చేసినవాళ్లు నాకు యెవళ్లూ కనిపించలేదు. తనకి మామూలుగా వుండే విషయాలని గురించి, అంటే సార్వజనీన క్షమ, యిరుగుపొరుగుల్ని ప్రేమించడం, నూతన నిబంధన, బుద్ధమతం లాంటి వాటి గురించి నాతోటి ఆయన యెప్పుడూ మాట్లాడలేదు, యిదంతా కూడా "నాబోటి వాళ్లకి కాదు" అని గుర్తించి. దాన్ని నేను యెంతగానో అభినందించాను.

ఆయన కిష్టమైనప్పుడు మనోహరంగా ఔచిత్యంతోటీ, సానుభూతిగానూ, సౌమ్యంగానూ వుండగలడు. అప్పుడు ఆయన మాట ఉల్లాసకరమైన సాదాతనంతోటీ, నాజూకుతనంతోటీ వుండేది. కాని ఒకో అప్పుడు ఆయన చెప్పేది వినడం యిబ్బందిగా వుండేది. ఆయన ఆడవాళ్లని గురించి మాట్లాడే తీరు నాకు యెప్పుడూ నచ్చలేదు. యీ విషయంలో ఆయన మరీ "సాదా మనిషి"లాగా మాట్లాడేవాడు. ఆయన మాటల్లో యేదో అస్వాభావికమైందీ, నిజాయితీ లోపించిందీ కనిపించేది. కాని అదే సమయంలో పరమవైయక్తికంగా కనిపించేది. తను యెవరి వల్లో గాయపడ్డట్టూ, దాన్ని యెన్నటికీ మర్చిపోవడం గాని, మన్నించడం గాని చెయ్యలేనట్టూ వుండేది. ఆయనతోటి పరిచయం అయిన తొలి సాయంకాలం నన్ను తనతోటి తన అధ్యయన మందిరానికి తీసుకుని వెళ్లాడు. నా యెదురుగా కూర్చుని "వారెంకా ఒలేసొవా" గురించీ, "యిరవై ఆరుమంది పురుషులూ, ఒక అమ్మాయీ"[83] గురించీ మాట్లాడ్డం మొదలుపెట్టాడు. ఆయన స్వరం నన్ను నీళ్లు కార్చేసింది. పూర్తిగా మనసు వికలమైంది. ఆరోగ్యవంతమైన యువతికి సిగ్గు సహజం కాదని ఆయన అంత కటువుగా ముతగ్గా నన్ను ఒప్పించడానికి ప్రయత్నం చేశాడు.

"ఏ పిల్లకేనా గానీ పదిహేను యేళ్లు నిండి, ఆరోగ్యంగా వుంటే ఆమె తనని యెవళ్లేనా ముద్దుపెట్టుకోవాలనీ, తనతో సరసాలాడాలనీ కోరుకుంటుంది. ఆమె మనసు దానికి తెలియని లేదా అర్థం కాని దాంతోటి గిర్రున తిరిగి పోతుంది, దాన్నే జనం కన్యాత్వం అనీ, సిగ్గు అనీ అంటారు. కాని యీ దురవగాహమైంది తప్పదనీ, న్యాయమనీ ఆమె శరీరానికి తెలుసు. ఆమె మనసు యెలా వున్నా యీ ధర్మ పరిపూర్తిని అపేక్షిస్తుంది. మీ వారెంకా ఒలేసొవా ఆరోగ్యవంతంగా వున్నట్టే వుంది, కాని ఆమె అనుభూతులు పాండు రోగికి వుండే లాంటివి — అదంతా తప్పు!"

నేను ఆయన్ని ఖండించలేదు. హఠాత్తుగా ఆయన నా జీవితం గురించీ, నా చదువు సంధ్యల గురించీ, నేను చదివే పుస్తకాల గురించీ అడుగుతూ దయాన్వితుడుగా, సానుభూతిపరుడుగా మారిపోయాడు.

''వాళ్లన్నట్టు మీరు నిజంగానే బాగా చదువుకున్నవాళ్లా? యేం, కొరొలేంకొ నిజంగా సంగీతకారుడా?''

''కాదేమో, నాకు తెలియదు.''

''మీకు తెలీదా? మీకు ఆయన కథలు యిష్టమేనా?''

''చాలా.''

''అది వైరుధ్యం వల్ల. ఆయన లిరిక్. మీలో లిరికల్‌గా యేదీ లేదు. మీరు వెల్ట్‌మాన్[84] రాసినవి చదివారా?''

''ఆఁ.''

''మంచి రచయిత. తేట అయిన బుద్ధి వున్నవాడు, కచ్చితంగా వుంటాడు. ఎప్పుడూ ఉత్ప్రేక్షించడు. ఒకో అప్పుడు గోగొల్ కంటే మెరుగనిపిస్తాడు. అతనికి బాల్జాక్ తెలుసు. గోగొల్ మర్లిన్‌స్కీ[85]ని అనుకరించాడు, తెలుసా?''

గోగొల్ బహుశా హాఫ్‌మన్ చేతా, స్టెర్న్[86] చేతా, ఓ విధంగా డికెన్స్ చేతా ప్రభావితుడైనాడని నేను అన్నప్పుడు ఆయన నా కేసి ఓ చూపు విసిరి అన్నాడు:

''ఆ ముక్క యెక్కడ చదివారు? చదవలేదా? మీరు చెప్పింది సబబు కాదు. గోగొల్ డికెన్స్ రాసినవి చదివాడని అనుకోను. కాని మీరు నిజంగా చాలా చదివారు — జాగ్రత్త — అది ప్రమాదం. కొల్‌త్సోవ్[87] అలాగే నాశనం అయిపోయాడు.''

నన్ను సాగనంపుతూ ఆయన తన చేతులు నా చుట్టూ వేసి, ముద్దుపెట్టుకుని అన్నాడు:

''మీరు నిజమైన రైతు! రచయితలలో మీకు చాలా గడ్డు రోజులు వుంటాయి. అయినా మిమ్మల్ని యెవరూ బెదరగొట్టనివ్వకండి. యెప్పుడూ మీరు యేమనుకుంటున్నదీ చెప్పండి, ఒకో అప్పుడు అది మొరటుగా వున్నా పట్టించుకోకండి. తెలివైన వాళ్లు అర్థం చేసుకుంటారు.''

యీ తొలి సమావేశం నామీద ద్వంద్వ ప్రభావాన్ని కలగ చేసింది — టాల్‌స్టాయ్‌ని కలుసుకున్నందుకు నాకు సంతోషంగానూ వుండింది, గర్వంగానూ వుండింది. కాని ఆయన సంభాషణ యేదో క్రాస్ ఎగ్జామినేషన్ లాగా వుండింది. ''కోసక్కులు'', ''కొలబద్ద,'' ''యుద్ధమూ — శాంతీ'' రచయితని కాకుండా, నా పట్ల అనుగ్రహం చూపించి, నాతోటి ఓ రకమైన ''జనరంజక'' ఫక్కీలో, బజారు భాషని ఉపయోగిస్తూ మాట్లాడ్డం అవసరమైనట్టుగా భావించే పెద్దమనిషిని కలుసుకున్నట్టుగా నాకు అనిపించింది. అది ఆయన్ని గురించి నాకు వున్న భావాన్ని

తలకిందులు చేసింది — నేను అలవాటు పడిపోయిన భావం, నాకు ప్రియమైన భావం.

నేను ఆ తర్వాత ఆయన్ని చూసింది యాస్నయా పొల్యానాలో. ఆకురాలు కాలంలో, బాగా చినుకులు పడుతూ వున్న నిరుత్సాహపూరితమైన రోజు అది. ఆయన బరువైన ఓవరుకోటు వేసుకుని, మామూలుగా నీళ్లల్లో నడవడానికి పని కొచ్చే యెత్తు తోలు బూట్లు తొడుక్కుని బర్చ్ చెట్ల చిట్టడివిలోకి నన్ను షికారు తీసుకుని వెళ్లాడు. ఆయన కుంటల్నీ, కయ్యల్నీ యౌవనభరిత చురుకు దనంతో దాటుతూ, చెట్ల కొమ్మలనుంచి నీటి బిందువుల్ని నెత్తిమీద పడేటట్లు చేసుకుంటూ వున్నాడు. అంత సేపూ తనకి యీ బర్చ్ పొదల్లోనే షెన్‌షిన్ (ఫెత్) యేవిధంగా షొపెన్‌హావర్‌ని గురించి ప్రజ్ఞా పూరితమైన వివరణ యిచ్చిందీ చెబుతూనే వున్నాడు. ఆయన చెమ్మగిలిన, మెరిసే బర్చ్ కాండాలని ప్రేమగా నిమిరాడు.

''యీ మధ్యన కొన్ని పద్యాలు చదివాను:

పుట్టగొడుగుల్లేవు, కాని శూన్య భాగాలన్నీ
చెమ్మగిలిన పుట్టగొడుగుల వాసనా భరితంగా వున్నాయి.

— బాగుంది, బాగా పరిశీలించినది.''

హఠాత్తుగా ఒక కుందేలు మా కాళ్లకిందనుంచి తకామని దూసుకుని వచ్చింది. మహా ఆవేశపడిపోయి టాల్‌స్టాయ్ ఎగిరి గెంతువేశాడు. ఆయన చెక్కిళ్లు యెరుపెక్కాయి. ఆయన ''ఉస్కో!'' మని గట్టిగా అరిచాడు. అప్పుడు నాకేసి వర్ణించలేని చిరునవ్వు నవ్వుతూ చూసి, యుక్తివంతమైన, నిసర్గ హాసం చేశాడు. ఆ క్షణంలో ఆయన అభినందనీయంగా వున్నాడు.

యింకో సారి పార్కులో ఓ గద్దని చూశాడు. అది యింటి పెరటి పైన యెత్తులో యెగురుతోంది. పైన చక్కర్లు కొడుతోంది. అప్పుడు కాసేపు నిశ్చలంగా ఆగుతూ, కిందికి దూసుకురావాల్నా లేక ఓ క్షణం ఆగాల్నా అన్నట్టుగా రెక్కల్ని నీరసంగా ఆడించేది. టాల్‌స్టాయ్‌కి వెంటనే చురుకు పుట్టేంది. ఆయన కంటిమీద నీడగా అరచేతిని పెట్టుకుని, కంపితంగా గొణిగాడు:

''యీ దొంగభడవ మన కోడిపెట్టల కోసం చూస్తోంది! చూడండి, చూడండి — యిదిగో — ఓ! దానికి భయంగా వుంది. బహుశా బండివాడు అక్కడ వున్నాడేమో — మనం బండివాణ్ణి పిలవాలి....''

ఆయన పిలిచాడు. ఆయన కేక వెయ్యగానే గద్ద బెదిరి పారిపోయింది.

రచయిత వ్యక్తిత్వంపట్ల గాఢమైన ఆసక్తి వుందనీ అనుకోవడంలో నేను పొరపడ లేదనే అనుకుంటున్నాను. నేను చాలా సార్లు ఆయన ప్రశ్నలని విన్నాను: "మీకు ఆయన తెలుసా? ఆయన యెలా వుంటాడు? ఆయన యెక్కడ పుట్టాడు?" ఆయన అభిప్రాయాలు అస్తమానూ ఆ వ్యక్తిని ఒక ప్రత్యేక కోణంనుంచి ప్రదర్శించేవి.

వి. కొరొలేంకొ గురించి ఆయన సాలోచనగా అన్నాడు:

"ఆయన రష్యన్ కారు. అంచేత మనం చూసుకునే దానికంటే స్పష్టంగా మన జీవితాల్ని గురించి ఆయన బాగా చూడగలడు."

తను అంత మార్దవంగా ప్రేమించిన చేహొవ్ గురించి:

"ఆయన వృత్తి ఆయన్ని పాడుచేసింది. ఆయన డాక్టరు కాకపోయి వున్నట్టయితే యింకా బాగా రాసి వుండేవాడు."

ఒక యువ రచయితని గురించి ఆయన అన్నాడు:

"అతను ఇంగ్లీషువాడిలా వుండాలని చూస్తాడు. మాస్కో జనం ఆ విషయంలో లాభం లేదు."

"మీరు కాల్పనికులు. మీ కువాల్దాలూ[92] అందరూ శుద్ధ కల్పనలు" అని ఆయన నాతో యెక్కువ సార్లే అన్నాడు.

కువాల్దాని జీవితంనుంచి గ్రహించడం జరిగిందని నేను అన్నాను.

"అతను మీకెక్కడ తగిలాడో చెప్పండి."

నేను కువాల్దా పేరుతోటి వర్ణించిన మనిషిని మొదటి సారిగా కజన్ న్యాయాధిపతి కొలొంతాయెవ్ కార్యాలయంలో చూసిన దృశ్యంతోటి ఆయన మహా సరదా పడిపోయాడు.

"గొప్ప వంశం! గొప్ప వంశం! — అదీ యిది!" అన్నాడాయన నవ్వుతూ, కళ్లు తుడుచుకుంటూ. "కాని యేం ముచ్చటైన, సరదా పుట్టించే మనిషి! మీరు రాసే దానికంటే బాగా చెప్తారు కథలు. మీరు కాల్పనిక రచయితలు — మీకు తెలుసా — కాల్పనికవాదులు కల్పించేవాళ్లు. మీరు ఆ విషయాన్ని ఒప్పుకొంటే మంచిది."

వాస్తవ జీవితంలో మనుషులు యెలా వుంటే తమకి యిష్టమో చూపిస్తూ యేదో మేరకి రచయితలు అందరూ కల్పించే వాళ్లేనని నేను అన్నాను. నాకు కార్యాచరణ శీలురైన మనుషులంటే, జీవితంలోని చెడుగు నంతటినీ తమ సర్వ శక్తులతోటీ, యింకా వస్తే హింసతోటి కూడా ప్రతిఘటించే వాళ్లంటే యిష్టమని కూడా నేను చెప్పాను.

''కాని హింసే ప్రధానమైన చెడు!'' అని అరిచాడాయన నా చేతిని తీసుకుంటూ. ''దాన్నుంచి మీరు యెలా తప్పించుకుంటారు, రచయితా? 'నా తోటి పథికుడు' వుంది — అది కల్పన కాదు. అది బాగుంది యేమంటే కల్పితం కాదు కనక. మీరు కల్పించడం మొదలుపెట్టినప్పుడే మీ జనం అంతా యోధుల్లాగా తయారయిపోతారు.''

తప్పని సరి మర్కట సమ ''తోటి పథికులు'' మన చుట్టూతా పూర్తిగా వున్నంత కాలం, మనం నిర్మించే ప్రతీదీ యిసకమీద, విద్వేషభరిత పరిసరంలో వుంటుందని నేను అన్నాను.

తన మోచేత్తోటి నన్ను మెల్లిగా పొడుస్తూ ఆయన చిరునవ్వు నవ్వాడు.

''దీన్నుంచి చాలా, చాలా ప్రమాదకరమైన నిర్ధారణలని తియ్యవచ్చు. మీరు నిజమైన సోషలిస్టు కాదు. మీరు కాల్పనికవాదులు. కాల్పనికవాదులు రాచరికవాదులై వుండాలి, వాళ్లు యెప్పుడూ వున్నట్టుగా.''

''విక్టోర్ హ్యూగో విషయం యేమిటి?''

''విక్టోర్ హ్యూగో సంగతి వేరు. నాకు నచ్చడు. గోల మనిషి.''

నేనేం చదువుతున్నానూ అని ఆయన తరుచుగా అడిగేవాడు. తన దృష్టిలో నేను మంచి వాటిని యెన్నుకోలేదని యెప్పుడూ నిందిస్తూనే వుండేవాడు.

''గిబ్బన్[93] కొస్తామరొవ్[94] కంటే అధ్వాన్నం. మీరు మోమ్సెన్‌ని[95] చదవాలి. పెద్దగా విసుగు పుట్టిస్తాడనుకోండి, కాని కండ వుంది.''

నేను చదివిన తొలి పుస్తకం అనేది వుంటే అది ''జెంగాన్నో సోదరులు'' అని తెలియగానే ఆయన మహా మండిపోయాడు.

''అదీ మరి — చెత్త నవల! అదీ మిమ్మల్ని పాడుచేసింది. ఫ్రెంచి రచయితలు ముగ్గురు వున్నారు — స్టెండాల్, బాల్జాక్, ఫ్లొబెర్ — కావలిస్తే మపాసాని కూడా కలుపుకోవచ్చు. కాని చేహొవ్ అతని కంటే మెరుగు. గొన్‌కూర్ సోదరులు శుద్ధ విదూషకులు, గంభీరంగా వుంటామని వాళ్లు నటిస్తారంతే. తమలాంటి కల్పిత రచయితలు సృష్టించిన దాన్నుంచే వాళ్లు జీవితాన్ని గురించి తెలుసుకున్నారు, కాని యెవళ్లకీ వాళ్ల రచనలు అక్కర్లేదు.''

నేను ఆయనతో ఏకీభవించలేదు. దాంతోటి టాల్‌స్టాయ్‌కి కోపం వచ్చింది. వ్యతిరేకించడం ఆయన ఒప్పుకోలేడు. ఆయన వాదనలు ఒకో అప్పుడు చిత్రంగా మొండిపట్టుతో వుండేవి.

''హీన స్థితికి రావడం అనే లాంటిదేమీ లేదు'' అన్నాడాయన. ''అదంతా ఇటాలియన్ లొంబ్రోసో[96] కల్పన.''

రష్యాలోని వర్తక కుటుంబాల చరిత్రనుంచి ఒక వాస్తవం తర్వాత యింకో వాస్తవాన్ని ప్రదర్శించినప్పుడు ఆయన అన్నాడు:

''అది నిజంగాదు, అదంతా గడుసు పుస్తకాలనుంచి వస్తుంది....''

నాకు తెలిసిన ఒక వర్తక కుటుంబంలోని మూడు తరాల కథని ఆయనకి చెప్పాను — ప్రత్యేకమైన నిర్దాక్షిణ్యంతో హీనస్థితిని వర్ణించిన కథ అది. నా చొక్కా చెయ్యిని ఆందోళనతో గుంజుతూ ఆయన చాటాడు:

''అది నిజం! నాకు తెలుసు — తూలలో రెండు కుటుంబాలు వున్నాయి. మీరు రాయాల్సింది అలాంటి దాన్ని గురించి. సూక్ష్మంలో పెద్ద నవల — నేనన్నది అర్థం అయిందా? అదీ చెయ్యాల్సిన పద్ధతి!''

ఆయన కళ్లు ఆత్రంగా మెరిశాయి.

''కాని వాళ్లంతా యోధులైపోతారు.''

''ఒక్కళ్లూ కారు! అది చాలా గంభీరమైంది. మొత్తం కుటుంబం కోసం తపస్సు చెయ్యబోయే సన్యాసి కావడం యెవరేనా — అది అద్భుతం. అదీ అసలైన జీవితం. మీరు పాపం చేస్తారు. నేను పోయి మీ పాపాలని విమోచన చేస్తాను. యిక మిగిలిన వాడు — విసుగెత్తిన ఆక్రమణదారు — అదీ నిజమే. అలాంటి వాడికి తాగడం, పశువులా ప్రవర్తించడం, వ్యభిచరించడం, ప్రతివాళ్లనీ ప్రేమించడం, హఠాత్తుగా హత్య చేసుకోవడం — అదెంత బాగుంది! దొంగల్లోనూ, దిమ్మరిగాళ్లల్లోనూ వీరుల కోసం వెదకకుండా మీరు రాయాల్సింది అలాంటి దాన్ని గురించి. వీరులు అనేది అబద్ధం, కల్పనలు. మనుష్యమాత్రులు తప్ప, ప్రజలు తప్ప యింకేం లేదు — అంతే!''

నా కథల్లోకి చొచ్చుకువచ్చిన అతిశయోక్తుల్ని ఆయన నాకు తరచుగా చూపిస్తూ వుండేవాడు. కాని ఒక సారి ''మృత జీవులు'' రెండవ భాగం గురించి మాట్లాడుతూ, సరదాగా చిరునవ్వు నవ్వుతూ ఆయన అన్నాడు:

''మనమంతా అతి నిస్పందేహంగా నేల విడిచి సాముచేసే రచయితలమే. ఒకో అప్పుడు రాస్తూనే వుండగా వున్నట్టుండి ఓ పాత్ర పట్ల జాలిపడతాం, ఆ పాత్రకి సల్లక్షణాలు యివ్వ ప్రయత్నిస్తాం, లేకపోతే యింకో పాత్రని తగ్గిస్తాం మొదటిది తులనాత్మక పరిశీలనలో మరీ దిగిపోకూడదని.''

తక్షణం నిర్దాక్షిణ్యమైన న్యాయ నిర్ణేత గంభీర స్వరంతో:

''అందుకనే నేనంటాను కళ అబద్ధం, వంచన, అహేతుకం, మానవాళికి అపకారం చేస్తుంది. మీరు వాస్తవ జీవితాన్ని గురించి వున్నదున్నట్టు రాయరు, జీవితం పట్ల మీకున్న అభిప్రాయాలని గురించి రాస్తారు, జీవితాన్ని గురించి

మీరు అనుకునేది రాస్తారు. నేను ఆ గోపురాన్నో, సముద్రాన్నో లేకపోతే యీ తాతార్‌నో యెలా చూస్తున్నదీ తెలుసుకోవడంవల్ల యెవడికేనా యేమిటి లాభం? అది యెవడిక్కావాలి? దానివల్ల యేమిటి లాభం?''

ఒకో అప్పుడు ఆయన ఆలోచనలూ, అనుభూతులూ నాకు తిక్కగా, ఆ మాటకొస్తే కావాల్సికి వక్రించుకున్నట్టుగా కనిపించేవి. కాని తరచుగా ఆయన, క్రూర భగవంతుణ్ణి నిర్భీతిగా ప్రశ్నించే జాబ్ లాగా కఠోర నియమభరిత సూటి దనంతో శ్రోతల్ని తాకి లొంగ దీసుకునేవాడు.

ఒక రోజున నేను ఆయనతోటి ద్యుల్‌బేర్‌నుంచి ఆయ్ తోడర్‌కి* దిగువ రోడ్డుమీద నడుస్తున్నాను. మెల్లిగా, ఒక యువకుడిలాగా, అంగలు వేస్తూ తనకి మామూలుగా వుండే దానికంటే యెక్కువ ఆందోళనని వ్యక్తం చేస్తూ:

''శరీరం అనేది బాగా సుశిక్షితమైన కుక్కలాగా వుండాలి ఆత్మకి, అది ఆత్మ దాన్ని యెక్కడెక్కడికి పంపినా అక్కడికల్లా వెడుతూ వుండాలి. మరి మనల్ని చూడండి! శరీరం అడ్డు అదుపూ లేకుండా విచ్చల విడిగా వుంటుంది, ఆత్మ దాన్ని దారీతెన్నూ తోచనట్టు నిస్సహాయంగా అనుసరిస్తుంది'' అన్నాడు.

ఆయన ఛాతీని గుండెకి పైభాగంలో తీవ్రంగా రుద్దుకున్నాడు, కనుబొమలు పైకి యెత్తాడు, యేదో ఆలోచిస్తున్నట్టు అన్నాడు:

''మాస్కోలో, సూఖరెవ్‌స్కయా గోపురం దగ్గర, ఒక గొందిలో నేనొక సారి ఒక తాగుబోతు ముండని చూశాను — అప్పుడు ఆకురాలు కాలం. ఆమె కాలిబాట దగ్గర పడి వుంది. సరిగ్గా ఆమె మెడకిందనుంచి, వీపుకిందనుంచి మురికి నీరు కాలవలాగా ప్రవహిస్తోంది. ఆమె అక్కడ ఆ చల్లని నీళ్లల్లో, లేవలేక, గొణు గుతూ, పొర్లుతూ, తడిలో దొర్లుతూ పడివుంది.''

ఆయన వణికాడు. ఒక క్షణం కళ్లు మూసుకున్నాడు. తల పంకించాడు. లోగొంతుకలో అన్నాడు:

''యిక్కడ కూర్చుందాం. తాగుబోతు ఆడదాని కంటే భయంకరమైందీ, వెలపరంగా వుండేదీ యింకేమీ లేదు. వెళ్లి ఆమె లేవడానికి సాయం చేద్దామా అనుకున్నాను, కాని చెయ్యలేకపోయాను, ముడుచుకుపోయాను. ఆమె మొత్తం జిగటుగా, చెమ్మగా వుంది. ఆమెని తాకిం తర్వాత మరి నెల రోజుల పాటు మీ చేతుల మకిలి పోదు — దారుణం! పక్కనే బాట అంచు రాళ్లల్లో ఒకదానిమీద బూడిద రంగు కళ్లూ, చక్కటి జుట్టూ వున్న కుర్రాడొకడు కూర్చుని వున్నాడు.

---

* క్రైమియాలో ఒక పర్వతం. — అను.

వాడి కళ్లలో నీళ్లు తిరుగుతూ, చెక్కిళ్లమీదనుంచి జారిపోతుంది. వాడు ఎగబీలుస్తూ నిస్సహాయంగా అరుస్తున్నాడు:

''అమ్మా ఆఆఆ.... లే....''

క్షణక్షణానికీ ఆమె చేతులు కదిపి, గుర్రుమని, తల యెత్తి మళ్లీ బురదలో పడిపోయేది.''

ఆయన గమ్మునైపోయాడు, అప్పుడు చుట్టూతా చూసి, యిబ్బందికరంగా దాదాపు గుసగుసమంటున్నట్టు రెట్టించాడు:

''దారుణం! దారుణం! మీరెప్పుడేనా తాగుబోతు ఆడదాన్ని చూశారా? చూశారా — ఓరి, భగవంతుడా! దాన్ని గురించి రాయకండి, రాయకూడదు.''

''యెందుకని?''

నా కళ్లల్లోకి చూసి చిరునవ్వు నవ్వుతూ ఆయన రెట్టిస్తూ అన్నాడు:

''యెందుకనా?''

అప్పుడు ఆయన సాలోచనగా, మెల్లిగా అన్నాడు:

''నాకు తెలీదు. నేను వూరికే — పాశవికత్వాన్ని గురించి రాయడం అజ్ఞాకరంగా వుంటుంది. అయినా — యెందుకని? ప్రతిదాన్ని గురించీ రాసెయ్యాల్సిందే....''

ఆయన కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఆయన వాటిని తుడిచేసుకుని, అంత సేపూ చిరునవ్వు నవ్వుతూనే వున్నాడు, తన జేబు రుమాలు కేసి చూశాడు, మళ్లీ ముఖపు ముడతలమీదనుంచి కన్నీళ్లు జారిపోయాయి.

''నేను యేడుస్తున్నాను'' అన్నాడాయన. ''నేను వృద్ధుణ్ణి. భయంకరమైన దేన్ని గురించి ఆలోచించినా నా హృదయం దడదడ మంటుంది.''

తర్వాత నన్ను మెల్లిగా పొడుస్తూ:

''మీరు కూడా యెక్కువ కాలం బతుకుతారు. అయినా ప్రతీదీ మారకుండానే వుండిపోతుంది. మరి మీరు కూడా యిప్పుడు నేను యేడ్చేదానికంటే కసిగా, రైతు ఆడవాళ్లు అన్నట్టు, ఎక్కువ 'కన్నీరు మున్నీరు'గా యేడుస్తారు.... కాని ప్రతిదాన్ని గురించి రాయాల్సిందే, ప్రతిదాన్ని గురించీ. లేకపోతే ఆ చక్కని జుట్టు వున్న చిన్న కుర్రాడు కష్టపెట్టుకుంటాడు, వాడు మిమ్మల్ని నిందిస్తాడు — అది సత్యం కాదు, అంటాడతను — మొత్తం సత్యం కాదు. వాడు సత్యం అంటే పట్టుగా వుంటాడు.''

ఆయన మొత్తం కుదుపుకుని, బుజ్జగిస్తున్నట్టు అన్నాడు:

''సర్లెండి, యేదేనా చెప్పండి, మీరు బాగా మాట్లాడతారు. ఒక పిల్లవాణ్ణి గురించో, మీ గురించో యేదేనా చెప్పండి. మీరు కూడా ఒకప్పుడు పిల్ల

వాడే నన్నది నమ్మడం కొంచెం కష్టంగా వుంటుంది, మీరు అలాంటి వింత మనిషి. మీరు పుట్టడమే పెద్ద వాళ్లల్లాగా పుట్టారేమో. మీ ఆలోచనల్లో చిత్ర తరహాగా వుండేదీ, అపరిణతమైందీ చాలా వుంది. అయినా మీకు జీవితం గురించి చాలా యెక్కువ తెలుసు — మీకు యింక తెలుసుకోవాల్సిన అవసరం లేదు. వూఁ, యేదేనా చెప్పండి....''

ఆయన ఒక పైన్ చెట్టు వెల్లడిగా వున్న వేళ్లమీద సుఖాసీనుడయ్యాడు, పైన్ ఆకులమీద చీమలు కదలికల హడావుడి చూస్తూ.

యిక్కడ, ఉత్తర ప్రాంతం వాడికి వింతగా వైవిధ్యభరితంగా వున్న ప్రకృతి మధ్య పుష్కలంగా, నిర్లజ్జగా ధారాళంగా పెరిగిన వృక్షతతి మధ్యలో కూర్చున్నాడు లియో టాల్‌స్టాయ్. ఆయన నామమే ఆయన ఆంతరిక శక్తి*కి సూచకంగా వుంది — చిన్న మానవుడు, తనేదో ముతక, గంభీర భూగర్భ వేరు అయినట్టు మెలితిరిగి ముడతలు పోయినవాడు. ఆడంబరంగా వుండే క్రైమియా ప్రకృతి మధ్య, నేను మళ్లీ అంటున్నాను, ఆయన తన సముచిత స్థానంలో వున్నట్టు, అదే సమయంలో స్థానభ్రంశం చెందినట్టు కనిపించాడు. చాలా పురాతన మానవుడొకడు, తన గ్రామీణ ప్రాంతం మొత్తానికి అధిపతి అయినవాడు — అధిపతీ, నిర్మాతా అయినవాడు, తనే స్థాపించిన ఆర్థిక వ్యవస్థకి ఒక వంద సంవత్సరాల విరామం తర్వాత వచ్చినట్టు వుంది. తను మరిచిపోయింది యెంతో వుంది, తనకి కొత్తదైంది యెంతో వుంది; విషయాలు వుండాల్సినట్టే వున్నాయి, కాని సరిగ్గా కాదు, యేది వుండాల్సినట్టు లేదో యెందుకనో వెంఠనే తను గమనించాల్సినట్టు వున్నాయి.

అనుభవజ్ఞుడైన భూచరుడి లాగా ఆయన వేగవంతంగా, హడావుడిగా వుండే నడకతోటి దారుల్లో అటూ యిటూ తిరుగుతున్నాడు. ఒక రాయి గాని, ఒక ఆలోచన గాని దృష్టి పథంలోనుంచి తప్పిపోలేని ఆయన నిశిత దృక్కు కొలత వేస్తూ పరీక్షిస్తూ, తులనాత్మకంగా పరిశీలిస్తూ చూస్తోంది. ఆయన తన నిరంతర ఆలోచన అనే సజీవ బీజాల్ని విత్తుతున్నాడు. ఆయన సులెర్‌జీత్‌స్కీతోటి అన్నాడు:

''నువ్వు యేం చదవవు సులెర్‌జీత్‌స్కీ, అది చాలా చెడ్డది, స్వాతిశయం. గోర్కీ తెగ చదువుతాడు, అదీ తప్పు — ఆత్మ విశ్వాసం లేకపోవడం. నేను తెగ రాస్తాను, అదీ సరిగాదు యేమంటే నేను వార్ధక్యపు దాంభికం వల్ల, ప్రతి

---

* లియో — సింహం, టాల్‌స్టాయ్ — దృఢం. — అను.

వాళ్లనీ నాకు లాగానే ఆలోచించేటట్టు చెయ్యాలనే కోరిక వల్లా అలా రాస్తాను. నా ఆలోచనా విధానం నాకు ఒప్పే కానప్పు, అది గోర్కీకి తప్పుగా కనిపించినా గానీ. సరే, నువ్వు అసలు ఆలోచించనే ఆలోచించవు, కళ్లు చికిలించి చుట్టూరా చూస్తావు దేన్నైనా పట్టుకునేందుకు. నీకు సంబంధం యే సూత్రం లేని వాటిని పట్టుకుంటావు — నువ్వు తరచుగా అలా చేశావు. నువ్వు పట్టుకుని వేలాడతావు. నువ్వు పట్టుకుని వేలాడే వస్తువు నీ నుంచి జారిపోతూ వుంటే, దాన్ని వది లేస్తావు. చేహొవ్‌ది మంచి కథ వుంది — ''ది డార్లింగ్'' — నువ్వు అందులోని ఆడమనిషి లాంటి వాడివి.''

''యేరకంగా?'' అని నవ్వాడు సులెర్‌జీత్‌స్కీ.

''నువ్వు ప్రేమించడానికి యెప్పుడూ తయారుగానే వుంటావు కాని యెంచు కోవడం యెలాగో నీకు తెలీదు. నీ శక్తిని చిల్లర విషయాలమీద వెదజల్లేస్తావు.''

''ప్రతివాళ్లూ అంతే కాదేమిటి?''

''ప్రతివాళ్లూనా?'' ఖంగుమన్నాడు టాల్‌స్టాయ్. ''ఉహుం, కాదు — ప్రతివాళ్లూ కాదు.''

హఠాత్తుగా ఆయన నా మీద విరుచుకు పడ్డాడు:

''మీరు దేముణ్ణి యెందుకు నమ్మరు?''

''నాకు విశ్వాసం లేదు.''

''అది నిజం కాదు. మీరు స్వతహాగా విశ్వాసం వున్నవాళ్లు. దేవుడు లేకుండా లాక్కురాలేరు మీరు. త్వరలోనే మీకు అది అనుభూతం అవుతుంది. మీరు నమ్మరు, యేమంటే మీరు మొండి వాళ్లు కాబట్టి, మీరు విసుగు చెందిన వాళ్లు కాబట్టి — మీకు యిష్టమైన రీతిలో ప్రపంచం తయారయి లేదు. కొంత మంది సిగ్గువల్ల నాస్తికులుగా వుంటారు. యువకులు ఒకో అప్పుడు అలా వుంటారు. వాళ్లు కొంత మంది ఆడవాళ్లని ఆరాధిస్తారు, కాని దాన్ని ప్రద ర్శించుకోవడం భరించలేరు. అపార్థానికి గురవుతామేమోనని భయపడతారు, పై పెచ్చు వాళ్లకి ధైర్యం లేదు. విశ్వాసానికి, ప్రేమ లాగానే, ధైర్యం కావాలి, సాహసం కావాలి. మీరు మీ అంతట అనుకోవాలి: 'నేను విశ్వసిస్తున్నాను' అని. మరి ప్రతీదీ చక్కబడుతుంది. ప్రతీదీ యెలా వుండాలని మీరు కోరుకుంటారో అలా వుంటుంది. ప్రతీదీ మీకు విశదం అవుతుంది, మిమ్మల్ని ఆకర్షిస్తుంది. ఉదాహ రణకి మీరు ప్రేమించేది చాలా వుంది. విశ్వాసం అనేది ప్రేమ తీవ్రతరమైనటు వంటిదే. మీరు యింకా యెక్కువ ప్రేమించాలి, ప్రేమ విశ్వాసంగా మారుతుంది. మగాళ్లు ప్రేమించేది ప్రపంచంలో యెప్పుడూ అత్యుత్తమమైన స్త్రీలనే, ప్రతి

వాడూ ప్రపంచంలో అత్యుత్తమమైన స్త్రీనే ప్రేమిస్తాడు. మరి అదుగో అక్కడే వుంది – అదే విశ్వాసం. నాస్తికుడు ప్రేమించలేడు. వాడు యివాళ ఒకళ్లని ప్రేమిస్తాడు, ఓ యేడాది కాలంలో యింకొకళ్లని ప్రేమిస్తాడు. అలాంటి వాడి చిత్తం తిరుగుబోతుది. అది గొడ్డుది, అది ఒప్పు కాదు. మీరు విశ్వసించే వాళ్ళుగా జన్మించారు, మీ ప్రకృతికి విరుద్ధంగా పోవడం కోసం ప్రయత్నించి లాభం లేదు. మీరు యెప్పుడూ అంటూనే వున్నారు – సౌందర్యం అని. సౌందర్యం అంటే యేమిటి? అత్యుత్తమమైందీ, పరిపూర్ణమైందీనీ – భగవంతుడు."

అంతకు ముందు ఆయన యెప్పుడూ నాతో యీ విషయాల గురించి మాట్లాడలేదు, ఆ విషయపు ప్రాముఖ్యం, అనుకోకుండా అది రావడం నన్ను నిశ్చేష్టితం చేసి, దాదాపుగా నన్ను ముంచేత్తేశాయి. నేను యేమీ అనలేదు. సోఫా మీద కూర్చుని, కాళ్ళు మడిచి గడ్డం పై నుంచి ఒక విజయసూచక మంద హాసం దోగాడగా నా కేసి ఒక వేలు చూపిస్తూ అన్నాడు:

"యేం చెప్పకుండా దాన్నుంచి మీరు తప్పించుకోలేరు తెలుసా!"

నేను, భగవంతుణ్ణి నమ్మని వాణ్ణి, దొంగగా, దాదాపు పిరికిగా వుండే చూపుతో ఆయన కేసి చూసి నాలో నేనే అనుకున్నాను:

"యీ మానవుడు దేవుడిలా వున్నాడు."

# ఫెనిమోర్ కూపర్ ''ది పాథ్‌ఫైండర్''కి ముందుమాట

''ది డీర్‌స్లేయర్'', ''ది పాథ్‌ఫైండర్'', ''ది లాస్ట్ ఆఫ్ ది మోగికాన్స్'', ''ది లెదర్‌స్టాకింగ్ సీరీస్'', ''ది ప్రెయిరీ''—యీ అయిదూ కూడా న్యాయంగానే ఫెనిమోర్ కూపర్[97] అత్యుత్తమ కృతులు. వంద యేళ్లక్రితం అవి ప్రచురితమవగానే తక్షణమే అమెరికాలో, యూరప్‌లో ఆదరణ పొందాయి. మన ప్రఖ్యాత విమర్శకుడు వి. బెలీన్‌స్కీ[98] వాటిని చదివి ముగ్ధుడైపోయాడు. 19వ శతాబ్దపు పూర్వార్థంలో చాలా మంది ప్రముఖ రష్యనులు పారవశ్యంతో వాటిని యెత్తేశారు.

ఉత్తర అమెరికా రాష్ట్రాల వలసల చరిత్రని వర్ణించే సత్యపూరిత, సౌందర్యమయ చిత్రాలుగా ఫెనిమోర్ కూపర్ నవలలకి కాలం గడిచినా ఆసక్తి తగ్గలేదు. చురుకుమంతులైన ప్రజలు మానవ సంచారమెరగని అడవుల్లో, బిక్కుబిక్కుమనే మైదానాల్లో, ఎర్ర ఇండియన్ ద్రిమ్మర తెగలతో యెలా ఒక వందా యాభై సంవత్సరాల కాలంలో ఒక శక్తివంతమైన రాజ్యాన్ని వ్యవస్థీకరించారో మనకి చెప్పే టటువంటి బోధనాత్మక చరిత్ర అది.

యీ అయిదు పుస్తకాలూ కూడా నాట్టీ బంపో అనే స్వేచ్ఛాయుతుడైన వేటగాని వ్యక్తిత్వంతో సంధించబడి వుంటాయి. పాఠకుడికి యీ వింత మనిషి ''ది డీర్‌స్లేయర్''తో పరిచయమవుతాడు. అతను నిరక్షర కుక్షి, అనాగరికుడు. కాని అతనికి అత్యుత్తమమైన స్థాయిలో నిజంగా సంస్కారవంతుడైన వాడి అచ్చాణీ లక్షణాలు వుంటాయి—ప్రజలతోటి తన సంబంధాలలో వేలెత్తి చూపించలేని నిజాయితీ; యేదీ కూడా ఛిన్నం చెయ్యలేని ప్రేమ; తన పొరుగువాడికి సాయపడాలన్న నిరంతర, సహజ కామన, అతనికి జీవితాన్ని సుఖవంతం చెయ్యాలని యెంతేనా శ్రమ పడడం.

నాట్టీ బంపో నిజమైన మనిషేననీ, నిజంగా వున్నవాడేననీ ఫెనిమోర్ కూపర్

తన ముందుమాటలలో రాశాడు, కాని దానివల్ల పాఠకుడికి పెద్ద లాభించేది లేదు. యేమంటే మానవుడిలో అచ్చమైన మానవ దృక్పథాన్నీ, అనుభూతుల్నీ పెంపొందించడంలో వూహించిన, భావనాత్మక సంఘటనలూ, విషయాలూ నిజంగా జరిగిన వాటికంటే యేమీ తీసిపోవు. ఒక ఆదర్శంవల్ల చోదకం అయితే, యింకా ఉనికిలో లేకపోయినా భావనాత్మకంగా రూపం తీసుకోబోయే దానివల్ల చోదకం అయితే జీవితం మరింత మంచి స్థితికి పోతుంది.

యదార్థం అనేది యెప్పుడూ కూడా ఒక ఆదర్శానికి రూపమే. దాన్ని నిరాకరించి, మారుస్తున్నామూ అంటే మనం అందులో రూపొందించిన ఆదర్శం యిక యెంత మాత్రమూ మనకి తృప్తికరంగా లేదు గనక, మనకి మన వూహలో సృష్టించుకున్న మరో గురుతరమైన ఆదర్శం వుంది కనకా. అంచేత నాట్టీ బంపో అనే వ్యక్తి రక్తమాంసపుష్టంగా అమెరికాలో నిజంగా వున్నాడా లేదా అనేది ముఖ్యం కాదంటాను. అసలు విషయం యేమిటంటే ఆ అయిదు పుస్తకాలూ, అత్యుత్తమ మానవ గుణాల సాకార రూపంగా అతని జీవితాన్ని గురించి రాయడం జరిగింది.

మొదటి పుస్తకంలో లేళ్ల వేటగాడుగా, రెండవ పుస్తకంలో మార్గాన్వేషిగా, మూడవ పుస్తకంలో మోగికాన్ల కడపటి నాయకుడి నిజమైన మిత్రునిగా, నాలుగవ దాంట్లో ''లెదర్‌స్టాకింగ్'' వానిగా కడపటి దాంటో యేకాంత, వృద్ధ మృగరోమ వ్యాపారిగా నాట్టీ బంపోని అతని ఆలోచనల నిజాయితీపూర్వకమైన అమాయకత్వానికీ, అతని కృత్యాలలోని సాహసానికీ ప్రతి చోటా పాఠకుడు అభిమానిస్తాడు.

'నూతన ప్రపంచపు' అరణ్యాల్లో, మైదానాల్లో జనానికి అతను నూతన పుంతలు తొక్కాడు. మరి యీ మనుషులు తర్వాత అతన్ని, అతని స్వేచ్ఛా భావానికి అవగతం కాని వ్యాపార ధర్మాల్ని అతిక్రమించినందుకుగాను, నేరస్థునిగా తీర్పు చేశారు. అనాగరికులైన ప్రజల దేశంలో పాదార్థిక సంస్కృతిని భౌగోళికంగా వ్యాప్తి చెయ్యాలనే మహా యత్నం అని తనకి తెలియకుండానే అతను తన యావజ్జీవితమూ దానికి సేవచేశాడు. కడకి, యీ సంస్కృతిలో, తనే తొలి మార్గాన్వేషకుడైన దాంటో, ఆ పరిస్థితుల్లో అతను జీవించలేకపోతాడు.

అది తరచుగా పథనిర్దేశకుల విషయంలో జరిగే విషయమే. జీవితాన్ని అధ్యయనం చెయ్యడంలో వాళ్లు తమ సమకాలికులకంటే యెక్కువ గాఢంగా దూరం పోతారు. యీ అర్థంలో, నిరక్షరుడైన నాట్టీ బంపో ఒక ప్రతీకలాగా వుంటాడు; మన జీవితాలని సంపద్వంతం చెయ్యడంలో యెంతగానో బాధలు పడి, మహత్కార్యాలు చేసిన మానవాళి సిసలైన మిత్రుల కోవలో అతను కలుస్తాడు.

ఫెనిమోర్ కూపర్ పుస్తకాలకి వున్న బోధనాత్మక ప్రాముఖ్యం నిర్వివాదమైంది. దాదాపు ఒక వంద సంవత్సరాలుగా అవి అన్ని దేశాల్లోని యువజనానికీ అభిమాన పాత్రమైన పుస్తకాలు. రష్యన్ విప్లవకారుల స్మృతులలో యీ రచయితని ఉటంకించడం మనకి తరుచుగా కనిపిస్తుంది. ఆయన నవలలు ఒక ఆత్మగౌరవాన్నీ, సాహసాన్నీ, కార్యాచరణ ప్రేరణనీ వాళ్లల్లో బాగా పెంపొందించాయి.

# ఎన్. లెస్కోవ్

నికొలాయ్ లెస్కోవ్[99] ఒరేల్‌లో పుట్టాడు. లెస్కోవ్ తాత పురోహితుడు. మామ్మ వర్తకుని కుటుంబంనుంచి వచ్చింది. తండ్రి సుమాస్తా. తల్లి గొప్ప కుటుంబీకురాలు. ఆ రకంగా నాలుగు సాంఘిక అంతస్తులు ఆయనకి రక్తంలో కలిసి వున్నాయి. యేమైనా అయిదవ సాంఘిక అంతస్తుకి చెందిన వ్యక్తి ఆయనమీద అత్యంత ప్రభావం కనబర్చడం జరిగి వుండవచ్చు. ఆ వ్యక్తి అతని భూస్వామ్యదాస్య దాది — ఒక సైనికుని భార్య. ఆమె కథలు ఒకో అప్పుడు జీవితపు పుల్లని జెల్లీకి జతచేసిన తీపి పదార్థంలాగా, ఒకో అప్పుడు జీవితపు జిగటైన సూకరత్వానికి రుచికలిగించే మసాలాలాగా వుంటూ వుండేవని లెస్కోవ్ తనే అన్నాడు.

మరీ పసితనంనుంచీ ఆయన మామూలు మనుషుల్ని యెరుగును. ముప్పై యేళ్లు నిండక ముందే ఆయన రష్యా అంతా తిరిగాడు. స్తైప్ గుబేర్నియాలు చూశాడు. యెంతో కాలంగా ఉక్రేయిన్‌లో వుంటున్నాడు — కొంచెం భిన్నమైన జీవిత విధానం, భిన్నమైన సంస్కృతీగల ప్రాంతం. పరాయి దేశంలో వుండటం అంటే యితరుల కళ్లతోటి మిమ్మల్ని మీరు చూసుకోవడమే. జీవితాన్ని గురించిన పుస్తక పాండిత్యంగాక ప్రజల జీవితపు నిజమైన పాండిత్యం సంతరించుకుని ఆయన ఓ రకంగా పరిణతి చెందిన వయసులోనే రచయిత అయాడు. 'ప్రజల ఆత్మ' అని పిలిచే సూక్ష్మమైన దాన్ని అనుభూతం చేసుకున్నాడు.

లెస్కోవ్ సాహిత్య జీవితం ఒక బాధాకరమైన ఘటనతో మొదలైంది. రష్యన్ సంస్కారవంతులు ఒకొళ్లనొకళ్లు యెక్కువ శ్రద్ధతోటీ, జాగ్రత్తతోటీ చూసుకుని వుండినట్లయితే అలా జరిగివుండేది కాదు. యిది యిప్పటిదాకా అవసరమే యేమంటే మన దేశంలో చాలా తక్కువ మంది మేధావులు వున్నారు. పీటర్స్‌బుర్గ్‌లో వుంటున్న మొదటి సంవత్సరంలోనే లెస్కోవ్ హృదయం చితికిపోయింది, అలాంటిది ఆయనకి సంభవించ కూడనటువంటిది.

1862 వేసవిలో అనేక అనుమానిత అరణ్యాగ్నులు పీటర్స్‌బుర్గ్ శివారుల్లో చెలరేగాయి. దహన కాండలు జరుగుతున్నాయన్న వదంతి వ్యాపించింది. అడవులకి అగ్గి పెట్టిన వాళ్లేమో విద్యార్థులట. ఆ దహనాలలో విద్యార్థుల పాత్ర వుంటే ఖాయమైన రుజువు యిమ్మనీ, లేనట్లయితే మరే మాత్రం ఆలస్యం చెయ్యకుండా, నిర్ద్వంద్వంగా ఆ అపవాదుని ఖండించమనీ అధికారులని అడుగుతూ లెస్కోవ్ వార్తాపత్రికలో ఒక వ్యాసం రాశాడు. కొంతమంది తేలిక మనుషులు ఆ వ్యాసానికి చిత్రమైన వ్యాఖ్య యిచ్చారు. ఖాయిదా పెట్టలేని విద్యార్థులు దహనాలు చేస్తున్నారని లెస్కోవే ఆరోపిస్తున్నట్టున్నట్టు ఆ వ్యాసం వుందట. చాలా సార్లు యీ విషపూరిత అభిప్రాయాన్ని ఖండించ ప్రయత్నించాడు లెస్కోవ్. కాని యెవళ్ళూ ఆతన్ని విశ్వసించలేదు, యేమంటే ఒక వ్యక్తిని నిర్దోషిగా చెయ్యడం కంటే ఆతన్ని ఖండించడం చాలా సులభమూ, సంతోషదాయకమూ కూడానూ.

అసంబద్ధమైన యీ నిందతోటి యెంతగానో గాయపడి, సాహిత్య ప్రపంచంలో యింకా ఓనమాలు దిద్దుకుంటున్న వాడిగా పరాయి వాడిగా వుండి, స్నేహితులుగాని, ఆసరా వచ్చేవాళ్లుగాని లేక లెస్కోవ్ తనని తాను సమర్థించుకోలేక పీటర్స్‌బుర్గ్ వదిలిపెట్టి మొదట ప్రాగ్‌కి తర్వాత పారిస్‌కి వెళ్లిపోయాడు. అక్కడ ఆ అవమానంవల్ల బాధపడుతూ ఆయన దురదృష్టవశాత్తూ పగని వెల్లడి చేస్తూ ''యెక్కడా లేదు'' అనే పుస్తకం రాశాడు. అది ఓ రకంగా ఆ రోజు ఘటనం కథనం. యీ పుస్తకంలో పద్దెనిమిది వందల అరవైల నాటి మేధావివర్గాన్ని తీవ్రమైన ద్వేషంతో చిత్రించడం జరిగింది. ఉదాహరణకి వి. స్లెప్‌త్సోవ్[100]లాంటి రచయితని, ''గడ్డు రోజులు''లాంటి మంచి కథని రాసిన వాణ్ణి తప్పుగా చూపించడం జరిగింది. మొదటగా ''యెక్కడా లేదు'' చవకబారుగా రాసిన పుస్తకం. దాన్ని చదివినట్లయితే, తను రాస్తూ వున్న వాళ్ల గురించి రచయితకి యేమంత సరిగా తెలియదు అని యెవరికేనా అనిపిస్తుంది. నిహిలిజాన్ని ఖండించే కర్తవ్యంతో రాసింది యీ పుస్తకం. ఆ రోజుల్లో యువకుల మనస్థితిని తెలియజేసే దానికి పేరు అదీ. యుగయుగాల బానిసత్వంనుంచి అప్పుడే విముక్తమైన దేశపు గతంతోటి గల సకల బంధనాలనీ ఒక్క దెబ్బతో తెంచుకుందామనీ, రాజకీయ, మతపర పీడనల అన్ని పారలనీ — ముఖ్యంగా మొదటి నికొలస్[101] పాలనలో అసంబద్ధంగా, భారంగా వున్నాయి అవి — చీల్చాలనీ యువకులకి గల సాహసోపేతమైన కామననుంచే నిహిలిజం ఉద్భవించింది.

సంస్కరణాత్పూర్వ జీవితపు కుళ్లు, దుర్గంధపూరిత బురదనుంచి బయటపడాలని యువజనంలో వున్న యీ వీరోచిత తీవ్ర వాంఛలలో ఒక ఆరోగ్యకరమైన

అంశం వుంది. లెస్కోవ్ దాన్ని అర్థం చేసుకోవడంలో విఫలం అయాడు, వాళ్ల తీవ్ర ప్రవర్తనలోని అసలైన అర్థాన్ని సరిగా అంచనా వెయ్యలేకపోయాడు. కాని మనకి గతం గూనిలాంటిదనీ ఒక వ్యక్తి నిరంతర, జాగరూకతగల సాహసిక ప్రయత్నంవల్ల మాత్రమే నిటారుగా నిలబడగలడనీ, ఆయన జిజ్ఞాసాత్మక, నిగ్రహ శక్తి గల ధీశక్తి, గ్రహించింది. ఒక్క యిచ్ఛా ప్రయత్నంవల్ల చరిత్ర ఘన భారాన్ని తమ భుజాలమీదనుంచి విసిరేసుకున్న వాళ్లు రష్యాలో కొద్ది మందే వున్నారు. గతంనుంచి "కొత్త జనం" గ్రహించిన ప్రతిదాన్నీ లెస్కోవ్ చూశాడు. కాని వాళ్లల్లో భవిష్యత్తుకి విలువైన దాన్ని చూడలేదు. "యెక్కడా లేదు" అనే నవలలో దాదాపు ప్రతి ఒక్కళ్లూ కూడా పరిహాసాస్పదంగా, అసహ్యకరంగా వున్న దుష్టులుగానే వున్నారు. అందరూ కూడా వాస్తవంతో సంబంధం లేకుండానే వున్నారు. వాళ్లు నిస్సహాయులు, వాగుడు పిట్టలు, దంభాలకోరులు, యెక్కడికీ పోలేరు.

కాని యీ పుస్తకంలో వున్న ఒక ముఖ్యమైన విషయం యేమిటంటే దయ నీయమైన, వంచకులైన యీ గుంపులో లెస్కోవ్ తన మనసుకి సరిపడిన ఒక నాయకుణ్ణి చూశాడు. యీ పుస్తకపు నాయకుడు రైనర్. అతను ఆదర్శవాది; కొంచెం తిక్క మనిషి ; కొంచెంగా చెర్నిషేవ్‌స్కీ[102] ప్రఖ్యాత నవల "యేం చెయ్యాలి?"లోని రహ్‌మేతొవ్‌ని పోలివుంటాడు. యీ రైనర్ తనని సోషలిస్టు అని పిలుచుకుంటాడు, రష్యాలో బహిరంగంగా విప్లవ ప్రచారం చేస్తూ వుంటాడు. అతను 1863నాటి పోలిష్ తిరుగుబాటు యుద్ధంలో ఒక వీరుడిలాగా చనిపోతాడు. లెస్కోవ్ అతన్ని ఔన్నత్య పరివేష భరితుణ్ణి చేస్తాడు, దాదాపు ఋషి కల్పునిగా. అయినాగానీ ఆ నవల అందరికీ ఆగ్రహ ప్రేరకమైంది, ఒక అపవాదుగా పరి గణించబడింది. సిసలైన విప్లవకారులకి అది ఆమోదయోగ్యంగా కనిపించలేదు. ముక్త కంఠంతో దాన్ని శపించడం జరిగింది. అది యే మేరకి వచ్చిందంటే, ఆ ప్రసిద్ధ సాహిత్య విమర్శకుడైన పీసరెవ్[103] ఒక వ్యాసంలో ప్రశ్నించాడు: "లెస్కోవ్‌తో పాటుగా రాసి, ఒకే పత్రికలో తన రచనని ప్రచురించడానికి అంగీకరించే నిజాయితీపరుడైన రచయిత యెవడేనా వున్నాడా?"

అది చంపడం లాంటిది. కసితో నిండిపోయి, రెచ్చిపోయి లెస్కోవ్ యే రకంగా చూసినా గానీ చెడ్డది అయిన "దూసిన కత్తులు" అనే పెద్ద నవలని తొందరపాటుతో రాశాడు. యీ నవలలో నిహిలిస్టులని "యెక్కడా లేదు"లో కంటే అధ్వాన్నంగా చూపించడం జరిగింది. వాళ్లని యెంత మబ్బుగా, తెలివిహీనంగా, నిస్సహాయ రీతిలో చిత్రించడం జరిగిందంటే, పగ మూఢత్వం కంటే గహన మైందనీ, అనార్ద్రమైందనీ లెస్కోవ్ చూపించదలచుకున్నాడా అనిపిస్తుంది. యీ

హీనంగా క్రూరంగా రష్యా అనే పేరుతో వున్న దేశాన్ని, సకల వర్గాల, శ్రేణుల జనులూ ఒక్కలాగా అసంతృప్తితో నున్న ఆ దేశాన్ని, ఉత్సాహపరిచి, ఉత్తేజితం చేసే కర్తవ్యం పెట్టుకున్నాడా అన్నట్టు చేశాడు. ఆ పాపిష్ఠి దేశాన్ని ప్రేమించాలి, యెలా ప్రేమించాలంటే ప్రతి రోజూ ప్రతి ఘడియా యీ ప్రేమ వల్ల హృదయం రక్తం చిందించి బాధ పడుతున్నట్టు; తీవ్ర హింసా రిరంసగలవాడి వల్ల ఒక అమాయకుడు హింసకి గురైనట్టు కనిపించే లాంటి ప్రేమ.

తనకి ముందు యెవరికీ లేనంతగా, ఒక వ్యక్తికి పశ్చాత్తాపానికీ, లాలనకీ గల హక్కుని లెస్కోవ్ అర్థం చేసుకున్నాడు. యెలా పశ్చాత్తాప పడిచి, లాలించాలో ఆ వ్యక్తి తెలుసుకుని వుండాలి. అతను రష్యన్ పవిత్ర విదూషకుల జీవిత దృశ్యాలని వర్ణించాడు. అతని నాయకులు అనుమానాస్పద పవిత్రత వున్న వాళ్లన్నది నిజమే, యేమంటే వాళ్లు తమ మోక్షాన్ని గురించి యెన్నడూ ఆలోచించిన వాళ్లు గారు. వాళ్లు నిరంతరంగా తమ పొరుగు వాళ్ల మోక్షం గురించీ, పశ్చాత్తాపం గురించీ చీకు పడతారు. వాళ్లు పాపరహిత, సౌందర్యపూరిత స్వర్గ జీవితానికి పవిత్రీకృతం చెయ్యమని ప్రభువుని ప్రార్థించేటందుకు గాను థెబేల యెడారుల్లోకీ, దట్టమైన అడవుల్లోకీ, గుహల్లోకీ, యేకాంత ఆశ్రమాల్లోకీ యీ ప్రపంచాన్ని వదలిపెట్టి పారిపోరు. వాళ్లు వివేకం లేకుండా ప్రాపంచిక జీవితపు రొంపిలోకి జారతారు. అక్కడ రక్తసిక్తమై, దురాశతోటీ, అన్యాయతోటీ మూలుగుతూ, క్రౌర్యంలోనూ, దౌష్ట్యంలోనూ రాక్షసులతో సమ మవ ప్రయత్నిస్తూ, మానవుడు పొర్లుతున్నాడు. వాళ్లు బహుశా, భగవంతుణ్ణి జ్ఞేయం చేసుకోవాలనే ప్రయత్నంలో మానవుణ్ణి గురించి మరిచిపోయే పూజ్యులైన ఆధ్యాత్మిక, ఐహిక సన్యాసుల్లాగా యేమీ చెయ్యలేరు, లేదా అంత తక్కువ చేస్తారు. మానవ జీవితంలో క్రౌర్యం పాలు తగ్గించలేని భగవంతుని అనౌదార్య వివేచన తాలూకు నిస్సహాయతని సమర్థిస్తూ ఈ సన్యాసులు దాక్షిణ్యంలేకుండా మానవుణ్ణి నిందిస్తారు.

నిగ్రహ శక్తి వుండి, సంశయాత్మమైన లెస్కోవ్ మనసు ప్రతిదాన్నీ సందేహిస్తుంది. కాని రష్యాని సమర్థించే పనిని పెట్టుకుని, పాపుల సౌకర్యార్థం దాని ఋషుల ప్రీతియోగ్యమైన ప్రతిమలని తయారు చెయ్యాలని లెస్కోవ్ తన మనస్సు కాక, తన హృదయాన్ని ఉపయోగించాడు. అందుకనే వాన్స్‌కోక్, రైనర్ యింకా అలా మనుషుల పట్లా, జీవితం పట్లా ప్రేమతో సమ్మోహితులైన వాళ్లంతా, యీ ప్రపంచపు ద్రిమ్మరులంతా యెంత జీవశక్తితో వుంటారంటే వాళ్లు నిష్పక్షపాతంగా, ఆలోచనాయుతంగా వుండే పాఠకుడి హృదయాన్ని స్పష్టంగా స్పందింప చేస్తారు.

పద్దెనిమిది వందల డెబ్బైయ్యవ దశకంలో లెస్కోవ్ ''సొబొర్యానె'' అన్న తన ఉజ్వల నవలని రాసినప్పుడు అతను ఒక దాని తర్వాత ఒకటిగా తన చిత్తర మారి కథలని ప్రచురించ ప్రారంభించినప్పుడు రష్యన్ సాహిత్యపు ప్రధానమైన, ఒకేఒక నాయకుడు, రష్యన్ రైతు, అయినట్టు అనిపిస్తుంది. దాదాపు అందరు రచయితలూ, పత్రికా విలేకరులూ ప్రజల బుద్ధిని గురించీ, ఆప్యాయతని గురించీ పొగడ్తల బృందగానం చేశారు. బానిసత్వపు బంధనాలనుంచి విముక్తి అయిన ప్రజలు తమ శక్తివంతమైన రెక్కలని చాచి ఆధ్యాత్మిక, పౌర స్వేచ్ఛల వైపు గరుడునిలా యెగిరిపోతారని మేధావివర్గం వూహించింది. ఆ రోజుల్లో మేధావివర్గం పట్ల తెలివితక్కువ అధికారులకి బలమైన అపనమ్మకం వుండేవి. మేధావివర్గం శక్తుల్ని ఉపయోగపెట్టాలనే కోరిక వాళ్లకి లేదు, కనీసం అలాంటి కోరిక వున్నా యెలా ఉపయోగించాలో తెలీదు. వెనకబడిన, అనాగరిక వ్యాపార, పారి శ్రామిక ప్రపంచంలో మేధావులకి సావకాశమూ లేదు. నిర్దయాపూరిత, జడ రాచ రికాన్ని రాజ్యాంగ పద్ధతులద్వారా మార్చాలని మేధావులు కలలు కంటూ వుండే వాళ్లు. రైతు నిన్నటి బానిస అయినా, గ్రామ సమాజపు సభ్యుడుగా ప్రాతినిధ్య ప్రభుత్వపు ప్రయోజనాలని గురించి బాగా తెలుసుకుని వుంటాడని వాళ్లు నిశ్చ యంగా అనుకున్నారు. రష్యన్ గ్రామాల్లో విజ్ఞానదాహం వుందని వాళ్లు మన స్ఫూర్తిగా నమ్మారు. అందుకనే వాళ్లు భక్తితోటి తమ ఉత్తమ ఆలోచనలనీ, అనుభూతులనీ, పుస్తకాలనుంచి తొందర తొందరగా తీసుకున్న ప్రతిదాన్నీ గ్రామా లకి తీసుకునివచ్చారు. డజన్ల కొద్దీ యువకులు గ్రామాలకి వెళ్లిపోతూ వుంటే, ''సాహసోపేతమైన కృత్యాలు చెయ్యడానికి నిస్సంకోచంగా, నిర్భయంగా''104 వెళ్లిపోయే వాళ్ల గౌరవార్థం రచయితలూ, పత్రికావిలేకరులూ ఔత్సుక్యభరిత గద్య, పద్యాల్లో వీడ్కోలు ఉపన్యాసాలు చెప్పారు.

నాస్తికులు జీవిత లక్ష్యం కోసం అయోగ్యమైనట్టే ఆస్తికుల్లోని అధిక సంఖ్యాకులూ అంతే అసహనంతో వున్నారు. రష్యన్ ప్రజల మత భావాలు చాలా తీవ్రమైనవికాగా, మన నిహిలిస్టులు కూడా తమ పిడిసూత్రంలో మూర్ఖంగా నమ్మకం పెట్టుకున్న వాళ్లే. ఒక వ్యక్తి పట్ల మనుషుల ప్రేమానురాగాలు చాలా నీరసంగా వుండేవి, అందుకనే వాళ్లు లెస్కోవ్‌ని అర్థం చేసుకోలేకపోయారు. సంశయవాదిగా వున్నా ఆయనకి యుక్తమైన, జాగరూకతగల ప్రేమ అనే అపు రూపమైన వరం వుండింది. మానవుడి శతధా భిన్నమైన, అమితమైన బాధలని గాఢంగా ఆయన అనుభూతం చేసుకోగలిగాడు. వున్న దాన్ని వున్నట్టుగా దాని ప్రాచీన జీవన విధానపు సకల అసంబద్ధతలతోటీ ఆయన రష్యాని ప్రేమించాడు.

బ్యూరాక్రట్లు పీల్చి పిప్పి చేసిన ప్రజల్నీ, అర్ధాకలితోటీ, అర్ధపానమత్తుతోటీ వున్న ప్రజల్ని ప్రేమించాడు. 'సకల సద్గుణాలనీ కలిగివుండటం సాధ్యం' అని చిత్తశుద్ధితో అనుకున్నాడు. కాని ప్రతిదాన్నీ ప్రేమిస్తూ కూడా ఆయన దేన్నీ చూడకుండా కళ్లు మూసుకోలేదు. అలాంటి వేదనాభరిత ప్రేమ సర్వహృదయ శక్తినీ తీసేసుకుంటుంది, ప్రతిఫలంగా యేమీ యివ్వదు. ఒక వింతరీతిలో యీ మానవునిలో విశ్వాసమూ, సందేహమూ, ఆదర్శవాదమూ, సంశయాత్మకతా మిళితం అయిపోయాయి.

పవిత్రతంగా, ఒక రకంగా రైతుని ప్రాకృతిక మహిమాన్వితం చేసేవాళ్ల మధ్య ఒక అసమ్మతీయుని పాషండ స్వరం ఖంగుమని మోగినప్పుడు, అది సామాన్యంగా విభ్రమాన్నీ, అపనమ్మకాన్నీ రెచ్చగొట్టింది. రష్యనులు యెక్కువ చదివారు. కాని యెక్కువ శ్రద్ధ, సామర్థ్యం లేకుండా చదివారు. 19 శతాబ్దపు ఆ డైబ్బైయ్యవ దశకంలో అలావాటుగానే మంచివిగా పరిగణించినప్పటికీ పాఠకుల ఆలోచనలతోటీ, అభిరుచులతోటీ ఛాందసంతోటీ పూరా తగినట్టే వుండేవి. అలాంటి పుస్తకాలు లెస్కోవ్ కథల్లో యేదో నూతనమైన దాన్నీ, ఆ కాలపు ధర్మశాసనాలకీ నరోదిజం ఆదేశాలకీ ప్రతికూలమైన దాన్నీ ప్రతి ఒక్కళ్ళూ భావించుకున్నారు. కొంతమంది యీ నూతనమైనదాన్ని ఒక విదూషకుడి వెటకారం అనుకున్నారు. కొంతమంది దాన్ని భూస్వామ్యదాస యజమానీ, ప్రగతి నిరోధకుడూ అయినవాడి కోపం అనుకున్నారు, మొత్తంమీద యెవళ్లకీ ఆయన కథల రూపం నచ్చలేదు. లెస్కోవ్ ప్రతివాళ్లకీ అయిష్టుడు అయేట్టు తయారయాడు. ఆయన యువకుల్ని నరోదిజంలో చేరమని రెచ్చగొట్టలేదు. తద్భిన్నంగా ''మస్క్ ఆక్స్'' అని పేరున్న విషాద కథలో యెవళ్లకేనా ఒక హెచ్చరిక కనిపిస్తుంది. ''ముందు చూసి మరీగెంతండి!'' మధ్యవయస్కులైన వాళ్లకి ఆయన కథలలో ''నాగరికమైన భావాలు'' కొంచెం ప్రకాశవంతంగా వ్యక్తమైనట్టు కనిపించలేదు. విప్లవ మేధావివర్గం ''యెక్కడా లేదు,'' ''దూసిన కత్తులు'' లాంటి నవలలు రాసినందుకు ఆయన్ని మర్చిపోలేకపోయింది, క్షమించలేకపోయింది. ప్రతి సాంఘిక అంతస్తులోనూ, ప్రతి గ్రూపులోనూ ఒక సాధుపుంగవుణ్ణి దర్శించిన రచయిత ప్రతి ఒక్కళ్లనీ సంతృప్తి పరచలేకపోవడం, ప్రతివాళ్ళూ అతన్ని అనుమానంతో చూడడం వల్ల పక్కకి జరిగిపోవడం వుంటుంది. ఛాందసులు, ఉదారవాదులు, తీవ్రవాదులు — అంతా కూడా అతన్ని రాజకీయంగా నమ్మదగని వానిగానే చూశారు. సిసలైన స్వేచ్ఛ అనేది పార్టీలకి యువతల యెక్కడనో వుందనడానికి యీ వాస్తవం మరో దాఖలా.

జర్మనీ దేశపు ఉత్తమ ప్రజాతంత్రవాదుల్లో ఒకడైన కవి హైనె,[105] "ప్రజల పట్ల ప్రేమ వున్న మనిషి, వాళ్లచేత స్నానం చేయించాలి" అని అన్నాడు. అలాంటి విద్వేషభరిత పరిహాసానికి హైనెని మన్నించినా, లెస్కోవ్ గుండె మంచి తన్న మాటలని ఆయన ఛాందసతత్వానికి రుజువుగా అంటగట్టారు.

మనుషులు రైతాంగపు స్వేచ్ఛాయుత ఆలోచనలోనూ, రైతాంగపు సాంఘిక న్యాయ వ్యామోహంలోనూ విశ్వాసం పెట్టుకోవలసిన అవసరం వుంది. మరి లెస్కోవ్ "మస్క్ ఆక్స్" లాంటి కథలు రాశాడు. ప్రతి కలప వర్తకుడూ తమ శత్రువే అని రైతుల్ని ఒప్పించేందుకు ఒక సెమినరిస్టు ప్రయత్నించడం యీ కథలో చూపించడం జరిగింది. రైతులు ఆ ప్రచారకుడి మాటలని అంగీకరిస్తారు: "అవును, మీరు చెప్పింది సబబే" అని. తర్వాత కొంత కాలానికే వర్తకుడికి తెలియచేస్తారు: "చూడండి, ఆయన తప్పు" అని. తను యెక్కడికి పోవడానికీ లేదని రూఢి ఆయాక, ('వర్తకుడు యెక్కడ పడితే అక్కడే వున్నాడు') పాపం, ప్రచారకుడు ఉరి పోసుకుంటాడు. అతను ఒక చెట్టుమీద ఉరిపోసుకుంటాడు. అతనిమీద నిఘా వుంచిన ఓ రైతు, ఉరిపోసుకున్న మనిషిని చూడ్డానికి వచ్చిన వర్తకుడితో అంటాడు: "అతను క్షీణించిపోవడానికీ, మీరు బతకడానికీ వున్నారు."

రైతులమీద విశ్వాసం వున్న యీ జనం అలాంటి కథలంటే యిష్టపడతారా? "నిర్లజ్జ" అనే కథలో, సెవస్తోపాల్ యుద్ధం[106] అప్పుడు యెక్కువ డబ్బు కాజేసిన కమిసరీ వుంటాడు. యుద్ధంలో వికలాంగులైన ఆఫీసర్లు అందుకుగాను అతన్ని నిందిస్తే అతను అంటాడు:

"పోరాడాలని చెప్పి మీకు రాసిపెట్టి వుంది, అంచేత మీరా పనిని అత్యుత్తమంగా చేస్తున్నారు. మీరు వీరులలాగా పోరాడి, చనిపోయి యూరప్ అంతా ప్రఖ్యాతులవుతున్నారు. మా పని మాకుంది. అలాంటి చోట్లే మేం కాజెయ్యగలిగింది. మేమూ యెంతగానో సాధించాం. మేం యెంత కాజేస్తున్నామంటే మేమూ ప్రఖ్యాతులవుతున్నాం. కాని, మాటకి, మనం ఒకళ్ల స్థానంలో యింకొకళ్లం మారాలని ఆజ్ఞా వచ్చిందనుకోండి. మమ్మల్ని కందకాల్లోకి పంపించి మిమ్మల్ని సరఫరాలకి నియమించినట్లయితే, అలాంటి సందర్భంలో మేము పోరాడుతూ వుండే వాళ్లం, మీరు కాజేస్తూ వుండేవాళ్లు."

నిర్లజ్జని గురించిన కథ చెపుతూ వుండే వ్యక్తి అంటాడు: "సిగ్గులేని వాళ్లే సబబు అనిపిస్తుంది." అలాంటి కథలంటే భూమ్మీద యెవళ్లు యిష్టపడతారు?

యీ మహా రచయిత జీవితం అలాంటిది. రచయితలనుంచీ, ప్రజలనుంచీ దూరంగా వుంటూ ఆయన ఒంటరిగా వున్నాడు, దాదాపు జీవితాంతం అపార్థానికి

గురయాడు. యిదిగో యిప్పుడు మాత్రమే ఆయన్ని యెంతో శ్రద్ధతో చూడ్డం జరుగుతోంది. అదీ సరిగా అదునులో, యేమంటే మనం మళ్లీ రష్యన్ ప్రజల గురించి గట్టిగా ఆలోచించాలి. మనం మళ్లీ రష్యన్ జీవలక్షణాన్ని గురించి తెలుసుకో ప్రయత్నించాలి.

సాహిత్యకారునిగా లెస్కోవ్‌ని లియో టాల్‌స్టాయ్, గోగొల్, తుర్గేనెవ్, గొన్చరోవ్‌ల[107] లాంటి రష్యన్ సాహిత్య స్రష్టల అంత ఉన్నతంగా గణింపదగ్గ యోగ్యత ఆయనకి వుంది. శక్తిలో, సౌందర్యంలో లెస్కోవ్ ప్రతిభ రష్యన్ గడ్డలోని పవిత్రశాసన స్రష్టల ప్రతిభకి యేమంత లొక్కుగాదు. జీవిత దృగ్విషయాల విస్తృతావగాహనలో, నిత్యజీవిత రహస్యాల గాఢ అవబోధనలో, రష్యన్ భాషాధికార సౌందర్యంలో లెస్కోవ్ మామూలుగా పైన చెప్పిన పూర్వులకి గాని, సాటి వాళ్లకి గాని తీసిపోడు. రష్యన్ సాహిత్యపు దిగ్దంతులకీ లెస్కోవ్‌కీ భేదం యేమంటే వాళ్లు సృజనాత్మక రీతిలో రాయడమే. వాళ్ల మాటలు మట్టి లాంటివి. దేవుళ్లలాగా వాళ్లు రూపరహిత పదార్థాన్ని ప్రజ అనే విగ్రహాలుగా, మూర్తులుగా మలిచారు. ఆ రూపాలు యెంత నమ్మలేనంత జీవంతో వుంటాయంటే, వాళ్ల పుస్తకాలని చదివేటప్పుడు మంత్ర సమ్మోహితంగా సజీవులైన నాయక పాత్రలు మిమ్మల్ని చుట్టుముట్టి వున్నట్టు, మిమ్మల్ని స్పృశిస్తున్నట్టు మీకు అనిపిస్తుంది. వాళ్ల బాధలని మీరు నిశితంగా అనుభవిస్తారు. మీరు వాళ్లతోబాటు నవ్వుతారు, యేడుస్తారు, వాళ్లని ద్వేషిస్తారు, ప్రేమిస్తారు. మీరు వాళ్ల గొంతుకలని వినగలుగుతారు, వాళ్ల కళ్లల్లో సంతోష, విషాదాల చెమ్మ మెరవడం చూడగలుగుతారు. వాళ్లతోబాటు కలిసి వుంటూ మీకు వాళ్లపట్ల స్నేహపూర్వక ఆదరమేనా వుంటుంది. లేదా మీరు వాళ్లని పగతో చీదరించుకోనేనా చీదరించుకుంటారు. రాసిన ప్రతీదీ కూడా జీవితం అంత వాస్తవంగా వుంటుంది, వూరికే యింకొంచెం స్పష్టంగా, అందంగా వుంటుందంతే.

లెస్కోవ్ కూడా సాహిత్య మాంత్రికుడే. కాని ఆయన సృజనాత్మక రీతిలో రాయలేదు. ఆయనది ఆఖ్యాన పద్ధతి. అందులో ఆయన అద్వితీయుడు. ఆయన ప్రతి కథా ఉత్తేజభరిత గీతం. చమత్కారపూరిత పాదాల్లో దగ్గరసా అల్లిన రష్యన్ మాటలు ఒకో అప్పుడు ఆలోచనాత్మకంగా వుంటాయి, ఒకో అప్పుడు వాటిల్లో ఖంగుమనే నవ్వు వుంటుంది. అందులో యెప్పుడూ ప్రజల పట్ల బెరుకు ప్రేమ యెవళ్లకేనాగానీ కనిపిస్తుంది. యిది స్త్రీల ప్రేమలాగా మృదువైన ప్రేమ. తనకి తానే సిగ్గుపడే లేత ప్రేమ. ఆయన కథల్లో మనుషులు తరుచుగా తమని గురించే మాట్లాడుకుంటారు, కాని వాళ్ల మాటలు యెంత ఉల్లాసభరితంగా, సత్యపూరితంగా

వుంటాయంటే, యెంత హత్తుకునేటట్టు వుంటాయంటే, వాళ్ళు విచిత్రంగా స్పర్శనీయం అవుతారు. వాళ్ళు టాల్‌స్టాయ్ పుస్తకాలలోని నాయకులంత స్పష్టంగానూ వుంటారు. వేరే మాటల్లో చెప్పాలంటే లెస్కోవ్ అదే ఫలితాన్ని వేరే కౌశలంద్వారా సాధిస్తాడు.

తాము కోరుకుంటే తప్ప, తాము చిత్రించే వ్యక్తిలో పాఠకుడికి తన వ్యక్తిత్వం ద్యోతకమవాలని తాము అనుకుంటే తప్ప వాళ్ళ పుస్తకాలలో తుర్గేనెవ్, గొన్‌చరోవ్, తదితరుల వ్యక్తిత్వం అనుభూతం కాదు. లెస్కోవ్ సామాన్యంగా యెక్కువ్లో పాఠకుడికి దగ్గరగానే వుంటాడు. కాని యెవరో ముసలి, చతురమైన దాది చెప్పిన సగం సగం వింత కథల్ని, గాథల్ని పునరుక్తం అవుతున్న వాటిని విని పించనీయకుండా ఆయన కంఠం ఆటంకం రాదు. ఆయన అఖ్యాన కళ హోమర్‌కి సమమైంది లేదా సర్వజ్ఞుడైన హెరొడోటస్‌కి,[108] కాని ఆయన కథల్లో ఆ ప్రాచీన కవిలో వుండే విసుగు పుట్టించే గంభీరత్వంగాని, ''చరిత్ర పితామహుడి''లో వుండే అమాయకపు విశ్వసనీయతగాని లేవు. టాల్‌స్టాయ్, తుర్గేనెవ్‌లు తమ కథానాయకులకి చుట్టూతా కొంత నేపథ్యం సృష్టించడానికి యిష్టపడేవాళ్ళు. అది ఆ పాత్రలని మరింత సజీవం చేసేది. వాళ్ళు ప్రకృతి వర్ణనని విస్తారంగా వాడారు. ఆలోచనా శ్రేణుల్ని వర్ణించారు. మానవ అనుభూతుల క్రీడల్ని వర్ణించారు. లెస్కోవ్ మామూలుగా అలాంటి చమక్కులని తప్పించుకునేవాడు. కాని వాడుక భాషని నైపుణ్యంగా అల్లి ఆయన అదే ఫలితాన్ని సాధించాడు.

కొంతమంది నైష్ఠిక మనుషులు — పరిశుద్ధవాదులు అని కూడా అనబడే వాళ్ళు, ఆ పేరు వాళ్ళని మరింత మంచిగా, యింపుగా వుండేటట్టు చెయ్యొద నుకోండి — ఆ కటువైన విమర్శకులు, రచయిత పుస్తకంలోని నిగూఢమైన వాటినీ, చాపల్యయుతమైన వాటినీ ఆ రచయితల కంటే కూడా బాగా అర్థం చేసుకుంటామని నటించేవాళ్ళు, భిన్నమైన నూతన కల్పిత పదాలతో రష్యన్ భాషని వక్రం చేసినట్టు లెస్కోవ్‌ని నిందించారు. కాని మన చతురోక్తులు నవ్వు తెప్పించకపోయినా చతురోక్తులు చెప్పడం యెందుకు మానాలి? దేవుళ్ళు కూడా ఒకో అప్పుడు చెత్త చతురోక్తులు మాట్లాడతారు.

యిలా చేసి, అనూదితం అవుతూ వున్న జనామోద విజ్ఞానశాస్త్రాలనుంచి తీసుకున్న అనేక విదేశీ మాటలు పుంఖానుపుంఖంగా రష్యన్ భాషలోకి వచ్చే రోజుల్లో లెస్కోవ్ రచనలు చేశాడు. అణువణువూ రష్యన్ అయిన లెస్కోవ్‌కి రష్యన్ భాషని గురించిన చక్కటి పరిజ్ఞానం వుంది, దాని చక్కదనం పట్ల ప్రేమ వుంది. ఆయన ''గ్యారంటీ,'' ''సబ్సిడీ,'' ''కన్‌సెషన్,'' ''గ్రండీయిజం''లాంటి

మాటలంటే, పెద్ద పదాలూ పెద్ద అర్థాలూ వున్న పదాలంటే, పరాకు పడకుండా వుండలేకపోయేవాడు.

చెహోవ్ నిసలైన రష్యన్ రచయిత. యే పరాయి ప్రభావానికీ లొంగని వాడు. ఆయన పుస్తకాలని చదవడం వల్ల, అందులో వున్న ప్రతి నుంచి పెద్ద లతోటీ, రష్యాని బాగా అర్థం చేసుకోవచ్చు; యెవళ్లైనాగానీ సంక్లిష్ట రష్యన్ వ్యక్తిని స్పష్టంగా చూడగలరు.

# రొమేన్ రోలాన్

''అవశ్వర''మైన దాన్ని దేన్నో ధ్వంసం చెయ్యని యుగం అనేది యెన్నడూ లేదు — వుండలేదు. హేతుబుద్ధి తన సంకల్పం వల్ల సృష్టించినటువంటి విశ్వాసాలనీ మూఢ నమ్మకాలనీ తునాతునకలు చెయ్యడానికీ, తన బలం కూడా పగలగొట్టలేని పరమ సత్యాలని తన వేదనాభరిత యత్నాలవల్ల కనుక్కోడానికీ ప్రయత్నించకుండా వున్న యుగం అనేది లేదు.

1914–1918 నాటి హింసాకాండ దారుణాలవల్ల మతులుపోయి, మరో దేశవ్యాప్త అంతర్వర్గ యుద్ధపు మరిన్ని దారుణాలని శంకిస్తూ యిప్పుడు బతుకుతున్నట్టుగా విశ్వాసరాహిత్య, ఆత్మవినాశకర నిస్పృహాయ విషాదభరిత స్థితిలో యూరప్ ప్రజలు బతుకుతున్న లాంటి యుగమూ యెన్నడూ లేదనే అనుకుంటున్నాను.

''మన తర్వాత — మరి మహా ప్రళయమే'' అనే జీవిత వేదాంతం వున్న జనం పూర్వం యెన్నడూ లేనంతగా యివాళ వున్నారు. మన రోజుల్లో లాగా యెన్నడూ కూడా మానసిక, ఇంద్రియ వక్రత్వం అంత వికార రూపాలని ధరించి వుండలేదు. యెన్నడూ కూడా ప్రజలు యింత నీరసంగా, యింత యాంత్రికంగా వాస్తవికత్వపు వ్యభిచార ప్రభావాలకి లొంగిపోలేదు.

పరస్పర వినాశనం కోసం అంత యాతనతో, అంత దీక్షతో మార్గాలని జనం గతంలో వెదకడం యెవరికేనా కనిపిస్తుందా? మానవత్వవాదపూ, దాతృత్వపూ భావజాలాన్ని సృష్టించే ప్రయత్నాలలో యింత నికృష్ట దారిద్ర్యం వున్న యుగమూ గతంలో యెన్నడూ లేదు. మానవత్వవాదం లుప్తం అయిపోతూ వున్న మన రోజుల్లో మానవత్వవాదాన్ని గురించి మాట్లాడ్డం అనేది అమర్యాదగా వుంటుంది. ఒకవేళ అలవాటు కొద్దీ ''మనిషిమీద జాలి చూపించండి'' అని అరిచినా, దాపరికంలేని ద్వేషంతోటే, పగతీర్చుకోవాలనే బెదిరింపుతోటే అలా అరవడం జరుగుతోంది.

ప్రజలు ''యూరప్ క్షీణదశని'' గురించి అంత ఆవేశంతో, యుక్తితో, యింకా

# రొమేన్ రోలాన్

''అవశ్వర''మైన దాన్ని దేన్నో ధ్వంసం చెయ్యని యుగం అనేది యెన్నడూ లేదు — వుండలేదు. హేతుబుద్ధి తన సంకల్పం వల్ల సృష్టించినటువంటి విశ్వాసాలనీ మూఢ నమ్మకాలనీ తునాతునకలు చెయ్యడానికీ, తన బలం కూడా పగలగొట్టలేని పరమ సత్యాలని తన వేదనాభరిత యత్నాలవల్ల కనుక్కోడానికీ ప్రయత్నించకుండా వున్న యుగం అనేది లేదు.

1914–1918 నాటి హింసాకాండ దారుణాలవల్ల మతులుపోయి, మరో దేశవ్యాప్త అంతర్వర్గ యుద్ధపు మరిన్ని దారుణాలని శంకిస్తూ యిప్పుడు బతుకుతున్నట్టుగా విశ్వాసరాహిత్య, ఆత్మవినాశకర నిస్పృహాయ విషాదభరిత స్థితిలో యూరప్ ప్రజలు బతుకుతున్న లాంటి యుగమూ యెన్నడూ లేదనే అనుకుంటున్నాను.

''మన తర్వాత — మరి మహా ప్రళయమే'' అనే జీవిత వేదాంతం వున్న జనం పూర్వం యెన్నడూ లేనంతగా యివాళ వున్నారు. మన రోజుల్లో లాగా యెన్నడూ కూడా మానసిక, ఇంద్రియ వక్రత్వం అంత వికార రూపాలని ధరించి వుండలేదు. యెన్నడూ కూడా ప్రజలు యింత నీరసంగా, యింత యాంత్రికంగా వాస్తవికత్వపు వ్యభిచార ప్రభావాలకి లొంగిపోలేదు.

పరస్పర వినాశనం కోసం అంత యాతనతో, అంత దీక్షతో మార్గాలని జనం గతంలో వెదకడం యెవరికేనా కనిపిస్తుందా? మానవత్వవాదపూ, దాతృత్వపూ భావజాలాన్ని సృష్టించే ప్రయత్నాలలో యింత నికృష్ట దారిద్ర్యం వున్న యుగమూ గతంలో యెన్నడూ లేదు. మానవత్వవాదం లుప్తం అయిపోతూ వున్న మన రోజుల్లో మానవత్వవాదాన్ని గురించి మాట్లాడ్డం అనేది అమర్యాదగా వుంటుంది. ఒక వేళ అలవాటు కొద్దీ ''మనిషిమీద జాలి చూపించండి'' అని అరిచినా, దాపరికంలేని ద్వేషంతోటీ, పగతీర్చుకోవాలనే బెదిరింపుతోటీ అలా అరవడం జరుగుతోంది.

ప్రజలు ''యూరప్ క్షీణదశని'' గురించి అంత ఆవేశంతో, యుక్తితో, యింకా

అని వుండాలని నేను అనుకుంటాను. రొమేన్ రోలాన్‌కి యిలాంటి మిత్రుడు వుండకుండా విధి అనుగ్రహిస్తుందని నమ్ముతున్నాను.

విమర్శకుణ్ణి కాకపోవడం వల్ల, ఆయన్ని గురించి "విషాదాంత విశ్వాసం", "జాన్ క్రిస్టోఫ్"ల రచయితగా, అద్భుతమైన శుద్ధ గాలిక్ కావ్యం అయిన "కొలా బ్రున్యోన్" రాసినవాడిగా, కవిగా నేను మాట్లాడబోవడం లేదు. కడ పటిది బహుశా మన కాలపు అత్యంతాశ్చర్యకరమైన పుస్తకం. ఫ్రాన్స్ అనుభవించిన అన్ని విషాదాల తర్వాత ఫ్రాన్స్‌లో "కొలా బ్రున్యోన్" లాంటి ఉల్లాసభరితమైన దాన్ని రాయడానికి, తన తోటి ఫ్రెంచి వాళ్లలోని అచంచల, సాహసోపేత విశ్వాసాన్ని నింపిన పుస్తకాన్ని రాయడానికి యెవరికేనా గానీ అద్భుతావహమైన ప్రేమ నిండిన హృదయం వుండాలి. అన్నిటికంటే కూడా, తను రాసిన అన్ని పుస్తకాలలోనూ, తను చేసే ప్రతిదాంట్లోనూ రొమేన్ రోలాన్‌కి వున్న యీ విశ్వాసానికి ఆయన్ని నేను సంభావిస్తాను. నాకు సంబంధించి రొమేన్ రోలాన్ యెప్పుడూ కూడా ఫ్రాన్స్ దేశపు లియో టాల్‌స్టాయే—అయినా హేతువాదంపట్ల విద్వేషంలేని, ఈ రష్యన్ హేతువాదికి తన మహా కష్టాలకాలంబన అయినటువంటి విద్వేషంలేని టాల్‌స్టాయ్.

రొమేన్ రోలాన్ ఒక డాన్ క్విక్సట్[110] అని జనం అంటారు. యెవర్ని గురించేనా గానీ యెవరేనా అనగల అత్యుత్తమమైనది యిది అనిపిస్తుంది నాకు. మనుషులమైన మనపట్ల కనికరం లేకుండా చారిత్రక శక్తులు ఆడే ఆటలో, ధార్మికతని అర్థించే మనిషి కూడా ఒక శక్తే; తత్కారణంగా అతను యీ ఆటలోని సద్యోజనితత్వాన్ని వ్యతిరేకించగలిగి వుంటాడు.

లియో టాల్‌స్టాయ్ చారిత్రక తత్వం సత్య దూరం అయిందనీ, చరిత్రలో వ్యక్తిత్వపు పాత్ర కార్ల్ మార్క్స్ అంచనా వేసినట్టే కాదనీ వ్లదీమిర్ లెనిన్ రుజావు చెయ్యగలిగాడు. రొమేన్ రోలాన్ నిజమైన ఫ్రెంచి వాడిలాగా పట్టుదల, ధైర్యం కలవాడు, నిజానికి ఆయన స్వేచ్ఛాయుతుడు. అంతమంది జనానికి, లెనిన్ మరణ వార్త విని వికటంగా సంబరం చేసుకున్న వేలాది కాలంతీరిన జనాంకి "మన యుగపు మహత్తర కార్యవాదీ, అవగింజంత కూడా స్వలాభం యెరుగని మనిషి లెనిన్" అని అంత నిబ్బరంగా చెప్పడానికి యెవడికేనా గానీ తన న్యాయబుద్ధిలో యెంతో విశ్వాసం వుండాలి.

యుద్ధానికి వ్యతిరేకంగా యూరప్‌లో మొట్టమొదటగా తన వాణిని యెత్తిన రచయిత రొమేన్ రోలాన్. అందుకు గాను ఆయన్ని చాలా మంది యేవగించు కున్నారు. వింత లేదు—సత్యం చెప్పే మనిషిని యెవరు ప్రేమిస్తారు?

"సమ్మోహక ఆత్మ"లో, త్వరలోనే మరొక దయాన్విత సత్యం, ప్రపంచానికి

యెంత కాలంగానో అవసరం అయింది, ఉద్భవిస్తుందని హృదయంలో కళాకారుడైన ఆయన ప్రబోధించానని అనుకున్నాడు. యివాళ ప్రపంచ వినాశనం కోసం దోహదం చేసే మహిళ స్థానంలో ఒక నూతన మహిళ ఆవిర్భవిస్తుందని — తను సంస్కృతిని ఉద్దీపనం చెయ్యాలని అవగతం చేసుకుని, అందుకుగాను ప్రపంచంలోకి న్యాయమైన యజమానురాలిగా ప్రవేశించాలని కోరుకునే మహిళ, తను సృష్టించిన మనుషులకి మాతగా, తాము చేసే పనులకి తనకి జవాబుదారీగా వుండే మనుషులకి కన్న తల్లిగా వుండే మహిళ ఆవిర్భవిస్తుందని — ఆయన అనుకున్నాడు.

మనిషినీ ప్రపంచాన్నీ యెంత స్థిరంగా రొమేన్ రోలాన్ ప్రేమించిందీ చూస్తే నాకు ఆశ్చర్యం కలుగుతుంది. ప్రేమకిగల శక్తిలో ఆయనకి వున్న దృఢ విశ్వాసం నాకు అసూయని కలిగిస్తుంది. నేను ఆయన్ని ఆశావాదిగా పరిగణించను. ఆయన ఆదర్శయుతమైన స్టోయిక్. ఆయన "ప్రతిదీ నశిస్తుంది, ఒక్క సత్యం మాత్రమే నిలుస్తుంది" అన్న రష్యన్ సూక్తిలో గాఢమైన విశ్వాసం వున్న వాడుగా తోస్తుంది. మనుషుల్ని వేధిస్తూ, పరిశుద్ధమైన, సౌందర్యయుతమైన సత్యాన్ని మాత్రమే వదిలిపోయేటు వంటి అసంఖ్యాక బాధల్ని చూడ నిరాకరించకుండా ధైర్యంగా, స్థైర్యంగా రొమేన్ రోలాన్ కవిగా చింతనాపరుడుగా తన కర్తవ్యాన్వేషణ చేస్తాడు.

నేను యెప్పుడూ ఆయన్ని చూడలేదు. కాని ఆయన నేత్రాలు శాంతంగా, విచారంగా వుంటాయనీ, ఆయన కంఠం సన్నగా, అయినా బిగిగా వుంటుందనీ నేను వూహించుకుంటున్నాను.

ఫ్రాన్స్ దేశంలో, నేను బాల్యంనుంచీ ప్రేమించిన ఆ దేశంలో, అద్భుతమైనటువంటి, ఆత్మీయత నిండిన కళాకారుడైనటువంటి రొమేన్ రోలాన్ లాంటి మనిషి వున్నాడనేదే నాకు సంతోషం కలిగిస్తుంది.

# ఎమ్. ప్రిష్విన్

మిమ్మల్ని గురించి రాయడం సులభం కాదు, యేమంటే మీ అంత బాగానూ యెవళ్లేనా రాయగలిగి వుండాలి. కాని నేను అలా రాయలేనని నాకు తెలుసు.

రష్యన్ సాహిత్యంలో సుమారు యిరవై అయిదేళ్లుగా అద్భుతమైన కృషి చేస్తూ వున్న మౌలిక ప్రజ్ఞగల రచయిత అయిన ఎమ్. ప్రిష్విన్111 రచనలకి ఒక వివరణ వ్యాసంలాంటి దాన్ని ఎమ్. గోర్కీ రాయడం అనేది యేదో యెబ్బె ట్టుగా వుంటుంది. అక్కడికి పాఠకులు అజ్ఞానంగా వున్నారనీ, అవగాహన లేకుండా వున్నారనీ నేను అనుమానిస్తున్నట్టు.

యిది నాకు యిబ్బందికరంగా వుంటుంది, యేమంటే మీకంటే ముందే నేను రాయడం మొదలుపెట్టినా, శ్రద్ధగా చదివే పాఠకుణ్ణి కావడంవల్ల, మీ పుస్తకాల నుంచి నేను యెంతో నేర్చుకున్నాను. యేదో మర్యాదగా వుండాలనీ, లేదా ''అతి వినయం''గా వుండాలనీ నేనీ మాట అంటున్నానని అనుకోవద్దు. యిది నిజం, నేను నేర్చుకున్నాను. నేను యివాళ్టికీ నేర్చుకుంటూనే వున్నాను. వూరికే మీనుంచే, చెయ్యి తిరిగిన రచయిత అయిన మీనుంచే కాదు; నాకంటే బహుశా ముప్పై అయిదేళ్లు చిన్న వాళ్లు, నైపుణ్యానికి సంబంధించి యింకా గాడిలో పడని ప్రతిభ వున్న ఆరంభకులు, కాని ఒక నూతన జవంతో కొత్తగా, దృఢంగా మోగే గొంతు కలు వున్న వాళ్లు అయిన రచయితలనుంచీ నేర్చుకుంటున్నాను.

''నేర్చుకోవడానికి సమయం యెన్నడూ మించిపోదు'' అన్న దానివల్లనే కాదు నేను నేర్చుకుంటూ వున్నది, నేర్చుకోవడం అన్నది ఒక సహజమైన సంతోష దాయకమైన పని కాబట్టి కూడా. ప్రధానంగా యెందుకంటే ఒక కళాకారుడు మరొక కళాకారుడినుంచి మాత్రమే నైపుణ్యాన్ని నేర్చుకుంటాడు.

మీ ''నల్ల అరబ్,'' ''గుండ్రటి రొట్టె'' ''బెదరని పిట్టల దేశం'' యింకా తర్వాత వచ్చిన కథల నాటినుంచీ నేను మీనుంచి నేర్చుకుంటూనే వున్నాను. మీదగ్గరికి నన్ను ఆకర్షించింది యేమిటంటే మీ పుస్తకాల్లోని పరిశుద్ధ సౌందర్య

భరిత, అమలిన రష్యన్ భాష; మీరు వర్ణించే ప్రతిదాన్నీ సామాన్య పదాల పోహ శింపు గల నమ్రత్వంతోటి దాదాపు రూప స్పర్శం కావించే మీ అద్భుతమైన సామర్థ్యం. శబ్దంమీద మీకు వున్నంత పరిపూర్ణ సాధికార ప్రభుత మన రచయితలు ఆట్టే మందికి లేదు.

కాని మీ పుస్తకాలని యింకా లోతుగా చదివే కొద్దీ మీలో వున్న మరో యితోధిక ప్రతిభ, పూర్తిగా మీదైన ప్రతిభ నాకు ఆవిష్కారమైంది. మరే యితర రష్యన్ రచయితలోనూ నాకు అది కనిపించలేదు.

ఒక ప్రకృతి దృశ్యాన్ని మాటల్లో రూపుకట్టినట్టు మనోహరంగా చిత్రించే సామర్థ్యం మన పాత రచయితల్లోనూ, సమకాలీన రచయితల్లోనూ చాలా మందిలో వుంది. తుర్గేనెవ్, అక్సాకొవ్,[112] లియో టాల్‌స్టాయ్‌ల అద్భుతమైన వర్ణనా దృశ్యాలని జ్ఞప్తికి తెచ్చుకోవడం చాలు. చేహొవ్ ''పచ్చికమైదానం'' యెంతో రమ్యంగా వుంటుంది, ముత్యాలతో కూర్చినట్టు కనిపిస్తుంది. యిక సెర్గేయెవ్ — త్సెన్‌స్కీ[113] చేసిన క్రైమియన్ దృశ్య వర్ణన యెలా వుంటుందంటే, అతను షోపెన్[114] కృతిని పిల్లనగ్రోవిమీద వాయిస్తున్నాడా అనుకుంటారు యెవళ్లేనా. మన రచయితల ప్రకృతి దృశ్య చిత్రణలో కళాత్మకంగా స్పందనాత్మకంగా, వాస్తవంగా శక్తివంతంగా వుండేది చాలా వుంది.

చాలా కాలం నేను యీ ప్రకృతి లాలిత్యభరిత స్తోత్ర గీతాలని మెచ్చుకునేవాణ్ణి, కాని కాలం గడిచే కొద్దీ యీ రుక్కులు నాలో ఒక దిగులునీ, యింకా చెప్తే వ్యతిరేకతనీ కూడా కలిగించాయి. 'ప్రకృతి సౌందర్యాన్ని' గురించి రచయితలు మాట్లాడే మనోహర భాషలో, భయంకర మూఢ అమానుష జంతువూ, అర్థరహితంగా రాశుల కొద్దీ గుడ్లని పెట్టి, అంత అర్థరహితంగానూ వాటిని కబళించేదీ వాస్తవానికి మత్స్యమూ అయిన లెవియాథన్‌ను దువ్వడానికి చేసే అసంకల్ప ప్రయత్నం దాగి వున్నట్టు నాకు యిప్పుడు కనిపిస్తుంది. మానవుడు యింకా పరిష్కరించుకోగలగలేని ప్రకృతి చిక్కు ప్రశ్నలతో వున్న యీ పోటీలో ఆత్మ హైన్యపు అనుమానం వుంది. ప్రకృతికి మానవుడే ఊహాపరంగా ఆపాదించి, యింకా ఆపాదిస్తూ వున్నట్టి ఆ ప్రకృతి సౌందర్యాన్ని మానవుడు ఆరాధించడంలో, యేదో ''ఆదిమమైందీ, ప్రాచీనమైందీ'' కూడా వుంది.

యింతా చేసి యెడారిలో యే అందమూ లేదు, ఆ అందం ఆరబ్‌వాడి హృదయంలో వుంది. అలాగే ఫిన్‌లాండ్ దేశపు నిస్తేజమైన ప్రకృతి దృశ్యంలోనూ యే అందమూ లేదు — తన వూహలో ఆ అందాన్ని ఆవాహన చేసి, తన కటువైన నేలకి దాన్ని ఆపాదించినది ఫిన్నిష్‌వాడే. లెన్నిథాన్[115] అంతకు ముందెవ్వరూ చూసి

మెరిసిని అందాన్ని రష్యన్ ప్రకృతి దృశ్యంలో ఆవిష్కరించాడని యెవరో అన్నారు. మరి యెవరూ చూసి వుండలేరు. యేమంటే ఆ అందం అక్కడ లేదు కాబట్టి, లెవితాన్ దాన్ని "ఆవిష్కరించ"లేదు, దానికి అందాన్ని ఆపాదించాడు, తన మానవ వరాన్ని భూమికి లాగా. అతనికి ముందు రూస్‌దాయెల్,[116] క్లాడ్ లొర్రె యిన్,[117] యింకా అలాంటి బోలెడు మంది గొప్ప చిత్రకారులు భూమిని సౌందర్యంతో ముంచెత్తేశారు. "విశ్వం" రచయిత హుంబోల్ట్[118] లాంటి శాస్త్రజ్ఞులు దాన్ని తేజస్సుతోటి అలంకరించేశారు. భౌతికవాది అయిన హేక్కెల్[119] పరమ వికారమైన నాచు, మెడుస్సాల్లో "సౌందర్య రూపా"న్ని దర్శించకోరాడు. ఆయన అలా దర్శిం చాడు, అది నిజంగా అందంగా వుందని మనల్ని దాదాపు నమ్మించాడు కూడానూ! కాని సౌందర్య నిపుణులైన పురాతన గ్రీకులు మెడుస్సా భీతి కలిగించేదనీ వికార మైందనీ భావించారు. మంచు తుఫానుల ఆటవికమైన కేకల్ని, హోరుల్ని, వినాశ కర జంఝితరంగ తాండవ నృత్యపు విశృంఖలతల్ని, భూకంపాల్ని, గాలివానల్ని గురించి అందమైన, శ్రావ్యమైన మాటల్లో మాట్లాడ్డం మానవుడు నేర్చు కున్నాడు. యిందుకు గాను మనిషిని శ్లాఘించాల్సిందే, అభినందించాల్సిందే. యేమంటే మానవుడి సంకల్ప శక్తీ, ఊహాబలమూనే పట్టు సడలకుండా విశ్వంలోని ఒక ఊషర ఖండాన్ని అతని నివాస స్థానంగా మార్చాయి. బతకడానికి గాను యీ భూమిని యింకా యింకా సౌఖ్యప్రదమైన చోటుగా తయారుచేశాయి. మానవుడు సర్వదా తన బుద్ధితో దాని రహస్యాలని ఆకళింపు చేసుకో ప్రయత్నించేటట్టు చేశాయి.

సరే మరి, మీ పుస్తకాలలోనే మానవుడు ప్రకృతి ముందర మోకరిల్లడం నాకు కనబడలేదు. కాని నేనింకొకటి కూడా చెప్పాలి, మీరు రాసేది ప్రకృతిని గురించే కాదు. యింకేదో పెద్ద దాన్ని గురించి, భూమిని గురించి, మన మహత్తర భూమాతని గురించి. మీ పుస్తకాల్లో కనిపించినంతగా, అనుభూతం అయి నంతగా భూమిపట్ల ప్రేమా, దాన్ని గురించిన పరిజ్ఞానమూ సౌష్ఠవంగా మిళితం కావడం మరే యితర రష్యన్ రచయితలోనూ నాకు కనిపించలేదు, అనుభూతం కాలేదు.

మీకు అడవుల గురించీ, బాడవల గురించీ, చేపల గురించీ, పక్షుల గురించీ, గరికల గురించీ, జంతువుల గురించీ, కుక్కల గురించీ, పురుగుల గురించీ శ్రేష్ఠ మైన పరిజ్ఞానం వుంది. మీకు తెలిసిన ప్రపంచం యెంత సంపద్వంతమైందీ, విశాలమైందీ అనే విషయం ఆశ్చర్యం కలిగిస్తుంది. యింకా ఆశ్చర్యకరమైంది భూమిని గురించీ, దీనిమీద వున్న సకల జీవరాశుల గురించీ, దీని

సర్వ జీవ ఆవరణ గురించీ మీకు గల ప్రేమని మీరు వెల్లడి చేసే అతి సామాన్య, స్వచ్ఛమైన మాటల పౌష్కల్యం. ''బూట్స్''లో మీరు అంటారు: ''మంచిది అయిన దాన్ని గురించి మాట్లాడ్డం కంటే కష్టం మరొకటి లేదు'' అని. అది కష్టం, అనుకుంటాను. ఒట్టిసే యెందుకంటే అదే కథలో మీరు అంటారు: ''భౌతికమైన ప్రభావానికి గల వైశద్యానికి తగ్గట్టుగా మాటల ప్రభావాన్ని పెంచాలని నా కోరిక.''

''వెరెండి జలధారలు''లో ''భూమి రహస్యాల''ని గురించిన మీ మాటలు ఒక భవిష్యత్ మానవుని మాటలలాగా, భూమిమీద సర్వం సహాధిపత్యం గల యజమానీ, దాని అద్భుతాలకీ సంతోషాలకీ సృష్టికర్తా అయినవాడి మాటలలాగా నాకు ధ్వనిస్తున్నాయి. అదీ మీ పుస్తకాలలో పరమ మౌలిక ఉపజ్ఞ కలదీ, యెంతో నూతనంగా యెంతో అత్యంత ముఖ్యంగా వుండేదీనీ.

మామూలుగా మనుషులు భూమితో అంటారు: ''మేము నీ వాళ్లం'' అని.

మరి మీరు భూమికి చెప్పేది యేమంటే ''నువ్వు నా దానివి''.

మీ పుస్తకాలద్వారా, మీరు మానవుడి నేస్తులని యెవళ్లేనా బాగా చూడగలరు. ఆ మాటని మినహాయింపుల్లేకుండా అనువర్తింపచెయ్యగల కళాకారులు యెక్కువ మంది లేరు. మానవుడిపట్ల మీ స్నేహం తార్కికంగా భూమిపట్ల మీ ప్రేమ నుంచి ఉత్పన్నం అయింది. ఒకో క్షణంలో మీరు మానవుడి కంటే ఒక మెట్టు యెత్తులో వున్నట్టు కనిపిస్తారు, కాని అది మానవుణ్ణి ఒక్క పిసరు కూడా తగ్గించదు. అది మీ నిజాయితీపూర్వక, నిర్మల దృష్టి పూర్వక స్నేహంవల్ల పూర్తిగా సమర్థనీయమే, అతను యెలాంటి మానవుడైందీ సంబంధం లేకుండా: అవసరంవల్ల నీచుడైనా, లేదా దౌర్బల్యంవల్ల దయాపరుడైనా, బాధాద్వేషంవల్ల పీడకుడైనా, వాస్తవాలకి లొంగిపోయే అలవాటువల్ల బాధితుడైనా. మీ మానవుడు చాలా ప్రాపంచిక యదార్థ మానవుడు, అతను ప్రపంచంతో సజావుగా గడుపుకుంటాడు. మిగిలిన వాళ్లు చిత్రించిన దానికంటే మీ మానవుడు యింకా యెక్కువ ''భూ, జీవశాస్త్ర'' మానవుడు. అతను నిజంగా మహామాత సుపుత్రుడు, నిజంగా మానవాళి పవిత్ర శరీరపు సజీవ భాగం. అతను చెకుముకి రాతి గొడ్డలినుంచి విమానం దాకా గడిచివచ్చిన పథం యెంత వేదనాభరితమూ, ఆశ్చర్యకరమూ అయిందీ మీరు సర్వదా వ్యథాకులితంగా గుర్తుపెట్టుకున్నట్టే వుంది.

కాని మీ పుస్తకాలలో నన్ను మురిపించే ముఖ్యమైన విషయం యేమిటంటే మానవుడి ప్రమాణాన్ని తీసుకుని, అతని చెడుకి కాకుండా, మంచికి అంచనా కట్టే మీ సామర్థ్యం. యిది లోక జ్ఞానసంబంధే కాని దాన్ని నేర్చుకోవడం

జనానికి కష్టం, అసలంటూ వాళ్లు నేర్చుకుంటే. మానవుడిలో వున్న మంచిని, అతను సృష్టించిన సకల అద్భుతాల్లోకీ అత్యంత ఆశ్చర్యకరమైన దానిని, మనం గుర్తుపెట్టుకోదలిచుకోం. యింతా చేసి, మానవుడికి ''మంచి''గా వుండాల్సిన హేతువే లేదు, యేమంటే అతనిలో వున్న దయనీ, మానవత్వాన్నీ ప్రకృతి ధర్మాలు గాని, సాంఘిక జీవితంగాని ప్రోత్సహించడమే లేదు కనక. సరే ఆ విషయం అలా వున్నా, మీరూ, నేనూ చాలా మంది నిజంగా మంచి వాళ్లని యెరుగుదుం. వాళ్లని అలా తయారుచేసింది యేది? వాళ్ల కోరిక మాత్రమే. ఒక మానవుడు వున్నదానికంటే మెరుగ్గా వుండాలని కోరుకోవడమూ, రాణించడమూ తప్పిస్తే వేరే ప్రేరకమే నాకు కనిపించడం లేదు. వైరుధ్యాలతో సతమతమైపోయినప్పటికీ కూడా బ్రహ్మాండంగా శక్తివంతమైన వ్యూహనీ, తనని తనే ప్రతి రకంగానూ పరిహాసం చేసుకునే రాక్షస శక్తినీ నిర్మించుకున్న యీ నిగూఢ సంక్లిష్ట ప్రాణికంటే మన యీ భూమ్మీద అద్భుతావహమూ, ఆశ్చర్యకరమూ యేం వుంటుంది?

మానవుణ్ణి ప్రశంసించడమూ, మానవుడి గురించి ఆలోచించడమూ నేను చాలా మందినుంచి నేర్చుకున్నాను. కళాకారులైన మీతోటి నా పరిచయం కూడా మానవుణ్ణి గురించి నన్ను ఆలోచించేటట్టు చేసింది. నేను కచ్చితమైన మాటలలో పెట్టలేనుగాని నా ఉద్దేశం యేమంటే, యింతకు ముందుకంటే నన్ను మానవుణ్ణి గురించి బాగా ఆలోచించగలిగేటట్టు చేసింది.

ఒక రష్యన్ మనిషి ముఖ్యంగా, అతను యెలాంటి జీవితం గడిపిందీ, యిప్పుడు యెలాంటి జీవితం గడుపుతూ వున్నదీ పరిశీలించిం తర్వాత, మరింత భిన్నంగా, మరింత సావధానంగా, మర్యాదపూర్వకంగా, సున్నితంగా చూడబడ్డానికి అర్హుడు. అతను యిప్పటికీ ఒక దేవదూతేం కాదు అని నేను గ్రహించగలననుకోండి. కాని అతను దేవదూత కావాలనీ నేను కోరుకోను. తన పనిని ప్రేమించే వాడిగా, దాని మహత్తర ప్రాముఖ్యాన్ని అర్థంచేసుకునే వాడిగా అతను వుండాలని నేను కోరతాను.

నూతన జీవిత సృష్టికోసం నడుంకట్టిన మనకందరికీ కూడా, ఒకొళ్లకొకళ్లం రక్తబంధువుల మాదిరీ అతి సన్నిహితంగా వుండేటట్టు అనుకోవడం, చెప్పలేనంత ముఖ్యం. మనం జీవిస్తున్న గడ్డు రోజుల దృష్ట్యా, మనం చేపట్టిన బ్రహ్మాండమైన కర్తవ్యం దృష్ట్యా యిది అవసరం అవుతోంది.

నేను బహుశా దేన్ని గురించో పొరపడి వుండవచ్చు, దేన్నో కొండంతలు చేసి చెప్పి వుండవచ్చు. నేను యేమి చేస్తూ వున్నదీ తెలిస్తే నేను తప్పు చేసి, అతిశ

యోక్తిగా చెప్పివుండవచ్చు. యేమంటే నేను తాత్వీకరించడానికి అలవాటు పడ్డాననీ, కొన్ని విషయాల్లో స్వాతిశయంగా వుంటాననీ ప్రతివాళ్లకీ తెలుసు. నేను యెక్కడ తప్పు చేస్తున్నానో అక్కడ తప్పు చెయ్యడంలో ప్రమాదం లేదని నేను అనుకుంటున్నాను. యేమంటే నేను నన్ను గాని, "పైకి యెత్తేసే భ్రమ"తో మా పొరుగువాణ్ణిగాని వూరడించుకోవడానికి గాక నేను సత్యం పక్షాన తప్పు చేస్తున్నానని నాకు యేదో చెప్తోంది. ఆ సత్యం అనివార్యంగా విజయం సాధిస్తుంది. ప్రజలకి అవసరమైన ఒక్క సత్యమూ అదే. వాళ్లు, యీ భూమికి అధినేతలు, తమని తాము ఉత్తేజితం చేసుకునే సత్యమూ అదే.

# అనతోల్ ఫ్రాన్స్

ఫ్రాన్స్ దేశపు జీవలక్షణాన్ని మిగతా దేశాల జీవలక్షణంతో అతి విశిష్టంగా, అనుకూలంగా విభేదపరచేది యేమిటీ అని నన్ను అడిగితే నేను జవాబు చెప్తాను: నిరాశావాదంలాగానే మత మౌఢ్యం కూడా ఫ్రెంచివాళ్ల ఆలోచనా ధోరణికి పరాయిది అన్న వాస్తవమే. ఫ్రెంచి సంశయవాదులు ప్రొతాగరస్‌కి[120] గాని పిర్రోన్‌కి[121] గాని శిష్యులు గాకుండా సోక్రటీస్‌కి[122] శిష్యులని నాకు అనిపిస్తుంది.

''బుద్ధికి గల ప్రచండమైన శక్తి పట్ల కుతార్కికుల వ్యామోహానికి'' సోక్రటీస్ పరిమితి పెట్టాడని మనకి తెలుసు. పాఠ్యపుస్తకాల సత్యాలకి వినాశకరమైనటువంటి ఆలోచనలు పోయే అరాచక విశృంఖలత స్థానంలోకి నైతిక మూలసూత్రాలని తీసుకురావడంద్వారానూ, వస్తుపర సత్యం మానవ సంకల్పంవల్ల సాధ్యయోగ్యమైందని స్థాపించడంద్వారానూ — యీ చింతన సంపూర్తిగా నిర్నిబంధమై వుండి, ఆత్మజ్ఞేయతనీ, ప్రపంచజ్ఞేయతనీ లక్ష్యంగా పెట్టుకుని వుండినట్లయితే అది సాధ్యం — ఆయన అలా చేశాడు.

ఫ్రాన్స్ దేశపు ఆధ్యాత్మిక అభివృద్ధి చరిత్రకి సంబంధించిన నా పరిజ్ఞానం అరకొరగా వుండవచ్చు, నా తీర్పులు తప్పుగానూ వుండవచ్చు. కాని నాకు తెలిసిన ఆ కొద్ది పాటి విషయమూ కూడా శుభ్రంగా యే మౌఢ్యమూ, ఉదాసీన ఆత్మసంతృప్తి లేని ఫ్రెంచి మనిషి మేధని నాకు రూపుకట్టిస్తుంది. మూఢ సిద్ధాంతాలా, వ్యవస్థలా అనుల్లంఘనీయతని కాపలా కాయాలని ఇంక్విజిటర్‌కి వుండే నమ్మలేని క్రౌర్యంతో సర్వకాల సర్వావస్థలకీ వర్తించే యేదో ఒక మూఢ సిద్ధాంతాన్ని స్థాపించాలనీ, ఆలోచనా శక్తిని గంజిగుంటలోకి గెంటెయ్యాలనీ చూసే నిరంకుశ కామన లేని ఫ్రెంచి మనిషి మేధని నాకు రూపు కట్టిస్తుంది. ప్రొక్రూస్టియన్ తల్పం[123] — జ్ఞేయతా స్వేచ్ఛని పరిమితం చేసే పండితమ్మన్యుల ప్రియమైన సాధనం — యెప్పుడూ కూడా ఫ్రాన్స్‌లో ప్రత్యేకమైన ఆదరణ పొందలేదు. అందుకనే ''నేను

ఆలోచిస్తున్నాను గాబట్టి నేను అస్తిత్వంలో వున్నాను'' అనే మాటల్ని ఫ్రెంచి వాడు అనడం యెంతో ఒప్పిదంగా వుంది.

శతాబ్దాలమీదుగా జారి వోల్టేర్‌కి[124] కరమందించిన రాబ్లే,[125] మాన్‌టేన్‌లతో[126] మొదలైన ఫ్రెంచ్ సంశయాత్మకవాదం, సోక్రటీస్‌తో అనుగుణంగా వుండి, వికాసపు అవసరాన్ని నొక్కిచెప్పింది. ''సీసాలోని అశరీర వాణి''లా మాట్లాడుతూ రాబ్లే, ప్రకృతిని అధ్యయనం చెయ్యమనీ, దాని శక్తుల్ని మానవాళికి సేవచేసేటట్టు చెయ్యమనీ ప్రజలకి సలహా యిచ్చాడు. ''ప్రజలనుండి దాంకున్న'' తత్వశాస్త్రం శుద్ధ మోసకారి అని మాన్‌టేన్ అన్నాడు.

నాకు జొనాథన్ స్విఫ్ట్[127] కులాసా చిరునవ్వు ఒక్కటీ గుర్తులేదు. అయితేనేం, సన్యాసి అయిన రాబ్లే తనకు ముందుగాని, రొమేన్ రోలాన్ రాసిన ''కొలా బ్రున్యోన్'' దాకా తర్వాతగాని, యెవ్వరూ లేనంత సంపూర్ణ హాస భరితంగా వుంటాడు. రాబ్లే హాసం ఫ్రాన్స్ దేశంలో గింగుర్లెత్తడం యెన్నటికీ మానదు. మంచి నవ్వు స్వస్థమనస్కతకి చిహ్నం.

మిగతా దేశాల్లో మనకి నిరాశావాదులైన తాత్త్వికులు, నిరాశావాదులైన కవులూ కనిపిస్తారు. అంతర్ బహిర్ సామరస్యం కోసం నిరర్థకంగా వెదకడంవల్ల అవమానం పాలై తీవ్రంగా తననీ, ప్రపంచాన్నీ శపించే మానవుడి నిరాశావాదానికీ, మన ప్రపంచంలో కుప్ప తెప్పలుగా వుండి నిర్మూలనం కోసం ఆర్తిపడే క్లేశాలకి, మనసుకీ దేహానికీ వ్యాకులం కలిగించే క్లేశానికి నిస్సహాయంగా లొంగిపోవడంవల్ల వచ్చేటువంటి నిరాశావాదానికీ మధ్య భేదాన్ని చూస్తున్నాను. అందుకనే బొద్‌లేర్[128] నిరాశావాదాన్ని నేను ఆమోదిస్తాను. యదార్థాల ద్వేషభరిత అస్తవ్యస్త స్థితికి లెనౌ విషణ్ణంగా దాసోహం అనడం నాకు పరమ అనామోదకరమైంది. బాల్జాక్ అన్న సత్యపూరిత, తిరస్కారయుతమైన మాటలని పునరుక్తం చెయ్యడం నాకు యిష్టం: ''యదార్థం లాగా బదుద్దాయి.''

''యూరప్ క్షీణదశ''ని గురించీ, యూరపియన్ సంస్కృతికి ఆసన్నమవబోయే అంతాన్ని గురించీ అతి తక్కువ మాట్లాడుతున్నదీ, రాస్తున్నదీ ఫ్రాన్స్ దేశంలోనే అని కూడా నేను అంటాను.

. . .

సకల జీవిత రంగాలనీ ఆక్రమించేందుకు గాను సులభంగా పెంచి, విస్తృతం చెయ్యగల యీ పోలికలన్నీ పాఠకుడికి బహుశా అతిరిక్తంగా కనిపించవచ్చు. కాని అనతోల్ ఫ్రాన్స్[129] మేధని గురించి యెవళ్లైనా మాట్లాడేటప్పుడు జాతి జీవ

లక్షణాన్ని గురించి విస్మరించలేరు. దొస్తొయేవ్‌స్కీ, టాల్‌స్టాయ్‌లు తమతమ పంథాల్లో పూర్ణమైన గ్రాహక శక్తితో రష్యన్ ప్రజల ఆత్మని ప్రదర్శించారు. నామట్టుకి నాకు అనతోల్ ఫ్రాన్స్ అంతే గంభీరంగా, సర్వగ్రాహకంగా ఫ్రాన్స్ దేశపు ఆత్మని ప్రతిబింబించాడు. అలాంటి సాదృశ్యానికి రష్యన్ వైపునుంచి బహుశా అభ్యంతరాలు రావచ్చు, కాని అది వూరికే అభిరుచికి సంబంధించిన వాదం అవుతుంది. దీనికి తోడు, నేను సౌందర్య పరిధిని పోల్చడం లేదు, జాతి ఆత్మని వ్యక్తీకరించిన స్థాయిని మాత్రమే పోలుస్తాను. యీ దృష్ట్యా అనతోల్ ఫ్రాన్స్ నాకు సంబంధించిన మట్టుకి ప్రపంచపు అతి మహత్తర మేధావులతో సముడు. దీనికి మరో మాటని కూడా జత చెయ్యాలి. ఆధ్యాత్మికంగా ఆరోగ్యవంతమైన వ్యక్తి మనకి ఓ రకంగా తేలికగా కనిపిస్తాడు. అది చాలా తప్పు, అపాయకరమూ, జీవితం పట్ల వక్రీకృత దృక్పథం వుంది అన్నదానికి దాఖలానూ.

అనతోల్ ఫ్రాన్స్ ఆలోచనా సౌందర్యాన్ని గురించి నేను చెప్ప బోవడం లేదు. ఆయన భాష నాకు తెలియదు కాబట్టి లావణ్యభరితమైన దాని శక్తిని గురించీ, ఆయన శైలిలోని పుష్టిని గురించీ యేమీ చెప్పలేకపోతున్నాను — యీ లక్షణాలు ఆయన పుస్తకాల రష్యన్ అనువాదాలలో కూడా సుస్పష్టంగా గోచరమవుతున్నప్పటికీ కూడా. అనతోల్ ఫ్రాన్స్‌లో అన్నిటికంటే యెక్కువగా నన్ను ముగ్ధుణ్ణి చేసేది ఆయన సాహసమూ, ఆధ్యాత్మిక ఆరోగ్యమూనూ. నిజానికి ఆయన "mens sana in corpore sano"* అనే మాటలకి మచ్చలేని ఆదర్శం. ఆయన గొప్ప సాంఘిక సంక్షోభాలు జరుగుతూ వున్న కాలంలో జీవించాడు. కాని ఆయన నిశిత మైన చింతన సంఘటనల గురించి తప్పుగా అంచనా వేసినట్టు నాకు గుర్తు లేదు — యుద్ధం పట్ల ఆయన దృక్పథానికీ, కమ్యూనిజపు భావం పట్ల ఆయన దృక్పథానికీ గల సంబంధం నాకు యెప్పటికీ బాగా స్పష్టపడక పోయినప్పటికీ. ఆయనకి ఆత్మ ఔన్నత్యపు పూర్ణ సంచితం అపరిమేయంగా వుంది. యీ ఔన్నత్య పూరిత సంచితం ప్రజలకి వ్యతిరేకంగా నేరాలు చెప్పడంతోటీ, తన వ్యక్తిగత బాధలని చాటడంతోటీ ప్రపంచపు దుఃఖాలని విస్తృతపరిచేటట్టుగా ఆయన్ని చెయ్యలేదు — యీ విశిష్టమైన వ్యక్తి "పెంగ్విన్ పక్షుల ద్వీపం" లాంటి పుస్తకాన్ని అంత సాహసంగా రాస్తున్నప్పుడు మాత్రమే యెంతో ప్రయాసపడ్డారన్నది నిస్సందేహమైనప్పటికీ. "సంశయాత్మకవాదం" అనే వ్యాసంలో ఆయన జాన్ డీకన్ గురించిన కథని చెప్తాడు:

"చక్రవర్తి ట్రాజన్[130] ఆత్మ శాశ్వతంగా దుర్గతి పాలైందన్న ఆలోచనకి సెయింట్

---

* ఆరోగ్యమైన శరీరం ఆరోగ్యమైన మనసు (లాటిన్).

గ్రెగరీ రోదించినప్పుడు, దేవుడు ట్రాజన్ ఆత్మని శాశ్వతంగా వ్యథ చెందడంనుంచి మినహాయించాడు: ఆ ఆత్మ నరకంలో వుండిపోయింది, యిక ఆ తర్వాత అక్కడ యే సంకటమూ పడలేదు.''

యేహ్యామైన నరకంలో బతుకుతూ, యూరప్‌లోని పాలకవర్గాలు అంత కుయుక్తితో, అంత అద్భుతంగా నిర్వహించిన నరకంలో బతుకుతూ, ఒక పోకిరీ వనదేవుడి రూపమూ ప్రాచీన తాత్త్వికుడి మహోన్నత ఆత్మ వున్న అనతోల్ ఫ్రాన్స్ ''చెడు'' అయిన దాన్ని ఆశ్చర్యకరమైన నైశిత్యంతో చూసి, అనుభూతి చెందాడు. అవి యెంత అందకుండా పోయేవైనప్పటికీ కూడా, ఆయన తన దీర్ఘనాసికతోటి నరకపు సకల దుర్గంధ భూయిష్ట వాసనలనీ పసికట్టేవాడు. సోక్రటీస్ లాగా జనసామాన్యం మంచిదిగా భావించేదాంట్లోని చెడుని బట్టబయలు చేసేవాడు. ఆ చెయ్యడమూ సమర్థవంతంగా చేసేవాడు. విచారకర ''డ్రేఫుస్ అభియోగం కేసు''**131** పట్ల ఆయన వైఖరి, పాల్ మర్గరైట్‌ని హింసించడం గురించి ఆయన రాసిన ఉత్తరం, యింకా అలాంటివి, ప్రజల పట్లా, ప్రపంచం పట్లా ఉదాసీనత ఆయన సంశయవాదానికి పరమ విజాతీయమైనదని నొక్కి చెప్తున్నాయి. పిర్రోన్‌ని అభినందిస్తూ, ఆ ప్రాచీన సంశయాత్మకవాది తత్వంలోని ''నైతిక బోధన''ని ఆయన దర్శించాడు.

యిక మన మంచి, చెడూ భావనలలోని తరతమ భేదాల్ని గురించి అనతోల్ ఫ్రాన్స్ అంతగా యెవ్వరూ అనుకోలేదు. గి డె మపాసా రాసిన ''ప్యేర్, జాన్''ని సమీక్షిస్తూ, మునిపుంగవుడి మృదు వ్యంగ్యంతోటి, సాపేక్షకతని అపరిమేయం అని పొరపాటు పడ్డంలో ప్రజల అలవాటు ధోరణి యెంత ''అమాయకమైందో'' అని అంటాడు.

''మన ఆలోచన అనే ఒకేఒక్క వాస్తవాన్ని గురించే మనకి తెలుసు. ప్రపంచాన్ని సృష్టించేది మన ఆలోచనే'' అని ఆయన గాఢంగా విశ్వసించాడు. నైష్ఠికంగా, పట్టు సడలకుండా ఆయన ఒకేఒక్క సత్యాన్ని నమ్మాడు — అది సౌందర్యం. ''చరిత్ర పాపాలు'' అన్న బుర్దో పుస్తకాన్ని సమీక్షిస్తూ అక్షర లక్షలు చేసే మాటలు ఆయన అన్నాడు:

''సౌందర్యానికీ, సత్యానికీ మధ్యన యెంచుకోవాల్సి వస్తే నేను సంశయించను: నేను సౌందర్యాన్నే వుంచుకుంటాను. అది సత్యంకంటే ఉన్నతమైన, గాఢతరమైన దాన్ని తనలో యిముడ్చుకుని వుంటుందనేది ఖాయం.''

అనతోల్ ఫ్రాన్స్ నీతిశాస్త్రం సౌందర్యమే. అది భవిష్యత్ నీతిశాస్త్రం. ధర్మంలో అన్నిటి కంటే ముందు ఆయన సౌందర్యాన్ని చూశాడు — సౌందర్యంతో ఆమూలాగ్రం నిండినప్పుడే జీవితం ధర్మబద్ధమవుతుందని భవిష్యద్దర్శనం చేస్తూ.

నా అభిప్రాయంలో ఆయన ఆలోచనని సైతం అంత ఉన్నతంగా పరిగణించా డంటే, అది మానవ జీవంక్షణపు సౌందర్య అత్యుత్కృష్ట రూపాల్లో ఒకటి కాబట్టేనని. కాని తనకిగా తనని ఆలోచనకు ఒక పరికరాన్నని దానికి ఒక ఉప జీవినని ఆయన యెన్నడూ అనుకోలేదు. ఆలోచన ఆయనకి యెన్నడూ ఒక ఆరా ధనా సంకేతం కాలేదు, అలాగే బుద్ధి ఒక పూజార్హ విగ్రహమూ కాలేదు.

నాకు సంబంధించి, అనతోల్ ఫ్రాన్స్ ఆలోచనా సార్వభౌముడు, ఆయన దానికి ఆద్యుడు, పెంచి పోషించినవాడు. శక్తివంతంగా దాన్ని మాటలతో అలంకరించి హుందాతనంతో, లావణ్యంతో ప్రపంచంలోకి తీసుకువచ్చాడు: ఉల్లాసంగా, ఉత్సా హంగా, వ్యంగ్యంగానే గాని ద్వేషరహితంగా చిరునవ్వు నవ్వుతూ. దాని చిలిపి క్రీడల్ని ప్రతిభాసమన్వితుడైన స్వరమేళన కర్తలాగా ఆయన పాలించాడు. యెవడి మట్టుకు వాడు సాటిలేని ప్రతిభావంతుడుగా భావించుకుని అరాచకంగా తయారయే ఆర్కెస్ట్రా బృందపు నిర్వాహకుడుగా ఆయన దాన్ని పాలించాడు.

బుద్ధి, యీ ప్రపంచంలోని మిగతా ప్రతిదాని లాగానే, శాంతి ప్రశాంతతం నర్థిస్తూ, మరీ తరచుగా, మరీ తొందరపాటుగా, దుస్సాహసంగా పిడివాదాలని, సిద్ధాంతాలని, వ్యవస్థలని నిర్ధరిస్తుంది. ఆ రకంగా మన భావనలని గాఢతరం చేసి, విస్తృతం చేసే ఆలోచనా స్వేచ్ఛని కుంటుపరుస్తుంది. అనతోల్ ఫ్రాన్స్ ఒక వింత రూపంలో భౌతిక ఆకృతి దాల్చినట్టుగా బుద్ధిని చూశాడని నేను తరచుగా వూహించుకుంటాను: దానికి అబదోన్నాకి[132] వున్న కోపిష్టి ముఖమూ, తలా, మానవుడ్ని అనేక సత్యాలనే పటువైన సాలెగూట్లో చిక్కుపెట్టెయ్యడంలో మునిగిపోయి, ఆ రకంగా ప్రపంచాన్ని జ్ఞేయం చేసుకొనే అతని సంకల్పాన్ని బానిస చేసే రెక్కల సాలెపురుగు శరీరమూ వున్నటువంటిది. ఒక సంక్లిష్ట సర్వాన్ని బానిసని చెయ్యడానికి ఒక పార్శ్వపు యీ ప్రయత్నం చూసి అనతోల్ ఫ్రాన్స్ వ్యంగ్యంగా చిరునవ్వు నవ్వాడు.

అనతోల్ ఫ్రాన్స్‌ని గనక హేతువాది అని పిలవగలిగినట్లయితే, బుద్ధిని ఒక పాముని మాదిరిగానో, ఒక సింహాన్ని మాదిరిగానో శిక్షణ చేసిన హేతువాది అవు తాడాయన. బుద్ధితో ఆడుకోవడం, దానితో వాదించడం, దాన్ని ఉడికించి చిరాకు తెప్పించడం- ఆయనకి యిష్టం. నేను చాతుర్యం అని పిలవ నిష్టపడేటువంటి అమాయకత్వంతోటి బుద్ధి నొక్కి చెప్పిన సత్యాల అస్థిరత్వాన్ని ఆయన తరచుగా సూచిస్తూనే వున్నాడు. "స్థిర సత్యాల" ముతక, మొద్దు చర్మంమీదకి గురి పెట్టినప్పుడు ఆయన తార్కికత కొట్టే దెబ్బలు ముఖ్యంగా గట్టిగా కనిపిస్తాయి. ఈ ఫ్రెంచి వాడికి న్యాయంగానే పేరు తెచ్చిన వ్యంగ్యం తాకిడి తగలని "స్థిర

సత్యం'' ఒకటీ నాకు గుర్తులేదు. మతగురువు కాయినార్డ్ ఉపన్యసించిన ప్రతీదీ, ''పెదాక్ రాణి'' దగ్గర చెప్పిన ప్రతీదీ కూడా, విధిగా నీతి పుస్తకంలోని సత్యాల చట్రపు అస్థిరంగా తరచు అసహ్యకరంగా వుండే రూపాన్ని వెల్లడి చేస్తూ, బూడిద అయిపోయాయి.

ఆటలో తన భాగస్వామి అయినటువంటి బుద్ధి పట్ల తన గౌరవాన్ని ఒక్క క్షణం కూడా వదులు కోకుండా, దాన్ని ఫ్రెంచివాడి మర్యాదతోటి సంబోధిస్తూ అనతోల్ ఫ్రాన్స్ మాట్లాడ్డం వింటున్నానని నాకనిపిస్తుంది:

''ఆ, అవును, అయ్యా, మీరు నిజంగా ఘనులే, నిర్వివాదంగా మీరు వైభవోపేతులే. కాని వయసు బాగా పైబడ్డప్పటికీ కూడా మీరు యింకా బాగా పసివాళ్లే, పరమ పూర్ణత్వం అనేది యింకా మీకు చాలా దూరంలో వుంది. మీరు బాగానే తిరుగుబాటు చేస్తారు. కాని ఒకో అప్పుడు మీ తిరుగుబాటు సత్యం అనే వెచ్చటి గూట్లో ప్రశాంతతని కనిపెట్టాలన్న మీ ఆతృతతో ప్రేరితమవుతున్నట్టూ, మీరు యెంతలా కోరుకున్నప్పటికీ కూడా మీకు ప్రశాంతత దక్కడం గగన కుసుమమైనట్టూ నాకు అనిపిస్తుంది. మీరు చాలా యెక్కువ ఆరంభించారు. మీరు చాలా యెక్కువ కష్టపడాలి. యెక్కువ ధైర్యంగా కృషి చెయ్యాలి, పడికట్టు సూత్రాలని పుక్కిటబట్టి వల్లించడానికి బదులుగా పరికల్పనలని చెయ్య ప్రయత్నించాలి.''

ప్రతిభా సంపత్తులనేవి పెద్ద విచిత్రం కాకుండా వున్న ఫ్రాన్స్ దేశపు కీర్తి కిరీటంలో అనతోల్ ఫ్రాన్స్ పేరు శతాబ్దాల తరబడి మణిదీధితులతో ప్రకాశిస్తుందని చెప్పవలసిన అవసరం లేదు.

యీ తెలివైన వ్యక్తి కడపటి విశ్రాంతి స్థావరమైన చోట సమాధి రాతిపైన వూరికే రెండు మాటలు

అ న తో ల్ ఫ్రా న్స్

అని చెక్కాలని నిర్ణయించిన వాళ్లు బాగా చేశారు. ప్రపంచాన్ని తన ప్రతిభా సంపదలతో ఐశ్వర్యవంతం చేసి, తన కళనీ, ముగ్ధమోహన రూపాన్నీ మనం నిజంగా అర్థం చేసుకుని, అభినందించేందుకు సులభతరం చేసి వెళ్లిన యీ మనిషి ప్రాముఖ్యాన్ని యీ మాటలు పూర్తిగా వెల్లడి చేస్తున్నాయి.

# శ్రామికవర్గ రచయిత

పొక్రోవ్స్క్ పట్టణంలోని ఒక సాంకేతిక పాఠశాల సాహిత్య బృంద సభ్యులకి రాసిన ఉత్తరం

ప్రియమైన కామ్రేడ్స్! నేను "శ్రామికవర్గ" రచయితనా లేక "శ్రామికవర్గేతర" రచయితనా అని విమర్శకుల మధ్య వున్న వాదోపవాదాలతో నా మట్టుకి నాకు యేమీ ఆసక్తి లేదు. ఉత్సవ సందర్భంగా నాకు వచ్చిన అసంఖ్యాక అభినందనల్లో శ్రామికులు ఏక కంఠంతో నన్ను "మా వాడివ"నీ, "శ్రామికుణ్ణి"నీ, "కామ్రేడ్" అనీ సంబోధించారు. శ్రామికుల వాణి నాకు విమర్శకుల మాటకంటే యెంతో ముఖ్యమైంది. శ్రామికులు నన్ను పరాయివాడిగా కాకుండా తమ "కామ్రేడ్"గా పరిగణిస్తున్నందుకు నేను నిజంగా గర్విస్తున్నాను. యిది నాకు నిజంగా గర్వకారణమూ, గౌరవమూనూ.

"శ్రామిక" అనే పదానికి సంబంధించినంతవరకూ, అది సోవియట్ యూనియన్ శ్రామిక జనం తాము వున్న వాస్తవ పరిస్థితితోటి పూర్తి అనుగుణంగా లేదని నాకు అనిపిస్తోంది.

"శ్రామికవర్గం" అనేది తమ శ్రమశక్తిమీదనే బతుకుతూ, మరే యితర జీవనాధారమూ లేని ప్రజల వర్గమని మీకు తెలుసు. అయితే ఆ పదాన్ని యీ అర్థంలో మన దేశంలో రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకుని, యిప్పుడు క్రమేపీ దేశపు ఆర్థిక స్థితినీ, సంపదనీ అజమాయిషీలోకి తీసుకుంటూ వున్న శ్రామికజనానికి, సోవియట్ యూనియన్ కార్మికులకీ, రైతులకీ అన్వయించవచ్చా? దీనికి సమాధానం చెప్పడం మీ వంతు.

"యే లక్షణాలని బట్టి నిజమైన శ్రామికవర్గ రచయితని గుర్తించవచ్చు?" అని మీరు అడుగుతారు. అలాంటి లక్షణాలు చాలా వున్నాయని నేను అనుకోను. ఆ లక్షణాలు యివి: మానవుణ్ణి ఆంతరికంగా, బాహిరంగా ఉభయత్రా పీడించే ప్రతిదాన్నీ, మానవుడి

సామర్థ్యాలు స్వేచ్ఛగా పెరిగి అభివృద్ధి చెందకుండా ఆటంకపరిచే ప్రతిదాన్ని క్రియాత్మకంగా రచయిత ద్వేషించడం; సోమరిపోతుల పట్లా, పరాన్నభుక్కుల పట్లా, నీచుల పట్లా, ఇచ్చకాలమారుల పట్లా, అనేక రూపాల్లో వుండే ప్రతిదుష్టుడి పట్లా మొత్తంగా నిర్దాక్షిణ్యమైన ద్వేషం వుండటం.

సృజనాత్మక శక్తికి ఆధారభూతుడుగా, సర్వరకాల వస్తువులనీ ప్రపంచంలోని సకల అద్భుతాలనీ సృష్టించేవాడుగా, ప్రకృతి విపత్తులకి వ్యతిరేకంగా పోరాడేవాడుగా, తన భౌతిక శక్తులు నిరర్థకంగా వ్యయం కాకుండా వుండేందుకుగాను — వర్గ దేశపు పరిస్థితుల్లో ఈ వ్యయం విధిగా తెలివితక్కువ, పనికి మాలిన న్యాయంగా వుండేది — తన శ్రమ వల్లా, శాస్త్ర సాంకేతిక జ్ఞానంవల్లా ''విశ్వామిత్ర సృష్టి'' చేసినవాడుగా మానవుడి పట్ల రచయితకి గౌరవం వుండటం.

అహేతుక దోపిడీని, ఒక మనిషిమీద మరొక మనిషి పెత్తనాన్నీ పూర్తిగా తొలగించి వేసేటువంటి నూతన జీవిత రూపాల సృష్టి ధ్యేయంగా కల సమష్టి శ్రమని రచయిత కవితాత్మకం చెయ్యడం.

శారీరక సౌఖ్యప్రదాయినిగా కాకుండా జీవిత కష్టభూయిష్ట పథంమీద విశ్వాస పాత్రమైన సహచరిగా, సహాయకురాలిగా స్త్రీల పట్ల రచయిత దృక్పథం వుండటం.

పిల్లల పట్ల బాధ్యతా దృష్టి వుండటం. మనం చేసే ప్రతిపనికీ మనం వాళ్లకే బాధ్యులం అనే వైఖరి వుండటం.

జీవితం పట్ల పాఠకుల క్రియాశీల దృష్టిని పెంచి, శ్రమ సంతోషాన్నీ దాని మహత్తర ప్రాముఖ్యాన్నీ జీవితపు మహత్తర భావాన్నీ అర్థం అవకుండా అడ్డగించే ఆంతరికమైన, బాహిరమైన దాన్నంతటినీ జయించేటువంటి తమ సామర్థ్యం పట్లా తమ శక్తి పట్లా, వాళ్లకి విశ్వాసాన్ని కలిగించేందుకు రచయిత ప్రయత్నించడం.

యిదీ సూక్ష్మంగా శ్రామిక ప్రపంచానికి అవసరమైన రచయితని గురించి నా అభిప్రాయం.

శ్రామిక ప్రపంచంలో అధికారేచ్ఛ జాగృతం అవుతోందనీ, యీ క్రమం ప్రపంచ మంతటా ఒక్క యూరప్‌లోనే కాకుండా ఆసియా, ఆఫ్రికాలలో కూడా వుందనీ మీకు తెలుసు.

మరి మీరు, సోవియట్ యూనియన్ శ్రామికుల అగ్రగాములైన మీరు, ప్రపంచ శ్రామికజనానికి ఒక ఉదాహరణ, ఆదర్శమూ అనీ, లక్షలాది కళ్లు మీకేసే చూస్తున్నాయనీ, లక్షలాది చెవులు మీరు చెప్పేది వింటున్నాయనీ తెలుసుకోవాలి.

మానవుడి పట్ల నూతన దృష్టిని ప్రచారం చేసే వాళ్లుగా, నూతన జీవిత నిర్మాణ బోధకులుగా వుండేట్టు, మీమీద, యువజనంమీద, చరిత్ర బాధ్యత

గొడ్డళ్ళూ, గొలుసులూ, బందుకులూ, సంకెళ్ళూ లాంటి నానా రకాల పనిముట్లూ పరికరాలూ చేసుకోవడానికి వీలైన ముడి ఖనిజంగా పరిగణిస్తుంది.

యీ సిద్ధాంతాన్ని ప్రచారం చేసే వాళ్లు కూడా "వంచకులే" అంటే నిజాయితీపూర్వకమైన, క్రియాత్మకమైన, శ్రమించే జీవితానికి అనర్హులు. శ్రామిక జనాలకి అల్పమూ, అవమానకరమూ అయిన జీవిత రూపాలకి భిన్నమైన వాటిని వూహించలేని, వూహించాలని ఇష్టంలేని వాళ్లు. "జన్మతః" వున్న, లేదా రాక్షస ప్రేరిత దుష్ట సహజాతాల సిద్ధాంతం, "అనాగరికులు" అని పిలిచేటువంటి వాళ్లు, ఆఫ్రికన్ నీగ్రో తెగలు, లేదా సైబీరియన్ తెగలు — జాకుత్‌లు, బుర్యాత్‌లు, తుంగుస్‌లు — వాస్తవానికి, మానవజాతుల శాస్త్రజ్ఞులు చూపించినట్టు చాలా దయగల మనుషులన్న యదార్థం వల్ల సులభంగా వమ్ము అయిపోయింది.

యింకొంచెం ధర్మ పరాయణులూ లేదా యింకొంచెం కుటిలురూ అయిన యీ బోధకులు కనిపెట్టిన అత్యుత్తమమైంది యేమంటే "పరిణామవాదం," సామాజిక వ్యవస్థ జీవిత రూపాల మందమైన, క్రమానుగతాభివృద్ధి.

కాని ధర్మమూ, కౌటిల్యమూ వాళ్లకి దాదాపు ఒకటే. పెట్టుబడిదారీ సమాజ "పరిణామం", అత్యంత ఆరోగ్యవంతులైన లక్షలాది మనుషులను నాశనం చేసిన నాలుగు సంవత్సరాల క్రూరమైన హత్యలకి దారి తీసింది, యీ హత్యా కాండలోకి శ్రామికుల్ని, యీ "పరిణామపు" రక్షక స్వభావంలో నమ్మకం వున్న సోషలిస్టులని లాగింది. "సాంస్కృతిక"మైన యూరప్‌ని బ్రహ్మాండంగా ఆటవికం చేసింది. రక్త పాతంలో కాసుల రాశుల్ని మూటకట్టుకున్న లెక్క లేనంత మంది మోస గాళ్లని తయారుచేసింది. మరో కొత్త యుద్ధాన్ని, యింకా భయంకరమైన దాన్ని, రప్పించే బెదిరింపులు చేస్తోంది. యిదంతా మీకు యిప్పటికే తెలుసు.

ఆఖరిగా, సామాన్య నిరాయుధీకరణకి సోవియట్ యూనియన్ ముందు పెట్టినటు వంటి ముసాయిదా సంధిని, పరిణామ సిద్ధాంతపు రక్షక స్వభావంలో నమ్మకం వున్న సాంస్కృతిక జనం తిరస్కరించారు అని మీకు తెలుసు.

నానా జాతి సమితి[133] అప్రతిష్టాకరమైన పిరికితనం యూరపియన్ సంస్కృతికీ దాని మానవ వ్యతిరేక సారాన్ని వెల్లడి చేసే వర్గ సమాజానికీ గల కడపటి దివాళాకోరుతనం తప్ప వేరేమీ కాదని మీరు గమనించి, సదా గుర్తుంచుకోవాలి.

మీరు నిజాయితీపరులైన వాళ్లు కావాలంటే విప్లవకారులు అవాలి.

# నేను రాయడం యెలా నేర్చుకున్నాను

కామ్రేడ్స్,

నాకు మాట్లాడే అవకాశం వచ్చిన ప్రతి పట్టణంలో నన్ను చాలా మంది నోటి మాటగానో, రాత మూలకంగానో నేను రాయడం యెలా నేర్చుకున్నదీ చెప్పమని అడుగుతూ వుంటారు. అదే ప్రశ్నని యు.ఎస్.ఎస్.ఆర్. నాలుగు మూల లనుంచీ రచనలు చెయ్యడం ఆరంభించిన యువకులు తమ ఉత్తరాల్లో అడుగుతూ వుంటారు. ''కథలు యెలా రాయాలి అన్న దాన్ని గురించి ఒక పుస్తకం సంక లితం చెయ్యమనో'', లేదా ''సాహిత్య సిద్ధాంతాన్ని అభివృద్ధి చెయ్యమనో'' లేదా ''సాహిత్యంమీద ఒక పాఠ్యగ్రంథాన్ని ప్రచురించమనో'' నన్ను చాలా మంది అడి గారు. నేను అలాంటి పాఠ్యగ్రంథాన్ని రాయలేను, అలాంటి పనిని చెయ్యలేను కూడా. అదీ కాకుండా అలాంటి పుస్తకాలు యిప్పటికే వున్నాయి; అవి, ఒక వేళ మరీ అంత బాగా లేకపోయినా, అంతో యింతో పనికి వస్తాయి.

రాయడం నేర్చుకునే వాళ్ళకి సాహిత్య చరిత్రని గురించిన పరిజ్ఞానం వుండి తీరాలి. ఒక మనిషి వృత్తి యేదేనా కానీయండి, అతనికి దాని అభివృద్ధి చరిత్ర తెలిసి వుండాలి. యేదేనా ఒక పరిశ్రమలో వున్న కార్మికులు, లేదా యింకా అయితే, ఒక ఫాక్టరీలో వున్న కార్మికులు అది యెలా పుట్టింది, క్రమేపీ అభి వృద్ధి చెందింది, యెలా ఉత్పత్తి మెరుగు పడింది తెలుసుకుని వున్నట్టయితే వాళ్ళ సాంస్కృతిక చరిత్రలో తమ శ్రమ ప్రాముఖ్యం గురించిన మరింత అవ గాహనతో, మరింత ఉత్సాహంతో యింకా బాగా పనిచేస్తారు.

విదేశీ సాహిత్యం గురించిన పరిజ్ఞానం కూడా అవసరం, యేమంటే సాహిత్య సృజన అనేది సారంలో అన్ని దేశాలకీ, అందరు ప్రజలకీ ఒకటే. యిది వూరికే లాంఛనంగా, పైపై విషయాలకి, అంటే గోగొల్ ''మృత జీవుల'' కథాంశం

పూష్కిన్‌నుంచి వచ్చిందనీ, పూష్కినే బహుశా దాన్ని ఇంగ్లీషు రచయిత లారెన్స్ స్టెర్న్ రాసిన ''ఏ సెంటిమెంటల్ జర్నీ''నుంచి తీసుకున్నాడనీ లాంటి వాటికి సంబంధించే కాదు. అలాగే వస్తువు విషయంలో గోగొల్ రాసిన ''మృత జీవుల''కీ డికెన్స్ రాసిన ''ది పిక్‌విక్ పేపర్స్''కీ వున్న పోలిక కూడా అంత ప్రాముఖ్యమైంది కాదు. ముఖ్యమైంది యేమిటీ అంటే, యేనాటినుంచో ప్రతి చోటా మానవ హృదయాలని వశం చేసుకునే వల యెప్పుడూ అల్లుకుని వుంది, యిప్పుడు కూడా అల్లుకుని వుంది అనే వాస్తవాన్ని గుర్తించడం; మరో పక్క, యెప్పుడూ, ప్రతి చోటా మానవుణ్ణి మూఢ నమ్మకాలనుంచీ, దురభిప్రాయాలనుంచీ, విముక్తం చెయ్యడమే తమ ధ్యేయంగా పెట్టుకున్న వాళ్లూ యెప్పుడూ వున్నారు, యిప్పుడు కూడా వున్నారు అనీ గుర్తించడం. మనిషికి మురిపం కలిగించే చిన్న విషయాల్లో నిమగ్నమైన వాళ్లున్నట్టే, చుట్టూతా వున్న జీవితంలోని అల్పత్వానికీ, నీచత్వానికీ వ్యతిరేకంగా యెదురు నిలిచిన తిరుగుబాటుదార్లూ యెప్పుడూ వున్నారనీ, యిప్పుడు కూడా వున్నారనీ గుర్తించడమూ ముఖ్యమే. మానవులకి ముందుదారి చూపించి, ఆ పథంమీద సాగాలని బోధించి ఒప్పించిన తిరుగుబాటుదార్లు, వర్గ సమాజం సృష్టించిన నీచపరిస్థితులంతోటి, దురాశ, అసూయ, కశ్మలం, శ్రమ పట్ల వైముఖ్యం లాంటి అసహ్యకరమైన చెడుగులతో శ్రామిక జనాన్ని భ్రష్టం చేసిన బూర్జువా సమాజంతోటి రాజీనీ, సామరస్యాన్నీ బోధించిన వాళ్లమీద 'ఆఖరి పోటీ జరిగే ఆ దినాన' పై చెయ్యి సాధిస్తారని గుర్తించడం కూడా ముఖ్యం.

మానవ శ్రమ, సృజనల చరిత్ర మానవుని చరిత్రకంటే యెంతో యెక్కువ ఆసక్తికరంగా, ప్రముఖంగా వుంటుంది. ఒక మనిషి వంద యేళ్లు రాకుండానే గతిస్తాడు, కాని అతని కృషి శతాబ్దాలు మనుతుంది. విజ్ఞానశాస్త్రవేత్తకి తన ప్రత్యేక విభాగ అభివృద్ధి చరిత్ర తెలిసినందువల్ల విజ్ఞానశాస్త్రపు అద్భుత విజయాలు, దాని శీఘ్ర అభివృద్ధి సాధ్యమయాయి. విజ్ఞానశాస్త్రానికీ, సాహిత్యానికీ ఉమ్మడిగా వుండేది చాలా వుంది: రెండింటిలోనూ పరిశీలన, తులనాత్మకత, అధ్యయనం ప్రముఖ పాత్ర వహిస్తాయి; విజ్ఞానశాస్త్రవేత్తా, రచయితా యిద్దరకీ కూడా భావనా శక్తీ, సద్యోజనిత జ్ఞానం వుండి తీరాలి.

భావనా శక్తీ సద్యోజనిత జ్ఞానమూ వాస్తవాల గొలుసులోని ఖాళీలని భర్తీ చెయ్యడానికి ఉపకరిస్తాయి. ఆ రకంగా విజ్ఞానశాస్త్రవేత్త పరికల్పనలనీ, సిద్ధాంతాలనీ రూపొందించుకోవడానికి వీలవుతుంది. అవి ప్రకృతి శక్తులలోకీ, దృగ్గోచర విషయాలలోకీ మనసు చేసే శోధనలని కొంచెం యించుమించులో నిర్దుష్టంగా నడిపిస్తాయి. క్రమేపీ ప్రకృతి శక్తులనీ, దృగ్గోచర విషయాలనీ లొంగ దీసుకో

వడంద్వారా మానవుడి మనసూ, యిచ్ఛా మానవ సంస్కృతిని నిర్మిస్తాయి. అదే వాస్తవానికి మన "అపర సృష్టి."

యీ ఉద్ఘాటన రెండు వాస్తవాలవల్ల బాగా ధృవపడుతుంది: ఆ కాలంలో తెలిసినటువంటి ఇనుము, సీసం, గంధకం, పాదరసం మొదలైన **మూలకాల** అధ్యయనంమీద ఆధారపడి ప్రఖ్యాత రసాయన శాస్త్రవేత్త దీమ్త్రి మెందెలేయెవ్[134] మూలకాల "ఆవర్తన పట్టిక" తయారుచేశాడు. అది ప్రకృతిలో అనావిష్కృత మూలకాలు యింకా చాలా వున్నాయని తెలియ చేసింది. ఆయన యీ అజ్ఞాత మూలకాల స్పెసిఫిక్ గ్రావిటీ కూడా సూచించాడు. వీటన్నిటినీ కూడా యిప్పుడు కనిపెట్టడం జరిగింది. పైగా మెందెలేయెవ్ పద్ధతి ఆయనే అనుమానించని అనేకమైన యితర మూలకాలని కనిపెట్టడానికి సహకరించింది.

మరో వాస్తవం: ఫ్రెంచి నవలా రచయితా, మహా రచయితలలో ఒకడూ అయిన బాల్జాక్ ఓ పుస్తకంలో కొన్ని గ్రంథుల గురించి రాశాడు. అప్పట్లో విజ్ఞానశాస్త్రానికి తెలియని కొన్ని శక్తివంతమైన గ్రంథిస్రావాలు బహుశా మానవ శరీర నిర్మాణంమీద ప్రభావం కలిగిస్తూ వుంటాయనీ, లనేక మానసిక శారీరక లక్షణాలకి కారణం అవుతాయనీ ఆయన అనుకొన్నాడట. కొన్ని దశాబ్దాల తర్వాత, గతంలో తెలియకుండా వుండిన కొన్ని గ్రంథులు మానవ శరీరంలో వున్నట్టు కనిపెట్టడం, ఆరకంగా వినాళ గ్రంథులనే ముఖ్య సిద్ధాంతం యేర్పడ్డం జరిగాయి. విజ్ఞానశాస్త్రవేత్తలా, ప్రముఖ రచయితలా సృజనాత్మక కార్యకలాపాలు అలా మిళితం కావడం అనేది యేమీ అరుదు కాదు. లొమొనోసొవ్,[135] గ్యోతేలు కవులూ, విజ్ఞాన శాస్త్రవేత్తలూ కూడానూ, అలాగే నవలా రచయిత స్ట్రిండ్‌బెర్గ్గానూ. ఆయన "కేప్టెన్ కోల్" అనే తన నవలలో[136] వాతావరణంనుంచి నత్రజనిని తీయడం అనే దాన్ని భవిష్యద్దర్శనం చేసిన తొలి వాళ్లల్లో ఒకడు.

పాత్రలనీ, "నమూనా"లనీ సృష్టించడానికి సంబంధించిన సాహిత్య సృజనాత్మక కళ, భావనా శక్తినీ, నూతన అన్వేషణనీ అపేక్షిస్తుంది. తనకి పరిచయమైన ఒక దుకాణదారుణ్ణో, ప్రభుత్వ ఉద్యోగినో లేదా శ్రామికుణ్ణో చిత్రించడంలో రచయిత కొంచెం అటూ యిటూగా ఒక వ్యక్తి ఫోటోగ్రాఫ్‌ని మాత్రమే విధేయంగా తయారు చేసినట్లయితే, అది సామాజిక బోధనా ప్రాముఖ్యం యేమీ లేని ఫోటోగ్రాపు తప్ప మరేంకాదు. అది మన జీవిత పరిజ్ఞానాన్ని గానీ, మన మానవ అవగాహనని గానీ విస్తరించడానికి దాదాపు యేమీ చెయ్యదు.

అయితే, రచయిత ఒక యిరవై, యాభై లేకపోతే ఒక వంద మంది దుకాణ దార్లకి, ప్రభుత్వ ఉద్యోగులకి, శ్రామికులకి ప్రత్యేకంగా వుండే అత్యంత విశిష్ట

వర్గ లక్షణాలని, అలవాట్లని, అభిరుచుల్ని, హావభావాలని, విశ్వాసాలని, మాట తీరుని సంశ్లేషించ గల సమర్థత చూపిస్తే, వాటిని ఒక్క దుకాణదారుడిలో ప్రభుత్వ ఉద్యోగిలో లేదా శ్రామికునిలో కేంద్రీకరించి సూక్ష్మ రూపంలో ప్రదర్శించగల సామర్థ్యం చూపిస్తే ఆ రకంగా అతను ఒక నమూనాని సృష్టిస్తున్నాడన్న మాట, మరి అదే కళ. ఒక కళాకారుడికి అతని విస్తృత పరిశీలనలూ, పుష్కలమైన జీవితానుభవమూ వాస్తవాల పట్ల అతని సొంత దృక్పథాన్ని దాటిపోగల శక్తిని, అంటే వైయక్తిక స్థితిని, దాటి పోగల శక్తిని తరచుగా యిస్తాయి. వ్యక్తిగతంగా బాల్జాక్ బూర్జువా సామాజిక విధానం కోరుకున్నవాడు, కాని తన రచనల్లో పెటీబూర్జువాల నైచ్య, అసభ్య స్వభావాన్ని ఆశ్చర్యకరమైన, నిర్దాక్షిణ్యమైన నగ్నత్వంతో చిత్రించాడు. రచయితలు తమ వర్గ, కాలాల నిష్పాక్షిక చరిత్రకారులైన సందర్భాలు చాలా వున్నాయి. అలాంటి సందర్భాల్లో వాళ్ల రచనలు, జంతువులు ఆహారం సేకరించుకుని, జీవించిన పరిస్థితుల్ని అధ్యయనం చేసే, అవి పునరుత్పత్తి కావడానికీ, అదృశ్యం కావడానికీ కారణాల్ని అధ్యయనం చేసే, మనగలగడానికి అవి చేసే బర్బర పోరాటాన్ని వర్ణించే పండితులైన ప్రకృతి శాస్త్రవేత్తల నిష్పాక్షికతతో తుల్యమైనట్టుగా వుంటాయి.

జీవన పోరాటంలో స్వయం రక్షణ అనే మానవుడి సహజ చోదన రెండు బలమైన సృజనాత్మక శక్తుల్ని అతనిలో పెంపొందించింది — అవబోధనా శక్తి, భావనా శక్తి. అవబోధనా శక్తి అంటే ప్రకృతి దృగ్గోచర విషయాల్ని సాంఘిక జీవిత వాస్తవాలని పరిశీలించి, పోల్చి, అధ్యయనం చేసే శక్తి అన్న మాట; ఒక్క ముక్కలో చెప్పాలంటే అవబోధనా శక్తి అంటే ఆలోచించడం అని. భావనా శక్తి కూడా, సారంలో, ప్రపంచాన్ని గురించిన ఆలోచనా విధానమే. కాని అలంకారాల్లో కళాత్మకంగా ఆలోచించడమన్న మాట. భావనా శక్తి అంటే విషయాలకీ, ప్రకృతి మూల శక్తులకీ మానవ లక్షణాలనీ, అనుభూతులనీ, ఆ మాటకొస్తే, అభిప్రాయాలనీ ఆపాదించే శక్తి అన్నమాట.

గాలి ''మూలుగుతోంది'' లేదా ''రోదిస్తోంది'' అనడం, చంద్రుడి ''వ్యాకులమైన వెన్నెల'' అనడం, ''గలగల'' మనే సెలయేరు అనడం, ''జలజల'' మనే నీటిబుగ్గ అనడం లాంటి అనేకమైన మాటలని, ప్రకృతి దృగ్గోచర విషయాలని యింకా స్పష్టంగా చేసేటటువంటి మాటలని అనడం వింటాం, మనం అంటాం.

దీన్ని ఆన్త్రోపోమార్ఫిజం అంటారు. రెండు గ్రీకు పదాల నుంచి యేర్పడింది: ఆన్త్రపస్ అంటే మనిషి, మార్ఫే అంటే రూపం లేక ప్రతిమ. మానవుడు తనకి గోచరమైన ప్రతిదానికీ మానవ లక్షణాలని ఆపాదించే మార్గం యిక్కడ కనిపి

స్తుంది. అతను యీ లక్షణాలని వూహించుకుని వాటిని ప్రకృతి దృగ్గోచర విషయాలలోని, తన శ్రమలోని ప్రతీదానితో జత చేస్తాడు. సాహిత్యంలో ఆన్త్రోపోమార్ఫిజానికి స్థానం వుండకూడదనేవాళ్లు, ఆ మాట కొస్తే అది సాహిత్యానికి అవరోధంగా వుంటుందని భావించే వాళ్లు వున్నారు. కాని యీ మనుషులే ''ఎముకలు కొరికేచలి'' అంటారు, ''సూర్యుడు మందహాసం చేశాడు'' అంటారు, ''వసంతం వచ్చింది'' అంటారు. ''దుర్మార్గమైన వాతావరణం'' అని కూడా అంటారు, వాతావరణానికి సంబంధించి నైతికపరమైన ప్రమాణాలని ఉపయోగ పెట్టడం కష్టమైనా.

జంతువులకి గనక భావనా శక్తి వుండి వుంటే, దేవుణ్ణి సింహాలు ఒక బ్రహ్మాండమైన అజేయమైన సింహంగానూ, మూషికాలు ఒక మూషికంగానూ, యింకా అలా అలా భావించుకుంటాయని ప్రాచీన గ్రీకు తత్వవేత్త క్సెనొఫేన్ అన్నాడు. మశక దేముడు బహుశా మశకం గానే వుంటాడు, క్షయ క్రిమి దేముడు క్రిమి గానే వుండచ్చు. మానవుడు తన దేముణ్ణి సర్వజ్ఞునిగా, సర్వశక్తివంతునిగా సర్వోత్పాదకునిగా నిర్మించుకున్నాడు. యింకోలా చెప్పాలంటే తన సర్వోత్తమ ఆకాంక్ష లన్నింటినీ తన దేముడికి అంటగట్టాడు. దేముడు కల్పితం మాత్రమే, ''జీవితపు వేసట దారిద్ర్య'' సంభూతుడు, జీవితాన్ని సంపద్వంతంగా, సులభతరంగా, మరింత ధర్మబద్ధంగా, రమ్యంగా చెయ్యాలనే అస్పష్ట కామన సంభూతుడు. దేముణ్ణి నిత్య జీవిత కోలాహలంపైన పెట్టడం జరిగింది. యేమంటే పురుషులా, స్త్రీలా అత్యుత్తమ గుణాలకి వాళ్ల శ్రమక్రమంలో ఉద్భవించిన కోరికలకీ జీవిత వాస్తవాలలో స్థానం లేకపోయింది. జీవిత వాస్తవం బొటాబొటీగా బతకడానికి చేసే శ్రమాన్విత పోరాట రంగంగా వుంది.

తమ అత్యుత్తమ గుణాలు నిరాటంకంగా అభివృద్ధి చెందేటట్టుగా జీవితాన్ని పునర్ నిర్మించగలగడం యెలాగో శ్రామికజనపు నాయకులైన వాళ్లు గుర్తించినప్పుడు, దేముడు అతిరిక్తంగా మనిన విషయం కావడం మనకి కనిపిస్తుంది. తమలోని అత్యుత్తమమైన దానిని భగవద్రూపంలో మహనీయం చేసే అవసరం యింకెంత మాత్రం లేదు, యేమంటే అత్యుత్తమమైందాన్ని యిప్పుడు సజీవ, ఐహిక వాస్తవంగా మార్చగలగవచ్చు.

భగవంతుణ్ణి కూడా సాహిత్య ''నమూనా''ల మాదిరిగానే, సంక్షేప నిర్దిష్ట రూప నియమానుసారంగా సృష్టించడం జరిగింది. వైవిధ్యభరిత వీరులు చేసిన విశిష్ట సాహస కృత్యాలని సంగ్రహించడం లేదా ''సంక్షేపించడం'' జరిగి, అప్పుడు ఏక వీరుని మూర్తిలో నిర్దిష్ట రూపం, అంటే ఒక భీముని రూపమో, రష్యన్

కల్పిత రైతు సీరుడు ఇల్యా మూరొమెత్స్[137] రూపమో యివ్వడం జరిగింది. అలాగే యే వ్యాపారికేనా గానీ, కులీనుడికేనా గానీ, రైతుకేనా గానీ వుండే విశిష్ట లక్షణాలని "సంక్షేపించి" అప్పుడు యేదో వ్యాపారిగానో, కులీనుడిగానో, రైతుగానో నమూనా చెయ్యడం జరుగుతుంది — యింకోలా చెప్పాలంటే ఒక సాహిత్య నమూనా సృష్టి అయిందన్న మాట. యీ రకంగానే ఫౌస్ట్,[138] హామ్లెట్,[139] డాన్ క్విక్సట్ సృష్టి అయారు. టాల్‌స్టాయ్ మెతగ్గా, భగవద్భక్తి వున్న తన ప్లతోన్ కరతాయెవ్‌ని,[140] దొస్తొయేవ్‌స్కీ తన కరమాజొవ్‌లనీ,[141] స్విద్రిగైలొవ్‌లనీ[142], గొంచరోవ్ తన ఒబ్లొమొవ్‌ని[143] సృష్టించారు.

యీ మనుషులు వాస్తవంలో యెప్పుడూ వున్న వాళ్లు కారు. కాని అలాంటి వాళ్లు చాలా మంది వున్నారు, వూరికే యింకా అల్పత్వంతోనూ, యింకా తక్కువ అవిభాజ్య వేషంతోనూ వుంటారంతే. విడివిడి యిటుకలతో శిఖరాలనీ, గుళ్లనీ తాపీవాళ్లు కట్టినట్టే రచయితలు కొన్ని మానవ గుణాలని సంక్షేపించిన సాహిత్య నమూనాలని తయారుచేశారు. ఒక అబద్ధాలకోరుని మనం హ్లెస్తకోవ్[144] అంటాం, ఇచ్చకాలమారిని మొల్చాలిన్[145] అంటాం, వంచకుణ్ణి టార్‌టూఫ్[146] అంటాం, అసుయా పరుణ్ణి ఒథెల్లో[147] అంటాం. యిలా యెన్ని పేరులైనా చెప్పుకుపోవచ్చు లెండి.

సాహిత్యంలో రెండు రీతులు లేదా శాఖలు వున్నాయి: రొమాంటిసిజం, వాస్తవికత. వాస్తవికత అంటే జనాన్నీ, వాళ్ల జీవిత స్థితి గతుల్నీ సత్య పూరితంగా, రంగు పులమకుండా ప్రదర్శించడం అని. రొమాంటిసిజానికి కొన్ని నిర్వచనాలని యివ్వడం జరిగింది కాని, అందరు సాహిత్య చరిత్రకారులకీ ఆమోదయోగ్యమైన సూటి, సర్వంకష నిర్వచనం రూపొందలేదు. రొమాంటిసిజంలో నిశితంగా విభేదం చూపించే ధోరణులని రెండింటినీ — ఉదాసీన, క్రియాత్మక — వేరుపరచాలి. ఉదాసీన రొమాంటిసిజం మానవుడికి జీవితంతో — ఆ జీవితాన్ని ఆకర్షవంతం చేస్తూ — రాజీ కుదిరించే ప్రయత్నం చేస్తుంది. లేదా అతని ఆంతరంగిక జీవితపు వంధ్య ఆత్మ పరీక్షలోకీ, ప్రేమ, మృత్యువు యింకా అలాంటి వూహాతీతమైనవీ, శాస్త్రవిజ్ఞానంవల్ల తప్ప చింతన వల్లా మననంవల్లా పరిష్కరించ వీలు గానివీ అయిన "జీవితపు అపరిష్కృత సమస్యల"లోకీ నెట్టి, తద్వారా తన చుట్టూతా వున్న విషయాలనుంచి అతని దృష్టిని మళ్లిస్తుంది. క్రియాత్మక రొమాంటిసిజం జీవించడానికి మానవుడి యిచ్ఛని దృఢతరం చెయ్యడానికీ, తన చుట్టూతా వున్న జీవితంమీద యెదురు తిరిగేటట్టు, ఆ జీవితం బలవంతంగా రుద్దే యే నియంతృత్వానికేనా వ్యతిరేకంగా అతను యెదురు తిరిగేటట్టు చెయ్యడానికీ కృషిచేస్తుంది.

యేమైనా, తృప్తికలిగించేటంత కచ్చితంగా బాల్జాక్, తుర్గేనెవ్, టాల్‌స్టాయ్,

గోగొల్, లెస్కోవ్ లేదా చేహోవ్ లాంటి ఉత్తమ శ్రేణి రచయితలు రొమాంటిసిస్టులా లేక వాస్తవికవాదులా అని చెప్పడం కష్టం. యేమంటే గొప్ప కళాకారుడిలో వాస్తవికత, రొమాంటిసిజం మిళితం అయివుంటాయి. బాల్జాక్ వాస్తవికవాది కాని ఆయన "మేక తోలు ముక్క" లాంటి నవలని, వాస్తవికత అనేది ఆమడ దూరంలో వున్న నవలని, రాశాడు. తుర్గేనెవ్ కూడా, గోగొల్‌నుంచి చేహోవ్, బూనిన్[148]దాకా మన ప్రముఖ రచయితల మాదిరిగా, రొమాంటిక్ ధోరణిలోనే రాశాడు. రొమాంటిసిజం వాస్తవికవాదాల యీ విలీనత మన గొప్ప సాహిత్యానికి వున్న వైశిష్ట్యం. అది దాన్ని మౌలిక ప్రజ్ఞతోటీ, శక్తితోటీ నింపింది. యివి సర్వ ప్రపంచ సాహిత్యంమీదా నిత్యం అధికం అయేటువంటీ, బలమైనటువంటీ ప్రభావం కలిగిస్తున్నాయి.

రొమాంటిసిజానికీ, వాస్తవికవాదానికీ మధ్యన వున్న సంబంధం, మీకు స్పష్టపడుతుంది, యీ ప్రశ్నని మీరు పరిశీలిస్తే కామ్రేడ్స్: "రాయాలనే ప్రేరణ యెందుకు కలుగుతుంది?" యీ ప్రశ్నకి రెండు సమాధానాలు వున్నాయి. నాకు ఉత్తరం రాసిన ఒకరు, శ్రామికుని కూతురు అయిన 15 యేళ్ల వయసు వున్న ఆడపిల్ల, ఒక సమాధానం యిచ్చింది. ఆమె ఒక ఉత్తరంలో యిలా రాసింది:

"నాకు పదిహేనేళ్లు. అయినా యింత చిన్న వయసులో కూడా నాలో రచయిత ప్రతిభ జాగృతం అయింది, దానికి కారణం అణగార్చే మందకొడి జీవితం."

"రచయిత ప్రతిభ" అనేదానికి బదులుగా రాయాలనే కోరిక అనడం 'అణగార్చే మందకొడి జీవితాన్ని' కాంతివంతం చెయ్యడానికీ, సంపద్వంతం చెయ్యడానికీ మరింత సమంజసంగా వుండేదేమో. యీ ప్రశ్న ఉత్పన్నం అవుతుంది: అలాంటి జీవిత పరిస్థితుల్లో యెవళ్లేనా యేం రాయగలరు?

యీ ప్రశ్నకు జవాబుని వోల్గా తీరంలో, ఉరల్స్ ప్రాంతంలో, సైబీరియాలో జీవించే అనేక జాతులు సమకూర్చాయి. నిన్నటికీ వాటిల్లో చాలా వాటికి వర్ణమాల లేదు. అయితేనేం మనకంటే యేనాడనగానో శతాబ్దాలకి ముందే వాళ్లు అడవి గర్భంలో, బాడవ బీళ్ల మధ్యలో, ప్రాచ్య ప్రాంతపు ఊషర స్టెప్‌మైదానాల్లో, ఉత్తర ప్రాంతపు తంద్రాల్లో పాటలూ, పద్యాలూ, వీరోచిత గాథలూ, దేముళ్లని గురించిన పురాణాలూ సృష్టించి తమ 'అణగార్చే మందకొడి జీవితాల'ని సంపద్వంతమూ, సౌందర్యవంతమూ చేసుకున్నారు. యిదంతా కూడా "మతపరమైన సృజనాత్మకత" అనే పేరుతో చలామణీ అవుతుంది గాని సారంలో యిదంతా కళా ప్రపంచానికి చెందిందే.

నాకు ఉత్తరం రాసిన ఆ అమ్మాయి నిజంగా ప్రతిభని అభివృద్ధి చేసుకుంటే — అలా చేసుకోవాలని నేను మనస్పూర్తిగా కోరుతున్నాను — ఆమె బహుశా రొమాంటిక్ ధోరణిలో రాస్తుంది. 'అణగార్చే మందకొడి జీవితాన్ని' అందమైన ఊహాకల్పిత వస్తువులతో శృంగా

రించి, మనుషులని ఉన్నదానికంటే బాగా చిత్రించబోతుంది. గోగొల్ ''ఇవాన్ ఇవానొవిచ్ యెలా ఇవాన్ నికీఫొరొవిచ్‌తో పోట్లాడాడు'', ''పాత ధోరణి భూస్వాములు'', ''మృత జీవులు'' లాంటివి రాసిన వాడు, కాని ''తరాస్ బూల్బ'' కూడా ఆయనే రాశాడు. మొదటి మూడూ కూడా 'మృత ఆత్మల'తో వున్న ప్రజలని చిత్రిస్తాయి. ప్రచురమైన సత్యాన్ని వర్ణిస్తాయి. యేమంటే అలాంటి వాళ్లు గతంలో వున్నారు, యివాళ వున్నారు. యిలాంటి వాళ్లని వర్ణించడంలో గోగొల్ వాస్తవికవాది.

''తరాస్ బూల్బ''లో జపొరోజ్‌యె కోసక్కులని భగవద్భక్తి వున్న వాళ్లుగా, వీరులూ శక్తిమంతులూ అయిన మనుషులుగా, తమ శత్రువులని బల్లెం కొనమీద పైకి యెత్తే వాళ్లుగా వర్ణించడం జరిగింది, బల్లెపు కొయ్యకాడ మనిషి బరువుకి విరిగిపోవడం అనేది స్పష్టమైన విషయమైనా. గోగొల్ రాసినలాంటి కోసక్కులు వాస్తవానికి యెన్నడూ వున్న వాళ్లు కాదు, ఆ కథ యేదో అందమైన అబద్ధం. యిందులో, ''రూడీ పాంకో'' యితర కథలలో లాగానే, గోగొల్ రొమాంటిసిస్టు. దానికి బహుశా కారణం యేమిటంటే ఆయన ''మృత జీవుల'' 'అణగార్చే మందకొడి జీవితాల' పరిశీలనతో విసిగిపోయి వుంటాడు.

చాలా విషయాల్లో మానవుడు యింకా పశువే. కాని అదే సమయంలో, సాంస్కృతిక పరంగా, పచ్చికాయలాంటి వాడు. అతన్ని పొగిడి, కొంచెం మెరుగు పెట్టడం మంచిదే. అది అతని ఆత్మ గౌరవాన్ని పెంచుతుంది. తన సృజనాత్మక శక్తులమీద విశ్వాసం పెంచు తుంది. అదీగాక, మానవుణ్ణి పొగడ్డానికి యెంతో సమంజసత్వం వుంది, యేమంటే మంచిది అయిన ప్రతీదీ, సాంఘికంగా విలువైన ప్రతీదీ అతని శక్తి సంకల్పాలవల్లనే సృష్టి అవుతున్నాయి.

యిప్పుడు నేను చెప్పిన దానంతటి బట్టీ సాహిత్యంలో రొమాంటిసిజపు అవసరం వుందని నేను అంటున్నట్టు అర్థమా? అవును, ఆ అవసరం వుందనే నేను అంటాను, కాని ఆ పదానికి ఒక అతి ముఖ్యమైన విస్తృతి కలిగించినప్పుడే.

యిదిగో యిక్కడ నాకు ఉత్తరం రాసిన యింకో అతని మొర. పదిహేడేళ్ల కుర్ర పనివాడు. ''నాకు యెన్ని అనుభవాలు కలుగుతున్నాయంటే రాయకుండా వుండలేకపోతున్నాను.''

యీ సందర్భంలో రాయాలన్న ప్రయత్నం జీవిత ''దారిద్ర్యం''నుంచి కాదు, జీవిత ఐశ్వర్యంనుంచి, అనుభవాల పౌష్కల్యంనుంచి, వాటిని వర్ణించాలన్న ఆంతరిక ప్రేరణనుంచి వచ్చింది. నాకు ఉత్తరాలు రాసే యువకులలో చాలా యెక్కువ మందికి వాళ్లు జీవితాను భవాలతో సంపద్వంతంగా వుండబట్టి, తాము చూసి, అనుభవించిన దాన్ని అందరికీ చెప్పాలని కోరిక వుండడం బట్టీ రాయాలని కోరుకుంటున్నారు. వాళ్లల్లోనుంచి సుమా రుగా వాస్తవికవాదులు పుట్టుకొస్తారు, కాని వాళ్ల వాస్తవికవాదం కొంత రొమాంటిసి జంతో రంగరించుకుని వుంటుందని నాకు అనిపిస్తుంది. అది ఆరోగ్యవంతమైన ఆధ్యాత్మిక

వెల్లువ దశలో తప్పని సరీ, ధర్మమూనూ. మనం యిప్పుడు సరిగ్గా అలాంటి దశలో జీవిస్తున్నాం.

అంచేత నేను యెందుకు రాయనారంభించాను అనే ప్రశ్నకి నేను జవాబు చెప్తాను: 'అణగార్చే మందకొడి జీవితపు' తాకిడివల్లా, నేను 'రాయకుండా వుండలేనట్టుగా' అను భవాలతో నిండిపోవడంవల్లా కూడానూ. మొదటి హేతువు నా మందకొడి జీవితంలోకి ''పామూ, గద్దల కథ'', ''మండే హృదయపు కథ''[149], ''సముద్ర పక్షి'' లాంటి వాటిని ప్రవేశపెట్టే ప్రయత్నం నా చేత చేయిస్తే, రెండవది ''ఇరవై ఆరుమంది పురుషులూ, ఒక అమ్మాయి,'' ''ఒర్‌లోవ్ దంపతులు'', ''రౌడీ'' లాంటి ''వాస్తవిక'' లక్షణం వున్న కథలని రాసేటట్టు చేసింది.

మన ''రొమాంటిసిజం'' సమస్యకి సంబంధించి యీకింది విషయాన్ని గుర్తుంచు కోవాలి. చేహొవ్ ''రైతులు'', ''కనుమలో'' అనేవీ, బూనిన్ రాసిన ''గ్రామం'', రైతాంగం గురించిన ఆయన కథలు అన్నీనీ వెలువడే దాకా మన కులీన సాహిత్యం రైతుని మరో ప్రపం చపు యేదో రకమైన ''క్రీస్తు సత్యాన్ని'' కాంక్షించే గంగిగోవులాంటి, ఓర్మి వున్న మని షిగా చిత్రించడానికి యిష్టపడ్డ సాహిత్యమే. ఆ సత్యానికి జీవితపు వాస్తవ విషయాలలో వేళ్ళు లేవు. అయినా కూడా తుర్గెనెవ్ కథ ''ఖోర్, కలీనిచ్''లోని కలీనిచ్, టాల్‌స్టాయ్ ''యుద్ధమూ — శాంతీ''లో ప్లతోన్ కరతాయెవ్ లాంటి రైతులు దాన్ని గురించి కలగన్నారు. భూస్వామ్య దాస్యాన్ని రద్దు చెయ్యడానికి యిరవై యేళ్ళ ముందర రైతుని ''దేముడి సత్యాన్ని'' కలగనే గంగిగోవులాంటి, ఓర్మికలవాడిగా చిత్రించాలనే వైఖరి ద్యోతకం అయింది. అప్పటికే భూస్వామ్యదాస రైతాంగం తమ నిగూఢ శ్రేణులనుంచి ప్రతిభా సమన్వితులైన పారిశ్రామికవేత్తలని తయారుచేసినా, రైతాంగం జన్మ ప్రసాదించిన కవి, ప్రముఖ విజ్ఞాన శాస్త్రవేత్త లొమొనోసావ్ అనే మహా మేరువు లాంటి వ్యక్తిని గురించి పత్రికల్లో తరచుగా వినబడుతూ వున్నా, సాహిత్యంలో అలా జరిగింది.

నిన్నటి దాకా పౌర హక్కులు లేకపోయినా, ఉత్పత్తిదారులు, నౌకా నిర్మాతలు, వర్త కులు యిప్పుడు కులీనులతో సమంగా జీవితంలో పక్కపక్క తను స్థానం ఆక్రమిస్తున్నారు. రోమ్‌లోని స్వేచ్ఛాయుతులైన వాళ్ళల్లాగా తమ పూర్వపు యజమానుల సరసన కూర్చుం టున్నారు. అలాంటి వాళ్ళని తమలోనుంచే తయారు చెయ్యడంద్వారా రైతాంగం తమలో దాగి వున్న శక్తినీ, ప్రతిభనీ వెల్లడి చేసింది. కులీన సాహిత్యం ఆ కాలపు నాయకుడిగా యీ కొత్త వ్యక్తిని, నిజమైన, స్ఫుటమైన, సంకల్ప శక్తి వున్న వాడిగా, జీవిత దాహం వుండి, నిర్మాతగా, సంపదలని కూడబెట్టే వాడిగా వ్యవహార దక్షునిగా గుర్తించి చిత్రించడంలో విఫలమైంది. తద్భిన్నంగా అణకువ వున్న భూస్వామ్యదాసుల్ని, ఆ సాహిత్యం ఆప్యాయంగా చిత్రించుకుంటూనే పోయింది. దయా హృదయుడూ, ఉదారవాదీ అయిన యజమాని

భూస్వామ్యదాసులు విశ్వసించని తీరుని అద్భుతంగా వర్ణిస్తూ 1852లో లియో టాల్‌స్టాయ్ ''ఒక భూస్వామి జీవితంలో ఒక ఉదయం'' అనే విచారగ్రస్తమైన స్కెచ్‌ని రాశాడు. 1862నుంచి టాల్‌స్టాయ్ రైతు బిడ్డలకి విద్యాబోధన మొదలుపెట్టాడు. విజ్ఞానశాస్త్రాన్నీ, పురోగతినీ ఆయన కాదనడం, సరిగ్గా బతకడం యెలాగో తెలుసుకోవాలంటే ప్రజలు రైతుల దగ్గరికి పోవాలని ఆయన బోధించడం జరిగింది. డెబ్బయవ దశకంలో ఆయన ''ప్రజల కోసం'' తన కథలని రాశాడు, రైతుల్ని భగవద్భక్తి వున్న వాళ్లుగా వర్ణిస్తూ. రైతుల్ని రొమాంటిసైజ్ చేశాడు, గ్రామీణ జీవితం వర ప్రసాదితం అయిందనీ, రైతు భూమిని దున్నడం పవిత్ర శ్రమ అనీ బోధించాడు. ఆఖరికి తన కథ ''మనిషికి యెంత నేల కావాలి?'' అన్నదాంట్లో మనిషి సమాధికి కావలసిన ఆరడుగుల నేలే అవసరం అని రాశాడు.

అణకువగా, భగవద్భక్తి వున్న మనుషుల్ని ఆర్థిక జీవితపు నూతన రూపాలని నిర్మించుకునే వాళ్లగా, పెటీబూర్జ్వాలుగా, బడా వ్యాపారులుగా, దురాశాపూరితులై పీడించే వాళ్లగా సల్తికోవ్ — శ్చెద్రీన్,[150] గ్లేబ్ ఉస్పేన్‌స్కీలు చిత్రించిన వాళ్లల్లాంటి మనుషులుగా తయారు చేస్తున్నాయి. అదే సమయంలో తిరుగుబాటుదారులుగా, విప్లవకారులుగా నిర్దిష్ట పరిస్థితులు తయారుచేస్తున్నాయి. ఏమైనా వీళ్లందర్నీ ప్రభు వర్గపు సాహిత్యం గమనించలేదు. మన సాహిత్యంలోని అత్యుత్తమ నవలల్లో ఒకటైన ''ఒబ్లోమొవ్''లో రచయిత గొన్‌చరోవ్ సోమరితనంవల్ల దాదాపు యేదో బడుద్ధాయిగా తయారైన రష్యన్ ప్రభువంశీకుణ్ణి ఒక జర్మన్‌తోటి తారతమ్యం చేసి చూపించాడు. గాని గొన్‌చరోవ్ తను కలిసి జీవించి, అప్పటికే దేశ ఆర్థిక జీవితాన్ని నడప నారంభిస్తున్న పూర్వ భూస్వామ్యదాసులలో ఒకడితో కూడా అలా చూపించలేదు. అప్పట్లో కులీన వర్గ రచయితలు ఒక విప్లవకారుణ్ణి వర్ణిస్తే వాడు ఒక విదేశీయుడైన బల్గేరియనో[151] లేదా మాటకి మాత్రం తిరుగుబాటుదారుడో అయివుండేవాడు, రూదిన్[152] లాగా. తన కాలపు నాయకుడిగా, సంకల్పమూ, క్రియాశీలతా వున్న రష్యన్ మనిషి సాహిత్యంలో ప్రతిబింబించలేదు, సాహిత్యకారుల దృష్టిపథం అవతల వున్నాడు, ఆ రష్యన్ వాడు బాంబుల సహాయంతో తను సుమారైన గోల చేస్తూ వున్నా. క్రియాశీల, ప్రయోజనపుష్ట రొమాంటిసిజం రష్యన్ కులీన వర్గ సాహిత్యానికి పరాయిది అని చూపించడానికి చాలా సాక్ష్యం వుంది. దానికి ఒక షిల్లెర్‌ని[153] తయారుచేసే శక్తి లేకపోయింది. ''ది రాబ్బర్స్''కి బదులుగా అది ''మృత జీవుల'', ''జీవచ్ఛవం'',[154] ''మృతగృహాలు''[155] ''మూడు చావులు''[156] యింకా అలాంటి బోలెడు చావుల అద్భుతమైన వర్ణనని అందించింది. దొస్తొయేవ్‌స్కీ ''నేరమూ శిక్ష'' ముక్కాలు ముప్వీసం షిల్లెర్ ''ది రాబ్బర్స్''కి వ్యతిరేకంగా రాసినదే కావచ్చు.

క్రియాశీల సాంఘిక విప్లవాత్మక రొమాంటిసిజం రజ్నోచీన్‌త్సి[157] మేధావుల సాహిత్యానికి కూడా పరాయిదిగానే వుండింది. రజ్నోచీన్‌త్సి తమ అదృష్టంతోటీ, జీవిత నాట

కంలో తన స్థానంతోటీనే యెక్కువ పట్టింపు. అతను నిరంకుశ ప్రభుత్వపు సమ్మెటకీ "ప్రజం" దాయకీ మధ్యన వుండేవాడు.

స్లెప్‌ట్సోవ్ రాసిన "గడ్డు రోజులు", ఒసిపోవిచ్-నొవొద్వోర్‌స్కీ[158] రాసిన "కాకీ, కోకిలా యేదీ కాని ఒక జీవితంలోనుంచి ఒక సంఘటన" అనేవి, తమకి జీవితంలో వేళ్లు లేక, "కాకులూ, కోకిలూ కాకుండా" వున్న వాళ్లుగా, లేదా ఆత్మ సంతృప్తిగల పశుబుద్ధులుగా మారిన మేధావి జనులని గురించి విషాదపు విధేయమైన, శక్తివంతమైన కథలు. ప్రతిభావంతమైన, ప్రముఖ మేధానిధి, కాని తగినంతగా ఆదరణ పొందని, రచయిత అయిన పొమ్యలోవ్‌స్కీ[159] తన "మోలొతొవ్" "పశుబుద్ధుడి ఆనందం" అనే నవలల్లో అలాంటి వాళ్లను చూపించాడు. సోషలిస్టు సంస్కృతిని నిర్మించే హక్కు కోసం శ్రామిక జనం రక్త తర్పణం కావించిన దేశంలో, పశుబుద్ధివాడు ఒక చవకబారు కలిమిని తనకి నిర్మించుకోవడానికి, ఓ మేరకి నెగ్గుకొస్తూ, ఆరంభించి, తిరిగి తల యెత్తుతూ వున్న మన రోజుల్లో యీ రెండు కథలూ సందర్భవశాత్తూ యింకా ప్రయోజనకరంగా వున్నాయి.

'నరోద్నిక్కు'లైన రచయితలు గ్రామీణ జీవితాన్ని ఆదర్శవంతం చెయ్యాలన్న తమ పట్టుదలతోటి ఉన్నత వర్గపు రచయితల గొంతుని ప్రతిధ్వనించారు. నరోద్నిక్కులకి రైతు 'మీర్' అనబడే గ్రామీణ సమాజపు, సత్యం తప్ప మరేమీ తెలియని సహజ సోషలిస్టుగా కనిపించాడు. అద్భుత ప్రతిభావంతుడైన ప్రభువంశీకుడు హెర్జెన్[160] రైతాంగం పట్ల యీ దృక్పథాన్ని పెంపొందించిన మొదటివాడు. యీ ధోరణిని ఎన్. మిఖైలోవ్‌స్కీ[161] అందుకున్నాడు. ఆయన "వాస్తవిక సత్యం," "న్యాయమైన సత్యం" అనే రెండు సత్యాలని కని పెట్టాడు. తమ రొమాంటిసిజం తమ ఉన్నత వర్గపు సహచరులతో ప్రతిభా లోపంలో మాత్రమే విభేదిస్తూ వుంటే, నరోద్నిక్కు రచయితలు "సమాజం"మీద కలిగించిన ప్రభావం దుర్బలమైందీ, అల్ప కాలికమైందీనీ. మినాయ్, మిత్యాయ్[162] లాంటి వాళ్ల రైతు స్వాప్నికులు పొలికూష్కు,[163] కలీనిచ్, కరతాయెవ్ యింకా అలాంటి పుణ్య రైతు పాత్రల నీరస నకళ్లు.

యిప్పుడే చెప్పిన గ్రూపుకి దగ్గరగా వుండే యిద్దరు చాలా ప్రముఖ రచయితలున్నారు, కాని సాంఘికంగా చాలా దూరదృష్టి వున్న వాళ్లు, నరోద్నిక్కుల కంటే చాలా యెక్కువ ప్రతిభకలవాళ్లు. నిజానికి నరోద్నిక్కులందర్నీ కలుపుకున్నా యింకా యెక్కువ ప్రతిభ వున్న వాళ్లు. వాళ్లు డి. మామిన్-సిబిర్యాక్,[164] గ్లేబ్ ఉస్పేన్‌స్కీలు. పట్టణ జీవితానికీ, పల్లె జీవితానికీ, పారిశ్రామిక పనివాడికీ రైతుకీ మధ్యన వుండే తేడాని గుర్తించి, వర్ణించిన మొదటి వాళ్లు వీళ్లే. యిందులో ప్రత్యేకమైన వివేచన చూపించిన వాడు గ్లేబ్ ఉస్పేన్‌స్కీ. ఆయన రెండు ప్రముఖ గ్రంథాలని రాశాడు: "రాస్తెర్యాయెవ్ వీధి

నీతులు'', ''భూమాత శక్తి''. వీటి సామాజిక విలువ యింకా వుంది. మొత్తంమీద ఉస్పేన్‌స్కీ కథలు తమ బోధనాత్మక ప్రాముఖ్యాన్ని పోగొట్టుకోలేదు. తన చుట్టూతా వున్న జీవితపు విస్తృత పరిజ్ఞానాన్నీ, పరిశీలించే సామర్థ్యాన్నీ ఆయననుంచి నేర్చుకోవడం మన యువ రచయితలకి మంచిది.

నేను యిదివరకే ఉల్లేఖించిన కథలు ''రైతులు,'' ''కనుమలో'' అనే వాటిల్లోనూ, ''నూతన భవంతి''లోనూ రైతుని యేవిధంగా ఆదర్శీకరించడానికీ చేహొవ్ తీవ్రమైన వ్యతిరేకత కనబరుస్తాడు. యీ ధోరణికి సంబంధించి యింకా యెక్కువ ద్వేషాన్ని ఇవాన్ బూనిన్ తన చిన్న నవల ''గ్రామం''లోనూ, అలాగే తన రైతు కథల్లోనూ కనబర్చాడు. చాలా విశేషమైన సంగతి యేమిటంటే రైతు రచయితఇవాన్ వోల్‌నోవ్[165] — యితను చాలా ప్రతిభావంతుడైన వర్థమాన రచయిత — గ్రామీణ జీవితాన్ని వూరికే తూర్పార బట్టేస్తూ వర్ణిస్తాడంటే. గ్రామీణ జీవితం, రైతు మనస్తత్వం లాంటి కథా వస్తువులు యెంతో సందర్భోచితమైనవీ, యివాళ ముఖ్యమైనవీ. ఈ విషయాన్ని మన యువ రచయితలు సంపూర్తిగా గ్రహించాలి.

యిక్కడ చెప్పుకున్న దాన్ని బట్టీ, జీవితం పట్ల క్రియాశీల దృక్పథాన్నీ, నూతన జీవిత రూపాలని నిర్మించుకోవడంలో ప్రేరణకి ఆధారంగా జీవించాలనే యిచ్ఛనీ, శ్రమ యోగ్యతనీ, మనం యెంతో కష్టపడి నిర్మూలించుకుంటూ వున్న దుష్ట వారసత్వపు పాత ప్రపంచం పట్ల పగనీ బోధించేదిగా ''రొమాంటిసిజాన్ని'' మన సాహిత్యం యింకా తెలుసుకోలేదన్న విషయం స్పష్టం. యే సంస్కారహీనత పునరుద్ధరణ నేనాగానీ, చిత్తశుద్ధితో నివారించాలని మనం కోరుకుంటూన్నాం. అలాంటి పునరుద్ధరణద్వారా వర్గ సమాజాన్నీ, పరాన్న భుక్కులూ, కొల్లగొట్టేవాళ్ళూ శ్రామికులనీ రైతులనీ అలా దోచుకుంటూ వుండడాన్నీ మనం చిత్తశుద్ధితో నివారించాలని కోరుకుంటూన్నాం. అలాంటప్పుడు యీ బోధన ప్రాణావసరం అవుతుంది. సోవియట్ యూనియన్ శత్రువులందరూ కలగంటూ వున్న ''పునరుద్ధరణ'' యిది. పూర్వపు వర్గసమాజాన్ని తిరిగి స్థాపించాలని శ్రామికవర్గాన్ని ఒత్తిడి చేసే ప్రత్యేక లక్ష్యంతోనే వాళ్ళు సోవియట్ యూనియన్‌మీద ఆర్థిక దిగ్బంధనం విధిస్తున్నారు. శ్రామికవర్గానికీ, బూర్జువావర్గానికీ మధ్యన వున్న వైరుధ్యాన్ని సమసింపజాలమనీ, సంపూర్ణ విజయమో, సర్వనాశనమో మాత్రమే ఆ వైరుధ్యాన్ని పరిష్కరించగలవనీ శ్రామికుడైన రచయిత అయినవాడు అత్యంత స్పష్టంగా గుర్తించి తీరాలి. ఆ విషాదకర వైరుధ్యంనుంచి, చరిత్రగతి శ్రామికవర్గంమీద నిర్దాక్షిణ్యంగా విధించిన కర్తవ్యపు గురుతర స్వభావంనుంచి, ఒక క్రియాశీల ''రొమాంటిసిజం'' సృష్టికామన, మనస్సంకల్పాల సాహసం, రష్యన్ విప్లవ శ్రామిక మానవుడిలో యెప్పుడూ ప్రత్యేకంగా వున్న విప్లవ గుణాలు, ఉత్పన్నం అయి తీరాలి.

స్వేచ్ఛా పథం సులభమైంది కాదనీ, జీవితమంతా ముచ్చటైన మగువలతో కలిసి

టీ తాగుతూ గడపగలిగే కాలం యింకా రాలేదనీ, మన యువజనంలో సుమారుగా చాలా మంది అలవాటు పడినట్టుగా అద్దం ముందు నుంచుని స్వీయ సౌందర్యారాధనతో ముగ్ధులై పోవడానికి గాని సమయం రాలేదని నాకు తెలుసు ననుకోండి. ప్రస్తుత జీవిత పరిస్థితుల్లో శాంతియుత యేకాంత జీవితం నిర్మితం కాలేదనీ, యెంచుకున్న భాగస్వామితోటో, లేక యేకాంత జీవితమో ఆనందాన్ని ప్రసాదించలేదనీ, సంస్కారహీన సంపద చిరస్థాయిగా వుండదనీ యేమంటే అలాంటి సౌఖ్యప్రదమైన దాని పునాదులు ప్రపంచంలో అన్ని చోట్లా కూలిపోతున్నాయనీ జీవిత వాస్తవాలు యింకా యింకా యెక్కువగా అవగతం అయేట్టు చేస్తున్నాయి. యెన్నో లక్షణాల వల్ల యిది సమ్మకంగా రుజువు అవుతోంది: ప్రపంచమంతా పశుబుద్ధులకి దాపురించిన విద్వేషం, నిర్వేదం, విపత్తు సూచన; యూరవ్ సాహిత్యంనుంచి వచ్చే శోకన్నాలు; రేపటి గురించి తనకి వున్న భయాన్ని తొలగించుకోవాలనే నిష్ఫల ఆశతో సంపన్న పశుబుద్ధివాడు అవలంబించే తెగింపుతో కూడిన ఉల్లాసం, ఆఖరిగా నీచసుఖాల కోసం వ్యాధిగ్రస్త వెంపరలాట, లైంగిక భ్రంశనలు, నేరం ఆత్మహత్యలు విస్తరించడం. ''పాత ప్రపంచం'' నిజంగా ప్రాణాంతక రుజాగ్రస్తంగా వుంది. దాని విషపూరిత వాయువులు సోకకుండా తప్పించుకోవడానికి మనం దాన్ని పరిత్యజించే వేగిరపాటు పడాలి.

యూరవ్‌లోని మనిషిమీద సాంఘిక నైతిక పతనం కమ్ముకుంటూ వుంటే, మన దేశంలోని శ్రామిక జనంలో మన శక్తిమీదా, సమష్టి శక్తిమీదా దృఢ విశ్వాసం పెరుగుతోంది. శ్రేష్ఠతరమైన జీవిత పథంమీద తగిలే ఆటంకాలని అధిగమిస్తూ వుంటేనే యీ విశ్వాసం సర్వదా ఉత్పన్నం అవుతుందనీ, యిలాంటి విశ్వాసమే సృజనాత్మక శక్తులలో మహితమైందనీ, యువజనులారా, మీరు తెలుసుకోవాలి. ఆ ''పాత ప్రపంచం''లో మానవత వున్నది ఒక్క విజ్ఞానశాస్త్రమేననీ అంచేత నిస్సంశయంగా విలువైందనీ కూడా మీరు తెలుసుకోవాలి. ఒక్క సోషలిజపు భావాలు తప్ప ఆ ''పాత ప్రపంచం''లో చలామణీ అయే ''భావాల''న్నీ మానవత్వం లేనివే. యేమంటే యేదో ఒక రకంగా ఆ భావాలు, శ్రామికజన స్వేచ్ఛా సంస్కృతులని పణం పెట్టి వ్యక్తుల అధికారాన్నీ, ''ఆనందపు'' అరాచకత్వాన్నీ స్థాపించి సమర్థించాలని చూసేవే.

నా యౌవనంలో జీవితాన్ని గురించి యెప్పుడూ అసంతృప్తి పడ్డట్టు నాకు గుర్తులేదు. నా చుట్టూతా వున్న వాళ్లు గొణుగుతూ వుండేవాళ్లు. ఒకళ్లకొకళ్లు సాయం చేసుకోవడం యిష్టం లేక, ఆ విషయాన్ని కప్పి పుచ్చుకునేందుకు వాళ్లు అలా చేస్తున్నారని గుర్తించినప్పుడు నేను వాళ్లని అనుకరించడం మానేశాను. యేరకమైన ప్రతిఘటనా యివ్వలేని వాళ్లూ, పని చెయ్యలేని వాళ్లూ, పని చెయ్యాలని లేని వాళ్లూ, మామూలుగా తోటి వాళ్ల కష్టం మీద సునాయాసంగా గడిపెయ్యడానికి ఉన్ముఖులైన వాళ్లూనే అలా గొణిగే వాళ్లల్లో అధికులు.

కొంటె పనులు చేసే ప్రేరణ కలిగించేది. ఒక పంథొమ్మిదేళ్ల వ్యక్తి యీ మధ్యనే నాకు యిలా రాయడం జరిగింది:

''వంట గదిలో, వూసులాడు కోవడంలో, బాధతో కుక్కలా అరిచే అరుపుల్లో వుండే చంపేటంతటి విసుగుని నా శరీరంలోని ప్రతీ అణువూ ద్వేషిస్తోంది.''

సరిగ్గా అలాంటి విసుగే నన్ను ధ్వంసం కావించే కొంటె పనులు చేసేటట్టు తరిమింది: యింటి కప్పు యెక్కి గుడ్డ పీలికలని పొగగొట్టాల్లో కుక్కేవాణ్ణి; మరిగే కాబేజీ పులుసులో గుప్పిళ్ల కొద్దీ ఉప్పు పోసేవాణ్ణి; గోడగడియారంలోకి దుమ్ముపోసేవాణ్ణి. మొత్తంమీద ఆకతాయితనం అని పిలిచే పనులని చేసేవాణ్ణి. దీనికి కారణం యేమంటే నేను సజీవ వ్యక్తిని అని అనుకోవాలనే కోరిక వున్నప్పటికీ, ఆ విషయం గురించి నమ్మకం కలిగించుకోడానికి యితర మార్గాలు నాకు దొరకలేదు. పడిపోయిన చెట్లూ గుబురుగా పెరిగిన పొదలూ కుళ్లిపోతూ వున్న ఆకులూ నిండుగా వున్న అడివిలో మోకాలి దాకా కూరుకు పోయి దారి తప్పానేమోనని నాకు అనిపించేది.

నాకు యీ సంఘటన గుర్తు వుంది: మేం వున్న వీధిలోనుంచే, సైబీరియాకి పంపాల్సిన నేరస్థుల గుంపుల్ని సాయుధ కాపలాతోటి జైలునుంచి రేవు దగ్గరికి తీసికెళ్లేవాళ్లు. అక్కడ వోల్గా, కామా నదుల్లో వెళ్లే స్టీమర్లమీద వాళ్లని యెక్కించేవాళ్లు. మందకొడిగా, వెంవెంట బోతూవుండే ఆ గుంపు అంటే నాకు వింత ఆకర్షణ కలిగేది. వాళ్లు అరదండాల్లో వున్నా సాయుధ కాపలాలో వున్నా, యేదో గమ్యం వాళ్లకి వుందనీ, నేనేమో కంతలోని ఒంటరి యెలకలాగా వుంటూ, యిటికల నేల వున్న మురికి వంటింట్లో చాకిరీ చెయ్యాల్సి వుంటోంది అనే వూహాలవల్ల యీ అనుభూతి ఉత్పన్నం అయివుండచ్చు. ఒక రోజున అర దండాలు వేసి శిక్ష పడ్డవాళ్ల పెద్ద గుంపుని నది కేసి తీసుకుపోతున్నారు. కాళ్లూ చేతులూ బేడీలు వేసి కట్టేసిన యిద్దరు నేరస్థులని కాలిబాటమీద నడిపించుకుపోతున్నారు. వాళ్లల్లో ఒకడు లావుగా వున్నాడు, నల్లని గడ్డం వుంది. అతని కళ్లు గుర్రం కళ్లల్లాగా వున్నాయి. కమిలి వివర్ణమైన దెబ్బ మచ్చ నుదుటిమీద వుంది. చెవి చీలిపోయి వుంది — భయంకరమైన ఆకారం. కళ్లు ఆ మనిషిమీదే లగ్నం చేసి, అతనికి యెదరగా నేను కాలిబాటమీదే వెళ్లాను. ఉన్నట్టుండి అతను ఉల్లాసంగా వుండే గొంతుకతో గట్టిగా నా కేసి అరిచాడు, ''ఓయ్, కుర్రకుంకా, వచ్చి మాలో కలు!'' అని.

వింతగా అతని కేసి ఆకర్షితుణ్ణయి, నేను అతని దగ్గరికి పరిగెత్తి వెళ్లాను. కాని సాయుధ కాపలావాడు నన్ను వెధవా అని తిట్టి వెనక్కి గెంటేశాడు. అతను గనక అలా చేసి వుండకపోయినట్లయితే నేనా భయంకరమైన మనిషిని యేదో కలలో మాదిరీ అను సరించి వెళ్లిపోయి వుండేవాణ్ణి, వూరికే యేమంటే అతను నాకు తెలిసిన మనుషులలో మాదిరీ యేమీ సామాన్యమైంది లేకుండా వున్నాడు. అతను భయంకరంగా బేడీలు తగి

లించి వున్నా గానీ మరోరకం జీవితం కేసి ఆకర్షిస్తున్నాయినట్టు నేను భావించాను. ఆ మనిషినీ, అతని ఉత్సాహభరితమైన, దయాన్వితమైన గొంతుకనీ నేను త్వరగా మర్చిపోలేక పోయాను. అతనితోటి కలిసి వున్నదే ఆ రోజుల నాటి అంతే శక్తివంతమైన మరో మానసిక ముద్ర. నాకు యెలాగో ఓ లావాటి పుస్తకం దొరికింది. దాని మొదటి పేజీలు చిరిగి, యెక్కడో పోయాయి. నేను దాన్ని చదవడం మొదలుపెట్టాను. ఒక పేజి వున్న కథకి సంబంధించి తప్ప నాకు యేం చాలా మూలం తెలీలేదు. అందులో ఒక రాజు ఒక సాదా విలుకాణ్ణి మహా రథుణ్ణి చేద్దామనుకుంటాడు. దానికి విలుకాడు పద్యంలో సమాధానం చెప్తాడు.

అయితే నన్ను మామూలు రైతుగా మననీయండి,
నా తండ్రి అంతే, తనయుడూ అలాగే వుండాలి.
తక్కువ తరగతి మనుషులు గొప్పవాళ్ల కంటే
ఘనమైన పనులు చెయ్యడం అధిక కీర్తికదా.

నేను యీ యిబ్బందికరమైన పాదాలని రాసి పెట్టుకున్నాను. అవి నాకు చాలా కాలం ఒక పథికునికి చేతికర్రలాగా ఉపయోగపడ్డాయి. లేకపోతే అప్పట్లో ''ఉత్తములైన'' సంస్కార హీనులు అందించే నీచ సలహాలకీ, ప్రలోభాలకీ వ్యతిరేకంగా నన్ను కవచం కాపాడి నట్టుగా ఉపకరించాయి. చాలా మంది యువకులకి వాళ్ల ఊహాలని ఒక రకమైన చోదక శక్తితో, ఒక ఓడ తెరచాపల్ని గాలిలాగా, నింపే పాదాలు తగులుతూనే వుంటాయి.

యీ పాదాలు షేక్స్పియర్ ముందు వాళ్లల్లో ఒకడైన రాబర్ట్ గ్రీన్ అనే 16వ శతాబ్దపు రచయిత ''ది కామేడీ ఆఫ్ ది మెర్రీ ఆర్చర్ జార్జ్ గ్రీన్ అండ రాబిన్ హుడ్''లోవని పదేళ్ల తర్వాత నాకు తెలిసింది. దీన్ని కనిపెట్టడం నాకు సంతోషం కలిగించింది. సాహిత్యం పట్ల యితోధికమైన ప్రేమ కలిగింది. కష్ట భూయిష్ట జీవితంలో ప్రజలకి నిజమైన మిత్రంగా, సహకారిగా ప్రాచీన కాలంనుంచీ వున్నది సాహిత్యమే.

అవును, కామ్రేడ్స్, జీవితపు క్రూరత్వ మొరటుతనాల భయానుభవం నాకు కొల్లలుగా వుండింది. ఒక సారి నేను ఆత్మహత్య చేసుకునే దాకా కూడా పోయాను. చాలా కాలం దాకా అది గుర్తుకు వచ్చినప్పుడల్లా సిగ్గుతోటీ, అసహ్యంతోటీ నాకు నేనే దహించుకు పోయేవాణ్ణి.

ప్రజలు చెడ్డగా వుండే దానికంటే యెక్కువగా అజ్ఞానంగా వున్నారనీ, నేను వాళ్ల వల్ల గాని, జీవితంవల్ల గాని జడుసుకోలేదనీ, కాని నా సాంఘిక, తదితరమైన నిరక్ష

రాస్యతవల్ల అనీ, జీవితంలో నాకు ఆత్మ రక్షణ లేకపోవడమూ, నిస్సహాయతవల్లనే అనీ గుర్తించినప్పుడే నాకా భయం పోయింది. విషయాలు వున్న తీరు సరిగ్గా అదీ. మీరీ విషయాన్ని గురించి బాగా ఆలోచించాలి. యేమంటే మీలో కొంత మందినుంచి వచ్చే మూలుగులూ, అసంతృప్తులూ వాళ్ల ఆత్మరక్షణా లేమినుంచీ, మానవుణ్ని లోపలి నుంచీ బయటినుంచీ అణగదొక్కడానికి ''పాత ప్రపంచం'' వాడే ప్రతి దానిమీదా తిరుగుబాటు చేసే తమ శక్తిలో విశ్వాసం లేకపోవడంనుంచీ ఉత్పన్నం అవుతాయి.

నా బోటి వాళ్లం ఆ రోజుల్లో ఒంటరిగాళ్లం, సమాజానికి ''సవతి బిడ్డలం.'' తన శక్తిని గుర్తించిన చైతన్యం తొణికిసలాడుతూ, అధికారం హస్తగతం చేసుకుని, వ్యక్తుల ప్రయోజన పుష్ట శ్రమకి పూర్తి విలువ యివ్వడం నేర్చుకుంటున్న శ్రామిక వర్గానికి మీరు వందల సంఖ్యలో చెంది వున్నారు. యీ విషయాల్ని మీరు గుర్తించాలి: మన కార్మిక కర్షక ప్రభుత్వం అధికారంలో వుంది. సూటికి నూరు పాళ్లూ మీ సామర్థ్యాలని అభివృద్ధి చేసుకోవడానికి అది సహకరించి తీరుతుంది, సహకరించగలదు కూడా. అది క్రమేపీ చేస్తున్న పని అదే. బూర్జువాలు — దానికీ, మీకూ బద్ధ శత్రువులు — దాని జీవితాన్నీ కృషినీ ఆటంకపరచకుండా వుంటే యింకా యెక్కువ విజయవంతంగా ఆ పనిని చేస్తుంది.

మీరు మీలోనూ, మీ శక్తిలోనూ ఒక విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. ఆటంకాలని అధిగమించడంద్వారానూ సంకల్పాన్ని దృఢ పరచుకోవడంద్వారానూ సాధించే విశ్వాసం. మీరు మీలోనూ, మీ చుట్టు పక్కలా వున్న గతకాలపు నైచ్య నికృష్ట వారసత్వాన్ని నిర్మూలించడం నేర్చుకోవాలి యేమంటే మరోలా మీరు ''పాత ప్రపంచాన్ని పరిత్యజించడం'' యెలా చెయ్యగలరు? అది బోధించే రీతిలో మీకు ఆ శక్తీ, ఆచరించాలనే కోరికా లేనట్లయితే మీరా పాటని పాడలేరు. యెవళ్లకేనా గానీ స్వల్ప ఆత్మ విజయమేనా సరే యితోధిక బలాన్ని యిస్తుంది. శరీరాన్ని సుశిక్షితం చేసుకోవడం అధికతర ఆరోగ్యాన్నీ, నిలబడే శక్తినీ చురుకునీ మనిషికి యివ్వడం మీకు తెలుసు. మనసుకీ, సంకల్పానికీ అదే శిక్షణని యివ్వాలి.

అలాటి శిక్షణ ప్రసాదించగల అద్భుత విజయాలకి సంబంధించి ఒక దృష్టాంతం యిదిగో: కొంత కాలం కితం బెర్లిన్‌లో ఒక ఆడమనిషిని ప్రదర్శనకి పెట్టారు. ఆమె చెరో చేతిలోనూ చెరో పెన్సిలూ పట్టుకుని, యింకో దాన్ని పళ్ల మధ్యన పెట్టుకుని యేకకాలమందు అయిదు భాషల్లో అయిదు మాటలని రాయగలిగింది. యిది యేదో నమ్మశక్యం కానిదిగా కనిపించవచ్చు. అంటే భౌతికంగా కష్టమనే దృష్ట్యానే కాకుండా ఆలోచనలో అసాధారణమైన విభజన చేసుకోవడం అవసరం అనే దృష్ట్యా కూడా. యేమైనా ఆమె అలా చెయ్యడం మాత్రం నిజం. పైపెచ్చు, అస్తవ్యస్త

బూర్జువా సమాజంలో అద్భుతమైన శక్తి సామర్థ్యాలని యెలా వృథా చెయ్యడం జరుగుతుందో కూడా యీ వాస్తవం తెలియచేస్తుంది. నలుగురి దృష్టి ఆకర్షించాలంటే చేతులమీద వీధులో నడవడం, యేమాత్రం ఉపయోగం లేని లేదా యేమాత్రం ఆచరణాత్మక విలువలేని స్పీడు రికార్డులు స్థాపించడం, యిరవై మంది ప్రత్యర్థులతోటి యేకకాలమందే చదరంగం ఆడ్డం, వెర్రెత్తి పోయే సాముగరిడీలు అష్టావధానాలు చెయ్యడం అక్కడ వుంటుంది. మొత్తంమీద భోగలాలసతతోటి వెక్కసంపుట్టి విసుగెత్తిన జనానికి గిలిగింతలు పెట్టడానికి ప్రచారం పొందే అట్టహాస ప్రదర్శనలని కనిపెట్టడం అక్కడ జరుగుతుంది.

''సమాజపు'' పరమ అజ్ఞానం విరోధిస్తూ వున్నా చర్చి తీవ్ర విద్వేషంతో పళ్లు పటపట కొరుకుతూన్నప్పుడు, పెట్టుబడిదార్ల దురాశ, కళా శాస్త్ర ''పోషకుల'' తిక్క కోరికలు వున్నప్పుడు మానవాళి శాస్త్ర సాంకేతిక కళా రంగాల్లో నిజంగా సాధించిన విలువైందీ, శాశ్వతంగా ఉపయోగకరమైందీ అంతా కూడా కష్టభూయిష్టమైన పరిస్థితుల్లో పనిచేస్తూ వ్యక్తులు సృష్టించిందే అనే విషయాన్ని యువకులైన మీరు తెలుసుకుని తీరాలి. సంస్కృతిని సృష్టించిన వాళ్లల్లో చాలా మంది సామాన్య శ్రామికులు వున్నారని గుర్తుంచుకోవాలి. ఉదాహరణకి మహత్తర భౌతికశాస్త్రవేత్త ఫారడే,[166] అనేకం కనిపెట్టిన ఎడిసన్[167] లాంటి వాళ్లు. మరమగ్గాన్ని కనిపెట్టిన ఆర్క్‌రైట్,[168] మరకారుడు. అత్యద్భుతమైన సింగాణీ కళానైపుణ్యం వున్న బెర్నార్డ్ పాలిస్సీ[169] కమ్మరి పని చేసేవాడు. యింతవరకూ ప్రపంచంలో అద్వితీయమని పేరు పొందిన మహా నాటక రచయిత షేక్‌స్పియర్ మామూలు నటుడు. మొల్యేర్[170] కూడా అంతే. మనుషులు తమ సామర్థ్యాలని అభివృద్ధి చేసుకోగలిగిన పద్ధతికి సంబంధించి వందలాది ఉదాహరణలు యివ్వవచ్చు.

యిదంతా కూడా యివాళ మానవాళి హస్తగతం అయిన శాస్త్రీయ విజ్ఞాన, సాంకేతిక యంత్ర సాధనాల విస్తార సామగ్రి సమకూర్చే ఉపయోగాలు అనుభవించని వ్యక్తులకి సాధ్యమైంది. మన దేశంలో సాంస్కృతిక కృషి యెంత సులభం అయిందో వూహించండి. యిక్కడ మనుషులని అర్థరహితమైన శ్రమనుంచి విముక్తి చెయ్యడానికి మనం కృషిచేస్తున్నాం. దుర్భరంగా దోచుకోవడంనుంచి శ్రామికులని విముక్తి చెయ్యడానికి కృషి చేస్తున్నాం. ఆ దోపిడీ వేగవంతంగా పతనమైపోయే ధనికవర్గాన్ని తయారుచేస్తుంది, శ్రామికవర్గాన్ని పతనం చేసే భయం కలిగిస్తుంది.

మీరు ఒక మహత్తరమైన, అత్యంత స్పష్టమైన కర్తవ్యాన్ని యెదుర్కొంటున్నారు — ''పాత ప్రపంచాన్ని పరిత్యజించడం'', నూతన ప్రపంచాన్ని సృష్టించడం అనే కర్తవ్యం. యిది ఆరంభమైంది. మన శ్రామికవర్గం చూపించిన ఆదర్శంద్వారా యీ క్రమం

అన్ని వేపులా అభివృద్ధి చెందుతోంది, అభివృద్ధి చెందుతూనే వుంటుంది, పాత ప్రపంచం దీని దారిలో యే ఆటంకాలని పెట్టినా సరే. యీ కార్య సన్నద్ధం వడం కోసం ప్రపంచమంతా శ్రామికులు నడుములు బిగిస్తున్నారు. వ్యక్తుల కృషి చుట్టూతా ఒక సానుభూతి వాతావరణం సృష్టి అవుతోంది. వాళ్ళు ఒక సమష్టి లోని విడివిడి తునకలుగా యింక యెంత మాత్రమూ భావించడం లేదు, దాని సృజనాత్మక సంకల్పాన్ని చాటే పథనిర్దేశకులుగా భావించుకుంటున్నారు.

యిలాంటి లక్ష్యం పెట్టుకున్న తర్వాత, మొట్టమొదటి సారిగా యెంతో సాహసంతో అలా పెట్టుకున్నాక, "యేం చెయ్యాలి?" అనే లాంటి ప్రశ్నకి తావులేదు. "బతకడం కష్టంగా వుంది" అంటారు కొందరు. నిజంగా అంత కష్టంగా వుందా? మీ అవసరాలు పెరగడంవల్లా, మీ తాత ముత్తాతలు యెన్నడూ కనీ వినీ యెరిగి వుండని వస్తువుల్ని మీరు కోరుకుంటూ వుండటంవల్లా కదూ బతకడం కష్టంగా వుందనిపించడం? బహుశా మీ కోరికలు అధికం అయ్యాయేమో?

మీలో చాలా మంది, సమష్టి కృషిలోని సంతోషాన్నీ కవిత్వాన్నీ అర్థం చేసుకుని పైసలని కూడబెట్టుకోవాలని వాంఛించకుండా, మానవుడిమీద, ప్రపంచంలోని మహత్తర అద్భుతమూ, ప్రపంచంలోని సకల అద్భుతాల సృష్టికర్తా అయిన మానవుడిమీద పైసలు చెలాయించే దుష్ట అధికారాన్ని మట్టు పెట్టే కోరికతో వున్నారనీ నాకు తెలుసుననుకోండి.

యిప్పుడు నేను రాయడం యెలా నేర్చుకున్నానూ అనేదానికి జవాబు చెప్తాను.

నేను జీవితంనుంచీ, పుస్తకాలనుంచీ ఉభయత్రా అనుభూతుల్ని పోగుచేసుకున్నాను. మొదటి వాటిని ముడి పదార్థంతో పోల్చవచ్చు, రెండవ వాటిని సగం ఉత్పత్తి అయిన పదార్థంతో పోల్చవచ్చు. లేదా, ముతగ్గా అయినా సాదా మాటల్లో చెప్పాలంటే మొదటి సందర్భంలో నేను పశువుతో వ్యవహరించాల్సి వచ్చింది, తర్వాత సందర్భంలో మహా చక్కగా పదును చేసిన చర్మంతో వ్యవహరించాల్సి వచ్చింది. నేను విదేశీ సాహిత్యానికి చాలా యెక్కువగా రుణపడివున్నాను, ముఖ్యంగా ఫ్రాన్సు దేశపు సాహిత్యానికి.

మా తాత క్రూరంగా, పిసినారిగా వుండేవాడు. కాని బాల్జాక్ "ఎజెనీ గ్రాండే" చదివే దాకా నేను ఆయన్ని సరిగా అర్థం చేసుకోలేకపోయాను. ఎజెనీ తండ్రి వృద్ధ గ్రాండే కూడా క్రూరంగా పిసినారిగా వుండి, మా తాతని పోలి వుండేవాడు. కాని అతను మా తాత కంటే యెక్కువ మొద్దుగా, తక్కువ ఆసక్తికరంగా వుండేవాడు. యీ ఫ్రెంచి మనిషితో పోలిస్తే, నేను ప్రేమించని ఓ ముసలి రష్యన్ మెరుగయ్యాడు. యిది ఆయన పట్ల నా దృక్పథంలో మార్పు తేలేదు కాని నేను ఒక

గొప్ప ఆవిష్కరణని, అంటే, మనిషిలో నేను చూడని దాన్నీ, నాకు తెలియని దాన్నీ, దేన్నో పుస్తకాలు నాకు తెలియచేస్తున్నాయి అన్నదాన్ని, చేశాను.

నీజ్ని నోవ్‌గొరొద్‌లోని తరహా జీవితాన్ని మనుషులు ఇంగ్లీషు, జర్మన్ రాష్ట్రాల్లో గడపడం లేదు గాని, అంతకంటే పెద్ద మెరుగు యేమీ కాదని జార్జి ఎలియట్ నీరసపు నవల ''మిడిల్‌మార్చ్'', ఔయెర్‌బాఖ్, స్పిల్‌హాగెన్ పుస్తకాలు నాకు తెలియచేశాయి. వాళ్లు అలాంటి విషయాలే మాట్లాడుకునే వాళ్లు — తమ ఇంగ్లీషు, జర్మన్ పైసలని గురించీ, ప్రభువంటే భయపడ్డమూ, ఆయన్ని ప్రేమించడమూ గురించీ మాట్లాడుకునే వాళ్లు. కాని సరిగ్గా మా వీధిలో వాళ్లల్లాగానే ఒకళ్లనొకళ్లు ద్వేషించుకునే వాళ్లు, ముఖ్యంగా, యేదో ఒక రకంగా తమ చుట్టూతా వున్న అధిక సంఖ్యాకుల కంటే భిన్నంగా వుండి, వేరే తరహాగా వుండేవాళ్లని. రష్యన్లకీ విదేశీయులకీ మధ్యన సారూప్యంగా వుండే అంశాల కోసం నేను వెదకడం లేదు. లేదు, నేను తేడాలు చూడబోయాను, అయినా కాని పోలిక కనిపించింది.

దివాళా తీసిన వర్తకులు, మా తాత అస్తమిత్రులు, థాకరే నవల ''వానిటీ ఫెయిర్''లోని మనుషుల మాదిరే, అదే విషయాలని గురించి మాట్లాడేవాళ్లు. నేను రాయడమూ, చదవడమూ స్తోత్రపాఠంనుంచి నేర్చుకున్నాను. నాకు ఆ పుస్తకం అంటే యిష్టం యేమంటే అది కమ్మని, సంగీత భాషలో వుంది. మా తాతా యింకా యితర ముసలాళ్లూ తమ పిల్లల గురించి ఒకళ్లకొకళ్లు పితూరీలు చెప్పుకుంటూ వుంటే దేముడికి అవిధేయుడైన కొడుకు అబ్‌సాలెమ్ గురించి చక్రవర్తి డెవిడ్[171] చేసిన పితూరీలు నాకు గుర్తుకునచ్చాయి. మామూలుగా మనుషులూ, ముఖ్యంగా యువకులూ, పాడైపోయారనీ, యింకా బుద్ధుల్లా యిల్లాగా సోమరిగా తయారవుతున్నారనీ, భగవంతుడి పట్ల భయభక్తులు లేకుండా పోతున్నాయనీ ఆ ముసలాళ్లు అనుకునేటప్పుడు వాళ్లు నిజం చెప్పడం లేదనే నాకు అనిపించింది. డికెన్సు చిత్రించిన వంచకులు సరిగ్గా అలాంటి విషయాలనే అనుకునేవాళ్లు.

చర్చి మనుషుల మధ్యన వాదాలని జాగ్రత్తగా విన్నాక, వాళ్లు మిగతా దేశాల్లోని చర్చి మనుషుల్లాగా మాటలని పట్టుకుని వేలాడుతున్నారనీ, చర్చి మనుషులందరికీ, మిగతా వాళ్లని అణగదొక్కి వుంచడానికి మాటలన్నీ ఒక దారి అనీ, చర్చి వాళ్లల్లాగే వుండే రచయితలు వున్నారనీ నేను కనిపెట్టాను. ఆసక్తికారకమైనా, యీ పోలికలో యేదో అనుమానాస్పదమైంది వుందని త్వరలోనే నాకు అనిపించింది.

నా పఠనంలో ఓ పద్ధతీ క్రమం లేదనుకోండి, ప్రతీదీ యాదృచ్ఛికంగా జరిగిందే. మా యజమాని సోదరుడు క్సన్యే డె మొంటెపేన్, గబోరియో లాంటి వాళ్లు రాసిన ఫ్రెంచ్ ''పసుపు అట్టు'' చవకబారు నవలలని యిష్టంగా చదివే

వాడు. వాటిని చదివిం తర్వాత ''నిహిలిస్టుల — విప్లవకారుల''ని గురించి విద్వేషపూరిత వర్ణనలు చేస్తూ, వాళ్లని పరిహసించే రష్యన్ పుస్తకాలు అతనికి తటస్థపడ్డాయి. నేను ఈ పుస్తకాలు కూడా చదివాను. నేను కలిసి బతికేటువంటి వాళ్లతోటి దాదాపు యే సంబంధమూ లేకుండా వుండే మనుషులని గురించీ, నన్ను వచ్చి తనతో కలవమని పిలిచిన ఆ నేరస్థునికి ఓ రకంగా సన్నిహితంగా వుండే మనుషులని గురించి చదవడం నాకు ఆసక్తికరంగా వుండేది. ''విప్లవత్వం'' యీ మనుషుల్లో యెక్కడ వుందో నాకు అర్థం కాలేదనుకోండి, రచయితల ఉద్దేశం యిదే, యేమంటే రచయితలు అందరు ''విప్లవకారుల్ని'' ఒకే రంగుతో పులిమేసే వాళ్లు.

నాకు పొమ్యలోవ్స్కీ ''మోలోతొవ్'', ''పశుబుద్ధుడి ఆనందం'' తగిలాయి. పశు బుద్ధి జీవితంలోని ''అణగార్చే మందకొడి జీవితం'', పశుబుద్ధి ఆనందంలోని క్షుద్ర త్వం అవి నాకు తెలియచేశాయి. మబ్బుగా వుండే నిహిలిస్టులు వృద్ధి పొందుతూ వుండే ''మోలోతొవ్'' కంటే మెరుగని నాకు, అస్పష్టంగానే అనుకోండి, అనిపించింది. పొమ్యలోవ్స్కీ తర్వాత నేను జరూబిన్[172] రాసిన ''రష్యన్ జీవితపు వెలుగు నీడలు'' అనే పరమ నీరస పుస్తకం చదివాను. ఆ పుస్తకంలో నాకు ప్రకాశవంతమైన భాగం యేదీ కనిపించలేదు, కాని చీకటి పార్శ్వాలు మాత్రం యింకా స్పష్టంగా, యింకా వెలపరంగా వుండేట్టు నాకు తెలిశాయి.

నేను చెత్త పుస్తకాలని లెక్కలేకుండా చదివాను. కాని అవి కూడా నాకు ఉప యోగపడ్డాయి. జీవితంలోని అనాకర్షక భాగాలని గురించి కూడా ఆకర్షవంతమైన భాగా లల్లాగానే యెవళ్లేనా తెలుసుకోవాలి. సాధ్యమైనంత అధిక జ్ఞానం సంపాదించాలి. అనుభవం యెంత వైవిధ్యపూరిత మైందైతే అంత వర్ధమాన దశని మనిషి సంపాదించుకుంటాడు, అతని దృష్టి పథం అంత విస్తృతమవుతుంది.

విదేశీ సాహిత్యం పోలికలకి పుష్కలంగా సరుకుని అందించింది. అందులో ప్రద ర్శించిన నేర్పు నన్ను చకితుణ్ణి చేసింది. యీ పుస్తకాలు మనుషుల్ని యెంత సజీవంగా, స్పష్టంగా చిత్రించాయంటే వాళ్లు నాకు స్పర్శవేద్యంగానే కనిపించారు. నాకు వాళ్లు రష్యన్లకంటే చురుగ్గా కనిపించారు — వాళ్లకి మాటలు తక్కువ, చేతలు యెక్కువ.

నా మీద ''పెద్ద'' ఫ్రెంచి రచయితలు స్టెండాల్, బాల్జాక్, ఫ్లొబెర్‌లు గాఢ మైన రూపనిష్పాదక ప్రభావం కలిగించారు. ఆరంభకులందరికీ యీ రచయితల పుస్తకా లని చదవమని నేను సలహా యిస్తాను. వాళ్లు నిజంగా మేధావంతులైన కళాకారులు, రూపానికి సంబంధించి అందె వేసిన నిపుణులు, అలాంటి వాళ్లు రష్యన్ సాహి త్యంలో యింకా దర్శనమివ్వాల్సి వుంది. నేను వాళ్ల రచనలని రష్యన్ భాషలో

చదివాను, అయినా కానీ ఫ్రెంచ్ రచనలోని శక్తిని గ్రహించడానికి అది అటంకం కాలేదు. కుప్పలు తెప్పలుగా "పసుపు అట్టు" నవలల తర్వాత, మైయేన్ రీడ్[173] తర్వాత, ఫెనిమోర్ కూపర్, గుస్తావ్ ఎమార్,[174] పొంసొన్ ద్యు టెరైల్ రచనల తర్వాత యీ మహా రచయితల కథలు నా మీద మంత్రదండం తిప్పినట్టు సమ్మోహక ప్రభావం కలిగించాయి.

ఒక ట్రినిటీ ఆదివారం రోజున నేను సంబరం చేసుకునే వాళ్ల కంటపడ కుండా ఒక మిద్దెమీద దాంకుని, ఫ్లొబెర్ "అమాయక హృదయం" చదవడం నాకు గుర్తుంది. ఆ కథాకథనం నాకు ఆశ్చర్యం కలిగించింది, యేదో చూపూ, వినికిడీ పోయిన వాడి లాగా అయినట్టు అనిపించింది. చుట్టూతా సందోహంగా వున్న పండగ వేడుకలన్నీ ఒక సామాన్య స్త్రీ, వంటలక్క, యే రకమైన ఘనకార్యాలు గాని, నేరాలు గాని చెయ్యని ఆవిడ మూర్తితో మూసుకుపోయాయి. సాదా మాటలు, నాకు అంత పరిచయమైన మాటలు, ఒక "సామాన్య" వంటలక్క జీవిత కథలో వాడిన మాటలు నన్ను అంతలా కదిలించి వెయ్యడం అనేది అర్థం చేసుకోవడం నాకు కష్టంగా వుండింది. ఆ పుస్తకం నా మీద కలిగించిన ప్రభావంలో యేదో ఒక రక మైన మంత్రమహిమని కచ్చితంగా నేను వివేచించినట్టే వుంది. కొన్ని సార్లు, ఒక ఆటవికునిలాగా, ఆ చేస్తున్న దేమిటైందీ ఆలోచించకుండానే, యీ మంత్ర రహస్యం యేమిటైందీ ఆ లైన్ల మధ్య కనిపెట్టడానికా అన్నట్టు నేను ఆ పేజీలని వెలు తురికి యెదురుగా పెట్టి చూశాను!

నిగూఢమైన, రక్తదాహం గల నేరాలని వర్ణించే పుస్తకాలు నాకు డజన్ల కొద్దీ పరిచయమే, అయినా నేను స్టెండాల్ రాసిన "ఇటాలియన్ గాథలు" చదివినప్పుడు అదంతా యెలా జరిగిందీ నాకు బోధపడలేదు. క్రూరకృత్యాలనీ, పగతీర్చుకునే హత్యలనీ వర్ణించిన మనిషి యిక్కడ వున్నాడు. అయినా గానీ అతని కథలని నేను యేదో "ఋషుల జీవిత కథలు" అయినట్టూ, నరకంలో చిత్రహింసలు పడుతున్న వాళ్లని ఓదార్చడానికి దేవమాత అక్కడికి వెళ్లిన కథ "మనదేవి కల" వింటున్నట్టూ చదివాను.

బాల్జాక్ "మేక తోలు ముక్క" నవలలో బేంకర్ విందు యిచ్చిన వర్ణన వున్న పేజీలని చదువుతూ వుంటే నాకు పరమాశ్చర్యం కలిగింది. పాతికమంది అతిథులు అందరూ ఒకే సారి, నా చెవులు చిల్లులు పడిపోతాయా అన్నంత గందరగోళం లేపుతూ మాట్లాడేస్తారు అందులో. యింకా ముఖ్యం అయింది యేమిటంటే నేను ఆ అతిథులు మాట్లాడింది వినడమే కాదు, వాళ్లల్లో ప్రతి ఒక్కళ్లనీ వాస్తవంగా చూశాను. బాల్జాక్ ఆ బేంకర్ అతిథుల రూప లావణ్య విశేషాలని వర్ణించకపోయినా నేను వాళ్ల కళ్లనీ, చిరునవ్వులనీ, హావ భావాలనీ చూడగలిగాను.

మాటలతో ప్రజలని వర్ణించే కళ, వాళ్ల సంభాషణని సజీవంగా, శ్రవణ గ్రాహితంగా చేసే కళ, సంభాషణని సృష్టించడంలో పరిణతి చెందిన నైపుణ్యం గం బాల్జాక్, తదితర ఫ్రెంచి రచయితల నేర్పు యెప్పుడూ నన్ను ముంచెత్తేసేది. బాల్జాక్ పుస్తకాలు తైల వర్ణచిత్రాలతో చేసినవేమో ననిపించేది. నేను మొదటి సారి రూబెన్స్[175] చిత్రాలు చూసినప్పుడు నాకు తక్షణం బాల్జాక్ గుర్తుకు వచ్చాడు. దొస్తొయేవ్‌స్కీ రాసిన తిక్క పుస్తకాలు చదివినప్పుడు, నవలా సాహిత్యపు యీ మహా నిపుణుడికి ఆయన చాలా రుణపడి వున్నాడని అనుకోకుండా వుండలేకపోయేవాణ్ణి. లేఖినితో గీసిన చిత్రాల్లాగా తీక్ష్ణంగా వున్న బిగిగల గొన్‌కూర్ సోదరుల నవలలూ నాకిష్టంగానే వుండేవి. మబ్బుగా వుండే రంగులతో, హత్తుకునేటట్టు గీసిన చిత్రాల్లాగా వుండే జోలా[176] వ్యాకుల రచనలూ యిష్టంగానే వుండేవి. హ్యూగో నవలలు నన్ను ముగ్ధుణ్ణి చెయ్యలేదు. "1793వ సంవత్సరా"న్ని కూడా యేదో ఉదాసీనంగా చదివాను. తర్వాత మాత్రమే అనతోల్ ఫ్రాన్స్ రాసిన "దేవతల కాంక్ష" చూశాకనే ఆ ఉదాసీనతకి కారణం నాకు అర్థం అయింది. యెన్నో విషయాలని అసహ్యించుకోవడం నేను నేర్చుకున్నాకనే నేను స్టెండాల్ రాసిన వాటిని చదివాను, అతని నిబ్బరమైన మాటా, సంశయాత్మక మందహాసం నన్ను నా ద్వేషంలో దృఢం చేశాయి.

పైన చెప్పిన దాన్ని బట్టి తేలేది యేమిటంటే నేను రాయడం అనే దాన్ని ఫ్రెంచి రచయితలనుంచి నేర్చుకున్నాను. యిది యాదృచ్ఛికమే, కాని ఫలితాలు ప్రయోజనకరంగా వున్నాయి. అందుకనే మహా రచయితల గ్రంథాలని మూలంలోనే చదివి, మాటల కళని వాళ్ల దగ్గర్నుంచి నేర్చుకొనేందుకు గాను ఫ్రెంచి చదవమని నేను యువ రచయితలకి సలహా యిస్తాను.

రష్యన్ సాహిత్యంలో మహా రచయితలైన గోగొల్, టాల్‌స్టాయ్, తుర్గెనెవ్, గొన్చరోవ్, దొస్తొయేవ్‌స్కీ, లెస్కోవ్‌ల రచనలని నేను చదివింది చాలా తర్వాతనే. తన అద్భుతమైన భాషా సంపదతోటీ, జ్ఞానంతోటీ నా మీద నిస్సందేహంగా లెస్కోవ్ ప్రభావం కలిగించాడు. రష్యన్ జీవితంలోకి చొచ్చుకుపోయిన సన్నిహితమైన పరశీలనా దృష్టిగల గొప్ప రచయిత ఆయన. ఆయనకి మన సాహిత్యంలో రావాల్సినంత పేరు రాలేదు. తను లెస్కోవ్‌కి యెంతో రుణ పడివున్నానని చెహోవ్ అన్నాడు.

రష్యన్ సాహిత్యమూ, విదేశీ సాహిత్యమూ — వీటి అభివృద్ధి గురించిన పరిజ్ఞానం రచయితకి విధిగా వుండాలని మళ్లీ చెప్పడానికే యీ పరస్పర సంబంధాలనీ, ప్రభావాలనీ నేను పేర్కొన్నాను.

దగ్గర దగ్గర యిరవై యేళ్ళ వయసప్పటికే, జనానికి చెప్పగలిగిందీ, చెప్పి తీరవలసిందీ యెంతో నేను చూసినట్టూ, విన్నట్టూ, అనుభవించినట్టూ నేను గుర్తించాను. మిగతా వాళ్ళకంటే భిన్నంగా కొన్ని విషయాలని నేను తెలుసుకున్నట్టూ అనుభవించినట్టూ నాకు అనిపించింది. అది నన్ను కలత బెట్టింది, అశాంతిగా, వదిరేటటు వంటి మానసిక స్థితిలో పెట్టింది కూడా. తుర్గేనెవ్ లాంటి సిద్ధ హస్తులైన రచయితలు రాసినవి చదివేటప్పుడు కూడా ప్రధాన పాత్రల గురించి నేను బహుశా యేదో చెప్పగలనేమోననీ, ఉదాహరణకి ''వేటగాని కథలు'' నాయకుల గురించి తుర్గేనెవ్ కంటే మరోలా చెప్పగలనేమోనని అనిపించింది. అప్పటికే కథాకథన నైపుణ్యం వున్న వాడినని నాకు పేరు వచ్చింది. ఓడ రేవు కార్మికులు, రొట్టెలు తయారు చేసేవాళ్లు, తిరుగుబోతులు, తివాసీలు చేసేవాళ్లు, రైల్వే కార్మికులు, దేశద్రిమ్మరులు, మొత్తంమీద నేను యెవళ్ల మధ్య బతుకుతున్నానో వాళ్లంతా నేను చెప్పే వాటిని ఆసక్తిగా వినేవాళ్లు. నేను చదివిన పుస్తకాలనుంచి విషయాలనీ తిరిగి చెప్పేటప్పుడు, తరుచుగా యితివృత్త సన్నివేశాలని మార్చేస్తున్నట్టూ, నేను చదివిన దాన్ని వక్రీకరిస్తున్నట్టూ, నా అనుభవంలోనుంచే సేకరించిన వాటిని జోడిస్తున్నట్టూ నాకు అవగతం అయింది. అలా యెందుకు జరిగిందంటే జీవిత, సాహిత్యాల వాస్తవాలు నా మనసులో పెన వేసుకుపోయాయి. ఒక పుస్తకం మనిషి అంతగానూ ఒక దృగ్గోచర విషయం. అది సజీవ, భాషణ వాస్తవం కూడా. అది మానవుడు సృష్టించిన, సృష్టిస్తూ వున్న విషయాలన్నిటి కంటే కూడా చాలా తక్కువ ''విషయం.''

నేను చెప్పేది విన్న మేధావులు నాకు యీ సలహాని యిచ్చారు: ''మీరు రాసితీరాలి. ప్రయత్నించి చూడండి.''

నేను తరుచుగా నన్ను అణగార్చినవో, లేక ఆనందపెట్టేనవో ఆ సకల విషయాలనీ వ్యక్తం చెయ్యాలనే ప్రేరణతోటి వాగ్దాటి దాడులని, మాటల ఝరిని అనుభవించి మత్తెక్కి పోయేటట్టువాణ్ణి. ''నా గుండె గుబగుబ వదిలించుకోవాల''ని ఆత్రపడే వాణ్ణి. నా లోపలి ఉద్రిక్తతవల్ల నేను చిత్రహింస పడిన క్షణాలు వున్నాయి. నా కంఠంలో ఉండ కొట్టుమిట్టాడిన క్షణాలు వున్నాయి. నా మిత్రుడు, గాజు వూదే అసతోలీ ప్రతిభ వున్న కుర్రాడనీ సహాయం యేం రాకపోతే నాశనమై పోతాడనీ అర వాలనిపించేది. సామాన్య వేశ్య థెరెసా చక్కని మనిషనీ ఆమె పడుపు వృత్తికి దిగడం అన్యాయమనీ అరవాలని పించేది. ఆమె దగ్గరకి వెళ్లే విద్యార్థి కుర్రాళ్లు యీ విషయాన్ని చూళ్లేదు, జీవనాధారం కోసం ముష్టి యెత్తుకునే ముసలామె మాతిత్సా, పడుచుదనంతో వుండి బాగా చదువుకున్న మంత్రసాని యాకొవ్‌లేవా కంటే గట్టి బుర్ర వున్న మనిషని గ్రహించనట్టే.

నా సన్నిహిత మిత్రుడు, విద్యార్థికి కూడా తెలియనంత రహస్యంగా నేను థెరెసాని గురించీ, అనతోలీ గురించీ పద్యాలు రాశాను. వసంతరుతువులో మంచుకరిగి రొచ్చులు చేసే వాళ్ల నేలమాళిగంలోకి మురికి నీటిగా ప్రవహించేందుకు కాక మంచు కరుగుతుం దని పద్యాలు, వోల్గ అందమైన నది అనీ; జీవితం అనేది ఆత్మని వైకల్యపరిచే మురికి బాడవ, నిరాశ అనీ పద్యాలు రాశాను.

పద్యాలు సునాయాసంగా రాసేసేవాణ్ణి. కాని నేను రాసింది వెలపరంగా వున్నట్టు నాకు అనిపించింది. నేర్పూ, ప్రతిభా లేనందుకు నామీద నాకే అసహ్యం కలిగేది. నేను పూష్కిన్, లేర్మొన్‌తొవ్, నెక్రాసొవ్‌ల పద్యాలూ కూరొచ్కిన్[177] చేసిన బెరంజే[178] అను వాదాలు చదివి, యీ కవులతోటి నాకు యే మాత్రమూ సాదృశ్యం లేదని స్పష్టంగా గుర్తించాను. వచనం రాయాలని నిర్ధారణ చేసుకోలేకపోయాను. అది నాకు పద్యం రాయడం కంటే కష్టంగా కనిపించింది. దానికి నిశిత దృష్టీ, యితరులు చూడలేని విషయాలని చూసి పరిశీలించే శక్తీ, సూటిగా వాడిగా వుండే శైలీ అవసరం. యేమైనా వచన రచనలో ప్రయత్నం చెయ్య మొదలుపెట్టాను. అయినా ''లయబద్ధ'' మైన వచన సాధనాన్ని యెన్నుకున్నాను, యేమంటే మామూలు వచనం నా సామర్థ్యా నికి మించిందిగా కనిపించింది. సాదా శైలి రాయాలన్న నా ప్రయత్నాలవల్ల విచారక రమూ, పరిహాసాస్పదమూ అయిన ఫలితాలు దాపురించాయి. లయబద్ధమైన వచనంలోనే నేను ''పాత ఓకు చెట్టు పాట'' అన్న బృహత్తర ''పద్యం'' రాశాను. యీ చెత్త రాతని ముక్కలు ముక్కలుగా ఖండించడానికి వి. కొరొలేన్‌కొకి డజను మాటలు సరి పోయాయి. ''జీవిత సుడిగుండం'' అనే, పరిణామ సిద్ధాంతాన్ని చర్చించే వ్యాసం,[179] నేను పొరపడకుండా వున్నట్లయితే ''జ్ఞానం'' అన్న పత్రికలో ప్రచురితమైందానికి సంబంధించి, నాకు కలిగిన ఆలోచనలని అందులో వ్యక్తం చేసినట్టు నాకు గుర్తు. దానికి సంబంధించి నా జ్ఞాపక పేటికలో వున్న ఒక్కటే ''అనంగీకారం తెలియచెయ్య డానికే నేనీ ప్రపంచంలోకి వచ్చాను'' అన్న వాక్యం. నేను నిజంగా పరిణామవాదాన్ని అంగీకరించలేదని చెప్పి తీరాలి.

యేమైనా, లయబద్ధమైన వచనం పట్ల నాకు వున్న పక్షపాతాన్ని కుదర్చడంలో కొరొలేన్‌కొ నెగ్గలేకపోయాడు. అయిదేళ్ల తర్వాత నా కథ ''తాత అర్కీప్''ని పొగు డుతూ, నేను ఆ కథని ''పద్యాన్ని పోలిన దేనితోటో'' ముస్తాబు చెయ్యకుండా వుండాల్సిందని ఆయన అన్నాడు. మొదట్లో నేను ఆయన అన్నదాన్ని నమ్మలేదు. కాని తర్వాత యింటి దగ్గర చూద్దును కదా, మొత్తం ఒక పేజి అంతా, పచ్చిక మైదానంలో కుంభ వృష్టిని గురించిన వర్ణన అంతా ఆ దిక్కుమాలిన ''లయబద్ధ'' వచనంలో రాసినదని విచారభరితంగా గుర్తించాను. ఆ వచనం చాలా కాలం నా అదు

గులని అనుసరించి, అవాంఛనీయంగా అనువు గాని చోట నా కథల్లోకి యింకి పోయింది.... మొత్తం మీద నేను ఒక ''రమ్యమైన'' శైలిని వాడ ప్రయత్నించాను. ఒక ఉదాహరణ: ''ఆ తాగుబోతు, వదనంమీద మందహాసంతో, చలించే తన నీడని పరీక్షిస్తూ దీపస్తంభాన్ని ఆలింగనం చేసుకుని నుంచున్నాడు.'' నేనే రాసినట్టుగా ఆ రాత్రి, సందర్భవశాత్తూ, గాలి లేకుండా, వెన్నెలగా వుంది. ఆ రోజుల్లో అలాంటి రాత్రిళ్లప్పుడు వీధి దీపాల్ని వెలిగించే వాళ్లు కారు. పైగా ఒక వేళ దీపాలు వెలిగినా గాలి లేకుండా వున్నప్పుడు ఆ మనిషి నీడ నిశ్చలంగా వుంటుంది. అలాంటి పొర పాట్లూ, తప్పులూ నా కథల్లో ప్రతిదాంట్లోనూ తగిలాయి, దానికి గాను నన్ను నేనే తీవ్రంగా నిందించుకున్నాను.

''సముద్రం చిరునవ్వు నవ్వుతోంది'' అని రాశాను. చాలా కాలం అలా అనడం మంచిదనే అనుకున్నాను. అందాన్ని వెంటాడ్డంలో నేను యెప్పుడూ వర్ణనకి సంబంధిం చిన సూటిదనానికి దూరం అవుతూనే వుండేవాణ్ణి. విషయాలని తలకిందులు చెయ్యడం, మనుషులని తప్పుగా వర్ణించడం వుండేది.

''మీ పొయ్యి అది వుండాల్సినట్టుగా వుండదు'' అన్నాడు లియో టాల్‌స్టాయ్ నా కథ ''యిరవై ఆరుమంది పురుషులూ, ఒక అమ్మాయి''ని గురించి చెపుతూ. నేను వర్ణించినట్టుగా పొయ్యిలోని మంట రొట్టెలు కాల్చేవాళ్ల ముఖాలమీద వెలుతురు ప్రస రింపచెయ్యదుట. నా ''ఫోమా గొర్దేయెవ్''లోని మెదీన్‌స్కయా గురించి మాట్లాడుతూ ''ఆమెకి మూడు చెవులున్నట్టున్నాయి — ఒకటి ఆవిడ చుబుకంమీద కూడా — చూడండి'' అన్నాడు చేహొవ్. నిజంగా అదంతా అతినిజం, ఆమె దీపం యెదురుగా వుండే తీరు అంత తప్పుగా వుంది.

కొన్ని తప్పులు చిన్నవిగానే కనిపించవచ్చును గాని అవి చాలా ముఖ్యమైనవి. యేమంటే అవి కళాత్మక సత్యాన్ని అతిక్రమిస్తాయి. మొత్తంమీద, ''అల్పాక్షరముల అన ల్పార్థ రచన'' కోసం, మాటని పొదుపుగా వాడుతూ కూడా విస్తారమైన ఆలోచనా పరిధిని పరివేష్టితం చెయ్యడం కోసం, మాటల ఉపకరణంద్వారా సజీవ చిత్రాలని సృష్టించడం కోసం, ఒక పాత్ర ప్రధాన లక్షణాన్ని పదునుగా వివరిస్తూ తక్షణం పాఠకుని మనసుమీద ఆ పాత్ర నడవడిక, మాట తీరు చెక్కడం కోసం కచ్చిత మైన మాటలని యెన్నుకోవడం చాలా కష్టం. మాటల మాధ్యమికంద్వారా మను షులకీ, వస్తువులకీ ''చిత్రాత్మకత''ని యివ్వడం ఒక యెత్తు, ''యుద్ధమూ — శాంతీ''లో లాగా వాళ్లు భౌతికంగా స్పర్శనీయం అవగలందుకు 'త్రీ డైమెన్షన్స్'లో వాళ్లని కళ్లకి కట్టినట్టు వర్ణించడం యింకో యెత్తు.

ఒక సారి మధ్య రష్యాలోని ఒక పట్టణపు రూపనఖ చిత్రాన్ని యివ్వాల్సి వచ్చి

నప్పుడు, నేను యీకింది దాన్ని రాయడానికి ముందు మూడు గంటలు తంటాలు పడ్డాను.

''బావురుమనే రోడ్లు అడ్డ దిడ్డంగా పోతున్న సముద్ర తరంగాల్లా వుండే లోయమధ్యలో రంగురంగుల పట్టణం ఒకూరోవ్ విశాలంగా, ముడతలు పడి వున్న అరచేతిలో ప్రకాశించే ఆటవస్తువులా కనిపించేది.''

నేను మహా బాగానే రాసానని అనుకున్నాను. కాని ఆ కథ ప్రచురితమైన ప్పుడు అదంతా అలంకారం చేసిన అల్లం బిస్కట్టు లాగానో లేదా ఒక చాకొలెట్ పెట్టెమీద బొమ్మ లాగానో వుందని నేను గుర్తించాను.

మొత్తంమీద మాటలని మహా కంచు పదునుగా వాడాలి. మరో రంగంనుంచి యింకో సందర్భం యిదిగో. ''మతం నల్లమందు'' అన్నారు. కాని నల్లమందుని డాక్టర్లు బాధని తగ్గించేందుకు వాడతారు, అంచేత అది మంచిదే. నల్లమందుని పొగాకు లాగా ధూమపానం చేస్తారనీ, ఆ ధూమపానం మనుషుల్ని చంపేస్తుందనీ, నల్ల మందు సారాయికంటే విషపూరితమైందనీ ప్రజలకి తెలియదు.

నా దోషాలు యెప్పుడూ కవి విచారపూరిత మాటలని మనసుకి తెచ్చేవి: ''మాటల చిత్రహింసని మించిన నిశితమైన చిత్రహింస ప్రపంచంలో లేదు.''[180]

''మన బీద భాష శీతలంగా దారిద్ర్యంతో వుంది''[181] అని నాద్‌సన్ కవి కామోసు అన్నాడు. భాషా ''దారిద్ర్యాన్ని'' గురించి అసంతృప్తి ప్రకటించని కవి అరుదు అనుకుంటాను.

యీ ఫిర్యాదులు రష్యన్ భాషా ''దారిద్ర్యా''నికి సంబంధించే కాదు, మామూ లుగా మానవ భాషకే సంబంధించినట్టుగా నాకు కనిపిస్తుంది. అది కూడా మాటలు కనిపెట్టలేనీ, వ్యక్తీకరించలేనీ అనుభూతులూ, ఆలోచనలూ వుండటంవల్లనే. కాని, మాటలు కనిపెట్టలేని విషయాలని అలా వుంచినా, రష్యన్ భాష ఒక తరగని సంపద, ఆశ్చ ర్యం కలిగించే వేగంతో అది సంపద్వంతమవుతోంది. భాష పెరిగే వేగాన్ని రుజావు చెయ్యడం కోసం, గోగొల్, చేహొవ్, తుర్గెనెవ్‌లూ, ఉదాహరణకి బూనిన్, దొస్తొ యేవ్‌స్కీ యింకా లియొనీద్ లియోనొవ్[182] వాడిన మాటల సముదాయాన్ని పోల్చి చూడ్డం మంచిది. లియోనొవ్ తను దొస్తొయేవ్‌స్కీ నుంచి సాధించుకున్నానని పత్రికలలో ప్రకటించాడు, కాని కొన్ని రకాలుగా — ఉదాహరణకు, మనస్సుని అంచనా కట్టడంలో — లియో టాల్‌స్టాయ్‌నుంచీ సంక్రమింప చేసుకున్నాడనీ అతను అని వుండేవాడు. యేమై నప్పటికీ, యీ రెండు లింకులూ కూడా యువరచయిత ప్రాముఖ్యాన్ని రుజావు చేస్తు న్నాయి గాని అతని మౌలిక ప్రజ్ఞని యేరకంగానూ వక్రీకరించవు. అతను యే సందే హమూ లేకుండా, తన నవల ''దొంగ''లో ఆశ్చర్యకరమైన భాషా సంపదని వెల్లడి చేశాడు. అతను అనేకం అధికమైన ఉచిత పదాలని సొంతం సృష్టించాడు. పైగా

అతని నవలా నిర్మాణం సంక్లిష్టతలోనూ, కల్పనలోనూ స్ఫుటంగా వుంది. లియోనొవ్ తన సొంత సందేశం వున్నవాడనీ, యెంతో మౌలిక ప్రజ్ఞ వున్నవాడనీ నా అభిప్రాయం; అతను ఆ సందేశాన్నివ్వడం యిప్పుడే మొదలుపెట్టాడు, దొస్తొయేవ్‌స్కీ గాని, మరెవరుగాని అతన్ని అందులో అటంక పరచలేరు.

భాషని ప్రజలు సృష్టిస్తారని మీకు గుర్తు చెయ్యడం ఉచితం యిక్కడ. సాహిత్య భాష అనీ, ప్రజల భాష అనీ అనడం పూరికే ఒకటి "ముడి సరుకు" అనీ, రెండవది సిద్ధహస్తులు మలిచింది అనీ చెప్పడమే. దీన్ని పూర్తిగా గుర్తించిన మొదటి వాడు పూష్కిన్. ప్రజలు సమకూర్చిన భాషణ సామగ్రిని ఉపయోగ పెట్టుకుని, వ్యవహరించాల్సిన తీరు చూపించిన మొదటివాడూ ఆయనే.

కళాకారుడు తన దేశాన్నీ, తన వర్గాన్నీ ప్రభావితం చేసే సర్వాన్నీ అతి సున్నితంగా గ్రహించేవాడు — దాని చెవి, కన్ను, గుండెకాయ. అతనిది తన కాలపు గొంతు. అతను యెంత వీలైతే అంతా తెలుసుకోవాల్సిన విధి వున్నవాడు. మరి అతను గతాన్ని గురించి యెంత బాగా తెలుసుకుంటే, వర్తమానాన్ని అంత బాగా అర్థం చేసుకోగలడు. అంత గాఢంగా నిశితంగా అతను మన కాలపు సార్వజనీన విప్లవత్వాన్ని, దాన్ని యెదుర్కొనే కర్తవ్యాల పరిధినీ గ్రహిస్తాడు. ప్రజల చరిత్రకి సంబంధించిన పరిజ్ఞానం ముఖ్యం, అలాగే దాని సాంఘిక, రాజకీయ ఆలోచనా సరళికి సంబంధించిన జ్ఞానమూనూ. పండితులు -- సంస్కృతి చరిత్రకారులు, మానవజాతుల శాస్త్రీయ వర్ణన చేసే వాళ్లు — యీ ఆలోచన అద్భుత కథల్లోనూ, కల్పిత కథల్లోనూ, సామెతల్లోనూ, సూక్తుల్లోనూ వెల్లడి అవుతుందని వివరించారు. యెంతో బోధనాత్మకంగా, పరిపూర్తిగా వుండే రీతిలో ప్రజాబాహుళ్యం ఆలోచించే ధోరణిని సూక్తులూ సామెతలూనే వాస్తవంగా వ్యక్తం చేస్తాయి. కొత్త రచయితలు వాటికి సంబంధించిన పరిజ్ఞానం సంపాదించుకోవాలి, మాటల పొదుపరితనాన్నీ, సూటిదనాన్నీ, ఆలంకారికతనీ అవి ఉత్కృష్టంగా బోధిస్తూ వున్నందువల్లనే కాదు యీ దిగువ కారణంవల్ల కూడా: సోవియట్ల దేశపు జనాభాలో అత్యధిక భాగం రైతులే. శ్రామికులు, పట్టణవాసులు, వర్తకులు, పుజారులు, అధికారులు, ప్రభువంశీకులు, ప్రసిద్ధ వైజ్ఞానికులు, కళాకారులు లాంటి వాళ్లందరినీ మలిచిన మృత్తిక రైతు అంటే. ప్రభుత్వ చర్చిని నియమితం చేసిన వాళ్లు, చర్చినుండి విడిపోయిన అనేక శాఖలా నిరంతర ప్రభావంలో రైతు మనసు వుండింది. యుగాలుగా రైతులకి సూక్తులూ, సామెతలూ లాంటి తయారై సిద్ధంగా వున్న, స్థిరరూపాలలో ఆలోచించడమే నేర్పడం జరిగింది. వాటిల్లో అత్యధిక భాగం కుదించిన రూపంలో పొదిగిన చర్చి బోధనలు తప్ప మరేం కాదు....

....మొత్తంమీద, సామెతలూ, సూక్తులూ అనేవి శ్రామిక ప్రజలు కూడబెట్టుకున్న

సాంఘిక చారిత్రక అనుభవాన్ని సంక్షిప్తంగా పొదివి పట్టుకున్నవే. గుప్పిడి ముడిస్తే వేళ్లు ముడుచుకున్నట్టుగా, రచయిత అనేవాడికి మాటలని కుదించడం నేర్పే సరంజామా పరమ అవసరం. అలాగే యితరులు కుదించిన వాటిని విస్తరించడమూనూ. అది కూడా ఆ కాలానికి విరుద్ధంగా వున్న, లేదా పాతబడిపోయిన అంతర్భూత అర్థాలని వెల్లడి చేసేటట్టు అలా చెయ్యాలి.

నేను సామెతలనుంచి చాలా నేర్చుకున్నాను, లేదా వేరే మాటల్లో చెప్పాలంటే సూక్తుల పద్ధతిలో ఆలోచించడంనుంచి. యీకింది సంఘటన గుర్తుకు వస్తోంది: మా మిత్రుడూ కావలివాడూ అయిన యాకొవ్ సొల్దాతొవ్‌కి జోక్‌లంటే చెడ్డ సరదా. అతను ఒక సారి కొత్త చీపురు కట్టని వూపుతూ వీధి తుడుస్తున్నాడు. యాకొవ్ నా కేసి చూసి, హుషారుగా కన్ను గీటి, అన్నాడు:

''నేనేం చేస్తున్నాగానీ తుదముట్టించడం అనేది వుండదు. నేను వూడ్చే కొద్దీ వస్తూనే వుంటుంది.''

అతను వున్నదున్నట్టు చెపుతున్నాడని నేను గుర్తించాను. యిరుగుపొరుగు వాళ్ళు వీధిని శుభ్రంగా వుంచుకున్నా, పక్క వీధులనుంచి గాలి దుమ్ముని తీసుకువస్తుంది. పట్టణంలోని అన్ని వీధులనీ శుభ్రంగా వుంచుకున్నా, ధూళి మేఘాలు పొలాలనుంచీ, చుట్టు పక్కల పట్టణాలనుంచీ వస్తూనే వుంటాయి. యెవళ్ల యింటి చుట్టూతా వాళ్ళు శుభ్రంగా వుంచుకోవాలనుకోండి, కాని దాన్ని మొత్తం వీధికి, మొత్తం పట్టణానికి, మొత్తం ప్రపంచానికి విస్తరించినట్లయితే శ్రమకి ఫలితాలు యితోధికంగా వుంటాయి.

యీ పద్ధతిలో ఒక సూక్తిని విస్తృతపరచవచ్చు. సూక్తులు యెలా పుడతాయో అనేదానికి యిది ఒక ఉదాహరణ: ఒక సారి నీజ్నీ నోవ్‌గొరొద్‌లో కలరా సోకినప్పుడు, డాక్టర్లు రోగిష్ఠి వాళ్లని హతం చేసేస్తున్నారని యెవడో పుకారు లేపాడు. గవర్నర్ అతన్ని అరెస్టు చెయ్యమని ఆర్డరు వేసి, అతన్ని కలరా రోగుల ఆస్పత్రిలో సహాయకునిగా పని చేసేటట్టు చేశాడు. తర్వాత ఆ పుకారు లేపిన వాడు గవర్నరు తనకి నేర్పిన గుణపాఠానికి కృతజ్ఞత చెపితే, గవర్నరుగారు బదులు చెప్పాట్ట:

''సత్యం నీ మొహంమీద మొత్తుతున్నప్పుడు, నువ్వు అబద్ధం అడ్డం మానేస్తావు.''

గవర్నరు ముతక మనిషి, కాని మొద్దు కాదు. అలాంటి విషయాలని అనగల సమర్థుడే. అదీగాక, ఆ మాటలని యెవడు అన్నాడో పెద్ద తేడా యేం వుంటుంది.

నేను ఆలోచించడానికీ, రాయడానికీ నాకు సహాయం చేసినవి అలాంటి సజీవ ఆలోచనలు. కావలి వాళ్లనుంచీ, లాయర్లనుంచీ, కులం పోగొట్టుకున్న వాళ్లనుంచీ, అన్ని రకాల మనుషులనుంచీ, నేను నేర్చుకున్న ఆలోచనలకి సరిపోలినవే పుస్తకాలనుంచి నేర్చుకున్నవీనూ. కాని పుస్తకాలలో ఆ మాటలు వేరే వేషంతో వుంటాయి. అంచేత

యీ రకంగా జీవిత వాస్తవాలు, సాహిత్య వాస్తవాలు ఒక దానికి ఒకటి పూరకం అయ్యాయి.

సాహిత్యకారులు ''సమూనా''లనీ, పాత్రలనీ సృష్టించే విధానాన్ని గురించి నేనిది వరకే చెప్పాను, కాని నేను బహుశా రెండు ఆసక్తికరమైన ఉదాహరణలని యిస్తాను.

గ్యోతే రాసిన ''ఫౌస్ట్'' కళాసృష్టిలో ఉత్కృష్టమైంది. కళాసృష్టి సర్వదా కల్పిత కథ, వూహా. లేదా యింకా కచ్చితంగా చెప్పాలంటే జీవితం అందిస్తున్న దానికి జత చేసిన ఒక రకమైన వూహా, అదే సమయంలో ఆలోచనని ప్రతిమలలోకి అనూదితం చెయ్యడమూనూ. నేను మొట్టమొదటగా ''ఫౌస్ట్''ని చదివినప్పుడు నాకు యిరవై యేళ్ళు. ఆ తర్వాత కొంత కాలానికి జర్మన్ గ్యోతేకి ముందే రెండు వందల యేళ్ళ కితం ఇంగ్లీషు నాటకకర్త క్రిస్తఫర్ మార్లో[183] అనే ఆయన ఫౌస్ట్‌ని గురించి రాసా డని నాకు తెలిసింది. ''పన్ త్వర్దోవ్‌స్కీ'' అనే పోలిష్ నవల కూడా ఒక రకమైన ఫౌస్ట్ అనీ, అలాగే ఫ్రెంచ్ రచయిత ఫిల్ ముస్సే రాసిన నవల ''ఆసందాన్వేషి'' కూడాననీ తెలిసింది. ఒక మానవుడు సొంత ఆనందం కోసమూ, మిగతా వాళ్ళమీదా, ప్రకృతి రహస్యాలమీదా అధికారం కోసమూ తన ఆత్మని సైతాన్‌కి అమ్మేసాడనే మధ్య యుగాల నాటి కథమీద ఆధారపడి ఫౌస్ట్‌ని గురించిన అన్ని పుస్తకాలూ పుట్టాయనీ నాకు తెలిసింది. క్షుద్ర లోహాలని బంగారంగా మార్చి, జీవితామృతాన్ని ఆవిష్కరించాలని దేవుళ్ళాడిన రసవాదుల జీవితాన్నీ, ప్రయత్నాలనీ పరిశీలించడంనుంచి యీ కథ పెరిగింది. వీళ్ళల్లో నిజాయితీ వున్న స్వాప్నికులూ వున్నారు, యావలో పడికొట్టుకుపోయిన వాళ్ళూ వున్నారు, వాళ్ళేగాక నాటు మనుషులూ, నాటు వైద్యులూ వున్నారు. ''తిరుగులేని అధికారా''న్ని సాధించాలని యీ వ్యక్తులు చేసిన ప్రయత్నాల్లోని బోలుతనాన్నే మధ్య యుగం నాటి డాక్టర్ ఫౌస్ట్ సాహసాల కథలో పరిహసించడం జరిగింది. అతనికి సర్వ జ్ఞత్వాన్నీ, అమరత్వాన్నీ ప్రసాదించడం అనేది సైతాన్ శక్తికి మించినది అని రుజువైంది.

దుఃఖితుడైన ఫౌస్ట్ పక్కన, ప్రజలందరికీ పరిచయమైన యింకో మూర్తి వుంది: అది ఇటలీ దేశంలో పుల్చినేల్లో, ఇంగ్లండ్‌లో పంచ్, టర్కీలో కరపేట్, మన దేశంలో పెత్రూష్క. జానపదుల తోలుబొమ్మల ప్రదర్శనలో, యెప్పుడూ పోలీసుల్ని, మతాధిపతులని, ఆఖరికి దయ్యాన్నీ మృత్యువునీ కూడా మాయ చేసేసి, తనే మృత్యువు లేకుండా అగ్రభాగంలో వుండే అజేయ వీరుడు. పాటక జనం యీ అమాయకపు, మొతక రూపంలో తమ మూర్తినీ మొత్తంమీద యేనాటికేనా గానీ తాము, తామే, సర్వాన్నీ, ప్రతిదాన్నీ జయిస్తారన్న విశ్వాసాన్నీ దర్శించారు.

యీ రెండు ఉదాహరణలూ నేనిదివరకే చెప్పినదాన్ని రుజువు చేస్తాయి: ''పేరులేని''

రచనలు, అంటే, యేమీ తెలియని ప్రజలు సృష్టించినవి*, కూడా సంగ్రహించే నియమాల్నీ, యే సాంఘిక గ్రూపుకేనాగానీ విశిష్టంగా వుండే లక్షణాలనీ, అంశాలనీ, అలాగే యీ లక్షణాలని ఆ గ్రూపు ప్రతినిధి అయిన వ్యక్తిలో ప్రత్యేకం చేసే నియమాలనీ అంగీకరిస్తూనే వుంటాయి. ఒక కళాకారుడు విధేయంగా ఆ నియమాలని అనుసరిస్తే అతను "నమూనా"లని సృష్టించగలడు. యీ రకంగా షార్ల్ ది కస్టేర్184 తన "తిల్ ఉలెన్‌స్పీగిల్"లో ఫ్లెమింగ్‌కి, జాతీయ నమూనాని, రొమేన్ రోలాన్ తన "కొలా బ్రున్యోన్"లో బర్గండీ మనిషిని, అల్ఫోన్స్ దదే తన "తార్తారియన్"లో ప్రొవెన్సెల్ మనిషినీ సృష్టించారు. నిశితమైన పరిశీలనా, పోలికలూ తేడాలూ విచక్షణగా చూడగలిగే సామర్థ్యం, నిరంతర, అవిచ్ఛిన్న అధ్యయనం వుంటేనే అలాంటి "నమూనా" జనాన్ని కళ్ళకు కట్టినట్టు వర్ణించడం జరుగుతుంది. కచ్చితమైన పరిజ్ఞానం లేని చోట, వూహని ఉపయోగించడం జరుగుతుంది. పది వూహాల్లో తొమ్మిది ఖాయంగా తప్పే అవుతాయి.

ఒబ్లోమొవ్, రూదిన్, ర్యజానొవ్** లాంటి పాత్రలకీ, నమూనాలకీ సమమైన పాత్రలనీ, నమూనాలనీ సృష్టించడంలో నేను సిద్ధహస్తుణ్ణి అని అనుకోను. అయినాగానీ, "ఫొమా గొర్దేయెవ్" రాయడానికి, తమ తండ్రుల జీవితాలతోటీ పనితోటీ సరిపడక, ఆ వైవిధ్యరహిత "అణగార్చే మందకొడి" జీవితంలో అర్థం తక్కువ అని అస్పష్టమైన అనుభూతి వున్న వర్తకుల యిళ్ల వంశోద్ధారకులని చాలా డజన్ల మందిని చూడాల్సి వచ్చింది. ఫొమా గొర్దేయెవ్ లాంటి వాళ్ల మధ్యనుంచి, తనుకి అవమానకరమైన, విసుగుదల జీవితపు పాలబడిన వాళ్ల మధ్యనుంచి, ఆలోచించడం మొదలు పెట్టిన వాళ్ల మధ్యనుంచి ఒక వక్క తాగుబోతులు, రౌడీలు, భ్రష్టులు పుట్టుకొచ్చారు. యింకో వక్క సామాన్య సూత్రానికి మినహాయింపు అయి లెనినిస్టు "ఇస్క్రా"కి డబ్బు పెట్టిన ధనిక సవ్వ మొరోజొవ్‌లాంటి, సోషల్ రివల్యూషనరీలకి ఆర్థిక సహాయం చేసిన పెర్మ్ ఓడ అధిపతి ఎన్. మెష్కోవ్, కలూగ ఫాక్టరీ యజమాని గొన్‌చరోవ్, మాస్కోకి చెందిన ఎన్. ష్మిడ్ట్ యింకా అలాంటి వాళ్లు పుట్టుకొచ్చారు. అదే సాంఘిక వాతావరణంనుంచే చెరెపొవేత్స్ మేయరు అయిన మిల్యూతిన్

* అలాంటి రచనలని మనం "జానపద సృష్టి" అని పిలవవచ్చు, యేమంటే అవి బహుశా పండగలప్పుడు ప్రదర్శించడం కోసం వృత్తి గిల్డులలో అభివృద్ధి చెంది వుంటాయి. — రచయిత వివరణ.

** రజ్నొచీన్‌త్సి మేధావికి నమూనాగా "గడ్డు రోజులు"లో స్లెప్‌చోవ్ చాలా బాగా వర్ణించిన పాత్ర. — రచయిత వివరణ.

లాంటి సాంస్కృతిక నాయకులు, విజ్ఞానశాస్త్రాన్నీ, కళనీ, తదితర సాంస్కృతిక కార్య కలాపాలనీ పోషించడంలో యెంతో నేర్పునీ, భక్తినీ ప్రదర్శించిన వర్తకులు చాలా మంది మాస్కోనుంచీ, రాష్ట్రాలనుంచీ పుట్టుకొచ్చారు. ఫోమా సంరక్షకుడు మయాకిన్ కూడా చిల్లర లక్షణాలతో, లేదా ''సామెతల''తో తయారైనవాడే. అక్కడ ఒక విచ క్షణ ప్రదర్శించా ననుకుంటున్నాను: 1905 తర్వాత రైతులా శ్రామికులా మృత కళేబరాలు మయాకిన్ల అధికారానికి దారి వేసినప్పుడు, యీ మయాకిన్లు శ్రామికవర్గా నికి వ్యతిరేకంగా పోరాటంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు, యివాళ్టికి కూడా తమ పాత గూళ్ళకి తిరిగి రావాలనే కలగంటూవున్నారు.

నేను జీవితంలో ''చిత్తయి పోయినవాళ్ల''ని గురించి యెందుకు రాసానని యువ జనం నన్ను అడుగుతూ వుంటారు.

కారణం సాదా అయిందే. నాకు లాగా క్షుద్ర సంస్కారహీనుల మధ్య బతుకుతూ, యితరుల జీవరుధిరాన్ని పీల్చాలని ప్రయత్నిస్తూ ఆ రక్తాన్ని కోపెక్కులుగా ఆ కోపె క్కులని రూబుళ్లగా మార్చాలని చూసే వాళ్లు చుట్టుముట్టి వుండగా, నేను, నాకు ఉత్తరం రాసిన 19 యేళ్ల వ్యక్తిలాగా, ''నా శరీరంలోని ప్రతీ అణువుతోనూ'', మంద కొడి ప్రజల మశ్చక సమ జీవితం పట్ల, రాగి అయిదు కోపెక్కు నాణేలు అన్నీ ఒక్కలాగే ముద్రించినట్టు ఒకళ్లనొకళ్లని పోలివున్న ఆ ప్రజల జీవితం పట్ల, ద్వేషం పెంచుకున్నాను.

నాకు తిరుగుబోతులూ, ఆవారాగాళ్లూ మామూలు గాడిలో లేని మనుషులుగా కనిపించారు. వాళ్లు ప్రజలతో విభేదించి వుండేవాళ్లు. యేమంటే కులం పోగొట్టు కోవడంవల్లా, తమ వర్గంనుంచి బహిష్కృతమవడం వల్లా వాళ్లు తమ పూర్వ వాసన అని వదిలించుకున్నారు. నీజ్నీ నోవ్‌గొరొద్‌లోని 'మిల్లియోంకా' అనే చోట వుండే చిత్తయి పోయిన వాళ్లల్లో పూర్వం స్థితిమంతులుగా వున్న వెనకటి నగరవాసులు; మా బంధువు అలెగ్జాండర్ కష్‌రిన్, ఒక సాధు స్వాప్నికుడు; టంటీని అనే ఒక ఇటా లియన్ చిత్రకారుడు; గ్లద్‌కోవ్ అని ఒక నాటి పాఠశాల ఉపాధ్యాయుడు; యెవరో ఒక బారన్ బి.; దోపిడీ నేరానికి జైలులో గడిపిన ఒక నాటి పోలీసు ఇనస్పెక్టరు; యింకో పేరు మోసిన దొంగ 'నికోల్కా జనరల్' అన్యోన్యంగా స్నేహంగా కలిసిమెలిసి వుండేవాళ్లు.

రనూరమి యిరవై మంది నానా రకాల వాళ్ళూ వున్న ఒక గుంపు కజాన్‌లోని 'ప్రైక్లియాన్నీ జవోద్'లో వుండేది. వాళ్లల్లో రాద్లొవ్ లేదా రదునోవ్ ''విద్యార్థి'' వుండేవాడు; పది సంవత్సరాలు కఠిన శ్రమశిక్ష అనుభవించిన కాగితాల తయారీకి పీలి

కలు పోగుచేసే పెద్దాయన ఒకతను; గవర్నరుకి ఒకప్పుడు పరిచారకుడుగా వున్న గ్రాచిక్; యింజను డ్రైవరూ రొడ్జియేవిచ్, బైలోరష్యన్ పూజారి కొడుకూ, పశు వైద్యుడు దవీదొవ్ వుండేవాళ్ళు. వాళ్లల్లో అధిక భాగం రోగిష్టులే. వంటికి సరిపడే దానికంటే అధికంగా తాగి కొట్లాడుకునే వాళ్లు. కాని వాళ్ల మధ్యలో ఒక స్నేహ భావం, పరస్పర సహకారం వుండేవి. వాళ్లు తాము యేది సంపాదించుకోగలిగినా లేదా కాజెయ్యగలిగినా ఆ తిండిమీదా సారామీదా ఉమ్మడిగా బతికేవాళ్లు. తమ బతుకులు ''సాదా జనం'' కంటే కష్టతరంగా వున్నప్పటికీ, యీ మనుషులు వాళ్లకంటే అధి కులమని అనుకునే వాళ్లు. యేమంటే వాళ్లకి దురాశ లేదు. వాళ్లు ఒకళ్లనొకళ్లని అణగదొక్కుకునే వాళ్లు కాదు, డబ్బు వెనకేసుకునే వాళ్లు కాదు. వీళ్లల్లో కొంత మంది కొంత సొమ్ము జాగ్రత్త చేసుకుని వుండచ్చు యేమంటే వాళ్లు పాదుపరి తనపు అవశేషాలనీ, ''క్రమబద్ద'' జీవితం పట్ల ప్రేమనీ యింకా నిలబెట్టుకున్న వాళ్లు. వాళ్లకి దాచుకున్న సొమ్ము వుండి వుండచ్చు, యేమంటే, నేర్పూ, నెగ్గుకు వచ్చే అదృష్టమూ వున్న గ్రాచిక్ తరుచుగా కొల్లగొట్టిన దాన్ని ''కోశాధిపతి'' రొడ్జి యేవిచ్ భద్రంగా దాచమని యిచ్చేవాడు. యీ చిత్తయిపోయిన కూటానికి రొడ్జి యేవిచ్ ఒక రకమైన జనరల్ మానేజర్. అతన్ని అందరూ నమ్మేవాళ్లు, పైగా ఆశ్చర్యకరమైన మెతకదనమూ, దుర్బల సంకల్పమూ వున్న వ్యక్తి.

యెన్నో దృశ్యాలని నేను గుర్తుచేసుకోగలను: ఓ సారి యీ మిత్ర బృందంలోని ఒకతను తను కాజేసిన యెత్తు బూట్లని తీసుకువచ్చాడు. వాటిని అమ్మెయ్యాలనీ, ఆ సొమ్ము సారామీద ఖర్చుపెట్టాలనీ ఉమ్మడిగా తీర్మానం చేశారు. అయినా, పోలీసు దెబ్బలు తిని జబ్బుగా వున్న రొడ్జియేవిచ్ బూట్ల పై భాగాన్నే అమ్మి, కింది భాగాన్ని, బూట్లు విరిగిపోయిన ''విద్యార్థి''కి యివ్వాలని అన్నాడు. ''వాతం పట్టి చచ్చిపోతాడు అతను, మనిషి మంచివాడు'' అన్నాడతను.

బూట్ల పై భాగం తీసేశాక, ఆ జైలుకెళ్లివచ్చిన అపరాధి దాన్ని చెప్పుల కింద మార్చాలన్నాడు — ఒక జత తన కోసం, రెండవది రొడ్జియేవిచ్ కోసం. ఆ రకంగా కాజేసిన ఆ బూట్లని యింతా చేసి సారాకింద మార్చడమే జరగలేదు. తను అందరి పట్లా స్నేహపూర్వకంగా వుండి, అందరికీ సాయం చేస్తానసీ, యెందుకంటే తనకి ''చదువుకున్న జనం'' అంటే యిష్టమనీ గ్రాచిక్ అన్నాడు.

''నాకు చదువుకున్న మనిషంటే అందమైన ఆడదానికంటే యెక్కువ యిష్టం'' అని అతను నాతో అన్నాడు. అతను వింత మనిషి. నల్లని జుట్టు, మంచి రూపు రేఖలు, హృద్యమైన మందహాసం వున్నవాడు. మామూలుగా మితభాషిగా, ఆలోచనామగ్నంగా వుండే అతను. కాని ఒకో అప్పుడు అడ్డూ ఆపూలేని, దాదాపు పిచ్చెత్తి పోయినంత హుషా

రుగా వుండేవాడు: పాటలు పాడేవాడు, నాట్యం చేసేవాడు, తన ఘనకార్యాలని గురించి డబ్బా కొట్టేవాడు, యిక యెప్పటికీ తిరిగి రాకుండా యేదో యుద్ధంలోకి పోయే వాడిమల్లే అందర్నీ కౌగలించుకునేవాడు. ఒక సారా కొట్టు కింద నేలమాళిగలో వుండే యెనమండుగురు ముష్టి వాళ్ళని పోషించేవాడు; నీళ్ళ, శక్తులు ఉడిగిపోయిన వృద్ధ స్త్రీ, పురుషులు. కాని వాళ్ళల్లో ఒక యోడారి పంటిపిచ్చి వున్న ఒక పడుచు పిల్ల ఆమె కూడా వుండేది. అతను యీ రకంగా దొంగ అయ్యాడు: తను యింకా గవ ర్నరుగారి నౌకరుగా వుండగానే ఒక రాత్రంతా తన ప్రియురాలితో గడిపేడు. పొద్దున్న యింటికి పోతూ, యింకా మత్తుగానే వున్న స్థితిలో పాలు అమ్మే ఒకామె దగ్గ ర్నుంచి బలవంతంగా ఓ కూజా లాక్కుని పాలు తాగేశాడు. పట్టుకున్నప్పుడు పెనుగు లాడాడు. న్యాయాధికారి అతన్ని జైలుకి పంపించాడు. ఆ న్యాయాధికారికి ఉదారుడని పేరు వున్నా తన విధులని కఠోరంగా నిర్వర్తించేవాడు. జైలునుంచి వచ్చాక గ్రాటిక్, అతని అధ్యయన మందిరంలోకి దూరబడి, అరుదైన కాగితాలన్నిటినీ చింపేసి, అలారం గడియారం, బైనాక్యులర్స్ కాజేసి మళ్ళీ జైల్లో కూర్చున్నాడు. కన్నం వెయ్యడానికి విఫల ప్రయత్నం చేసి సహోదరా వాళ్ళని తప్పించుకుని పారిపో ప్రయత్నించేటప్పుడు నాకు అతనితో పరిచయం అయింది. అతన్ని వెంటాడేవాళ్ళల్లో ఒకణ్ణి త్రోటు పడచేసి గ్రాటిక్ పారిపోవడానికి నేను సాయంచేశాను. అతనితోబాటు పారిపోయాను.

యీ వెలివేసిన మనుషులలో వింత మనుషులు వుండేవాళ్ళు, నాకు అర్థం కానిది వాళ్ళల్లో చాలా వుండేది. నేను వాళ్ళ పట్ల అనుకూలంగా వుండడం అనేది, వాళ్ళు జీవితంమీద ఫిర్యాదు లేమీ చెయ్యకపోవడమన్న దానివల్లనే. స్థితిమంతుల కులాసా జీవితం అంటే వాళ్ళకి అసూయ లేదు. దాన్ని గురించి పరిహాసంగా, యెత్తిపొడుపుగా మాట్లాడుకుంటూ, అందని ద్రాక్ష పళ్ళు పుల్లన అనే భావమే ద్యోతకం కాని య్యరు. తమ జీవితాలు బీదరికంతో వున్నా, కులాసాగా గడిపేవాళ్ళకంటే తామే మెరు గని, తాము యేదో గుర్తించినట్టుగా, వాళ్ళు గొప్పగా భావించుకునే వాళ్ళు.

నేను "చిత్తయి పోయినవాళ్ళు"లో చిత్రించిన వసతి గృహపు కాపలావాడు, కువాల్దా, అధ్యక్షతన వున్న కోర్టులో నేను మొదటగా చూసిన వాడు. జడ్జిగారు అడిగిన ప్రశ్నలకి యీ బికారి సమాధానం యిచ్చిన హుందాతనం, పోలీసులు పోటీ సాక్ష్యం తెచ్చినప్పుడు అతను ప్రదర్శించిన యేవగింపు నాకు ఆశ్చర్యం కలిగించాయి. ఒదెస్సా ఆవారా మనిషి సరదాగా పరిహాసాలాడ్డమూ నాకు అంతే ఆశ్చర్యం కలిగిం చింది. "చెల్కాష్"లో నేను వర్ణించిన సంఘటన చెప్పింది అతనే. నికొలాయెవ్ పట్ట ణంలో ఒక హాస్పిటల్‌లో మేం కలుసుకున్నాం. అతని చిరునవ్వు నాకు బాగా గుర్తువుంది. అతని అద్భుతమైన తెల్లని పళ్ళు కనిపించేవి. అతను పనికి పెట్టుకున్న

ఒక యువకుడు తనని మోసగించిన విధం చెపుతూ అతను తన కథ ముగించాడు: ''అంచేత నేను అతన్ని ఆ డబ్బు తీసుకుని పోనిచ్చాను. ఫోరా, వెధవా, పోయి దాంతో నీ యిష్టం వచ్చినట్టు చేసుకో''.

అతను నాకు డ్యూమా ''ఉదాత్త'' నాయకుల్ని గుర్తుకు తెచ్చాడు. హాస్పిటల్ నుంచి బయటపడ్డాక, నాకు కొన్ని పుచ్చకాయ ముక్కలు పెడుతూ అతను నన్నడిగాడు:

''కొంత లాభసాటి వ్యవహారంలో నాతో కలుస్తారా మీరు? మీరు సరిపడే వాళ్లని నా అభిప్రాయం.''

అది పూరించేటట్టుగానే వుంది, కాని స్మగ్లింగ్ కన్నా, దొంగతనం కన్నా ప్రయోజనకరమైన పనులు వున్నాయని నాకప్పటికే తెలుసు.

బహిష్కృతుల పట్లా, ఆవారాల పట్లా నాకు గల మొగ్గుకి సంబంధించిన వివరణే నేను చెప్పింది అంతా — మందకొడి సంస్కారహీనులని కాకుండా మామూలు జీవితపు గాడికి బయటవున్న వాళ్లని, చిత్రించాలన్న నా కోరికని వివరించిందే. నేను విదేశీ సాహిత్య ప్రభావం కింద కూడా వున్నాను. మొదటగా ఫ్రెంచి సాహిత్యం, అది రష్యా సాహిత్యం కంటే యింకా యెక్కువ కళ్లకి కట్టినట్టూ, వర్ణ శోభితంగానూ వుంది. యేమైనప్పటికీ, మా పదిహేనేళ్ల లేఖరి రాసినట్టు ''అణగారే మందకొడి జీవితాన్ని'' నా వూహద్వారా ఉత్సాహభరితం చెయ్యడమనే నా కోరికే ప్రధాన కారణం.

నేనిదివరకే చెప్పినట్టుగా ఆ కోరికని ''రొమాంటిసిజం'' అంటారు. కొంత మంది విమర్శకుల అభిప్రాయంలో నా రొమాంటిసిజం నా తాత్వికతలో వున్న భావవాదపు ప్రతిబింబమే. ఆ అంచనా తప్పని నా అభిప్రాయం.

మానవుడూ, జంతువులూ, మానవుడు సృష్టించిన సకల వస్తువులూ ''భావాల'' అధీనంలో వుంటాయని తాత్విక భావవాదం బోధిస్తుంది. యివి మానవుడు సృష్టించిన ప్రతిదానికీ సంపూర్ణ ఆదర్శాలు. మానవుడి కార్యకలాపాలు ఆ ఆదర్శాలమీదనే ఆధారపడి వుంటాయి, అతని కృషి ఆ ''భావాలని'' అనుకరించడంలోనే వుంటుంది, వాటి ఉనికిని అతను యేదో అస్పష్టమైన తీరులో గ్రహిస్తాడట. యీ దృక్పథం ప్రకారం యెక్కణ్నో పైన, మనకి పైన, సంకెళ్ల భావం, ఇంటర్నల్ కంబశ్చన్ ఇంజన్ భావం, క్షయ క్రిమి భావం, ఆధునిక తుపాకీ భావం, వికారపు కప్పని గురించిన భావం, సంస్కారహీనుడు, మూషికం, మొత్తంమీద భూమ్మీద వుండే ప్రతి దానికీ, మానవుడు సృష్టించిన ప్రతిదానికీ సంబంధించిన భావం వుంటుందట. యిక యెక్కడనుంచి యీ భావాలన్నిటినీ సృష్టించిన వాడొకడు, యేదో కారణానికి, గద్దనీ పేనునీ, యేనుగునీ కప్పనీ సృష్టించిన వాడొకడు వుంటాడన్న దాన్ని విధిగా గుర్తించడమన్నది అనుసరించి వస్తుంది స్పష్టంగా.

నాకు సంబంధించి మనిషికి బయట భావాలనేవి లేవు. నాకు సంబంధించి మానవుడు — మానవుడే — సకల వస్తువులనీ, సకల భావాలనీ సృష్టించిన వాడు. అద్భుతాలని చేసేవాడు అతనే, ప్రకృతి శక్తుల భవిష్యత్ నాయకుడు అతనే. మన యీ ప్రపంచంలో అత్యంత సుందరమైంది మానవుడి ప్రతిభవల్ల సృష్టించబడింది, అతని కుశలమైన హస్తాలవల్ల నిర్మితమయింది. మన సకల ఆలోచనలు, భావాలు క్రమ క్రమంలో ఉత్పన్నమైనవే. కళా, విజ్ఞానశాస్త్రం, సాంకేతిక పరిజ్ఞాన చరిత్ర మనకి విశ్వాసం కలిగించేది యిది. వాస్తవాన్ని అనుసరించి వస్తుంది ఆలోచన. నేను మానవుడికి విశ్వాన్ని అర్పిస్తున్నాను, యేమంటే మన ప్రపంచంలో అతని హేతువు, అతని స్వప్నా, అతని కల్పనల మూర్తి తప్ప నాకేం గోచరం కాదు. భగవంతుడు మానవుడి స్వప్నాలలో కల్పితమే, ఫోటోగ్రఫీలాగా. తేడా యేమిటంటే కెమెరా వాస్తవమైన దాన్ని చిత్రిస్తుంది. భగవంతుడు అనేవాడు మానవుడు సర్వజ్ఞుడుగా, సర్వ శక్తిసంపన్నుడుగా, పరమ ధర్మ మూర్తిగా వుండగలిగి, వుండాలని కోరుకున్న జీవిగా తను ఊహించిన దాన్ని కనిపెట్టిన ఫోటోగ్రాఫే.

"పవిత్రమైన" దాన్ని గురించి మాట్లాడాల్సిన అవసరం వుంటే, నేను పవిత్రంగా యెంచే ఒక్కటే యేమిటంటే మానవుడు తన పట్ల తను చెందే అసంతృప్తి, యింత కంటే అధికుడుగా తయారవాలని అతను చేసే కృషి. మానవుడు తనే ఉనికి కలిగించి, జీవితాన్ని బంధనం చేసే చెత్త అంతటినీ ద్వేషించడాన్నే పవిత్రంగా భావిస్తాను. అన్యాయని, దురాశని, నేరాన్ని, రోగాన్ని, యుద్ధాలని ప్రపంచంలోని ప్రజల మధ్య శత్రుత్వాలన్నీ రూపు మాపాలనే అతని సంకల్పాన్ని పవిత్రంగా భావిస్తాను. అతని శ్రమని పవిత్రంగా భావిస్తాను.

# సంస్కృతి

నా దృష్టిలో, సంస్కృతి పట్ల శ్రామికవర్గం యిక్కడ చెప్పబోయే దృక్పథాన్ని అవలంబించడం మంచిది.

సంస్కృతి అని పిలిచేది అంతా ఆత్మరక్షణ అనే సహజ ప్రేరణనుంచి పుట్టింది. ప్రకృతి అనే సవతి తల్లికి వ్యతిరేకంగా పోరాడే క్రమంలో మానవుడి శ్రమవల్ల సృష్టి అయింది. సంస్కృతి అనేది మానవుడు సంకల్ప, మేధల శక్తి వల్ల "అపర సృష్టి" కావించే ప్రయత్నపు ఫలితం.

తొలి ప్రకృతి అవ్యవస్థిత, ఆదిమ శక్తుల అయోమయం. అవి భూకంపాల్ని, వరదల్ని, తుఫాన్‌లని, క్షామ పరిస్థితుల్ని, భరింప శక్యంగాని ఉష్ణాన్ని, శీతాన్ని కలిగించేవి. తొలి ప్రకృతి తన శక్తుల్ని వ్యాధికారక సూక్ష్మ క్రిములని సృష్టించడంలో వృథా చేసేది. ఆ క్రిములు యెంతో అపాయకరమైన సూక్ష్మజీవులు, పెంకుటీగలు, మానవుడి రక్తంలో జ్వరాన్ని, సన్నిపాత విషజ్వరాన్ని ప్రవేశపెట్టే పరోప జీవి క్రిములు. అది లెక్క లేనన్ని అపాయకర, నిరర్థకమైన మొక్కల్నీ, తృణాలనీ సృష్టించేది. మానవుడికి ఆహారంగా ఉపయోగపడే పళ్ళూ, తృణధాన్యాలూ పెరగడానికి అవసరమైన ఆరోగ్యకర ఆనవాలని పరాన్న జీవుల పునరుత్పత్తిమీద వృథా చేసేసేది. అసలు మానవుడికి ఉపయోగమైన తృణధాన్యాలని ప్రకృతి యెన్నడూ ఉత్పత్తి చెయ్యలేదనీ, యిప్పుడు మనకి ఆహారంగా వున్న వాటికి ఆదిమ మానవులు క్రమేపీ యెంతో కాలం బాధలు పడి, ప్రాణాలు పోయిన మీదట అలవాటు పడ్డారనీ యెవళ్ళేనా అనుకోవచ్చు. మొట్టమొదట సారి బంగాళా దుంపల్ని వాడినప్పుడు యూరపియన్లకి తీవ్రమైన వ్యాధులు సోకాయన్న వాస్తవం దీన్ని రుజువు చేస్తుంది. యిది ఒక్క బంగాళా దుంపలకి సంబంధించే కాక మిగతా వాటి విషయాల్లో నిజమే. యీ మాదిరిగా మానవుడికి ప్రతికూలంగా నిరర్థకంగా వుండే పరాన్నజీవి చెత్త మధ్యలో ప్రకృతి మానవుడ్ని సృష్టించింది. కాని అతన్ని మిగతా జంతువుల మాదిరిగానే ఒక జంతువుగా చేసింది.

యీ జంతువు శారీరక బాధలకి యెక్కువ చలించేదిగా అయింది. అంచేత

ఆత్మరక్షణ సామర్థ్యాన్ని మిగతా జంతువులన్నిటి కంటే కూడా యెక్కువ వేగంగా, నిశి తంగా, వైవిధ్యభరితంగా అభివృద్ధి చేసుకోవడం జరిగింది. ఆత్మరక్షణ సహజచోదన మానవుడికి తృణధాన్యాలనీ, పళ్లనీ, మొక్కల మధ్యా గరికల మధ్యా ఔషధ మూలికల్నీ కనిపెట్టేట్టు నేర్పింది. జంతువులని మచ్చిక చెయ్యడం, మృగచర్మాల్ని ధరించడం, గుహల్లో వసించడం, వేటాడే ఆయుధాలు, ఆత్మరక్షణ ఆయుధాలు, శ్రమని తగ్గించే పరికరాలు కనిపెట్టడం నేర్పింది.

వివేకపు ప్రతి రెమ్మని వశం చేసుకోడానికి పరిశీలనా, అధ్యయనమూ అందించిన చిన్న, అతి సూక్ష్మ సత్యాంశాలే ఆధారం. జీవితం పట్ల భయమూ, జీవితం కోసం నిర్దాక్షిణ్యమైన పోరాటమూ, ''తన వ్యక్తిత్వం'' కోసం నిర్దాక్షిణ్యమైన పోరాటమూ జరిపేటప్పుడు ఆత్మరక్షణ సహజచోదన మానవుణ్ణి ''యుక్తిగా తాత్వీకరించేటట్టు'' చేసింది. అందుకనే అతిసామాన్యమైన సత్యపు వెలుతురుని మాయ మాటల చెత్తా చెదారంతో జనం మసక కమ్మేం చేశారు. అందుచేత సత్యపు అవరోధాన్ని తొలగించే అవసరం, ప్రతి సత్య అంశమూ యెలా ప్రత్యక్షమైందీ గుర్తు చేసే అవసరం ఉత్ప న్నమవుతోంది.

మానవ సంస్కృతి అనేది జీవశాస్త్ర దృగ్విషయం. అది జీవితం పట్ల మానవు డికి గల యిచ్ఛలో వ్యక్తమవుతుంది, పోషకమవుతుంది, చింతనాత్మకం అవుతుంది. ఆ యిచ్ఛ సకల జీవానికీ, అంటే మొక్కలకి, క్రిములకి, పక్షులకి, జంతువులకి వుండే చిత్రమైన అంధ యిచ్ఛ. మానవుడు తను మిగిలిన జంతువులకంటే దుర్బలుడుగా వున్నానని అనుకున్నప్పుడే తన సంస్కృతిని సృష్టించుకో ప్రారంభించాడు. యీ దౌర్బ ల్యాన్ని గుర్తించడం అనేది మరింత వేగంగా, విజయవంతంగా అతను తన ఆత్మరక్ష ణని పెంపొందించుకొనేటట్టుగా అతని సహజచోదనని చేసింది. ఆత్మరక్షణ సహజచోదన అనే దాని ఆధారంగానే అత్యంత విలువైన మానవ సామర్థ్యం — పరిశీలించే సామర్థ్యం — అభివృద్ధి అయింది. ఓ చీమకి, కాకికి, పెద్ద పులికి కూడా అలాంటి సామర్థ్యం వుంటుంది. కాని మానవుడు పరిశీలించి పోల్చినప్పుడు ఆ సామర్థ్యాన్ని యింకా పెంపొందించుకు న్నాడు, జీవితపు అన్ని పార్శ్వాలని గురించిన విజ్ఞానం కోసమూ చేసే ప్రయత్నంగా అభివృద్ధిచెందింది. తర్వాత ఆ జ్ఞానం కచ్చితమైన విజ్ఞానశాస్త్రాలు అయే స్థాయికి చేరింది. మరి యివాళ అది క్రమేపీ ఒక సహజాతంగా, మానవుడి స్పష్టమైన భాష లాగా లేదా అతని నవ్వులాగా, అదే జీవశాస్త్ర సంబంధమైన సజీవ విలక్షణంగా, మారింది.

''ప్రేమా, ఆకలీ ప్రపంచాన్ని పాలిస్తాయి'' అని పూర్వం అనేవాళ్లు. ''ప్రేమ'' అంటే పునరుత్పత్తి యత్నం; ''ఆకలి'' — శారీరకమైన ఆకలి, కాని యివాళ మూడో

మా రోజుల్లో జీవసంభరణ భయం మాకు యెక్కువగా వుండేది. యివాళ అలాంటి భయం అంధుడి భయం లాంటిదని అంటాను. నేను వేరే సందర్భంలో వర్ణించినట్టుగా చాలా కష్ట భూయిష్టమైన పరిస్థితుల్లో జీవించి నా చిన్నప్పుడు మనుషులు ప్రదర్శించే పాశవికత్వాన్నీ, నేను అర్థం చేసుకోలేని పరస్పర విద్వేషాన్నీ చూశాను. కొంత మంది నడుములు విరిగిపోయేటట్టు పనిచెయ్యడమూ, మరింకొంత మంది సుఖ సంపదలతో తుల తూగడమూ చూసి ఆశ్చర్యపోయాను. తాము "భగవంతుడికి యెంత సన్నిహితంగా" వున్నామని భక్త వరేణ్యులు భావించుకుంటూ వున్నారో అంతగా వాళ్లు తమ కోసం పనిచేసే వాళ్లకి దూరంగా వుండటమూ, అంత నిర్దాక్షిణ్యంగా శ్రమించే వాళ్లనుంచి బలవంతంగా రాబట్టుకునేటట్టు వుండడమూ నాకు చాలా చిన్నప్పుడే అర్థమయ్యాయి. మీకు చూసే అవకాశంలేని జీవిత హేయాలని యెన్నిటినో నేను చూశానని చెప్పితీరాలి. పైగా, యింకా యెంతో అసహ్యకరమైన రూపాల్లో చూశాను. యేమంటే యివాళ మీరు చూసే పశుబుద్ధి వాడు విప్లవంవల్ల అణిగిపోయాడు, తన సహజధోరణిపట్ల హక్కు వుందన్న విశ్వాసంతో మనలేడు. పశుబుద్ధి తను బాగానే వున్నట్టూ, తన శ్రమరహిత, సౌఖ్యప్రద జీవితం శాశ్వతంగా వుండే వరం పొందినట్టూ, పరమ ఖాయంగా భావించుకుని వుండడం నేను చూశాను.

అప్పటికే నేను విదేశీ నవలా రచయితల అనువాదాలని, డికెన్స్, బాల్జాక్ లాంటి అద్భుత రచయితల నవలలని, అయిన్స్‌వార్త్, బుల్‌వేర్ — లిట్టన్, డ్యూమాలు రాసిన చారిత్రక నవలలని చదువుతూ వున్నాను. దృఢ సంకల్పమూ, అకుంఠిత స్వభావమూ వున్న వాళ్లని అవి చిత్రించాయి. వాళ్ల సంతోషాలూ, బాధలూ నాకు తెలిసిన వాటికంటే భిన్నమైనవి, వాళ్ల వైరాలు ముఖ్యమైన భేదాలనుంచి ఉత్పన్నమైనవి. యేమయినా, నా చుట్టూతా నీచమైన, కనాకష్టమైన మనుషులు వున్నారు. వాళ్ల దురాశ, వైషమ్యం, పగ, కచ్చలు, లిటిగేషన్లు యేదో పొరుగువాడి కొడుకు కోడిపెట్ట కాలు విరిచాడనో, కిటికీ అద్దం పగల గొట్టాడనో, లేకపోతే కాబేజీ పులుసు మరగ కాగిందనో, పాలు విరిగిపోయాయనో లాంటి వాటి నుంచే పుట్టేని. ఓ గజం గుడ్డ ముక్కకో, లేక ఓ పౌను పంచదారకో కొట్టువాడు యింకో కోపెక్కు యెక్కువ లాగేశాడని రోజుల తరబడి వలవలా యేడ్చేవాళ్లు. పొరుగు వాడికి యే పిసరు దురదృష్టం కలిగినా వాళ్లకి భలే సంతోషంగా వుండేది, ఆ సంతోషాన్ని సానుభూతి ప్రదర్శించడం మాటున దాచుకునేవాళ్లు. సంస్కారహీనుల స్వర్గంలో ధగధగ మెరిసేది ఒక కోపెక్ నాణెం అనీ, మనుషుల మధ్య క్షుద్ర, నీచమైన శత్రుత్వానికి అది దారి తీయించేదనీ నేను బాగా గుర్తించాను. కుండలూ, దాకలూ, కోళ్లూ కొక్కి రాయిలూ, పొంగరాలూ, దేవళ దర్శనాలూ, పుట్టడాలూ కిట్టడాలూ, తెగతాగడం తినడం — అదీ నేను బతికి పెరిగిన జీవితం. ఆ వెలపరం పుట్టించే బతుకు నాలో ఒకప్పుడు మొద్దుబార్చే మగతని కలిగించేది, యింకో సారి, మగతనుంచి మెలుకువ తెచ్చుకోడానికా అన్నట్టు,

మోపింది. మొదటి విషయంగా మీరు కష్టించి అధ్యయనం చేసే పూచీ మీమీద వుంచుతోంది అది. వ్యక్తి యెంత తెలుసుకుంటే అంత బలవంతుడవుతాడు. అది నిర్వివాదం. తన లక్ష్యం యెంతటి మహత్తరమైందీ, యెంత గంభీరమైందీ అన్న పరిజ్ఞానం మనిషిని యింకా దృఢతరం చేస్తుంది.

అప్పుడు చవకబారు ''జీవిత క్షుద్ర విషయాలు,'' పాత విశ్వాసాలు, మురికి, ''శతాబ్దాల ధూళి,'' ''సంస్కార హీనత్వపు'' లజ్జాకరమైన మనస్తత్వం, ''పెటీబూర్జ్వా తత్వం'' — యివేమీ కూడా రచయితకి సంబంధించి అస్తిత్వంలో వుండవు, అతన్ని సోకలేవు.

రచయిత ''క్షుద్ర విషయాల'' విషపూరితమైన చెత్తకి లొంగకూడదు. అతను దానికి వ్యతిరేకంగా అకుంఠితంగా పోరాడాలి. ''జీవితపు క్షుద్ర విషయాలు'' తనని ఆటంకపరిచి అడ్డగిస్తున్నాయని అతను ముక్కి మూలగకూడదు. నిత్యజీవిత లోపాలు ప్రతివాళ్లనీ అడ్డగిస్తాయనీ, రొష్టు పడడం వ్యర్థం అనీ, అకుంఠిత పోరాటమూ సంతోషభరిత శ్రమ మాత్రమే మన జీవిత కష్టాలన్నిటినీ అధిగమించేట్టు చేస్తాయనీ అతను తెలుసుకోవాలి.

మనిషి జన్మతః ''దుష్టుడు'' కాదనీ, వర్గ వ్యవస్థ అనే యేహ్యమైన సామాజిక నిర్మాణంవల్ల అతను భ్రష్టుడవుతున్నాడనీ రచయిత నిస్సంకోచంగా యెరిగి గుర్తించుకోవాలి. యిలాంటి వ్యవస్థ హింస లేకుండా వుండలేదు. అసూయని, పగని, సోమరితనాన్ని రెచ్చగొట్టకుండా వుండలేదు. బలవంతమూ, తరచూ వ్యర్థమూ అయిన శ్రమ పట్ల వైముఖ్యాన్నీ సులభ లాభం పట్లా, చవకబారు మురిగిపోయిన సుఖాల పట్లా, విషయ లౌల్యం పట్లా, సురాపానం యింకా తదితర చవకబారు కుచేష్టల పట్లా ఆకర్షణనీ కలిగించకుండా వుండలేదు.

తాము చెప్తున్నట్టు మానవుడు ''జన్మతః ఛండాలుడనీ'', నీచత్వం అనేది వాడి శరీరంలో, పాశవిక సహజాతాల్లో వుంటుందనీ, అది ''రాక్షస'' ప్రేరితమనీ, సకల మానవ చర్యలూ కూడా మానవ అంతరాత్మని స్వాధీనం చేసుకోడానికి అనాదిగా జరుగుతూ వున్న దేవదానవ పోరాటపు ''ప్రతిఫలన''మనీ నొక్కిచెప్పడం తమకి లాభసాటి అవసరంగా వుందని భావించే మనుషులు వున్నారని యువజనులైన మీరు తెలుసుకోవాలి, గుర్తుంచుకోవాలి.

ఉన్నత జీవితకోసం మానవుడికిగల యిచ్ఛని, శ్రమనీ సృజననీ విముక్తం చెయ్యాలన్న యిచ్ఛని పరిమితంచేసి, చంపెయ్యాలన్న కోరిక, మనిషిని వర్గసమాజపు బానిసగా పెంచాలన్న కోరిక అలాంటి ఉద్బోధకి ఆధారం. అది మనిషిని ఒట్టి ముడి పదార్థంగా,

టాల్‌స్టాయ్ నిట్టూర్చి, తనని తను నిందించుకుంటున్నట్టే అన్నాడు:

"నేను అరిచి వుండకూడదు — అరవకపోతే అది కోడిని పట్టేసి వుండేదే...."

ఓ సారి ఆయనతోటి త్బిలీసిని గురించి మాట్లాడుతూ వున్నప్పుడు నేను వి. బెర్వీ — ఫ్లెరోవ్‌స్కీ[88] పేరు ప్రస్తావించాను.

"మీకు ఆయన తెలుసా?" అని టాల్‌స్టాయ్ ఆతృతగా అడిగాడు. "ఆయన్ని గురించి నాకు యేమన్నా చెప్పండి."

ఫ్లెరోవ్‌స్కీ పొడుగ్గా వుంటాడనీ, బారుగా వుండే గడ్డం వుంటుందనీ, పల్చగా వుంటాడనీ పెద్ద కళ్లుంటాయనీ, కిత్త నారగుడ్డ అంగీ వేసుకుంటాడనీ, ఎర్ర వైన్‌లో ఉడికించిన పెద్ద అన్నం సంచీ ఆయన బెల్ట్ నుంచి వేలాడుతూ వుంటుందనీ, పెద్ద కాన్వాస్ గొడుగు మోసుకుపోతాడనీ చెప్పాను. నాతో బాటుగా ట్రాన్స్ కకేషియన్ కొండల రస్తాలో దిమ్మరిలా తిరిగాడనీ చెప్పాను. అక్కడ ఒక చిన్న గొందిలో ఓ ఆంబోతు యెదురైందనీ, కోపంతో వున్న ఆ జంతువుని తెరిచిన గొడుగుతో బెదిరిస్తూ, అంత సేపు అగాథంలోకి పడిపోయే ప్రమాదం వున్నా వెనక్కి తగ్గుతూనే, పారిపోయామనీ చెప్పాను. హఠాత్తుగా టాల్‌స్టాయ్ కళ్లల్లో నాకు నీళ్లు తిరగడం కనిపించింది. యిబ్బంది పడిపోయి ఆ విషయం తెంచేశాను.

"ఫరవాలేదు, చెప్పండి, చెప్పండి! వూరికే ఒక సహృదయుణ్ణి గురించి వినడం వల్ల కలిగిన సంతోషం యిది! ఆయన యెంత ఆసక్తికరమైన మనిషి అయి వుంటాడు! సరిగ్గా నేను ఆయన అలాగే వుంటాడని వూహించుకున్నాను — మిగిలిన వాళ్లల్లా కాదు! ప్రగతికాముక రచయితలందరిలోకీ ఆయనే అత్యంత పరిణతుడైన వాడూ, తెలివైన వాడూనూ. మన మొత్తం నాగరికత అంతా అనాగరికమైందనీ, సంస్కృతి అనేది శాంతికాముక తెగల వ్యవహారమనీ, బలహీనుల వ్యవహారమనీ, బలవంతులది కాదనీ, జీవనం కోసం పోరాటం అనేది చెడుని సమర్థించడానికి కల్పించిన అబద్ధం అనీ ఆయన తన పుస్తకంలో సమర్థవంతంగా చూపించాడు. మీరు మాతో అంగీకరించరనుకోండి, సందేహం లేదు. కాని దొదే[89] అంగీకరిస్తాడు ఆయన పోల్ ఆస్టియే[90] గుర్తుకు తెచ్చుకోండి."

"ఉదాహరణకి, యూరప్ చరిత్రలో నార్మన్ల[91] పాత్రని ఫ్లెరోవ్‌స్కీ సిద్ధాంతంతో యెవరేనా సమాధానపడ్డం యెలాగ?"

"ఓ, నార్మన్లా! అది వేరే విషయం."

సమాధానం తటక్కున స్ఫురించకపోతే ఆయన "అది వేరే విషయం" అంటాడు.

టాల్‌స్టాయ్‌కి సాహిత్యం గురించి మాట్లాడ్డం యిష్టం వుండదనీ, కాని

అనుకోకండి, యేం, కష్ట పెట్టుకుంటున్నారా? నేను ముసలివాణ్ని, ఆధునిక సాహిత్యాన్ని అర్థం చేసుకొనే శక్తి నాకు యిక లేకపోవచ్చును. కాని యిది యేదో రకంగా రష్యనేతరమైందని నాకు యెప్పుడూ అనిపిస్తుంది. మనుషులు ఒక వింత రకమైన పద్యాలు రాస్తున్నారు — యీ పద్యాలు యెందుకో నాకు తెలీదు, అవి యెవరి కోసమో నాకు తెలీదు. మనం కవిత్వాన్ని రాయడం పూష్కిన్‌నుంచి, త్యూత్‌చెవ్‌నుంచి[75] నేర్చుకోవాలి. మీరున్నారే'' — ఆయన చేహొవ్ కేసి తిరిగాడు — ''మీరు రష్యన్. అవును, మీరు చాలా చాలా రష్యన్.''

ఆయన ఆర్ద్రపూరితమైన చిరునవ్వుతో చేహొవ్ భుజం చుట్టూతా తన చేతిని వేశాడు. చేహొవ్‌కి అది యిబ్బందిగా అనిపించింది. ఆయన తన యింటిని గురించీ, తాతార్‌ల గురించీ సుంద్రస్వరంతో మాట్లాడ్డం మొదలపెట్టాడు.

ఆయనకి చేహొవ్ అంటే అభిమానం. చేహొవ్ కేసి చూసినప్పుడు, ఆయన చూపు దాదాపు ఆ క్షణంలో మృదువుగా అయిపోయి, చేహొవ్ వదనాన్ని లాలిస్తున్నట్టుగా వుండేది. ఒక రోజున చేహొవ్ పార్కులోని ఒక దారిలో అలెగ్జాంద్రా ల్వోవ్‌నాతో[76] నడుస్తున్నాడు. టాల్‌స్టాయ్ అప్పట్లో యింకా జబ్బుగా వున్నాడు. వరండాలో వున్న పడక కుర్చీలో కూర్చుని తన మొత్తం జీవంతోటి అవతలికి చేహొవ్ కేసి వెళ్లిపోతున్నట్టు వుంది.

''యేం సొగసైన, సెభాషైన మనిషి! అణకువగా నిదానంగా ఒక పడుచు స్త్రీలాగా వున్నాడు. అతను నడవడం కూడా ఆడపిల్లలాగే వుంటుంది. పూరికే అద్భుతంగా వున్నాడు!'' అని లోగొంతుకలో అన్నాడాయన.

ఒక రోజు సాయంత్రం సంధ్యా సమయంలో, కనుబొమలు ముడుచుకుని, అవి మెలి తిరిగి వుంటే, ఆయన మాకు తన ''స్వామి సెర్గియ్''లోని ఒక దృశ్యం చదివి వినిపించాడు. ఆ ఆడమనిషి యీ మునిని ప్రలోభ పెట్టే దృశ్యం అది. ఆయన దాన్ని సరాసరి చదివేసి, తల పైకి యెత్తి, కళ్లు మూసుకుని స్పష్టంగా అన్నాడు:

''ముసలాడు బాగానే రాశాడు — చాలా బాగా!''

దాన్ని యెంత సరసమైన సారళ్యంతో చెప్పడం జరిగిందంటే, తన సొంత రచనలోని సౌందర్యాన్ని అభినందించడం యెంత చిత్తశుద్ధిగా వుందంటే, నాకు అప్పుడు కలిగిన పారవశ్యం నేను యెన్నటికీ మర్చిపోలేను — నేను యెన్నటికీ మాటల్లో పెట్టలేని పారవశ్యం అది, దాన్ని గుంభనగా వుంచుకోడానికి నాకు బ్రహ్మ ప్రయత్నం అయింది! నా హృదయమే నిశ్చలంగా అయినట్టు అనిపించింది, ఆ ఉత్తర క్షణంలోనే ప్రతిదీ పునరుద్భూతమై, కళగా, నూతనంగా అయినట్టు అనిపించింది.

రత్వం ఆయన అభిరుచికి సరిపడుతుంది. ఆ మాటకి వున్న సిసలైన అర్థంలో ఒక జాతీయ రచయిత అయిన యీాయన తన బ్రహ్మాండమైన ఆత్మలో జాతికి గల అన్ని చెడ్డ లక్షణాలనీ, మన చరిత్ర చిత్రహింసలు మనమీద విధించిన అంగవైకల్యాన్నీ, యిముడ్చుకున్నాడు.... ఆయనలో వున్న ప్రతీదీ జాతీయమైందే. ఆయన మొత్తం బోధ అంతా శుద్ధ తిరోగమనం, ఆటవికం; దేన్నైతే జయించాలని మనం విదిలించుకో ప్రయత్నిస్తున్నామో అది.

1905లో ఆయన రాసిన ఉత్తరం ''మేధావులూ, రాజ్యమూ, ప్రజలూ'' అన్న దాన్ని గుర్తు చేసుకోండి — యెంతటి విద్వేషభరితమైన, అసహ్యమైన ఉత్తరం అది! దానిలో అంతటా కూడా కసిగా వుండే అసమ్మతీయుని ధోరణి ''నేను నీకు చెప్పాను కదా!'' అనేది కనిపిస్తూనే వుంటుంది. ఆ సందర్భంగా నేను ఆయనకి ఒక జవాబు రాశాను, ''రష్యన్ ప్రజల గురించీ, వాళ్ల పేరుమీదుగా మనం రాసే హక్కునీ ఎన్నడనగానో పోగొట్టుకున్నామని'' నాతోటి ఆయన అన్నమాటలమీదే ఆధారపడి. యేమంటే తనతోటి మనసు విప్పి మాట్లాడదామని వచ్చే మనుషులు చెప్పేది వినడానికే ఆయన అయిష్టంగా వుంటాడు. దానికి నేనే సాక్షిని. నా ఉత్తరం కటువుగా వుండింది. నేను దాన్ని పోస్టు చెయ్యలేదు.

తన భావాలకి వీలైనంత అత్యుత్తమ ప్రాముఖ్యం యిచ్చే ఆశతోటి బహుశా కడసారి లంఘనం అనేదాన్ని ఆయన చేస్తున్నాడు. వసీలీ బుస్లాయెవ్ లాగా ఆయనకి అలాంటి లంఘనలంటే యిష్టం. కాని యెప్పుడూ తన పవిత్రత్వపు రుజువు కోసమూ పరివేషం కోసం ప్రయత్నాల వైపూనే అవి వుంటాయి. యిది బలవంతంగా తను అభిప్రాయాలని యితరులమీద రుద్దడం లాంటిది, ఆయన బోధనలకి రష్యా ప్రాచీన చరిత్రవల్లా, మేధావి నైయక్తిక బాధవల్లా సమర్థన వచ్చినా. పాపాన్ని గురించిన చింతనవల్లా, జీవించాలనే కోరికకి లొంగడంవల్లా పవిత్రత సాధింపబడుతుంది.

విద్వేషానికి దగ్గరగా వుండే అనుభూతుల్ని నాలో రెచ్చగొట్టిందీ, నా హృదయంమీద మహా భారంగా పడేదీ టాల్‌స్టాయ్‌లో చాలా వుండింది. అసాధారణంగా ఉబ్బిన ఆయన అహం ఒక కిరాతకమైన దృగ్విషయం, దాదాపు అమానుషం. నిజమే, ఆయన గొప్పవాడే! ఆయన మాట్లాడుతున్న విషయాలకు తోడుగా, ఆయన చెప్పకుండా నిశ్శబ్దంగా వుండిపోయింది చాలా వుంది — ఆఖరికి తన డైరీల్లో కూడా — మరి దాన్ని గురించి ఆయన బహుశా యే ప్రాణికీ చెప్పడేమో. యీ ''యేదో'' యెప్పుడేనా, తాత్కాలికంగా, ఆయన మాటల్లో అనుభూతం అవుతుంది. దానికి సంబంధించిన సూచనలు ఆయన నాకూ, ఎల్. సులెర్‌జీత్‌స్కీకీ చదవమని

"సరే నాకీ విషయం చెప్పండి, మీ పేటలో పిల్లల్ని కొట్టేవాళ్లు యెవరు?" అని చేహొవ్ నిదానంగా, దయాన్వితంగా అడిగాడు.

ఆ ఉపాధ్యాయుడు కూర్చున్న కుర్చీలోనుంచి గెంతి, కోపంగా చెయ్యి వూపడం మొదలుపెట్టాడు.

"ఏమిటి? నేనా? ఎన్నడూ! వాళ్లని కొట్టడం?" అతను దెబ్బతిన్నట్టు ముసికొట్టడం మొదలుపెట్టాడు.

"వూరికే తత్తరపడకండి" అని చేహొవ్ అతన్ని శాంతింప చెయ్యడానికి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "మీరు అని నేనన్నానా? మీ పేటలో బడిపిల్లల్ని కొట్టేవాళ్లెవరో వున్నారని నేను పేపర్లో చదివాను...."

ఆ ఉపాధ్యాయుడు మళ్లీ కూర్చుని, చెమటలు కక్కుతూ వున్న ముఖాన్ని తుడుచుకుని, అమ్మయ్య అని నిట్టూర్చి, గంభీర స్వరంతో అన్నాడు:

"అలా అన్నారు బాగుంది. ఓ కేసు వుంది. ఆయన మకారొవ్. వింత యేం లేదు! అది అసహజంగానే వుంటుంది, కాని అర్థం చేసుకోవచ్చు, ఆయనకి పెళ్లి అయింది, నలుగురు పిల్లలు. భార్య రోగిష్టి. అతనూనూ — క్షయరోగి — జీతమా యిరవై రూబుళ్లు.... బడి చూస్తే కోళ్ల గూడులాగా వుంటుంది, ఉపాధ్యాయుడికి ఒకే గది. అలాంటి పరిస్థితుల్లో పైనుంచి దిగి వచ్చిన దేవతకేనా సరే యెవళ్లేనా పిసరు బెసికితే బేడీలు వేసేస్తారు, మరి చదువుకునే పిల్లలు దిగి వచ్చిన దేవతలు కారుకదా, యేమంటారు!"

ఒక్క క్షణం కితం భారీ పదగుంఫనతోటి చేహొవ్‌ని సమ్మోహితం చెయ్యాలని ప్రయత్నించిన యీ మనిషి, హఠాత్తుగా దుశ్శకున సూచకంగా తన గద్ద ముక్కుని ఆడిస్తూ, సాదాగా భారంగా రాళ్లల్లాగా వుండే పదాలతోటి మాట్లాడేశాడు. రష్యన్ గ్రామ జీవితంలోని శాపగ్రస్త కఠోర సత్యాన్ని అది తేటతెల్లం చేసింది....

తన ఆతిథేయుడినుంచి సెలవు తీసుకునేటప్పుడు ఆ ఉపాధ్యాయుడు తన రెండు చేతుల నాజూకైన వేళ్లతోటి చిన్నగా, యెండిపోయి వున్న చేహొవ్ చేతిని అదిమాడు.

"యేదో ఉన్నతాధికారిని చూడ్డానికి వచ్చినట్టుగా మిమ్మల్ని చూడ్డానికి వణికిపోతూ వచ్చాను. పండితమ్మన్యుడిలాగా నేను కూడా అంతో యింతో ప్రయోజకుణ్ణేనని మీకు ప్రదర్శించుకోవాలని గర్వంగా వచ్చాను. యిప్పుడు ఒక సహృదయుడైన, సర్వమూ అర్థం చేసుకోగల సన్నిహిత మిత్రుణ్ణి వదిలిపెట్టి వెళ్లిపోతున్నట్టుగా మీనుంచి సెలవు తీసుకుంటున్నాను. యిది యెంత మహత్తర విషయం — ప్రతీదాన్నీ అర్థం చేసుకోవడం! కృతజ్ఞుణ్ణి! నే వెడుతున్నా. నాతో కూడా ఒక మంచి విలువైన ఆలోచన వుంది: గొప్పవాళ్లు కల్లాకపటం లేకుండా వుంటారు,

యిటుకలలో కట్టిన యిళ్ళులాగా కూలి చక్కాపోతుంది. ఉపాధ్యాయుడు ఒక నటుడుగా, కళాకారుడుగా, తన పనిపట్ల యెంతో తీవ్రమైన అపేక్షతోటి వుండాలి. మరి మన ఉపాధ్యాయుడు కూలీ. సగంసగం చదువు వున్న వ్యక్తి. ప్రవాసానికి పోవడానికి యిష్టపడినంతగా వూరికి పిల్లలకి పాఠాలు చెప్పడానికి పోతాడు. వాడు తిండి లేక మాడిపోయిన వాడు, అణగారి పోయినవాడు, తన జీవనాధారం యెక్కడ పోతుందోనని నిత్యం భయంతో వుండేవాడు. ఉపాధ్యాయుడే వూళ్ళోకల్లా మొదటి మనిషిగా, రైతులు వేసే ప్రశ్నలన్నిటికీ సమాధానం చెప్పగల వాడుగా, భక్తి శ్రద్ధలకి యోగ్యమైన తన శక్తిమీద రైతులకి గౌరవభావం కలిగించేటట్టుగా, యెవరూ తనకేసి చూసి యెగతాళి చెయ్య సాహసించలేనట్టుగా అంటే తన గౌరవాన్ని తగ్గించలేనట్టుగా వుండాలి. యివాళ మన దేశంలో ప్రతివాళ్ళు అంటే గ్రామ పటేల్, ధనికుడైన దుకాణదారుడు, పూజారి, పాఠశాల పోషకుడు, పెద్ద — పాఠశాల పర్యవేక్షకుడు అని పిలిచినా విద్యా విధానంలోని పరిస్థితుల్ని మెరుగు పరచడానికి కాకుండా జిల్లా సర్క్యులర్లలోని అక్షరాలని తు. చ. తప్పకుండా అమలు జరిపేవాడు — అలా చేస్తున్నారు. ఉపాధ్యాయుడు యెవళ్ళూ తన గౌరవాన్ని తగ్గించలేని వాడుగా వుండాలి. ప్రజల్ని విద్యావంతుల్ని చెయ్యాల్సిన పని అప్పగించిన వాడికి కొసరికొసరి భత్యం యివ్వడం అసంబద్ధం — గుర్తుంచుకోండి ప్రజల్ని విద్యావంతుల్ని చేసే వాడికి! అలాంటివాడు పీలికలు తొడుక్కుని శిథిలమైన బడిలో చలికి బిగిసిపోతూ వుండడం, సరిగా పొగపోవడానికి లేకుండా కట్టిన పొయ్యిల్లోనుంచి వచ్చే ధూమంతో విషపూరితం కావడమూ, యెప్పుడూ పడిశంతో బాధపడ్డమూ, ముప్పై యేళ్ళకే లారింజిటిస్, కీళ్ళవాతం, క్షయలాంటి రోగాల పుట్ట కావడమూ భరించలేనిది. యిది మనకి సిగ్గు! సంవత్సరంలో ఎనిమిది, తొమ్మిది నెలలు మన ఉపాధ్యాయులు సన్యాసుల్లాగా, మాట్లాడ్డానికి ఒక పురుగు లేకుండా వుంటారు. పుస్తకాలూ సరదాలూ లేకుండా వాళ్ళు ఒంటరితనంలో మొద్దు బారిపోతారు. వాళ్ళు స్నేహితుల్ని తమని చూడ్డానికి రావాల్సిందిగా పిలిచారో, వాళ్ళు రాజకీయ అసంతృప్తులయారని అధికారులు అనుకుంటారు — కుత్సితమైనవాళ్ళు అమాయకుల్ని బెదిరించడానికి వాడే మూర్ఖ పదం అది.... యిదంతా రోతగా వుంది.... మహత్తరమైన బ్రహ్మాండమైన పని చేసేటటువంటి మనుషుల్ని ఒక రకంగా అధిక్షేపించడమే. నేను యెవరేనా ఉపాధ్యాయుణ్ణి కలుసుకుంటే అతని ముందు మహా, మహా యిబ్బందిగా వున్నట్టు బాధపడతాను, తెలుసా — అతని పిరికితనంతోటీ, ఎడ్డితనంతోటీ. ఉపాధ్యాయుడి దరిద్ర స్థితికి ఒక రకంగా నాదే దోషం అని పిస్తుంది నాకు — నిజంగా!''

# అంతోన్ చేహోవ్

ఒక సారి ఆయన నన్ను కుచుక్ – కోయ్* గ్రామంలో తనని సందర్శించ వలసిందిగా ఆహ్వానించాడు. అక్కడ ఆయనకి ఓ చిన్న మడి చెక్కా, తెల్లటి రెండు అంతస్థుల యిల్లూ వున్నాయి. ఆయన అంత సేపూ ఉత్సాహంగా మాట్లాడుతూ నాకు తన ''ఎస్టేట్''ని చూపించాడు.

''నాకు గనక పుష్కలంగా డబ్బు వుంటే యిక్కడ రోగిష్టి గ్రామీణ ఉపాధ్యాయుల కోసం ఒక శానటోరియం కడతాను. చక్కటి వెలుతురుతో వుండేట్టు, తెలుసుగా, చాలా వెలుతురు వుండేట్టు పెద్ద కిటికీలతోటీ యెత్తుగా వుండే కప్పుతోటీ వుండే భవనం. ఒక అద్భుతమైన లైబ్రరీని, అన్ని రకాల సంగీత వాయిద్యాలని, ఒక తేనెటీగల క్షేత్రాన్ని, కాయగూరల తోటని, పళ్లతోటని సంపాదించే వాణ్ణి; వ్యవసాయశాస్త్రంమీదా, వాతావరణశాస్త్రంమీదా ఉపన్యాసాలు యేర్పాటు చేయించేవాణ్ణి. ఉపాధ్యాయులకి అన్నీ తెలిసి వుండాలి, అన్నీ!''

ఆయన మధ్యలో మాట తుంచేశాడు. దగ్గాడు. నాకేసి ఓరగా చూసి, తన కమ్మని, మృదువైన చిరునవ్వు నవ్వాడు. ప్రతిఘటించలేని ఒక మనోహరత్వం, ఆయన చెప్పేదాన్ని అతి నిశితమైన శ్రద్ధతో అవతలివాడు అనుసరించేటట్టు చేసే టటువంటిది ఆ చిరునవ్వులో వుంది.

''నా కలల్ని వినడం మీకు విసుగ్గా వుందా? నాకు దీన్ని గురించి మాట్లాడ్డం అంటే యిష్టం. రష్యన్ గ్రామీణ ప్రాంతంలో మంచి, తెలివైన, విద్యా వంతులైన ఉపాధ్యాయులు వుండాలనే విషయం యెంత ముఖ్యమైందో మీకు తెలిస్తేనా! రష్యాలో మనం వేలుపెట్టి చూపించడానికి లేని పరిస్థితుల్ని ఉపాధ్యాయులకి కల్పించాలి. అదీ యెంత త్వరగా వీలైతే అంత త్వరగా. యేమంటే ప్రజలు సర్వ సౌష్ఠవపూరితమైన విద్యని పొందాలి. లేకపోతే రాజ్యం సగంసగం కాలిన

---

* క్రైమియాలో ఒక చోటు. – అను.

సహజాతం గురించి కూడా మాట్లాడే హక్కు మనకి వుంది — సంజ్ఞాన సహజాతం, మేధాశుత్తు.

దాని అంతస్సార ఫలితాలని బట్టి పరిశీలించడం వుండటమనేది ప్రకృతితోటి పోరాటంలో ఆత్మరక్షణ కోసం ప్రధాన ఆయుధంగా, తిరుగులేని ఔషధంగా, సాంస్కృతికాభివృద్ధికి ముఖ్య ఆధారంగా వుండేంది.

నిప్పు వెచ్చదనాన్ని యిస్తుంది. దాని ఉపయోగాన్ని గుర్తించడం సులభం. కాని నిప్పుని చెయ్యడం యెలాగో తెలుసుకోవడం చాలా కష్టం. కొయ్యని కొయ్యతో రాపిడి చేస్తే కూడా వెచ్చదనం రావడాన్ని చూసి మానవుడు దాన్ని నేర్చుకున్నాడు. ఆ రకంగా రాపిడివల్ల అతను నిప్పుని సాధించాడు, యివాళ మనం అగ్గిపుల్ల గీసి మంట తెప్పించినట్టుగా. ఒక దీపాన్ని, తర్వాత నూనె దీపాన్ని యెలా కనిపెట్టారు? ఒక మనిషి జంతు చర్మాన్ని వొలుస్తున్నాడు. అప్పుడు చీకటి పడింది. బాగా కొవ్వు వున్న మాంసంమీద ఒక కొయ్య ముక్కతో కొట్టాడు. కొయ్య వెచ్చబడ్డాక కొవ్వు కరిగి ప్రకాశమానంగా, నిదానంగా వెలగడం అతను గమనించాడు. మానవుడు అలాంటి దీపాన్ని వెయ్యేండ్ల పాటు వాడాడు. విద్యుచ్ఛక్తి వినియోగంలో వున్న యిప్పుడు కూడా వాడుతున్నాడు.

నీళ్లల్లో తేలిపోయే చిప్పనో, గుడ్డుడొల్లనో చూసి మానవుడు పడవని కనిపెట్టాడు. తర్వాత ఉక్కుతోటే ఇనుముతోటే నిర్మించిన బ్రహ్మాండమైన ఓడలు నీళ్లల్లో అటూ యిటూ ప్రయాణించడం అనే వాస్తవాన్ని సాధించాడు. అతను తుఫాన్‌వల్ల పెకలించుకుపోయిన చెట్ల వేళ్ల మట్టి పెళ్లలనీ, రాళ్లనీ లేవనెత్తడం చూసి, భవిష్యత్ యంత్రాలకి ఆధారభూతమైన, లీవరు అంతరార్థాన్ని అవగతం చేసుకున్నాడు. సాలిపురుగు గూడు అల్లుకోవడం చూసి నేత నేర్చుకున్నాడు. కొన్ని పక్షులు ఆకులతోటి గూళ్లని అల్లుకోవడాన్ని చూసి, చలినుంచి తనని తను కాపాడుకునేందుకు గాను, అతను బహుశా జంతు చర్మాలని దగ్గరికి చేర్చి కుట్టడం నేర్చుకుని వుండచ్చు. యివాళ మానవుడికి సమకూరిన ప్రతిదాన్నీ ఆవిష్కరించుకోడానికి మార్గం అలాంటిది.

విజ్ఞానశాస్త్రం సంస్కృతికి మూలం; ''అపర సృష్టి'' అంటే సంస్కృతిని, సృష్టించడానికి ప్రధాన శక్తి.

నా అభిప్రాయంలో మతమూ, భావనాత్మక తత్వశాస్త్రమూ కళకి చెందాలి; తన అనుభవాన్ని, అనుభూతుల్ని, కలలని ప్రతిమలుగా మార్చుకుని, తన అనుభూతుల్ని భావాలుగా మార్చుకునే మానవ సామర్థ్యానికి చెందాలి. మానవుడు దేవుణ్ణి తన అత్యుత్తమ ఆకాంక్షలతోటే, సర్వజ్ఞత్వం పట్లా సర్వశక్తిమంతం కావడం పట్లా తనకి వున్న కలలతోటే రూపొందించాడు. తనకి ప్రతికూలంగా వున్న ప్రాకృతిక పాంచభౌతిక శక్తుల్ని

జయించాలన్న తన ప్రయత్నంతో భగవంతుణ్ణి రూపు దిద్దాడు. ఆదిమ మానవులు తమ దేవుళ్ళని సంస్కృతీ నిష్ణాతులైన వాళ్ల ప్రతిరూపంతో సృష్టించారనడానికి చాలా ఆధారం వుంది. విశ్వకర్మలు — వల్కాన్, థోర్; గృహిణులు — గెబా, ఫ్రెయా; వేటగాళ్లు, నావికులు మొదలైన వాళ్లు.

ప్రపంచంలో వున్న ప్రతీదీ మానవ మేధ, వూహ, సంకల్పం అనే శక్తులవల్ల నిర్మితమయ్యాయి, సంస్కృతిని నిర్మించడానికి వేరే శక్తులు లేవు అనే విశ్వాసం శ్రామిక వర్గానికి అతి సన్నిహితంగా, అవగతమయేట్టుగా వుండాలి.

ఒక పనివాడు కాల్చిన మట్టి యిటికల ముతక ముక్కలతోటి అద్భుతమైన ఆకారాలని, ''సంస్కృతీ ప్రాసాదాలని'', నగరాలని నిర్మిస్తాడు. ''అసలు ప్రకృతి''లో యెన్నడూ లేని వాటిని — గడియారాలు, రైలు వంతెనలు, శస్త్ర వైద్యుని పనిముట్లు, ఇంటర్నల్ కంబశ్చన్ ఇంజన్లు, ప్రెస్సు యంత్రాలు వగైరా లాంటి వన్నిటినీ రూపం లేని ముడి ఖనిజంనుంచి — సృష్టిస్తున్నాడు. తన మేధా సంపత్తివల్ల అతను ఇనుమునీ, ఉక్కునీ ఆత్మ స్వరూపకం చేస్తున్నాడు.

''అసలు ప్రకృతి''లో వున్న ప్రతిదాన్నీ పరిశీలించి అధ్యయనం చెయ్యడంద్వారా ఒక శాస్త్రజ్ఞుడు, అసలు ప్రకృతి శక్తుల ఆధారంగా అపర ప్రకృతిని సృష్టించడం గురించి మానవుడికి నేర్పుతారు, అతని ఆరోగ్యాన్ని గురించి శ్రద్ధ తీసుకుంటాడు లేదా జీవన ప్రమాణాన్ని పెంచుతాడు. మనుషుల ఆంతరంగిక ప్రపంచాన్ని మనస్తత్వాన్ని పరిశీలించిన కళాకారుడు మానవుడికి అతని ఔన్నత్యాన్ని గురించీ, అతని అల్పత్వాన్ని గురించీ అతని మేధా శక్తిని గురించీ, అతని పాశవిక సహజ ప్రవృత్తుల గురించీ తెలియజేస్తాడు.

ముగ్గురు వ్యక్తులు సంస్కృతిని నిర్మిస్తారు: శాస్త్రజ్ఞుడు, కళాకారుడు, శ్రామికుడు. యే రకమైన సాంస్కృతిక ప్రాముఖ్యమూ లేని శ్రమ అనేది యేదీ లేదనీ, శ్రమ పట్ల అనురక్తి యెంత గాఢమైతే సంస్కృతి అంత ఉన్నతంగా వుంటుందనీ, విజ్ఞాన శాస్త్రానికీ, కళకీ, శ్రమకీ గల నిర్ణాయక ప్రాముఖ్యాన్ని గనక తను బాగా అవగతం చేసుకుంటే ప్రపంచం మొత్తంమీద త్వరలోనే శ్రామికవర్గం పూర్తి విజయం సాధించగలదనీ మన అభ్యుదయగామి సోవియట్ శ్రామికవర్గం తెలుసుకోవాలి.

సంస్కృతి పట్ల అలాంటి దృక్పథంలో నూతన నైతిక పునాది వుంటుందని నా విశ్వాసం. అది ఒక శ్రామికుణ్ణి అతనిలో పాత ప్రపంచపు అవమానకరమైన వారసత్వంగా సంక్రమించి వుంటున్న ప్రతిదాని పట్లా సడలింపులేని పోరాటానికి ఆయత్తం చేస్తుంది. అది సోమరితనానికి, తాగుడుకి, నిర్దాక్షిణ్యానికి, తన వర్గపు మహత్తర వీరోచిత కర్తవ్యాలకి ఆటంకం కలిగించేటటువంటి సంస్కార విహీన, ఉదాసీన స్థిరత్వ జీవితపు కామనకీ వ్యతిరేకంగా వుండే పోరాటం.

# వర్ధమాన సాహిత్యం, దాని కర్తవ్యాలు

మూర్‌మన్‌స్క్‌లో యెవళ్లో నాతో అన్నారు, ''యిక్కడ జాక్ లండన్‌ని చదవడం మంచిది'' అని. యీ మాటలలో ఒక సరి అయిన విషయాన్ని చెప్పారు. అక్కడ, నీరసం పుట్టించే దీర్ఘధ్రువ నిశీధులు వుండే ఆర్క్‌టిక్ మహాసముద్రపు కఠోర తీరంలో, యెవళ్లకేనా గానీ జీవితేచ్ఛ విపరీతంగా ప్రయాస పడినప్పుడు, ఆ మాటలు సరైనవే. మరి జాక్ లండన్ అలాంటి సృజనాత్మక సంకల్ప శక్తికి సంబంధించి నిశితమైన అనుభూతి, గాఢమైన పరిశీలనా వున్నవాడు. దృఢ సంకల్పం వున్న మనుషుల్ని చిత్రించే గొప్పగుణం ఆయనకి వుంది.

సోవియట్ యూనియన్ యథార్థ పరిస్థితివల్ల ''నూతన ప్రపంచాన్ని'' నిర్మించే ప్రతివాడికీ సకల సామర్థ్యాలూ, అణువణువూ ప్రయాసపడే యెంతో శ్రమ మూర్‌మన్‌స్క్‌లోనే కాదు, ప్రతిచోటా, దేశమంతటా కూడా అవసరం. దృఢ సంకల్పానికీ, ఉల్లాస భరిత మానసికస్థితికీ అవసరమైన వాటిని మన వర్ధమాన సాహిత్యం యే మేరకి యిచ్చే స్థాయిలో వుంది? యీనాటి సాహిత్య దృగ్విషయాన్ని పరిశీలించే విమర్శకులు యీ సమస్యతో మొదలు పెట్టాలని నా కనిపిస్తుంది: సృజనాత్మక సాంస్కృతిక విప్లవ కార్య కలాపాల పట్ల యిచ్ఛని యేదేనా పుస్తకం యే మేరకి పెంచగలదు?

''స్వేచ్ఛాయుతమైన కళ''కి జ్ఞానదాయక, బోధనాత్మక లక్షణాలని అంటగడతామనీ, ఆ రకంగా దానికి వుందనుకునే సంశయాత్మక ''స్వేచ్ఛ''ని అతిక్రమిస్తామనీ వుండే భయంతో రచయితలుగాని, విమర్శకులుగాని చైతన్యయుతంగా, దృఢంగా యెప్పుడూ యీ ప్రశ్నని లేవనెత్తలేదు. కాని యేదో ఒక దాన్ని బోధించని పుస్తకం ఒక్కటి కూడా యెప్పుడూ లేదు.

బ్రహ్మాండమైన రాశిలో వున్న ప్రపంచ సాహిత్యాన్ని మనం పరిశీలించినట్లయితే, సాహిత్యంలో వాస్తవం పట్ల విమర్శనాత్మక, నిందాత్మక, వ్యతిరిక్త దృష్టి సర్వకాలాల్లోనూ పెత్తనం చెలాయించిందనీ, యిటీవల అధికమవుతోందనీ మనం అంగీకరించి

తీరాలి. తమ పుస్తకాలని జనం మరిచిపోయినటునంటె సాదా, అనుకరణశీలురైన రచయితల్లో మాత్రం వాస్తవాన్ని అంగీకరించడం, తృప్తిపడడం, పొగడ్డం మాత్రం కనిపిస్తాయి. ''మహత్తరమైంది'' అని న్యాయంగా పిలిచిన సాహిత్యం యెప్పుడూ కూడా సాంఘిక జీవిత దృగ్విషయాన్ని కీర్తించలేదు. బొకాచియో,[185] రాబ్లే, స్విఫ్ట్, సెర్వాంటెస్, లోపె దె వేగా, కల్దెరోన్,[186] వోల్టేర్, బైరన్,[187] గ్యొతే, షెల్లీ,[188] పూష్కిన్, లియో టాల్‌స్టాయ్, ఫ్లొబెర్ యింకా తదితరమైన ఆ స్థాయి, ప్రాముఖ్యం వున్న రచయితలు ''మహత్తర సాహిత్య'' సృష్టికర్తలు. కాని వాళ్లల్లో ఒకళ్లూ ఉదాత్తమైన, జంకూ గొంకూ లేని ''ఆశీర్వచ''నాన్ని వాస్తవికతకి యివ్వలేదు.

చెయ్యి తిరిగిన నిపుణులకి వున్న మహత్తర సుగుణం అది. జీవిత దోషాల్నీ, జనుల లోటుపాట్లనీ నిర్దాక్షిణ్యంగా, కళ్లకి కట్టేటట్టు చిత్రించి, వాళ్ల ఉన్నతమైందాన్ని కోసం తపనని ఉద్దీపింపచేశారు, బోధించారు. తను బాల్జాక్‌నుంచి చాలా నేర్చుకున్నానని కార్ల్ మార్క్స్ అంగీకరించాడు. ఏమిల్ జోలా నవలల్లో యెవరేనా గానీ మొత్తం ఒక యుగాన్ని అధ్యయనం చెయ్యవచ్చు. బూర్జువా సమాజపు మూల భావాలు సారంలో యెంతటి స్వవచోవ్యాఘాతంగా వంచనాత్మకంగా, క్రూరంగా వున్నదీ చూపించకుండా అనతోల్ ఫ్రాన్స్ బూర్జువా సమాజపు ఒక్క భావాన్ని కూడా వదల్లేదు. ఆయన అంత్యక్రియల రోజున కొందరు రచయితలు ''మృతుని మొహంమీద చేతి దెబ్బ'' అని కరపత్రాన్ని ప్రచురించారు. అది ఫ్రాన్స్ చేసిన అద్భుతమైన విధ్వంసక కృషికి, ఆయనమీద నీరసంగా, దయనీయంగా తీర్చుకున్న పగ మాత్రమే.

ప్రస్తుత కాలపు యూరపియన్, అమెరికన్ సాహిత్యం యింకా యింకా యెక్కువ నిందాత్మకంగా తయారైంది. అది మరోలా వుండగలదా? అది నిస్సంకోచంగా వాస్తవికతని అంగీకరించగలదా? ఆస్కార్ వైల్డ్[189] తర్వాత, బెర్నార్డ్ షా[190] రోజుల్లో డికెన్స్‌కి లాంటి ఆత్మతృప్తి వుండే వీల్లేదు. యుక్తిగల విదూషకుడూ, అలాగే ప్రతిభావంతమైనా సాదా సమరసవాదీ అయిన ఓ హెన్రీ[191] స్థానంలో సింక్లర్ లూయిస్[192] వచ్చాడు. జూలియుస్ ష్టీండె[193] తన పుస్తకం ''బుఖ్‌గోల్జ్ కుటుంబం''లో చేసినట్టుగా పశుబుద్ధిని అప్రతిష్ఠ పాల్జేసే ధైర్యం వున్న జర్మన్ ఒక్కడు లేడు. ఆ పుస్తకాన్ని బిస్మార్క్[194] ఆకాశానికి యెత్తేశాడు, అది చాలా కాలం పెటీబూర్జువాలకి వేదంగా వుండింది.

సమకాలీన యూరపియన్, అమెరికన్ సాహిత్యాలు కలిగించే ప్రభావం యిలా వుంటుంది: రచయితలు అనారోగ్యకరమైన వస్తువు తీసుకుంటారు, ఓదార్చే రూపాలలో అనుభవాన్ని వ్యవస్థీకరించగల శక్తుల ప్రాముఖ్యాన్ని పూర్తిగా పోగొట్టుకున్న భావాలని తీసుకుంటారు. ''సామాజికంగా సంతృప్తి పరిచే విషయాల పరిమాణం మన ప్రపం

చంలో వేగంగా తగ్గిపోతోంది.'' యీ కొటేషన్ మార్కుల్లో వున్న మాటలు ఒక జర్నలిస్టు రాసిన ఉత్తరంనుంచి తీసుకున్నవి. తను రాస్తున్న విషయం గురించి ఆయనకి సన్నిహితంగా తెలుసు. ఆయన మాటలని వాస్తవాంశాలూ, అంకెలూ నమ్మిం చేట్టుగా రుజువు చేస్తున్నాయి.

సోవియట్ యూనియన్‌లో శ్రామిక జనులందర్నీ ఉద్ధరించడం, వ్యవస్థీకరించడం, కార్యాచరణోద్యుక్తుల్ని చెయ్యడం జరిగింది. వాళ్ల అగ్రగామి దళం దేశంలో పారిశ్రామిక, సాంస్కృతిక పునరుజ్జీవన కృషిని ప్రారంభించింది. చైతన్యయుతంగా ముందు పెట్టుకున్న లక్ష్యాన్ని సాధించే నూతన చారిత్రక శక్తి మార్గంలో వున్న ప్రతి ఆటంకాన్నీ అధిగమించే ఆశ్చర్యకరమైన ఉత్సాహాన్ని జీవితంలోకి తీసుకుపోయే కృషిని ప్రారంభిం చింది. శ్రామిక జనులకి గనక తమ ఉత్సాహాన్ని గురించీ, తమ ప్రయాసభరిత శక్తిని గురించీ స్పృహ వుండి వుండనట్లయితే, అంత తక్కువ వ్యవధిలో — పన్నెండేళ్ల కాలంలో మాత్రమే — అదీ, యింటా బయటా అంటే ప్రపంచ బూర్జువాలనుంచీ, లోపల ''పాత ప్రపంచపు'' అవశేషాలనుంచీ ఉత్పన్నమైన విద్వేష పరిస్థితులు వుండగా — దేశ పునర్నిర్మాణ సమయంలో అంతటి నిర్వివాదమైన, అద్భుతమైన ఫలితాలని సాధించి వుండేవాళ్లు కాదు.

మతమూ ప్రభుత్వమూ యుగాలుగా నిర్దాక్షిణ్యంగా తమ సంకల్పాన్ని అణిచివేసినటు వంటి, జీవితం పట్ల ఉదాసీన భావంతో వుండేట్టు కృత్రిమంగా పెరిగినటువంటి సంస్కారరహిత జనాభా వున్న విస్తారమైన దేశంలో జరుగుతున్న పునరుజ్జీవన క్రమం, అనిదం పూర్వకమైన వేగంతో వున్న యీ క్రమం మన తరుణ సాహిత్యంలో చాలా నీరసంగా ప్రతిబింబించింది, ప్రతిబింబిస్తోంది.

జీవంలోకీ కార్యాచరణలోకీ వచ్చిన దానిపట్ల కంటే జీర్ణించి పోయేదానిపట్ల మన సాహిత్యం యెక్కువ శ్రద్ధ చూపించడమే అలాంటి నీరసానికి ప్రధాన కారణం అని నాకు తోస్తోంది.

గతించి పోయేదాన్ని దృష్టిలో పెట్టుకున్న రచయిత, తీవ్రంగా గాయపడిన మున లాడి మంచం పక్కన నుంచుని ఆ రోగి చస్తాడా, బతుకుతాడా అని మీనమేషాలు లెక్కించే పిరికి యువ డాక్టరు లాంటివాడు.

చనిపోయే వాణ్ణి వూరడించడం కంటే యెక్కువగా తన సమస్యని పరిష్కరించు కోవడానికా అన్నట్టు రోగి బతకడానికి తగ్గ పరిస్థితులు యింకా వున్నాయని ఆశలు అడు గంటిపోయిన జబ్బు మనిషికి చెప్తాడు; యెవడేనా గానీ బేఫర్వాగా బతకగలిగే ప్రశాంత మైన జిల్లా పట్టణాలూ, సుఖవంతమైన పాత రోజులూ యింకా వున్నాయి. వాస్త

వానికి యింకా యెన్నో "ప్రతికూల దృగ్విషయాలు" వున్నాయి. అవి అనుకూల దృగ్విషయాల మీద పై చెయ్యిగా వున్నాయి కూడానూ, నూతన జీవిత పథంమీద అనేక ఆటంకాలని పెడుతున్నాయి. యిది ఖాయంగా నిజమే. యేమైనా వాటి అన్నిటి పట్లా నూచన సత్యానికి సేవగా గుర్తింపు పొందుతోంది.

ఒక రచయిత వాస్తవికతలోని అరమ్యమైనవాటిని గురించి బాగా యెరిగి వుండి, ఆ విషవలయంనుంచి బయట పడలేకపోయివుండినప్పుడు అది అలా వుండేది. యీ విషవలయాన్ని ఛేదించడం జరగని దేశాల్లో అలానే వుంది.

యీ దేశంలో విప్లవం యీ వలయాన్ని ఛేదించి, ఆ రకంగా ఒక నూతన వాస్తవికతకి, జీవితం పట్ల పోషలిస్టు ఉపగమ్యతగల రైతాంగంలోని ఒక భాగం, శ్రామిక జనం, వాస్తవీకరించే నూతన సత్యానికి మార్గం తెరిచింది.

కళనుంచి శ్రామికవర్గం అపేక్షించేది కచ్చితంగా సూటిగా వుంటుంది. తమ కోసం గాని, తమకి వ్యతిరేకంగా గాని జరిగే పోరాటంలో ఒక ఆయుధంగా దాన్ని వాళ్ళు పరిగణిస్తారు.

అనేక కారణాలవల్ల శ్రామికవర్గం కచ్చితంగా వుంటుంది, వాటిలో రెండు మాత్రం అతి ముఖ్యమైనవి: వాళ్ళు యే గమ్యం కోసమైతే యాతన పడుతున్నారో దాని ఉదాత్తత, సంక్లిష్టత; జీర్ణించిపోయే గతపు విద్వేషభరిత పరిసరాలు. యీ గతం అంటు జాడ్యంలా పట్టుకుంటోందని వాళ్ళకి తెలుసు. దాని వారసత్వంనుంచి తాము యింకా విముక్తం కాలేదనీ వాళ్ళకి తెలుసు.

శ్రామికవర్గం అంటోంది: మా చేతిలో సాహిత్యం ఒక సాంస్కృతిక ఆయుధం కావాలి. అది మా గమ్యానికి మాకు సాయపడాలి, యేమంటే మేం వెళ్లే మార్గం మానవాళి అంతటికీ ఉమ్మడిగా చెందింది.

యీ వాణి నూతన చరిత్ర వాణి. వర్ధమాన సాహిత్యం దీన్ని అసలు వింటోందా? హుఁ, అంత బాగా వింటం లేదు, అనే అనాలి. అంత బాగా లేదు, యేమంటే నిందాత్మక, వ్యతిరిక్త దృక్పథాన్నే వాస్తవికతపట్ల అనుసరించే పాత సంప్రదాయాన్ని యెదిరించకుండా దానికి లొంగిపోతూ, అది రెండో వాస్తవికతని చిత్రించడంలో విఫలమవుతోంది. పాత సత్యాన్ని వర్ణిస్తూ అది నూతన సత్యాన్ని గుర్తించడం లేదు. గతం ధ్వంసం అయే గందరగోళంలో మానవుడిలో యిప్పటికే ఆవిర్భవించినటువంటి నూతన లక్షణాలని, యెప్పటికీ జీవిస్తూ, మరింత మెరుగు పడడం కోసం మారడమే తప్ప, నాశనం పొందని నూతన లక్షణాలని అది గుర్తించడం లేదు.

తాము జీవిత నిర్నిబంధ సృష్టికర్తలమనీ, అధినేతలమనీ తమని గురించి భావించుకునే వాళ్ళు యింకా కొద్ది మందే వున్నారు. వాస్తవానికి వాళ్లల్లో చాలా మంది

సోవియట్ యూనియన్‌నుంచి వస్తున్నవాళ్లే. దీన్ని రుజువు చెయ్యక్కర్లేదనుకుంటాను.

మన సాహిత్యం వాళ్లని యింకా బాగా ఆదరించడం లేదు, వాళ్లని అర్థం చేసుకోవడం లేదు. సృజనాత్మక ప్రాణభూత కార్యాచరణకి వాళ్ల సంకల్పాన్ని బలపరచి, అభివృద్ధి చెయ్యడం అనేది దాదాపు వుండడమే లేదు. వాస్తవికతే వీరోచితమైంది అయినప్పుడు, సాహిత్యంలో ఉల్లాసభరిత జీవం కొరవడింది, వీరోచిత స్వభావం కొరవడింది.

నన్ను పొరపాటుగా అర్థం చేసుకోవచ్చునేమో. కాని యీ కథా సంకలనంలో ఉల్లాసభరితమైన స్వరాలు స్పష్టంగా నాకు వినిపిస్తున్నాయి. యిందులో ఓ కథలోని నాయిక తాను యెలా ఆకలికి మాడిపోయిందీ వర్ణిస్తూ తనకి, దాన్ని తగలెయ్య, యింత తిండానికి దొరికిం తర్వాత యెంత బాగా అనిపించిందీ చెప్పాలనుకుంటుందంటే నాకది నచ్చింది. సూర్యుడిలోని మచ్చల్ని వొట్టి కళ్లతోటే చూడ్డానికి అలవాటు పడ్డ విమర్శకులకి యువ రచయితలు రాసిన యీ కథా సంకలనంలో చాలా నెరసులు కనబడవచ్చు. అది విమర్శకుల వృత్తి ధర్మం. యిది తమ కృషిలోని సారం అని వాళ్ల నమ్మకం. నాకు సంబంధించి ప్రతి దృగ్విషయపు ధనపక్షాన్నే నేను చూస్తాను, ప్రతి మనిషిలోని సుగుణాలనే చూసాను.

# ''సంస్కృతీ నిష్ణాతులారా''
# మీరు యెవరి పక్షం?

అమెరికన్ విలేకరులకు జవాబు

''మహోదధికి అవతల, మీకు అపరిచితులైన వాళ్లనుంచి యీ సందేశం మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు'' అని మీరు రాస్తున్నారు.

లేదు, మీ ఉత్తరం నాకు ఆశ్చర్యం కలిగించలేదు. నాకు అలాంటి ఉత్తరాలు తరుచుగా వస్తూనే వుంటాయి. దాన్ని మీరు ''విశిష్ట''మైంది అని, పొరపాటు చేస్తున్నారు — మేధావులనుంచి విపత్సూచకమైన అరుపులు గత రెండు మూడేళ్లుగా మామూలు అయిపోయాయి. యిది సహజం: యెప్పుడూ కూడా ఆచరణలో ఒక మేధావి ముఖ్యమైన పని బూర్జువాల ఉనికిని షోకు చెయ్యడం; నీచమైన వృథాభరిత క్షణాల్లో సంపన్నులని వూరడించడం. పెట్టుబడిదారుల పరిచారికలైన మేధావివర్గం, లేదా వాళ్లల్లో అధికభాగం, యెప్పటినుంచో మురికి పట్టిపోయి, చివికిపోయి శ్రమజీవుల రక్తంతో మొదలంటా మరకలైపోయిన బూర్జువాల తాత్విక, మత ఉడుపుల చిరుగులకి మాసికలు వేసిన తెల్లదారపు పోగులకి శ్రద్ధగా అతుక్కుపోయారు. యివాల్టికి కూడా వాళ్లు యీ కష్టతరమైన, అయోగ్యమైన, సంపూర్తిగా నిష్ఫలమైన కర్తవ్యంతో తీరికలేకుండా వున్నారు దాదాపు ఆగామి సూచకమైన ఏవ్యదృశ్యాన్ని వంచిస్తూ. ఉదాహరణకి, జపాన్ సామ్రాజ్యవాదులు చైనాని ముక్కలు చెయ్యబోయే దానికి ముందుగానే జర్మన్ స్పెంగ్లర్[195] ''మానవుడూ సాంకేతిక జ్ఞానమూ'' అనే తన వుస్తకంలో ''రంగుజాతుల'' వాళ్లకి తమ పరిజ్ఞానాన్నీ సాంకేతిక అనుభవాన్నీ బోధించి పంథొమ్మిదవ శతాబ్దపు యూరపియన్లు అతి ఘోరమైన తప్పు చేశారనే భావాలని వెల్లడించాడు. యీ అభిప్రాయానికి సంబంధించి మీ అమెరికన్ చరిత్రకారుడు హైన్‌రిఖ్ వాన్ లూన్[196] స్పెంగ్లర్‌కి మద్దతు యిస్తున్నాడు. ఆయన కూడా నల్లవాళ్లకీ, పసుప్పచ్చ రంగు వాళ్లకీ యూరపియన్ సంస్కృతిని యివ్వడమనేది ''చారిత్రక పంచ మహా పాతకాల్లోనూ'' ఒకటి అంటున్నాడు.

యీ ''దోషానికి'' ప్రాయశ్చిత్తం చేసుకోవాలనే కోరికని చూస్తున్నాం. యూరపియన్,

అమెరికన్ పెట్టుబడిదారులు జపాన్ వాళ్లకీ, చైనా వాళ్లకీ డబ్బూ ఆయుధాలూ సరఫరా చేసి, వాళ్లు ఒకళ్లనొకళ్లు నాశనం చేసుకునేందుకు సాయపడుతున్నారు. అదే సమయంలో తమ యుద్ధ నౌకాదళాల్ని ప్రాచ్యానికి పంపిస్తున్నారు — యేదో అనుకూలమైన క్షణంలో తమ బ్రహ్మాండమైన సాయుధ బలాన్ని జపాన్ సామ్రాజ్యవాదులకి చూపించి, చంపిన ఎలుగు చర్మాన్ని ధైర్యవంతమైన కుందేలుతోటి కలిసి వాటా పంచుకోవాలని. ఎలుగుని చంపడం జరగదని వ్యక్తిగతంగా నా అభిప్రాయం. యేమంటే యూరపియన్ అమెరికన్ "సంస్కృతి"కి భయం కలిగించే ప్రమాదాలని విస్తరిస్తూ బూర్జువాలకి పూరట కలిగిస్తూ స్పెంగ్లర్లూ, వాన్ లూన్‌లూ యింకా అలాంటి వాళ్లూ చెప్పడం మరిచిపోయిన విషయాలు ఒకటి రెండు వున్నాయి. ఇండియన్లు, చైనీయులు, జపానీయులు, నీగ్రోలు సాంఘికంగా యేకశిలా సదృశంగా, అమిశ్రితంగా లేరనీ, వర్గాల కింద విభజన అయివున్నారనీ వాళ్లు మరిచిపోతున్నారు. అమెరికన్ యూరపియన్ పశుబుద్ధుల స్వార్థ ఆలోచనా విషానికి విరుగుడుగా మార్క్స్, లెనిన్‌ల బోధలు విస్తృతమవుతున్నాయనీ, మంచి గుణం కనిపింప చేస్తున్నాయనీ వాళ్లు మరిచిపోతున్నారు. యేమైనా, వాళ్లు యీపైన చెప్పిన వాటిని మరిచి పోకుండా వుండనూ వుండచ్చు. వూరికే వాటిని గురించి యుక్తిగా మౌనం వహించీ వుండచ్చు. యూరపియన్ సంస్కృతి పతనాన్ని గురించి వాళ్ల ప్రమాద సూచకమైన అరుపులు తమ విషపు అవటుత్వం గురించీ, విరుగుడుకి గల పటుత్వం గురించీ వాళ్లకి గల గుర్తింపు వల్ల కావచ్చు.

నాగరికత మట్టుపడిపోతోందో అని అరిచేవాళ్ల సంఖ్య యెంతలా పెరుగుతూ వుంటే అంత గట్టిగా వుంటున్నాయి వాళ్ల అరుపులు. మూణ్నెల్ల కితం ఫ్రాన్స్‌లో మాజీ మంత్రి కైయో నాగరికతకి రక్షణ లేకుండా పోయిందని బహిరంగంగా ఘోరు మన్నాడు.

"ప్రపంచం సమృద్ధిగా వుండడం, అవిశ్వాసం అనే విషాదాలవల్ల బాధ పడుతోంది. లక్షలాది ప్రజానీకానికి యింత కడుపు నిండా తిండానికి లేకపోతున్న సమయంలో గోధుమని దగ్ధం చెయ్యడం, బస్తాల కొద్దీ కాఫీని సముద్రంలో పారబొయ్యడం విషాదం కాదూ? అవిశ్వాసానికి సంబంధించి అది యిప్పటికే సుమారుగా హాని కలిగించింది. అది యుద్ధాన్ని తెచ్చిపెట్టింది, శాంతిసంధుల్ని ఆదేశించింది, అవిశ్వాసం అదృశ్యమైనప్పుడే వాటిని సవరించవచ్చు. విశ్వాసాన్ని పునరుద్ధరించకపోతే సర్వ నాగరికతా ప్రమాదంలో పడిపోతుంది, యేమంటే తమ సకల పాపాలనీ ఆపాదించే ఆర్థిక వ్యవస్థని కూలదొయ్యాలని జనానికి అనిపించవచ్చు" అని ఆయన గోలపెడుతున్నాడు.

యివాళ నిస్సంకోచంగా ఒకళ్లకేసి ఒకళ్లు తమ పంజాలనీ, కోరలనీ బాహాటంగా చాచేటువంటి దోపిడీ దొంగల మధ్య పరస్పర విశ్వాసపు అవకాశాన్ని గురించి మాట్లాడేవాడు పరమ వంచకుడేనా గావాలి లేదా శుద్ధ అమాయకుడేనా గావాలి. యిక

''ప్రజలు'' అంటే శ్రామిక జనం అయినట్లయితే, సంపదని సృష్టించేటటువంటి తమ శ్రమకి ఫలంగా పాపాలని బహుకరించే పెట్టుబడిదారీ వ్యవస్థ మౌఢ్యానికి వాటిని ''ఆపాదించడం''లో శ్రామికులు నూటికి నూరు పాళ్ళూ ఒప్పు అని ప్రతి నిజాయితీ పరుడూ అంగీకరించి తీరాలి. మార్క్స్, ఎంగెల్స్‌లు తమ ''కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక''లో చెప్పిన మాటలు యెంతో నమ్మకం కలిగే విధేయతతో బూర్జువా వాస్తవాలని గురించి రుజువు చేస్తున్నాయని శ్రామికులు యింకా యింకా యెక్కువ స్పష్టంగా గుర్తిస్తున్నారు:

''సమాజాన్ని పాలించడానికి అది అసర్థం: యెందుకంటే, తన బానిసకు బానిస బతుకునైనా నమ్మకంగా చూపించగల సామర్థ్యం లేదు దానికి: తన బానిస బిచ్చమెత్తుకోవలసిన దుస్థితికి దిగజారిపోతే, బానిస శ్రమమీద తాను బతకడానికి బదులు తన బిచ్చంమీద బానిస బతకవలసిన దుస్థితి సంభవిస్తే, యేమి చేయడానికీ సామర్థ్యం లేదు దానికి. ఈ బూర్జువావర్గంకింద సమాజం యెంతమాత్రమూ మనలేదు. అనగా, సమాజానికీ బూర్జువావర్గం ఉనికికీ యిక యెంతమాత్రం పొత్తు కుదరదు.''[197]

తమ బూర్జువా మౌఢ్యమే మానవుడికి సర్వకాల సర్వావస్థలకీ వరంగా యిచ్చిన వివేకమనీ, దానికంటే మెరుగైందాన్ని మానవుడు యెన్నటికీ కనిపెట్టలేడనీ, దాన్ని దాటిపోలేడనీ, దాని శిఖరాలకంటే సమున్నతమైన వాటిని అధిరోహించలేడనీ నొక్కి వక్కాణించే వందలాది పాతకాలం వాళ్ళల్లో కైయో ఒకడు. బూర్జువాలని వూరడించేవాళ్ళు తమ ఆర్థిక వివేకానికీ, దాని స్థిరత్వానికీ రుజువుగా వాళ్ల విజ్ఞానశాస్త్రాలని ఉల్లేఖించి కూడా యెంత కాలం అవలేదు.

యిప్పుడు తమ నికృష్టమైన క్రీడనుంచి వాళ్ళు విజ్ఞానశాస్త్రాన్ని మినహాయిస్తున్నారు. ఫిబ్రవరి 23వ తారీకున యిదే కైయో, పారిస్‌లో మాజీమంత్రులు, పావెల్ మిలుకోవ్[198] లాంటివాళ్ళూ, సామాన్యంగా కాలం తీరినవాళ్ళూ అయిన ప్రేక్షకులు వున్న సభలో స్పెంగ్లర్‌ని అనుకరిస్తూ, మాట్లాడుతూ అన్నాడు:

''చాలా సందర్భాల్లో టెక్నాలజీ నిరుద్యోగానికి దారి తీస్తుంది. తొలగింపబడ్డ పని వాళ్ల జీతాలని షేర్‌హోల్డర్లకి అదనపు డివిడెండ్లుగా యిస్తుంది. 'అంతరాత్మలేని' విజ్ఞానశాస్త్రం, 'అంతరాత్మ' ఆదరణ పొందని విజ్ఞానశాస్త్రం మానవుడికి హాని కలిగిస్తుంది. మనుషులు విజ్ఞానశాస్త్రాన్ని అదుపుచేయాలి. ప్రస్తుత సంక్షోభం మానవుడి శేముషికి ఓటమి. మహోన్నత మానవుడికంటే అధికమైన దురదృష్టం ఒకో అప్పుడు విజ్ఞానశాస్త్రానికి లేదు. అతను సిద్ధాంతపరమైన సూత్రీకరణల్ని చేస్తాడు. వాటిని ముందుపెట్టిన ఆ ప్రత్యేక కాలానికి వాటికి ప్రాముఖ్యం వుంటుంది, ఉదాహరణకి, కార్ల్ మార్క్స్ సందర్భంలో లాగా. 1848లో గాని, 1870లో గాని అవి సమం

జసమే కాని 1932లో మాత్రం పూర్తిగా అసమంజసమైనవి. మార్క్సు గనక యీనాడు జీవించి వుంటే, ఆనాడు రాసినట్టుగా రాసి వుండడు.''

తన వర్గపు బుద్ధి కౌశల్యం నీరసపడిపోయిందనీ దివాళా తీసిందనీ యీ మాటల్లో బూర్జువా అంగీకరిస్తున్నాడు. శ్రామిక ప్రపంచంమీద తన వర్గానికి ఆధిపత్యం కలిగించేందుకు యెంత శక్తిని విజ్ఞానశాస్త్రం యిచ్చిందీ అన్న దాన్ని మర్చిపోయి, ''విజ్ఞానశాస్త్రాన్ని అదుపు చెయ్యాల''ని ఆయన సిఫార్సు చేస్తున్నాడు. ''విజ్ఞానశాస్త్రాన్ని అదుపు చెయ్యడం'' అంటే యేమిటి? పరిశోధనా స్వాతంత్ర్యాన్ని కాదనడమా? విజ్ఞానశాస్త్రపు స్వాతంత్ర్యంమీద మతం జరిపిన దాడులని ధైర్యంగా, పటుతరంగా బూర్జువావర్గం యెదుర్కొన్న కాలం వుండింది. మధ్య యుగాలనాటి అతి అంధకార బంధురమైన రోజుల్లో తత్వశాస్త్రం యే స్థితిలో వుందో ఆ స్థితికి బూర్జువా తత్వశాస్త్రం క్రమేపీ దిగజారుతోంది — మత ధర్మశాస్త్రానికి పరిచారిక స్థితి. మార్క్సు జోస్యం చెప్పినట్టు — ఆయన బోధనలు కైయోకి తెలియవు — యూరప్ బర్బరత్వం కేసి వెనక్కి జారిపోయే ప్రమాదం వుందని అంటున్నప్పుడు కైయో నిజమే చెప్తున్నాడు. అవును, ప్రపంచానికి అధికారిణి అయిన యూరపియన్, అమెరికన్ బూర్జువావర్గం యేళ్లు గడిచే కొద్దీ అజ్ఞానులుగా, మేధాపరంగా శుష్కించిపోయి, అనాగరికంగా తయారవుతున్నారన్న విషయం యేమీ తిరుగులేనిది — యేం, వాళ్లే, మీరు ప్రాతినిధ్యం వహిస్తున్నట్టుగా అలా తయారవుతున్నారని మీరు గుర్తిస్తున్నారు.

బర్బరత్వం వేపు తిరిగి జారిపోయే అవకాశం వుందన్న భావం యీనాటి బూర్జువాలలో మహా ''మోజుగా'' వుంది. యీ స్పెంగ్లర్లూ, కైయోలూ యింకా అలాంటి ''చింతనా పరులూ'' వేలాది పశుబుద్ధుల మానసిక స్థితిని ప్రతిబింబిస్తున్నారు. తమ వర్గం పతనం అయిపోతోందనే శంకనుంచి, ప్రపంచమంతటా కూడా తమ పోరాటంలోని న్యాయంపట్ల శ్రామికజనంలో విప్లవ భావం పెరుగుతోందన్న వాస్తవంనుంచి యీ కలవరపాటు పడుతోంది. శ్రామిక ప్రజల విప్లవాత్మక సాంస్కృతికాభివృద్ధిని విశ్వసించకుండా వుండాలనే బూర్జువావర్గం అనుకుంటుంది గాని, దానికి అది కనిపిస్తోంది, అనుభూతం అవుతోంది. అది అన్నిటినీ యిముడ్చుకునే క్రమణం, అద్భుతంగా సమర్థనీయమైంది. సర్వమానవాళి శ్రామిక అనుభవపు తర్కబద్ధమైన తప్పనిసరి అభివృద్ధి యిది. దీన్ని గురించి బూర్జువా చరిత్రకారులు యెంతో ఘనంగా మాట్లాడతారు. కాని చరిత్ర కూడా ఒక శాస్త్రం కాబట్టి, దాన్ని కూడా ''అదుపు చేయాలి'' లేదా, యింకా సులభంగా, దాని ఉనికిని గురించి మరిచి పోవాలి. యిదీ ఫ్రెంచి కవీ, ఫ్రెంచి అకాడెమీ సభ్యుడూ అయిన పాల్ వాలెరీ[199] తన పుస్తకం ''సమకాలీన ప్రపంచపు సమీక్ష''లో యిచ్చిన సలహా. మనం చరిత్రని మరిచిపోవాలని ఆయన

కోరతాడు. జాతుల దుర్ఘటనలకి చరిత్రనే ఆయన చాలా గంభీరంగా నిందిస్తాడు: గతాన్ని గురించి తల పోయడం అనేది నిష్ఫలమైన కోరికలకి అవకాశం కలిగిస్తుందనీ, ప్రజల మనశ్శాంతిని మాయం చేస్తుందనీ ఆయన అంటాడు. ప్రజలు అంటే ఆయన దృష్టిలో బూర్జువాలే అనుకోండి. మరే రకమైన ప్రజలనీ భూమ్మీద చూసే శక్తి వాలెరీకి లేదు లెండి. యిటీవలదాకా బూర్జువాలు యెంతో గర్వపడి వాళ్ళ యెంతో నేర్పుగా రాసిన చరిత్రని గురించి ఆయన చెపుతున్నది యిదీ:

''మన మేధా రసాయన ప్రయోగశాలలో విశదీకరించిన అన్ని ఉత్పత్తుల్లోకీ మహా ప్రమాదభరితమైంది చరిత్ర. అది కలల్ని ఉద్దీపనం చేస్తుంది. జాతులకి మత్తు కలిగిస్తుంది, వాటిల్లో తప్పుడు జ్ఞాపకాలని మేల్కొల్పుతుంది, వాటి ప్రతిబింబాలని కొండంతలు చేస్తుంది, వాటి పాత పుళ్ళని రేపుతుంది, వాటి ప్రశాంతతని భగ్నంచేసి, పిచ్చిపట్టిస్తుంది — ఆత్మస్తుతి పిచ్చిగాని, వేధించే పిచ్చిగాని.''

చూశారు కదా, వూరడించే తన పాత్రలో ఆయన, చాలా మౌలికంగా వున్నాడు. బూర్జువావర్గం ప్రశాంతంగా బతకాలని కోరుకుంటోందనీ, తను అలా బతకగలందుకుగాను లక్షలాది ప్రజలని నాశనం చేసే హక్కు తనకి వుందని ఆ వర్గం భావిస్తున్నదనీ ఆయనకి తెలుసు. ఆ వర్గం సులభంగా వేలాది పుస్తకాలని నాశనం చెయ్యగలదు లెండి — యేమంటే, భూమ్మీద వున్న అన్నిటి లాగానే, లైబ్రరీలు కూడా దాని అధీనంలో వున్నాయి. చరిత్ర ప్రశాంత జీవితాన్ని నిరోధిస్తుందా? అయితే, మరి చరిత్ర యెందుకు! వున్న చరిత్ర పుస్తకాలన్నింటినీ వెనక్కి లాగెయ్యండి! పాఠశాలల్లో దాన్ని బోధించ నివ్వకండి! గతాన్ని గురించి అధ్యయనం చెయ్యడం అనేదాన్ని సాంఘికంగా ప్రమాదభరితమనీ, ఆ మాట కొస్తే నేరమనీ కూడా ప్రకటించండి! చారిత్రక పరిశోధనా కుతూహలం వున్న వాళ్ళ అసాధారణమైన మనుషులని ప్రకటించి, నిర్జన ద్వీపాంతర వాస శిక్షవేసి పంపెయ్యండి!

ముఖ్యమైన విషయం యేమిటంటే ప్రశాంతత! బూర్జువావర్గాన్ని వూరడించే వాళ్ళందరికీ కావాల్సింది అది. కాని ప్రశాంతతని సాధించడానికి, వాలెరీ చెప్పినట్టుగా, భిన్న జాతీయతల పెట్టుబడిదారీ దోపిడీ దొంగల మధ్య పరస్పర విశ్వాసం వుండి తీరాలి. మరి విశ్వాసాన్ని స్థాపించడం కోసం మిగిలిన దేశాల కవాటాలు — ఉదాహరణకి, చైనావి — విశాలంగా తెరిచి వుంచడం అవసరం. అప్పుడు యూరప్‌లోని దోపిడీ దొంగలూ, దుకాణదార్లూ అందరూ వాటిని కొల్లగొట్టుకోవచ్చు. కాని జపాన్‌లోని దోపిడీ దొంగలూ దుకాణదార్లూ, చైనా తమకి దగ్గర్లో వుందనీ, యూరప్‌కి దగ్గర్లో లేదనీ, తమకి ఇండియన్లని కంటే చైనీయుల్ని దోచుకోవడం సౌకర్యమనీ — ఇండియన్లని ఇంగ్లండ్ ''పెద్ద మనుషులు'' దోచుకోవడానికి అలవాటుపడ్డారు — చెప్పి, తమకి తప్ప మిగతా అందరికీ

ఆ కవాటాలు మూసెయ్యాలని చూస్తున్నారు. దోచుకోవడంలోని పోటీవల్ల వైషమ్యాలు తల యెత్తుతాయి. నూతన ప్రపంచ యుద్ధపు హెచ్చరికలతో ఆ వైషమ్యాలు నిండి పోతాయి. యింకా యేమిటంటే, ఫ్రెంచ్ పత్రిక విలేకరి గ్రెన్‌గువార్ చెప్తున్నట్టు, ''మామూలు, నిలకడ అయిన విపణిగా వుండే రష్యన్ సామ్రాజ్యం యూరప్‌కి పోయింది.'' దీంట్లోనే ''చెడుకి మూలం'' గ్రెన్‌గువార్‌కి కనిపిస్తోంది. మిగతా పత్రి కలవాళ్లూ, రాజకీయవాదులూ, బిషప్పులూ, ప్రభువులూ, దుస్సాహసికులూ, వంచకులూ మాదిరిగానే సోవియట్ యూనియన్‌లో మొత్తం యూరప్ అంతా జోక్యం చేసుకోవాల్సిన అవసరాన్ని అది పట్టుబడుతోంది. మరి యూరప్‌లో నిరుద్యోగం పెరుగుతోంది, అలాగే తమ పోరాటంలోని ధర్మంపట్ల శ్రామికవర్గపు విప్లవ భావమూ పెరుగుతోంది. ''ప్రశాంతత''ని స్థాపించడానికి చాలా తక్కువ అవకాశం వున్నట్టూ, యింకా చెప్తే, దానికి అసలు తావే లేనట్టూ తేలుతోంది. కాని నేను, ఆశావాదిని కాకపోవడంవల్లా, బూర్జువా వర్గపు సినిసిజానికి హద్దులేదని తెలిసి వుండడంవల్లా, ప్రశాంత జీవితం కోసం బూర్జువా వర్గం మార్గం యేర్పరచుకునే ప్రయత్నం చేసే దారి ఒక్కటే వుందని గుర్తించ సిద్ధపడతాను. ఫిబ్రవరి 19న, కొలోన్‌లో యీకింది మాటలు అంటున్నప్పుడు జాతి దురహంకారి డిప్యూటీ బెర్గర్ ఆ అవకాశాన్ని సూచించాడు:

''హిట్లర్ అధికారంలోకి వచ్చాక, ఫ్రెంచివాళ్లు జర్మన్ ప్రాంతాన్ని ఆక్రమిం చుకునే ప్రయత్నం చేస్తే మేము యూదులందరి గొంతుకలూ కోస్తాం.''

యీ ప్రకటన ప్రష్యన్ ప్రభుత్వం దృష్టికి వచ్చాక, బెర్గర్ యింక బహిరం గంగా యే ఉపన్యాసాలూ యివ్వకుండా అది నిషేధించింది. హిట్లర్ పక్షంలో యిది క్రోధావేశానికి కారణమైంది. ఒక జాతి దురహంకార పత్రిక యిలా రాస్తోంది:

''చట్టవ్యతిరేక చర్యల్ని రెచ్చగొడుతున్నాడని బెర్గర్‌ని నిందించడానికి లేదు. మేం అధికారంలోకి వచ్చాక మేం చెయ్యబోయే చట్టాల ఆధారంగానే మేం యూదుల గొంతుకలు కోస్తాం.''

యీ ప్రకటనని ఒక జోక్‌కింద, జర్మన్ ''విట్జ్''కింద కొట్టి పారెయ్యడానికి వీల్లేదు. ప్రస్తుతం తను వున్న మానసిక స్థితిలో, సామూహికంగా యూదులని మట్టు బెట్టడానికే కాదు, తన కంటే భిన్నంగా ఆలోచించే వాళ్లందర్నీ, అన్నిటి కంటె ముఖ్యంగా, తన రాక్షస ప్రయోజనాలకి అనుగుణంగా నడవని వాళ్లందర్నీ మట్టుబెట్టే ''చట్టాన్ని చేసే'' శక్తి యూరపియన్ బూర్జువావర్గానికి వుంది.

యీ ''విషవలయం''లో చిక్కుకునిపోయి, మేధావి ఆశ్వాసకులు క్రమేపీ వూరడించే తమ నైపుణి పోగొట్టుకుని తామే ఆశ్వాసన అవసరంలో పడిపోతారు. వాళ్లు, సూత్ర

రీత్యా బిచ్చం వెయ్యి నిరాకరించే వాళ్లని కూడా వూరట అర్థిస్తారు. యేమంటే దానం చెయ్యడమనేది బిచ్చం ఉండే హక్కుని స్థాపిస్తుంది. తమ ప్రాథమిక ప్రతిభ అయినటు వంటి ''అందంగా అబద్ధం ఆడే'' ప్రతిభ, బూర్జువా యదార్థపు అసహ్యాకరమైన సినిసిజాన్ని యిక యెంత మాత్రమూ ముసుగు కప్పి వుంచలేదు. ప్రపంచాన్ని కొల్ల గొట్టడమనే శ్రమతోటి సొలసిపోయిన వాళ్లని, తమ దుష్ట లక్ష్యాలపట్ల శ్రామిక వర్గంలో పెరుగుతున్న నిశితమైన ప్రతిఘటనతో భయకంపితులైన వాళ్లని, తమ అర్థం లేని ఐశ్వర్యదాహం ప్రలాపించే మద స్వభావాన్ని సంతరించుకుని, సామాజికంగా వినాశ కర రూపాలని ధరింపచేస్తూ వున్నటువంటి వాళ్లని, అలాంటి వాళ్లని వూరడించి వినోద పరచడం నిరర్థకమైన ఉద్యోగం అనేదే కాకుండా, ఆశ్వాసకులకి తమకే ప్రమాద కరంగా తయారవుతోందని మేధావుల్లో కొంత మంది గుర్తించ నారంభించారు.

కుంగిపోయిన దొంగలనీ, హంతకులనీ వూరడించడంలోని నేరాన్ని కూడా యెవళ్లైనా చూపించవచ్చు. కాని యీ వాదన యెవరి హృదయ తంత్రుల్నీ కదిలించలేదు అని నాకు తెలుసు — యేమంటే అది నీతిబోధన అవుతుంది. మరి నీతిబోధవని మితిమీరిన కర్తవ్యంగా బహిష్కృతం చెయ్యడం జరిగింది. యీనాటి ప్రపంచంలో మేధా ఆశ్వాస కుడు, తార్కికత కరాఖండీగా ఉనికిని నిరాకరించేటువంటి ''మధ్యస్థుడు'' అయిపోతున్నా డనే వాస్తవ విషయాన్ని సూచించడం ప్రముఖంగా వుంది.

బూర్జువావర్గానికి సంతానమూ, శ్రామికవర్గానికి సాంఘిక హోదాబట్టి సమానుడూ అయిన అతను, వినాశనం విధి లిఖితమైన ఆ వర్గానికి, దొంగతనమూ హత్యలూ వృత్తి అయిన వాడికి మళ్లే నాశనం అయిపోవడం పూర్తి సహేతుకం అయిన ఆ వర్గానికి, తాను సేవకుడి స్థానంలో వున్నాననే అవమానకరమైన విషాదాన్ని గ్రహిస్తు న్నట్టే వుంది. అతను యీ విషయాన్ని గుర్తించ నారంభించాడు, యేమంటే బూర్జువా వర్గానికి అతని సేవల అవసరం తీరిపోయింది. బూర్జువావర్గపు అభిమానాన్ని సంపా దించాలనే ప్రయత్నంలో తమ సౌభ్రాత్ర వర్గపు మనుషులు మేధావుల అధికోత్పత్తి జరిగిందని నొక్కి చెప్పడం అతను యెడతెగకుండా వింటూనే వున్నాడు. బూర్జువా వర్గం ''వూరట'' కోసం తత్వవేత్తలనుంచీ, ''చింతనాపరుల''నుంచీ మళ్లి, భవిష్యత్తు గురించి జోస్యం చెప్పే నాటు పండితులపట్ల యెక్కువ సునాయాసంగా మొగ్గు చూపి స్తోందని అతను చూస్తున్నాడు. యూరపియన్ వార్తాపత్రికలన్నీ బూర్జువాల కంటే కూడా యెక్కువ అజ్ఞానులైనటువంటి హస్త సాముద్రికులా, జ్యోతిష్కులా, జాతక చక్రాలు రాసేవాళ్లా, ఫకీర్లా, యోగులా, రేఖాచిత్ర సూత్రవైజ్ఞానికులా, ఆధ్యాత్మికవేత్తలా, తదితర బూటకపు మనుషులా ప్రకటనలతో కిక్కిరిసి పోతున్నాయి. ఫొటోగ్రఫీ, సిని మాలు చిత్రకళని చంపేస్తున్నాయి. చిత్రకారులు మాడిచావకుండా వుండేందుకు గాను

తమ బొమ్మలని బంగాళా దుంపలకీ, రొట్టెముక్కకీ, సంస్కారహీనులు తొడుక్కొని విడిచేసిన గుడ్డముక్కలకీ బదలాయించేస్తున్నారు. ఒక పారిస్ వార్తాపత్రిక ముచ్చటైన యీ వార్తని ప్రచురించింది:

"బెర్లిన్ కళాకారుల విపద్దశ తీవ్రంగా వుంది. ఉపశమన చిహ్నాలు యెక్కడా లేవు. కళాకారుల పరస్పర సహాయనిధిని నిర్వహించాలనే మాటలు వినిపిస్తున్నాయి. కాని, యే సంపాదనా లేనివాళ్ళు, సంపాదించే ఆశా కనిపించనివాళ్ళు ఒకొళ్ళకొకళ్ళు యేం సహాయం చేసుకుంటారు? నేరుగా వస్తు మార్పిడి చేసుకోవాలని అన్నత్ జాకోబి అనే మహిళా కళాకారిణి మొదట సూచించిన దాన్ని బెర్లిన్ కళా బృందాలు ఉత్సాహంగా ఆహ్వానించాయి. శిల్పాలకీ, బొమ్మలకీ మారుగా స్థానిక వర్తకుల్ని ఇంధనం సరఫరా చెయ్యనివ్వండి. కాలం మారుతుంది. బొగ్గుల వర్తకులు తమ బేరాల గురించి విచారించ నవసరం వుండదు. కళాకారులమీద దంతవైద్యుల్ని తమ కళాకౌశలాన్ని చూపించ నియ్యండి. దంతవైద్యుడి నిరీక్షా మందిరంలో యెప్పటికీ ఒక మంచి బొమ్మ ప్రత్యక్షమయ్యే వుంటుంది. మాంసం అమ్మేవాళ్ళూ, పాలూ, పెరుగూ అమ్మేవాళ్ళూ ఒక సత్కార్యం కోసం ఎగిరి గంతెయ్యాలి, అదే సమయంలో యే నగదు పెట్టుబడీ అవసరం లేకుండా నిజమైన కళాఖండం సంపాదించాలి. అన్నత్ జాకోబి సలహాని ఆచరణ యోగ్యం చెయ్యడానికని చెప్పి బెర్లిన్‌లో ఒక ప్రత్యేక కమిటీ యేర్పడింది."

యీ ప్రత్యక్ష వస్తుమార్పిడి పద్ధతిని గురించి వార్త అందించిన పత్రిక యీ పద్ధతి పారిస్‌లో అమల్లో వుందని చెప్పలేదు.

సినిమా క్రమేపీ ఉన్నత రంగస్థల కళని నాశనం చేస్తోంది. బూర్జువా సినిమా తాలూకు నైతిక పతన ప్రభావాన్ని గురించి వివరించాల్సిన అవసరం లేదు, యేమంటే అది అంత తేటతెల్లంగా తెలుస్తూనే వుంది. భావోద్వేగమయమైన ప్రతి కథావస్తువునీ యిగిర్చేసాక, అది శారీరక వికృత నిర్మాణాన్ని ప్రదర్శించ పూనుకుంది.

"మెట్రో గోల్డ్‌విన్ మేయర్స్" హాలీవుడ్ స్టూడియోలు 'తిక్కవాళ్ళు' అన్న సినిమా కోసమని అచ్చం అలా వుండే బృందాన్ని సేకరించారు. అందులో పెద్ద కొంగతోటి యెంతో పోలిక వున్న కు–కు అన్న అమ్మాయి వుంది. పి. రాబిన్‌సన్ అని అస్థిపంజరం మనిషి; పుట్టుకతోటే ఒంటిచేయి అవకరం వుండి, కాళ్ళతో లేసు అల్లే మార్తా అనే ఆమె; పిల్లంతా ఆ బృందంలో వున్నారు. ఆ స్టూడియోవాళ్ళ "గుండుసూది తల ఆడమనిషి"ని సంపాదించారు. ఆమెకి అతికాయం, గుండుసూది అంతటి తల వున్నాయి. ఓల్గా అని శుద్ధ మగరాయుడిలా గడ్డం వున్న ఆమెనీ, సగం ఆడ సగం మగ అయిన జోసెఫైనా–జసెఫ్‌ని, హిల్టన్ సయామిస్ కవలల్ని, మరుగుజ్జుల్ని, లిల్లిపుట్లనీ సంపాదించారు.

బర్నాయ్‌కీ, పాసార్ట్‌కీ, మెనే సర్లీకీ యింకా యీ రకానికి చెందిన తదితర నటీనటులకీ అవసరం తీరిపోయింది. ఫెయిర్‌బాంక్‌లూ, హెరాల్డ్ లాయిడ్‌లూ యితర గారడీవాళ్ళూ వెనక్కి గెంటేస్తున్నారు, సంప్రదాయిక సంగీతాన్ని జాజ్ గెంటేసినట్టుగా; చిన్నచిన్న దొంగతనాలూ హత్యలూ చేసేవాళ్ళని పట్టుకోవడంద్వారా సాముహిక హత్యల్ని చేయించేవాళ్ళూ, పెద్ద దొంగలూ అయిన వాళ్ళ ఆస్తిని పోలీసు డిటెక్టివ్‌లు కాపాడే కథల్ని చెప్పే కౌశలం వున్న లెక్కలేనంత మంది వాలెస్[200]లు స్టెండాల్, బాల్జాక్, డికెన్స్, ఫ్లొబెర్ లాంటి వాళ్ళని వెనక్కి గెంటేసినట్టుగా. కళా రంగంలో తపాలా బిళ్ళల్నీ, ట్రామ్ టిక్కట్లనీ లేదా మహా అయితే నకిలీ నిష్ణాతుల బొమ్మల్నీ పోగుచెయ్యడంతోటి బూర్జువావర్గం పరమ సంతృప్తి చెందుతోంది. విజ్ఞాన శాస్త్ర రంగంలో శ్రామిక జనుల శారీరక శక్తుల్ని దోచుకునే అతి చవక అయిన, అతి అనుకూలమైన మార్గాల్నీ పద్ధతుల్నీ చూడ్డంలోనే తన సంపద పెరిగే మేరకు బూర్జువా వర్గపు ఆసక్తి వుంది.

దీన్ని చూసి, కొంతమంది మేధావులు ''సృజనాత్మక సంస్కృతి'' — దాన్ని వాళ్ళు తమ వ్యాపకమనీ, తమ ''స్వేచ్ఛాయుత ఆలోచనా,'' ''స్వతంత్ర యిచ్ఛ''ల ఉత్పత్తి అనీ భావించారు — యిక యెంత మాత్రమూ తమకి సంబంధించింది కాదనీ, సంస్కృతి అనేది పెట్టుబడిదారీ ప్రపంచపు ఆంతరిక అవసరం కాదనీ గుర్తించ నారంభించారు. చైనాలోని ఘటనలు[201] వాళ్ళకి లూవైన్ విశ్వవిద్యాలయాన్నీ దాని లైబ్రరీనీ 1914లో నాశనం చేసిన సంగతిని[202] జ్ఞప్తికి తెచ్చాయి. షాంగ్‌హైలోని తుంగ్‌జీ విశ్వవిద్యాలయాన్నీ, నౌకా కళాశాలనీ, మత్స్య పాఠశాలనీ, జాతీయ విశ్వవిద్యాలయాన్నీ, వైద్య కళాశాలనీ, వ్యావసాయిక, ఇంజనీరింగ్ కళాశాలల్నీ, శ్రామికుల విశ్వవిద్యాలయాన్నీ జపాన్ తుపాకులు ధ్వంసం చేశాయి. యీ అనాగరిక చర్యవల్ల యెవళ్ళకీ ఆగ్రహం కలగ లేదు, సాంస్కృతిక సంస్థలకి యిచ్చే నిధులలో కోత ఆగ్రహం కలిగించనట్టే. యీ కోతకీ, ఆయుధాలు స్థిరంగా పెరగడానికీ అవినాభావ సంబంధం వుంది.

తాము ''బహిష్కృతులైన మధ్య వర్గపు న్యాయం'' విధిగా కిందికి రావాలని యూరపియన్, అమెరికన్ మేధావుల్లో కొద్ది మంది మాత్రమే అనుకుంటున్నారనుకోండి. వాళ్ళు యే పక్షం వహించాలి: పాత అలవాటు ప్రకారం శ్రామికవర్గానికి వ్యతిరేకంగా బూర్జువాల పక్షాన వుండాలా, లేక ఆత్మ గౌరవ ప్రబోధం మేరకి బూర్జువాలకి వ్యతిరేకంగా శ్రామికవర్గం పక్షాన వుండాలా అనే విచికిత్సలో వున్నారనుకోండి. మేధావివర్గంలో అధికభాగం పెట్టుబడిదారీ విధానానికి కొలువు చెయ్యడంతో సంతుష్టులవుతున్నారు. పెట్టుబడిదారీ విధానం అనేది తన సేవకులా, ఆశ్వాసకులా నైతిక నమ్యత్వాన్ని గురించి పూర్తిగా యెరిగి వుండి, రాజీ పడడానికి వాళ్ళు చేసే కృషిలోని నిరర్థ

కతనీ, నిష్ఫలత్వాన్నీ చూసి, బహిరంగంగా వాళ్లని అసహ్యించుకో (ప్రారంభించి, అలాంటి సేవకులా, ఆశ్వాసకులా ఉనికి అవసరం అని శంకిస్తూ వున్నాడు యజమాని.

మధ్యతరగతి సంస్కారహీనులని వూరడించడంలో నిపుణులైన వాళ్లు నాకు తరచుగా ఉత్తరాలు రాస్తూ వుంటారు. స్వెన్ ఎల్వర్‌స్టాడ్‌గారినుంచి నాకు వచ్చిన అలాంటి ఒక ఉత్తరాన్ని ఉల్లేఖిస్తాను:

''ప్రియమైన గోర్కీగారూ,

భూగోళంమీద వున్న అన్ని దేశాలనీ తాడించినటువంటి భయంకరమైన ఆర్థిక సంక్షోభంవల్ల కలిగిన దిగులు, నిస్పృహని సమీపించేటటువంటి దిగులు, ప్రపంచమంతా పెత్తనం చేస్తోంది. యీ ప్రపంచ వ్యాప్త విషాదం నన్ను నార్వేలో అతి పెద్ద సర్క్యులేషన్ వుండే వార్తాపత్రిక అయిన ''త్రైడెన్స్ తెన్''లో వ్యాసాల పరంపరను ప్రచురించడానికి ప్రేరేపించింది. భయంకరమైన విపత్తుకి గురి అయిన లక్షలాది ప్రజల్లో నూతన జవం, ఆశా పాదుకొల్పడమే ఈ వ్యాసాల లక్ష్యం. కాబట్టి నేను, గత రెండు సంవత్సరాల్లోనూ ప్రజల విషాదభరిత స్థితిని గురించి తమ అభిప్రాయాలని తెలియచెయ్యవలసిందిగా రచయితలని, కళాకారులని, శాస్త్రజ్ఞుల్ని, రాజకీయవేత్తలని అర్థించడం యుక్తమని భావించాను. ప్రతి దేశంలోనూ ప్రతి పౌరుడూ యీ ప్రత్యామ్నాయాన్ని యెదుర్కొంటునాడు: నిర్దాక్షిణ్యమైన విధి కశాఘాతం కింద నలిగిపోవడమో, లేదా యీ సంక్షోభానికి సంతోషకరమైన పరిష్కారాన్ని చూసే ఆశతో పోరాటం కొనసాగించడమో. యీ నిరాశామయ పరిస్థితి ఆనందదాయకంగా అంతం అవుతుందనే ఆశ ప్రతి ఒక్కళ్లకీ అవసరం. అందరూ కూడా శ్రద్ధగా వినడానికి అలవాటుపడ్డ వ్యక్తి వెలిబుచ్చే ఆశావహమైన అభిప్రాయాన్ని చదివి ఈ ఆశతో ప్రతివాడి గుండె తేజోవంతంగా వెలుగుతుంది. అంచేత ప్రస్తుత పరిస్థితిని గురించి మీ అభిప్రాయాన్ని అర్థిస్తున్నాను. అది మూడు నాలుగు లైన్లకంటే యెక్కువ వుండకపోవచ్చు గాని అది చాలా మందికి నిస్సందేహంగా నిస్పృహ పోగొడుతుంది, భవిష్యత్తుని ధైర్యంగా యెదుర్కొనే శక్తిని యిస్తుంది.

భవదీయుడు

స్వెన్ ఎల్వర్‌స్టాడ్.''

''రెండు మూడు లైన్ల''కి వున్న స్వాస్థ్య గుణంలో, ఒక పదబంధానికి గల సద్గుణంలో అమాయిక విశ్వాసం వున్న వాళ్లు — యీ ఉత్తరం రాసిన ఆయన లాంటి వాళ్లు — యింకా చాలామంది వున్నారు. యీ విశ్వాసం యెంత అమాయికమైందంటే అది నిజాయితీగా వుండలేదు. రెండు మూడు పదబంధాలు, లేదా రెండు మూడు వందల పదబంధాలు ఉడిగిపోయిన యీ బూర్జువా ప్రపంచానికి నూతన జీవాన్ని యివ్వ

లేవు. ప్రతిరోజూ ప్రపంచంలోని అన్ని పార్లమెంట్లలోనూ, నానా జాతి సమితిలోనూ వేలాది మాటలని అంటున్నారు. కాని అవి యెవర్నీ పూరడించడమూ లేదు, ధైర్యం చెప్పడమూ లేదు, బూర్జువా నాగరికతకి సంభవించే సంక్షోభం హఠాత్తుగా పెరగకుండా అదుపుచేసే అవకాశం గల ఆశని వెలిగించడమూ లేదు. మాజీ మంత్రులూ, యితర సోమరి మనుషులూ విజ్ఞానశాస్త్రాన్ని ''అదుపు చెయ్యండి'' అనీ, ''దండించండి'' అనీ సంస్కారహీనుల్ని అర్థిస్తూ నగరాలు పర్యటిస్తున్నారు. యీ మనుషుల ప్రలాపాలని వెంటనే అందిపుచ్చుకుంటున్నారు జర్నలిస్టులు—''అంతా ఒకటేగా, అంతా విసుగు పుట్టించే క్రీడగా'' అలా చాలా కాలంగా అది వున్న మనుషులు వీళ్లు. వాళ్లల్లో ఒకాయన ఒక గంభీరమైన వార్తాపత్రిక ''ది డైలీ ఎక్స్‌ప్రెస్''లో రాస్తూ, ''స్పెషలిస్టులని వదిలించుకొమ్మని'' మానవాళికి సలహాయిస్తున్నాడు. మరి పెటీబూర్జువా యీ నీచమైన చెత్తని విని, చదివి, దాన్నుంచి తన అభిప్రాయాలు తను యేర్పరచుకుంటాడు. విశ్వవిద్యాలయాన్ని మూసి వెయ్యడం అవసరం అని యూరపియన్ సంస్కారహీనులు నిర్ణయిస్తే, అదేమంత ఆశ్చర్యం కలిగించక్కర్లేదు. సందర్భవశాత్తూ తన వాదానికి బలంగా యీ వాస్తవాన్ని చూపించవచ్చు: జర్మనీలో విశ్వవిద్యాలయపు పట్టా అవసరమైన ఉద్యోగాలు సాలీనా 6,000 ఖాళీ అవుతున్నాయి, కాని జర్మన్ యూనివర్సిటీలనుంచి ప్రతి యేడూ ఓ 40,000 మంది పట్టాపరీక్షల్లో నెగ్గుతున్నారు.

''అభిప్రాయాల్ని రూపొందించే నిర్మాణ'' పాత్రని బూర్జువా సాహిత్యానికీ, జర్నలిజానికీ అంటగట్టడంలో శ్రీయుత డి. స్మిత్, టి. మారిసన్‌గార్లూ మీరు పొరపడుతున్నారు. యీ ''ఆర్గనైజరు'' యదార్థం అనే క్షుద్రమైన గందరగోళాన్ని మసిపూసి మారేడుకాయ చెయ్యప్రయత్నిస్తుంది. కాని అంత సమర్థవంతంగా చెయ్యలేదు, ఉదాహరణకి, జిల్లేడు మొక్కలూ, ఉమ్మెత్త మొక్కలూ శిధిలాల కుప్పలనీ, చెత్తనీ దాచిపెట్టలేనట్టుగా. ''ఒక అమెరికన్ అన్నిటికంటే ముందు అమెరికనే'' అనీ, తర్వాతనే మనిషి అనీ ఏక కంఠంతో చాటేటువంటి మీ పత్రికల సాంస్కృతిక పాత్ర గురించి పౌరులారా, మీకు అంతగా తెలీదు. యిక జర్మన్ జాతి దురహంకార పత్రికలు, ఒక జాత్యాహంకారి అన్నిటికంటే ముందు ఆర్యన్ అనీ, తర్వాతనే ఫిజీషియనో, భూగర్భశాస్త్రవేత్తో, తత్వవేత్తో అవుతాడనీ తమ వంతుగా బోధిస్తున్నాయి. ఒక ఫ్రెంచివాడు అన్నిటికంటే ముందు విజేత అనీ, అంచేత మిగతా వాళ్లకంటే యెక్కువగా బలోపేతుడవాలనీ ఫ్రెంచి జర్నలిస్టులు వాదిస్తారు—అంటే మానసికంగా బలపడ్డం అని కాదులెండి, ముష్టిబలం అనే అర్థంలోనే.

యూరపియన్, అమెరికన్ పత్రికలు, యిప్పటికే తన సహాయ సంపత్తుల ప్రమేయం యేమీ లేకుండానే అధోస్థాయిలో వున్న తమ పాఠకుల సాంస్కృతిక స్థాయిని అణగ

దొక్కడంలో మహా ఆతృతగా, దాదాపు కంకణం కట్టుగొని నిమగ్నం అయాయనడం అతిశయోక్తి గాదు. తమ యజమానులైన పెట్టుబడిదారుల ప్రయోజనాలకి వూడిగం చేస్తూ 'పేనులాంటిదానికి యేనుగులాంటి రూపాన్ని'చ్చే కౌశలం వున్న జర్నలిస్టులు సూకరాన్ని లొంగదీసుకోవడం తమ ధేయంగా పెట్టుకోరు, సూకరం పిచ్చి పట్టి స్వైర విహారం చేస్తూ వుండడం చూస్తూన్నప్పటికీ కూడా.

''మేం యూరప్‌లో వున్నప్పుడు, యూరపియన్లు మమ్మల్ని ద్వేషిస్తారన్న విషయాన్ని యెంతో బాధపడుతూ గుర్తించాం'' అని మీరు రాస్తున్నారు. యిది చాలా ''స్వీయా త్మక'' ధోరణిలో వుంది. స్వీయాత్మక ధోరణి పాక్షికంగా సత్యాన్ని దర్శింప చేసే టట్టు మీకు అనుకూలించినా, మొత్తం సత్యాన్ని మాత్రం మీనుంచి దాచి వుంచింది. యూరప్‌లోని బూర్జువాలు అందరూ పరస్పరం ద్వేషించుకునే వాతావరణంలో వున్నారని మీరు గమనించడం లేదు. బలవంతంగా ఆస్తిని దోచుకునే జర్మన్లు ఫ్రాన్స్‌ని ద్వేషి స్తారు. బంగారం యెక్కుతిక్కలై ఫ్రాన్స్ ఇంగ్లండ్‌ని ద్వేషిస్తుంది, సరిగ్గా ఇటాలి యన్లు ఫ్రెంచి వాళ్లని ద్వేషించినట్టుగా. మొత్తం బూర్జువాలు అందరూ కలిసి సోవియట్ యూనియన్‌ని ద్వేషిస్తారు. ఇంగ్లీషు ప్రభువులన్నా దుకాణదార్లన్నా ముప్పై కోట్ల మంది ఇండియన్లూ పగతో కుతకుతలాడి పోతున్నారు. నలభై అయిదు కోట్ల మంది చైనా వాళ్లూ జపాన్‌వాళ్లనీ, మొత్తం యూరపియన్లనందర్నీ అసహ్యించు కుంటున్నారు. యీ యూరపియన్లు, చైనాని దోచుకోడానికి అలవాటుపడి, జపాన్‌వాళ్లంటే కూడా ద్వేషంతో వుంటారు, ఆ జపాన్‌వాళ్లేమో చైనాని దోచుకోవడం తమ ప్రత్యేక హక్కని భావిస్తూవున్నందుకు. అందరి పట్లా అందరిలోనూ యీ ద్వేషం పెరుగు తోంది, యింకా యింకా యెక్కువ సాంద్రం అవుతోంది, పరుషం అవుతోంది. యిది యింకా చీముపట్టే పుండులాగా బూర్జువాలలో పెరుగుతోంది. సరే, చితుకుతుందను కోండి, అప్పుడు బహుశా అత్యుత్తమమైన, అత్యంత ఆరోగ్యవంతమైన ప్రజల రక్తం మళ్లీ నదులై పారుతుంది. దృఢగాత్రులైన లక్షలాది మనుషుల తోబాటుగా యుద్ధం అపారమైన సంపదనీ, దాన్ని సృష్టించే ముడి పదార్థాలనీ నాశనం చేస్తుంది. మాన వాళి ఆరోగ్యాన్నీ, మానవాళి లోహ, ఇంధన వనరుల్నీ హరించి దారిద్ర్యహేతువు అవు తుంది. యుద్ధం బూర్జువాల జాతీయ గ్రూపుల మధ్య వున్న పరస్పర విద్వేషాన్ని తొలగించదని వేరే చెప్పాల్సిన అవసరం లేదు.

మీరు ''విశ్వ మానవ సంస్కృతికి దోహదం'' చెయ్యగల వాళ్లుగా మిమ్మల్ని పరి గణించుకుంటున్నారు, ఆ సంస్కృతి ''బర్బరత్వంలో కూరుకుపోకుండా రక్షించాల్సిన బాధ్యత వున్న'' వాళ్లుగా భావించుకుంటున్నారు. అంతమట్టుకు బాగానే వుంది. కాని ఒక చిన్న ప్రశ్న వేసుకోండి: సందర్భవశాత్తూ, యెన్నడూ ''సార్వత్రికంగా మాన

పీయం''గాని, శ్రామికజనానికి యెంత మాత్రమూ జవాబుదారీగా వుండనక్కరలేని, ఒక జాతిని మరో జాతి తరుముకుని వెంటాడేటువంటి జాతీయ పెట్టుబడిదారీ ప్రభుత్వ సంస్థలు వున్నప్పుడు అలా ''సార్వత్రికంగా మానవీయం'' కాలేని స్థితిలో యీ సంస్కృతిని పరిరక్షించడానికి యివాళ గాని రేపు గాని మీరు యేం చెయ్యగలరు?

నిరుద్యోగం, లేదా శ్రామికవర్గపు ఆరోగ్యాన్ని కృశింపచేసే క్షుద్బాధ ప్రభావం, లేదా బాల జారత్వపు వ్యాప్తి లాంటి సంస్కృతీ విధ్వంసక దృగ్విషయాలని ప్రతిఘటించడానికి మీరు యేం చెయ్యగలరో, ప్రశ్నించుకోండి. ప్రజలు కృశించిపోవడం అంటే సంస్కృతి ఉత్పన్నం అయేటువంటి నేల కృశించిపోవడం అని మీకు అర్థమైందా? ''సంస్కార వంతులైన అంతస్తు'' అని పిలిచేది యెప్పుడూ కూడా ప్రజలు ఉత్పత్తి చేసిందే అని బహుశా మీ యెరుకలో వుండి వుంటుంది. మీకది బాగా తెలిసి వుండాలి, యేమంటే అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని వార్తాపత్రికల కుర్రవాళ్ళు అధ్యక్షుల స్థాయికి యెదగ గలరని అమెరికన్లకి డబ్బా కొట్టుకోవడం అలవాటు.

నేనీ విషయాన్ని ఆ కుర్రవాళ్ల సూక్ష్మబుద్ధిని గుర్తించేటందుకే చెబుతున్నాను గాని అధ్యక్షుల ప్రతిభల గురించి కాదు — ఆ విషయం గురించి నాకు బొత్తిగా తెలీదు.

మీరు ఆలోచించాల్సిన విషయం యింకోటుంది: తాము బ్రిటన్‌కి బానిసలుగా వుండాల్సిన ఖర్మ దేవుళ్లు రాసిపెట్టలేదని ముప్పై కోట్ల మంది ఇండియన్లు గుర్తించ నారంభిస్తూ వున్నప్పుడు, నలభై అయిదు కోట్ల మంది చైనీయుల్ని యూరపియన్ అమెరికన్ పెట్టుబడికి బానిసలని చెయ్యవచ్చని మీరు నమ్ముతున్నారా? కొంచెం ఆలోచించండి: కోట్లాది శ్రామికుల కాయకష్టంమీద కొన్ని వందల, వేల దోపిడీగాళ్ళు, దుస్సాహసికులూ శాశ్వతంగా నిమ్మకు నీరెత్తినట్టు బతకాలనుకుంటున్నారు! కాని అది మామూలే, అంటారా? ఒకప్పుడు అది మామూలుగా వుండింది, యిప్పుడూ వుంది; కాని అలానే వుండాలి అనే మొండితనం వుందా మీకు? ప్లేగు వ్యాధి కూడా ఒకప్పుడు, మధ్య యుగాలలో దాదాపు మామూలు విషయంగానే వుండేది. కాని యిప్పుడు ప్లేగు వ్యాధి దాదాపు మాయమైపోయింది. దాని బదులు భూమ్మీద బూర్జువావర్గం సిద్ధమైంది. యీ బూర్జువావర్గం, శ్వేతజాతుల పట్ల తీవ్రమైన విద్వేషం, పగ అనే అంటుజాడ్యంతో నింపేస్తూ, సకల రంగుజాతుల ప్రపంచాన్నీ భ్రష్టం చేసింది. సంస్కృతీ సంరక్షకులారా, పెట్టుబడిదారీ విధానమే జాతుల యుద్ధాల్ని రెచ్చగొడుతున్న దన్నది మీకు కనిపించడం లేదూ?

''విద్వేషాన్ని రెచ్చగొడు''తున్నానని నన్ను మీరు నిందిస్తారు, దానికి బదులుగా ''ప్రేమని ప్రచారం చెయ్యి''మని నాకు సలహా యిస్తారు. శ్రామికులమీద యిలా ఒట్టు

పెట్టే శక్తిమంతుణ్ణి నేనని మీరు అనుకుంటున్నారేమో: పెట్టుబడిదారుల్ని ప్రేమించండి, యేమంటే వాళ్లు మీ కండల్ని కబళిస్తారు; వాళ్లని ప్రేమించండి, యేమంటే వాళ్లు భూమ్మీది సంపదల్ని నిష్ఫలంగా వ్యర్థం చేస్తారు; మిమ్మల్ని నాశనం చేసే తుపాకుల్ని తయారు చెయ్యడంలో మీ యినుముని దుబారా చేసే యీ మనుషుల్ని ప్రేమించండి; యెవళ్ల పుణ్యమా అని మీ పిల్లలు సకసకలాడుతూ నాశనం అయిపోతున్నారో, ఆ తుచ్ఛుల్ని ప్రేమించండి; తాము సుఖసంతృప్తులతో బతకగలిగేటందుకుగాను మిమ్మల్ని ధ్వంసం చేసే ఆ మనుషుల్ని ప్రేమించండి; పెట్టుబడిదారుణ్ణి ప్రేమించండి, యేమంటే అతని చర్చి మిమ్మల్ని అజ్ఞానాంధకారంలో వుంచుతుంది. . .

. . దీనికి సరిపోతున్న దాన్ని దేన్నో బైబిల్ కూడా బోధిస్తోంది. దాన్ని గుర్తుకు తెచ్చుకుని మీరు క్రైస్తవమతాన్ని ''సాంస్కృతిక అభిమాని''గా ప్రస్తావిస్తున్నారు. మీరు కాలానికి చాలా వెనకబడి వున్నారు. ''ప్రేమ సువార్త, అణకువ'' సిద్ధాంతపు సాంస్కృతిక ప్రభావం గురించి నిజాయితీపరులు చాలా కాలం క్రితమే మాట్లాడ్డం మానేశారు. స్వస్థలంలోనూ, వలసలలోనూ కూడా తన బానిసలకి క్రైస్తవ బూర్జువా వర్గం అణకువని బోధిస్తూ, ''కత్తీ కఠార్లూ'' చూపించి తనను వాళ్లు ప్రేమించేటట్టు ఒత్తిడి చేస్తూ యీ ఆయుధాలని యితఃపూర్వం యెన్నడూ లేనంతగా ఉపయోగిస్తూ వున్న సమయంలో యీ ప్రభావాన్ని గురించి మాట్లాడ్డం అసమంజసమూ, అసంభావ్యమూనూ. ప్రస్తుతంలో కత్తికి బదులుగా మెషీన్‌గన్లూ, బాంబులూ వచ్చాయి, యింకా చెప్తే ''పైనుంచి దేవుడివాణి'' కూడా వచ్చింది. ఒక పారిస్ పత్రిక రాస్తోంది:

''అఫ్రిడిన్‌లతోటి తమ యుద్ధంలో తమని మంచి స్థితిలో వుంచేటువంటి కపటోపాయాన్ని బ్రిటిష్‌వాళ్లు కనిపెట్టారు. దుర్గమ పర్వతాల మధ్య పీఠ భూమ్మీద కొంత మంది తిరుగుబాటుదార్లు దాంకుని వుంటారు. వున్నట్టుండి యెంతో యెత్తులో పైన యెగురుతూ ఒక విమానం ప్రత్యక్షం అవుతుంది. అఫ్రిడిన్‌లు ఆయుధాలు అందుకుంటారు. కాని బాంబులు యేమీ పడవు. వాటికి బదులుగా విమానంనుంచి మాటలు యేకధాటీన వినవస్తాయి. ఆకాశంనుంచి ఒక అశరీరవాణి వాళ్ల మాతృభాషలో బతిమాలుతున్నట్టు మాట్లాడుతూ ఆయుధాలని కింద పారెయ్యమనీ బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా అర్థం లేని పోరాటాన్ని మానుకొమ్మని వాళ్లని ప్రాధేయ పడుతుంది. ఆకాశవాణి ప్రబోధంతోటి భయపడిపోయి తిరుగుబాటుదార్లు పోరాటం వదులుకున్న సందర్భాలు చాలా వున్నాయి.

''కార్య సాధకమైన యీ భగవంతుడి వాణిని ఫాసిస్టు మిలిషియా స్థాపక వార్షికోత్సవ సందర్భంగా మిలన్‌లో పునఃప్రయోగించారు. ఆ సమయంలో ఫాసిజాన్ని స్తవం

చేస్తూ వుండేటటువంటి మాటలని కొన్నిటిని ఆకాశవాణి పలకడం నగరం యావత్తూ వింది. జనరల్ బాల్బో మాట్లాడ్డం వినే అవకాశం కలిగిన మిలన్‌వాసులు ఆకాశం నుంచి వచ్చే ఆయన ఖంగుమనే గొంతుకని గుర్తుపట్టారు.''

ఆ రకంగా భగవంతుడి అస్తిత్వాన్ని రుజువు చెయ్యడానికీ, అనాగరికులని అదిమి వుంచడంలో ఆయన వాణిని వినియోగించుకోడానికీ సులభమైన మార్గాన్ని కనిపెట్టడం జరిగింది. ఏదో ఒక రోజున భగవంతుడు ఇంగ్లీషుని జపాన్ యాసతో మాట్లాడుతూ సాన్ ఫ్రాన్‌సిస్కో పైననో, వాషింగ్టన్ పైననో విహరించడం జరుగుతుందని వూహించ వచ్చు.

''మహనీయులు'', ''చర్చి ప్రబోధకుల'' ఉదాహరణని మీరు నాకు చూపిస్తారు. యీ విషయాన్ని మీరు సీరియస్‌గా ప్రస్తావించడం నిజంగా హాస్యాస్పదంగా వుంది. యే రకంగా, దేనికి, యెందుకు చర్చి బోధకులు తయారైందీ మనం అనుకోవద్దు. వాళ్ల ఆసరా తీసుకునే ముందు, వాళ్ల స్థిరత్వాన్నీ, దృఢత్వాన్నీ పరీక్షించడం బాగుంటుంది. చర్చిని గురించిన మీ సుదీర్ఘ ప్రస్తావనలో మీరు అమితమైన అజ్ఞానంనుంచి మాత్రమే ఆవిర్భవించగల ''అమెరికన్ భావవాదాన్ని'' వెల్లడి చేస్తున్నారు. ప్రస్తుత సందర్భంలో, క్రిస్టియన్ చర్చి చరిత్ర గురించిన మీ అజ్ఞానానికి హేతువు యేమిటయ్యా అంటే అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో నివశించే వాళ్లకి, చర్చి మానవ మేధనీ అంత రాత్మనీ బలవద్విధేయం చేసుకోడానికి వున్న వ్యవస్థ అనేది యూరప్‌వాసులకి లాగా, అంత నిశితంగా యెన్నడూ కఠోరమైన సొంత అనుభవంలో లేదు. ''మహా చర్చి బోధకుల'' రాక్షసత్వంతోటి, దురాశతోటి, స్వార్థంతోటి సమస్త పృథివీ క్రైస్తవ సభలలో జరిగిన రక్తసిక్తమైన దొమ్మీలని గురించి మీరు తెలుసుకోవాలంతే. ఎఫేసస్ సభలలో జరిగిన నాటువ్యవహారంనుంచి ప్రత్యేకం మీకు బోలెడు తెలుస్తుంది. సనాతన మత విరుద్ధ మైన పాషండ మతాల చరిత్రని గురించి మీరు చదవాలి. క్రిస్టియన్ మతపు తొలి యుగాల్లో ''పాషండుల్ని'' దుంప నాశనం చెయ్యడం గురించి, యూదులని సామూహి కంగా హతమార్చడం గురించి, ఆల్బిజినెసిన్‌లనీ, తాబొరైట్లనీ మూకుమ్మడిగా సంహరిం చడం గురించీ, మొత్తంమీద ''క్రైస్తు చర్చి'' రక్తసిక్త సిద్ధాంతం గురించి మీరు తెలుసుకోవాలి. విద్యావంతులు కాని వాళ్లకి ఆసక్తికరంగా వుండేది ''ఇంక్విజిషన్''[203] చరిత్ర. అలా అని మీ దేశస్థుడు వాషింగ్టన్ లీ చెప్పిన ఇన్‌క్విజిషన్ సంగతులు కాదు లెండి. వాటిని ఇంక్విజిషన్‌ని ప్రారంభించే ఆ వాటికన్ సెన్సార్‌షిప్ ఆమోదించింది. దీన్నంతటిని గురించీ గనక మీరు తెలుసుకుంటే చర్చి అధిపతులు అధిక సంఖ్యాకుల మీద అల్ప సంఖ్యాకుల అధికారాన్ని గుప్పిట చిక్కించుకోడానికి మహా ఆత్రంగా కృషి చేశారనీ, వాళ్ల మతాన్ని యెదిరించిన వాళ్లతో పోరాడారంటే ఆ యెదిరించిన

వాళ్లు శ్రామిక జనాల్లోనుంచి పుట్టినటువంటి వాళ్లూ, మత పెద్దల అన్యతాన్ని సహజాతంగా పసికట్టిన వాళ్లూ అయివుండడమేనని మీకు సమ్మకం కలుగుతుందని శుభ్రంగా అనుకోవచ్చు. యజమానులు తప్పుడుగా అర్థం చేసుకోవడంవల్లనో లేదా బానిసం భయంవల్లనో తప్ప మరోలా యెన్నడూ అనుసరించని మతాన్ని వాళ్లు బానిసలకి బోధించారు. సువార్తల బోధలకి అనుకూలంగా గాక వ్యతిరేకంగా చర్చి పోరాడవలసి వచ్చిందని ''పెద్ద చారిత్రక దోషాలు'' అనే వ్యాసంలో మీ చరిత్రకారుడు వాన్ లూన్ అంటున్నాడు.

''జెరూసలమ్‌ని ధ్వంసం చెయ్యడంద్వారా టైటస్[204] ఘోరమైన తప్పు చేశాడు. యేమంటే యూదులు పాలస్తీనానుంచి వెళ్లగొట్టబడి ప్రపంచమంతటా చెదిరిపోయారు. వాళ్లు స్థాపించిన సంఘంలోనే క్రైస్తవమతం పెరిగింది, పండింది. మరి మార్క్స్, లెనిన్‌ల భావాలు పెట్టుబడిదారీ ప్రభుత్వాలకి యెంత ప్రాణాంతకమైనవో అంతకంటే క్రైస్తవ మతం రోమన్ సామ్రాజ్యానికి తక్కువ ప్రాణాంతకమైనది కాదు.''

వాస్తవానికి అది అలా వుండింది, ప్రస్తుతం అలా వుంది: క్రిష్టియన్ చర్చి సువార్తల సహజ కమ్యూనిజానికి వ్యతిరేకంగా పోరాడింది — యిదీ మొత్తం దాని ''చరిత్ర'' తాలూకు అసలూ సిసలూ విషయం.

చర్చి యీవాళ యేం చేస్తోంది? సరే అన్నిటికంటే యెక్కువగా ప్రార్థన చేస్తోందనుకోండి. యార్క్ ఆర్చిబిషప్పూ, కాంటర్‌బరీ ఆర్చిబిషప్పూ — సోవియట్ యూనియన్‌కి వ్యతిరేకంగా ''ధర్మ యుద్ధం'' లాంటి దాన్ని జరపమని బోధించిన మనిషి యీయన — యీ యిద్దరు ఆర్చిబిషప్పులూ కూడా ఒక కొత్త ప్రార్థనని తయారుచేశారు. అందులో యింగ్లీషు వంచన యింగ్లీషు చిత్త వృత్తితోటి సంపూర్ణంగా మిళితమైంది. ''మా తండ్రి'' అనే ప్రార్థన ఫక్కీలో సాగినటువంటి కొంచెం పెద్ద కూర్పు అది:

''విశ్వాసాన్నీ, శ్రేయస్సునీ పునఃస్థాపించడం కోసం మా ప్రభుత్వపు విధానానికి సంబంధించి భవదిచ్ఛ అమలు జరుగుగాక. ఇండియా భవిష్యత్ రాజ్యాంగం నిమిత్తం తీసుకుంటున్న వాటన్నిటికి సంబంధించీ భవదిచ్ఛ అమలు జరుగుగాక. రాబోయే నిరాయుధీకరణ సమావేశానికీ, భూమ్మీద శాంతిని స్థాపించడానికీ సంబంధించి తీసుకుంటున్న వాటి అన్నిటికీ సంబంధించి భగవదిచ్ఛ అమలు జరుగుగాక. వాణిజ్యం, విశ్వాసం, పరస్పర స్నేహ సంబంధం — వీటికి సంబంధించి యీ రోజు మాకు మా ప్రసాదాన్నియ్యి. సమష్టి శ్రేయస్సు కోసం అన్ని వర్గాల సహకారానికి సంబంధించి యీ రోజు మాకు మా ప్రసాదాన్నియ్యి. మేం జాతీయ గర్వ దోషదూషితులమై, యితరులకి మా శక్తి కొలదీ సహకరించడం కంటే వాళ్లని పరిపాలించడంలోనే మాకు అధిక తృప్తి కలిగినట్లయితే మమ్మల్ని మా పాపాలకి మన్నించు. మా వ్యవహారాలని

నిర్వహించుకోవడంలో మేం స్వార్థాన్ని కనబరచి, యితరుల ప్రయోజనాల కంటే మా ప్రయోజనాలనీ, మా వర్గ ప్రయోజనాలనీ పైన పెట్టుకుంటే మమ్మల్ని మా పాపాలకి మన్నించు.''

భయకంపితులైన దుకాణదార్లకి తగ్గట్టే వున్న ప్రార్థన! యీ ప్రార్థనా క్రమంలో వాళ్లు తమ ''పాపాల''కి ''మన్నించ''మని దేవుణ్ణి డజను సార్లేనా వేడు కుని వుంటారు. కాని తాము ఆ పాపాలని చెయ్యమనీ, చెయ్యకుండా వుండగలమనీ ఒక్క సారి కూడా అన్న పాపాన పోలేదు. ఇదిగో, ఒక్క సందర్భంలో మాత్రం వాళ్లు దేవుడి ''క్షమాపణ''ని అడుగుతున్నారు:

''మేము జాతీయ అహంకారానికి లొంగిపోయి, యితరులకి సేవ చెయ్యడంలో కాక, వాళ్లని పరిపాలించడంలో తృప్తి పొందుతున్నందుకు, ప్రభూ, మమ్మల్ని మన్నించు.''

మమ్మల్ని యీ పాపానికి క్షమించు, అంతే కాని, మేం పాపం చెయ్యకుండా మాత్రం వుండం — అదీ, వాళ్లు అనేది. క్షమాపణని అర్థించే యీ ప్రార్థనని అధిక భాగం ఇంగ్లీషు క్రైస్తవ పూజారులు తిరస్కరించారు; దీన్ని పఠించడం వాళ్లకి అసంబద్ధంగానూ, అవమానకరంగానూ కనిపించింది.

యీ ప్రార్థనని లండన్‌లోని సెయింట్ పాల్ కెథ్రెడల్‌లో జనవరి 2వ తారీ కున బ్రిటిష్ దేవుడి సింహాసనానికి ''నివేదించ''వలసి వుండింది. యీ ప్రార్థన తమ అభిరుచికి అనుగుణంగా లేదని భావించిన పూజార్లకి దాన్ని చదవనవసరం లేదని కాంటర్‌బరీ ఆర్చిబిషప్ప్ అనుమతి యిచ్చాడు.

అంచేత క్రిస్టియన్ చర్చికి యెంత నీచమైన, బడుద్దాయి హాస్యానికి జారిపోయే సమర్థత వుందో, యెంత నవ్వులాటలుగా పూజార్లు తమ దేవుణ్ణి ఒక సీనియరు దుకాణదారుడి స్థాయికి, యూరప్‌లోని కొమ్ములు తిరిగిన దుకాణదార్ల వాణిజ్య లావా దేవీల్లో భాగస్వామి స్థాయికి, దిగ జార్చారో చూడండి. కాని ఒక్క ఇంగ్లీషు పూజా ర్లని గురించే అనుకోవడం, ఇటాలియన్లు ''పవిత్ర భూతపు బాంక్'' స్థాపించారన్న దాన్ని మర్చిపోవడం అంత న్యాయం కాదు. యిక ఫ్రాన్స్‌లో, ముల్‌యేస్‌లో, ఫిబ్రవరి 15న, రష్యన్ వలసదార్ల పారిస్ వార్తాపత్రిక రాస్తోంది:

''ఆబ్బే ఎజీ నేతృత్వంలోని కాథలిక్ 'యూనియన్' పబ్లిషింగ్ హౌస్ నడిపేటు వంటి పుస్తకాల షాపు మేనేజర్నీ, సేల్స్‌మన్నీ అయిన వ్యక్తిని పోలీసు అధికారులు ఉత్తర్వుల ప్రకారం అరెస్టు చేశారు. యీ దుకాణం జర్మనీనుంచి దిగుమతీ చేసు కున్న అశ్లీల ఫోటోగ్రాపుల్నీ, పుస్తకాలనీ అమ్మింది. ఆ 'సరుకు'ని స్వాధీనం చేసు కున్నారు. కొన్ని పుస్తకాలు అశ్లీలంగా వుండడమే గాకుండా మతాన్ని నిందిస్తూ దూషి స్తున్నాయి కూడా.''

యిలాంటి వాస్తవాలని వందల కొద్దీ చూపించవచ్చు. అవన్నీ కూడా ఒక్క విష యాన్నే సూచిస్తాయి: అదేమంటే తన పోషక, యజమాని అయిన పెట్టుబడిదారీ విధానానికి సేవ చేసే చర్చిని పెట్టుబడిదారీ విధానాన్ని పట్టి పీడించే జబ్బులే పట్టి పీడిస్తున్నాయి అని. ఒకప్పుడు బూర్జువావర్గం ''చర్చికి గల నైతిక అధికారాన్ని గణించిన'' కాలం వుండింది అని అనుకున్నా, అది ''ఆధ్యాత్మిక రక్షక భటుడి'' అధికారం, శ్రామికజనాన్ని అణగదొక్కడానికి ఉపయోగపడే సంస్థల్లో ఒకటైన దాని అధికారం అని అంగీకరించాలి. చర్చి ''వూరట కలిగించింది'' అని మీరు అంటు న్నారు కదూ? దాన్ని నేను కాదనను. కాని యీ వూరట హేతుబుద్ధిని ఆర్పేసే పద్ధ తుల్లో ఒకటి.

కాదు, ధనవంతుల్ని ప్రేమించండి అని బీదవాళ్లకి బోధించడం, యజమానిని ప్రేమించండి అని పనివాడికి బోధించడం నా వృత్తి కాదు. నాకు వూరడించే శక్తి లేదు. సర్వప్రపంచం విద్వేష వాతావరణంతోటి పూరా నిండిపోయిందని నాకు బాగా తెలుసు, చాలా కాలంగా తెలుసు. అది యింకా దట్టమై యింకా క్రియాశీలమై, లాభదాయకంగా అవుతోందనీ నాకు అనిపిస్తోంది.

''కార్యాచరణశీలురు అవబోయే మానవతావాదులైన'' మీరు ప్రపంచంలో రెండు రకాల విద్వేషాలు వున్నాయని తెలుసుకోవాలి. ఒకటి, పరస్పర పోటీవల్ల కొల్లగొట్టేవాళ్ల మధ్య ఉద్భవించింది; అలాగే కొల్లగొట్టేవాళ్లకి వినాశనం తథ్యం అన్న భవిష్యత్తు పట్ల వాళ్ల భయంనుంచి ఉద్భవించిందీని. మరొకటి — శ్రామికవర్గపు విద్వేషం — వున్నదున్నట్టుగా జీవితం పట్ల ఆ వర్గపు యేవగింపునుంచి ఉద్భవించింది, అది పాలించడానికి గల తన హక్కు పట్ల చైతన్యంతో అధికాధికంగా దీప్తం అవుతోంది. యీ రెండు విద్వేషాలూ యెంత తీవ్ర స్థాయికి పెరిగాయంటే వాటిని యేదిగాని, యెవరుగాని రాజీ చెయ్య లేరు. వాటి భౌతిక నిర్వాహకులైనట్టి వర్గాల మధ్య తప్పనిసరిగా జరిగే యుద్ధం తప్ప, శ్రామికవర్గపు విజయం తప్ప ప్రపంచాన్ని విద్వేషంనుంచి విముక్తం చెయ్యలేదు.

''మీ దేశంలో శ్రామికుల నియంతృత్వం రైతులమీద బలప్రయుక్త పాలనకి దారి తీస్తుందని, చాలా మందిలాగే మేమూ అనుకుంటున్నాం'' అని మీరు రాస్తున్నారు. సాంఘిక దృగ్గోచర విషయాలని నిజాయితీగా అధ్యయనం చేసేటట్టు శాస్త్రీయ ఆలో చన అందుకున్న శిఖరం మార్క్స్, లెనిన్‌ల బోధనలు అనీ, యీ బోధనల శిఖరం నుంచి మాత్రమే సాంఘిక న్యాయానికీ నూతన సాంస్కృతిక రూపాలకీ దారి స్పష్టంగా గోచర మవుతుందనీ గుర్తించ నారంభించిన కొద్ది మంది — యింకా బహు తక్కువ సంఖ్యలో వున్న, మేధావుల మాదిరిగా ఆలోచించవలసిందని మీకు సూచించ దలచుకున్నాను. శ్రమించే ప్రజా సమూహాన్ని — కార్మికులనీ, రైతులనీ శారీరకంగా, ఆధ్యా

త్మికంగా పీడించడమనే బృహత్తర గాథే మొత్తం తన చరిత్రగా వున్నటువంటి వర్గం తోటి మీ బాంధవ్యాన్ని, కొంచెం సేపేనా గానీ, కాస్త ప్రయత్నం చేసి పరిచి పొండి. యీ ప్రయత్నం చెయ్యండి, మీకు మీ వర్గమే శత్రువని అర్థం అవు తుంది. కార్ల్ మార్క్స్ మహా మేధావే. అయితే ఆయన ఒక బృహస్పతి లాగానో, ఇంద్రుడి లాగానో యీ భూమ్మీద అవతరించాడని అనుకోవడం పొరపాటు. కాదు, ఆయన బోధలు, న్యూటన్, డార్విన్ల సిద్ధాంతాల మాదిరిగానే శాస్త్రీయ అనుభవం తోటి మేధ నిర్మించిన శీర్షక శిల. లెనిన్ మార్క్స్ కంటే సులభుడు, బోధకు డిగా అంతకంటే తక్కువ వాడు కాదు. మీరు సేవ చేసే వర్గాన్ని వాళ్లు మీకు చూపిస్తారు, మొదటగా దాని అధికార వైభవాలతోటి; తర్వాత అది రాక్షస బలప్రయోగ పద్ధతులద్వారా తనకి నప్పేటువంటి ''సంస్కృతి''ని, రక్తంద్వారా, వంచనద్వారా, అబద్ధాలద్వారా యెలా నిర్మించుకోడానికి కృషి చేసిందీ, నిర్మించుకున్నదీ వాళ్ళు మీకు చూపెడతారు. ఆ తర్వాత ఆ సంస్కృతీ పతన క్రమాన్ని వాళ్లు మీకు చూపెడ తారు. దాన్ని అనుసరించినటువంటి, ప్రస్తుత కాలపు నైతిక పతనాన్ని మీ అంతట మీరే చూడవచ్చు. యేమంటే సరిగ్గా యీ క్రమమే నాకు మీరు రాసిన ఉత్తరంలో ద్యోతకమైన భీతిని రెచ్చగొట్టింది.

''బలప్రయోగం'' గురించి మాట్లాడదాం. శ్రామికవర్గ నియంతృత్వం ఒక తాత్కా లిక విషయం. యిదివరలో ప్రకృతికీ, బూర్జువా ప్రభుత్వానికీ బానిసలుగా వున్న లక్ష లాది మందిని తమ దేశానికీ, దాని సకల సంపదకీ యేకైక యజమానులుగా అయేట్టు మార్చడానికి అది అవసరం. శ్రామిక జనులందరూ, రైతాంగం అంతా సమాన సాంఘికార్థిక పరిస్థితుల్లో జీవించేటప్పుడు, ప్రతి వ్యక్తీ తన శక్తి కొద్దీ పని చేసి తన అవసరాల కొద్దీ అందుకునే అవకాశం వచ్చినప్పుడు శ్రామికవర్గ నియం తృత్వపు అవసరం తీరిపోతుంది. ''బలప్రయోగం'' అనేది మీరూ యింకా ''చాలా మందీ'' అర్థంచేసుకున్నట్టుగా ఒక పొరపాటు అవగాహన. కాని యింకా తరుచుగా అది సోవియట్ యూనియన్ కార్మికవర్గానికి సంబంధించీ, దాని సోవియట్ కమ్యూనిస్టు పార్టీకి సంబంధించీ అబద్ధమూ, నిందాత్మక అపవాదూనూ. సోవియట్ యూనియన్‌లో జరుగుతున్న సాంఘిక క్రమానికి వర్తింపచేస్తున్నట్టుగా బలప్రయోగం అనేది, సోవియట్ యూనియన్ శ్రామికవర్గం చేస్తున్న సాంస్కృతిక కృషిని — తన దేశాన్ని పునరుజ్జీ వింపచేసి, నూతన ఆర్థిక రూపాలని నిర్మించుకునే కృషిని — అప్రతిష్ఠ పాల్జెయ్యడానికి సోవియట్ యూనియన్ శ్రామికవర్గపు శత్రువులు వాడుతూ వున్న పదం.

నా దృష్టిలో, బలప్రయోగానికి పూర్తిగా భిన్నమైన ఒత్తిడి గురించి మాట్లాడ్డం సబబు; యేమంటే, మీరు ఖాయంగా పిల్లలకి అక్షరాస్యుల్ని కమ్మని బోధి

స్తున్నప్పుడు వాళ్లమీద బలప్రయోగం చెయ్యరు కదా. సోవియట్ యూనియన్ కార్మికవర్గం, దాని పార్టీ రైతాంగానికి సాంఘిక రాజకీయ ఓనమాలు నేర్పడం జరుగుతుంది. అలాగే సరిగ్గా మీరు, మేధావులు, కూడా, ''రోట్లో తల పెట్టిన చందం''గా మీ పరిస్థితి విషాదభరితం అయిందని భావించేటట్టు యెవరో, యేదో ఒత్తిడి చేస్తున్నారు. మీకు కూడా యెవరో సాంఘిక రాజకీయ ఓనమాల తాలూకు అంశాలని బోధిస్తున్నారు – ఆ యెవరో, నేను కాదనుకోండి.

అన్ని దేశాల్లోనూ కూడా దోపిడీ గాళ్ళూ, పరాన్న భుక్కులూ పుట్టేటువంటి గడ్డగా రైతాంగం – లక్షలాది సన్నకారు యజమానుల సమూహం – వుంటుంది. యీ గడ్డ నుంచే పెట్టుబడిదారీ విధానం తన సకల రాక్షస వికారాలతోటీ పుడుతుంది. నికృష్ట ఆస్తికోసం పడే తపనలోనే రైతు సకల శక్తులూ, సామర్థ్యాలూ, ప్రతిభలూ పత నమైపోయి వుంటాయి. సన్నకారు యజమాని సాంస్కృతిక మౌఢ్యం నూటికి నూరు పాళ్లూ లక్షాధికారి సాంస్కృతిక మౌఢ్యంతో సమంగా వుంటుంది. యీ విషయాన్ని మేధావులైన మీరు బాగా అర్థం చేసుకోవాలి, అనుభూతం చేసుకోవాలి. అక్టోబరు విప్లవాత్పూర్వం రష్యాలో రైతులు 17వ శతాబ్దపు పరిస్థితిలో బతికేవాళ్లు. యిది రష్యన్ వలసదార్లు కూడా కాదనలేని వాస్తవం, సోవియట్ పాలన పట్ల వాళ్ల ఆగ్రహం పరిహాసాస్పదంగా, అకటావికటంగా వున్నప్పటికీ కూడా.

రైతులు అధమ స్థానంలో అర్థబానిస ప్రజలుగా వుండకూడదు; చతురమైన రైతుకి, భూస్వామికి, పెట్టుబడిదారుడికి బలికాకూడదు; అతి చిన్న, పీలికలైన కమతాల మీద, తన భూమికి యెరువులు వెయ్యలేక, దాని సాగుకి యంత్రాలని పనిలో పెట్టుకోలేక లేదా వ్యవసాయ శాస్త్రాన్ని అభివృద్ధి చేసుకోలేక వుండే నికృష్ట, నిర క్షర యజమానిని పోషించ నశక్తమైన వట్టిపోయిన క్షేత్రంమీద కఠిన శిక్షకి గురైన బానిస కాకూడదు. ఘోరమైన మాల్థస్[205] సిద్ధాంతం నిజమే సుమా అనిపించేటట్టు రైతులు వుండకూడదు. నా అభిప్రాయంలో ఆ సిద్ధాంతం వెనక పురోహిత వ్యవస్థ తాలూకు కిరాతకత్వం అంతా వుంది. సామూహికంగా రైతులు యింకా తమ పరి స్థితిలోని వాస్తవాన్నీ, అవమానాన్నీ అర్థం చేసుకోలేకుండా వున్నారంటే, తత్సంబంధమైన చైతన్యాన్ని వాళ్లకి యివ్వడం అనేది, ఒత్తిడిద్వారానేనా సరే, శ్రామికవర్గపు విధి. యేమైనా దీని అవసరం లేదు. యేమంటే, 1914–18 నాటి కబేళాల చిత్ర హింసలు అనుభవించిన సోవియట్ యూనియన్ రైతు, అక్టోబరు విప్లవంవల్ల జాగృత మైన సోవియట్ రైతు యిక యెంత మాత్రమూ అంధుడు కాడు, వాస్తవికంగా ఆలోచించ సమర్థుడవుతున్నాడు. అతనికి ఎరువులూ, యంత్రాలూ అందుతున్నాయి. అన్ని పాఠశాలల తలుపులూ అతని కోసం తెరుచుకున్నాయి. ప్రతి యేడూ వేలాది

రైతు బిడ్డలు ఇంజనీర్లుగా, అగ్రోనమిస్టులుగా, ఫిజీషియన్లుగా జీవిత పథంలో అడుగు పెడుతున్నారు. పార్టీ రూపంలో ప్రాతినిధ్యం వహిస్తున్న శ్రామికవర్గం సోవియట్ యూనియన్‌లో 16 కోట్ల శిరస్సులూ, 32 కోట్ల చేతులూ వున్న ఒకేఒక్క యజమానిని సృష్టిస్తోందని రైతు అర్థంచేసుకోనారంభిస్తున్నాడు — అతను అర్థంచేసుకోవాల్సిన ప్రధాన విషయమూ అదే. తన దేశంలో జరుగుతూ వున్న ప్రతీదీ కొద్దిమంది సంపన్నులకే కాదనీ, అందరి కోసమూననీ రైతు గమనిస్తున్నాడు. సోవియట్ యూనియన్‌లో జరిగేదంతా తనకి ఉపయోగకరమైందనీ దేశపు 26 వ్యావసాయిక పరిశోధనా సంస్థలూ తన నేల సారాన్ని పెంచడానికీ, తన శ్రమని తగ్గించడానికీ కృషి చేస్తున్నాయనీ రైతు చూస్తున్నాడు.

శతాబ్దాలుగా జరిగినట్టు రైతు మురికి పల్లెల్లో జీవించ నిచ్ఛగించడం లేదు. తన పిల్లలకి మంచి బళ్ళూ, క్రెషీలూ, తనకి థియేటర్లూ, క్లబ్బులూ, లైబ్రరీలూ, సినీమాలూ వున్న వ్యావసాయిక నగరాల్లో వుండడానికి యిష్టపడుతున్నాడు. రైతుకి ప్రవర్థమానమవుతూ వున్న జ్ఞానదాహమూ, సాంస్కృతిక జీవితం కోసం అభిరుచీ కలుగుతున్నాయి. దీన్నంతటినీ గనక రైతు అర్థం చేసుకుని వుండకపోయినట్లయితే, శ్రామికులా, రైతులా ఉమ్మడి శక్తులు సాధించిన అద్భుత ఫలితాలని సోవియట్ యూనియన్ యీ పదిహేనేళ్ళల్లోనూ సాధించలేకపోయివుండేది.

బూర్జువా దేశాలలో శ్రామిక ప్రజలు ఒక యాంత్రిక శక్తి. సమూహంమీద వాళ్ళ తమ శ్రమ సాంస్కృతిక ప్రాముఖ్యతకి సంబంధించి అజ్ఞానంలో వున్నారు. మీ దేశంలోని పెత్తందార్లు శ్రామిక ప్రజలమీద పడిబతికే పరాన్న భుక్కులు. వాళ్ళు జాతీయ శక్తుల్ని కొల్లగొట్టే వ్యవస్థలనీ, సంస్థలనీ పరిపాలిస్తున్నారు. తమలో తాము కొట్టుకుంటూ, ధనంతో వ్యవహరిస్తూ, ఒకొళ్ళనొకళ్ళు నాశనం చేసుకో ప్రయత్నిస్తూ, వాళ్ళు విషాదమైన స్టాక్-ఎక్స్ఛేంజీ మోసాలు చేస్తారు. యిప్పుడు, ఆఖరికి, వాళ్ల అరాచకత్వం దేశాన్ని నమ్మలేని సంక్షోభంలో పడేసింది. లక్షలాది శ్రామికులు ఆకలి చావులకి గురవుతున్నారు. జాతి ఆరోగ్యం నిష్ఫలంగా క్షీణిస్తోంది. శిశు మరణాలు దారుణంగా పెరిగిపోతున్నాయి. ఆత్మహత్యలు అధికం అవుతున్నాయి. సంస్కృతికి మూలకందం, దాని సజీవ మానవ శక్తి యిగిరిపోతోంది. యింతలా వున్నా కూడా, నిరుద్యోగుల తక్షణ సహాయార్థం 375 మిలియన్ల డాలర్లని కేటాయించాలన్న లాఫాలెట్ — కాస్టిగన్ బిల్లుని మీ సెనేట్ తోసేసింది. 1930లో అద్దె చెల్లించనందుకు గాను 1,53,731 మందినీ, 1931లో 1,98,738 మంది నిరుద్యోగుల్నీ వాళ్ల కుటుంబాలనీ న్యూయార్క్‌లో యిళ్లనుంచి వెళ్లగొట్టడం జరిగిందని

"న్యూయార్క్ అమెరికన్" ప్రచురించింది. యీ యేడు జనవరిలో న్యూయార్క్‌లో వందలాది నిరుద్యోగుల్ని యిళ్లనుంచి ప్రతిరోజూ వెళ్లగొట్టడం జరుగుతోంది.

సోవియట్ యూనియన్‌లో పరిపాలకులూ, శాసనకర్తలూ యెవరంటే శ్రామికులూ రైతాంగంలోని ఒక విభాగమూనూ. యీ విభాగం భూమిమీద సొంత స్వామ్యాన్ని రద్దు చేసి, భూముల సాగుకి సాంఘికీకరణా, యాంత్రీకరణా అవసరం అని అర్థం చేసుకున్న వాళ్లు. తాము కూడా ఫాక్టరీలలోనూ, మిల్లులలోనూ పనిచేసే వాళ్ల మాదిరిగా మానసికంగా మార్పుచెందాలని అర్థంచేసుకున్న వాళ్లు. వేరే మాటల్లో చెప్పాలంటే తాము దేశానికి నిజమైన, యేకైక అధినేతల మని గుర్తించిన వాళ్లు. రైతు కలెక్టివిస్టులా, కమ్యూనిస్టులా సంఖ్య నిత్యం పెరుగుతోంది. భూస్వామ్య దాస్య వ్యవస్థ వారసత్వంనుంచీ శతాబ్దాల బానిస అస్తిత్వ జనిత మౌఢ్యంనుంచీ నూతన తరం తనని తాను విముక్తం చేసుకున్నప్పుడు అది యింకా వేగంగా పెరుగుతుంది.

సోవియట్ యూనియన్‌లో చట్టాలు అడుగునుంచి తయారవుతాయి. అవి శ్రామిక జనసమూహంలో ఉత్పన్నం అవుతాయి. వాళ్ల ప్రాణభూత కార్యాచరణనుంచి ప్రవహిస్తాయి. శ్రామికులా, రైతులా శ్రమ క్రమంలో హెచ్చు తగ్గులు లేని సమాజాన్ని నిర్మించడమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకున్న శ్రమ — ఈ శ్రమక్రమంలో పరిణతి చెందినటువంటి చట్టాల్ని మాత్రమే సోవియట్ ప్రభుత్వమూ, పార్టీ శాసనబద్ధం చేస్తాయి. తను నిర్వహణ కేంద్రంగా, శ్రామిక జనుల నాడీ కేంద్ర వ్యవస్థగా వున్నంత మేరకే పార్టీ నియంత. ప్రతి వ్యక్తి ప్రతిభా విశేషాలూ, మొత్తం జనాభా అంతానూ అభివృద్ధిచెందడానికి స్వేచ్ఛనీ అవకాశాన్నీ యివ్వగలందుకు గాను సాధ్యమైనంత విస్తృతిలో శారీరక శక్తిని మేధా శక్తిగా యెంత వేగంగా వీలైతే అంత వేగంగా మార్చడమే పార్టీ ధ్యేయం.

వ్యష్టివాదానికి బద్ధమైన బూర్జువా ప్రభుత్వం తన ప్రయోజనాలా, సంప్రదాయాలా ధోరణిలోనే తన యువతకి పట్టుదలగా బోధిస్తుంది. అది సహజమే నను కోండి. కాని సరిగ్గా బూర్జువా సమాజపు యువకుల్లోనే తరచుగా అరాచక భావాలూ, సిద్ధాంతాలూ పుట్టి వుండడం, పుడుతూ వుండడం మనకి గోచరిస్తుంది. అది అసహజమూ, ప్రజలు ఉక్కిరిబిక్కిరి అయిపోయి తత్ఫలితంగా వ్యక్తికి అపరిమిత స్వేచ్ఛని సాధించడం కోసం సమాజాన్ని సమూలం నాశనం చెయ్యాలని కలగన ప్రారంభించేటు వంటి అసాధారణ, అనారోగ్య వాతావరణ స్థితికి సూచకమూనూ. మీ యువజనం దీన్ని గురించి కలగనడమే కాదు, తదనుగుణంగా చరిస్తారు కూడానూ, మీకు తెలుసునో లేదో. యూరప్ పత్రికల్లో మీ యువతా, యూరప్‌లోని బూర్జువా యువతా చేసేటటువంటి "కొంటె చేష్టలు" — నేర సంబంధమైన చేష్టలు — గురించి తరచుగా

వార్తలు రావడం చూస్తూ వుంటాం. యేదో పాదార్థిక లేమివల్ల వచ్చినవి కాదు యీ నేరాలు. అవి ''జీవితంలోని విసుగు'' వల్ల, ఉబలాటంవల్ల, ''థ్రిల్స్'' పట్ల కామనవల్ల, ఉత్పన్నమైనవి. యీ నేరాలన్నిటికీ మూలం వ్యక్తిని గురించీ, అతని జీవితాన్ని గురించీ వున్న హీనమైన అభిప్రాయం. శ్రామికులూ, రైతులూ అత్యంత ప్రతిభావంతులైన సంతానాన్ని తనలో యిముడ్చుకుని, తన ప్రయోజనాలకి సేవ చేసేటట్టు వాళ్ళని నిర్బంధించి, బూర్జువావర్గం ''ఒక మేరకి వ్యక్తిగత వికసన''—ఒక సుఖప్రదమైన గుహ, వెచ్చని గూడు—సాధించేందుకు వ్యక్తికి ''స్వేచ్ఛ'' వుందని డబ్బాలు కొడుతుంది. మీ సమాజంలో వ్యక్తి స్వలాభంతో ''అభివృద్ధికి'' పోయే మార్గంలో, బూర్జువా జీవిత పరిస్థితులు దారిలో పెడుతూ వున్న ఆటంకాలని అధిగమించలేక నాశనం అయిపోతూ వున్న ప్రతిభావంతులు వేలాది మంది వున్నారు. యీ విషయాన్ని మీరు కాదనలేరు. నిరర్థకమైన అంతం పొందిన ప్రతిభావంతులని గురించిన వర్ణనలతోటే పూర్తిగా యూరప్, అమెరికన్ సాహిత్యాలు నిండిపోయాయి. బూర్జువా వర్గం చరిత్ర దాని ఆధ్యాత్మిక దారిద్ర్యపు చరిత్ర. అది మన కాలంలో యే ప్రతిభా విశేషాలని గురించి గర్వించగలదు? నానా రకాల హిట్లర్ల గురించీ, పిచ్చిగా ఆత్మస్తుతి చేసుకునే మరుగుజ్జుల గురించీ తప్ప గర్వించడానికి దానికి యేమీ లేదు.

సోవియట్ యూనియన్ ప్రజలు పునరుజ్జీవన యుగంలో ప్రవేశిస్తున్నారు. ప్రతిభావంతులైన వేలాదిమందిని ప్రాణభూతమైన కార్యాచరణకి అక్టోబరు విప్లవం జాగృతం చేసింది. కాని శ్రామికవర్గం తాను సాధించ దలపెట్టిన లక్ష్యాన్ని అందుకోడానికి వాళ్ళు యింకా చాలా తక్కువ సంఖ్యలో వున్నట్టే. సోవియట్ యూనియన్‌లో నిరుద్యోగులు లేరు. ప్రతి చోటా, మానవ ప్రయత్నపు సకల రంగాలలోనూ లభ్యమవుతున్న శక్తులు యింకా చాలినన్ని లేవు, అవి యింతకు ముందు యెక్కడా యెన్నడూ లేనంత వేగంతో పెరుగుతూ వున్నాగానీ.

శ్రామికవర్గం రాజకీయాధికారాన్ని ఒక సారి హస్తగతం చేసుకుంటే, అది సృజనాత్మక సాంస్కృతిక కృషికి విస్తృత అవకాశాలని మీకు అందిస్తుందని ''సంస్కృతీ నిష్ణాతులైన'' మేధావులుగా మీరు గుర్తించడం మంచిది.

బూర్జువావర్గం సంస్కృతికి ప్రతికూలం; ప్రతికూలంగా తప్ప మరోకలా యిక వుండలేదు. బూర్జువా వాస్తవంవల్లా, పెట్టుబడిదారీ రాజ్యాల మొత్తం ఆచరణవల్లా రుజువైన సత్యం యిది. సామాన్య నిరాయుధీకరణకి సోవియట్ యూనియన్ పెట్టిన ప్రణాళికని బూర్జువావర్గం నిరాకరించింది. పెట్టుబడిదారులు సాంఘికంగా ప్రమాదకారులనీ, వాళ్ళు మరో ప్రపంచ యుద్ధం కోసం ఆయత్తమవుతున్నారనీ చెప్పడానికి

యిది ఒక్కటే చాలు. వాళ్ళు సోవియట్ యూనియన్‌ని రక్షణోద్రిక్త పరిస్థితిలో వుంచు తున్నారు. పెట్టుబడిదారులకి వ్యతిరేకంగా రక్షించుకోడానికి తమ విలువైన కాలాన్ని, పారిశ్రామిక వనరులని ఆయుధోత్పత్తికి వ్యయం చేసేట్టు శ్రామికవర్గాన్ని ఒత్తిడి చేస్తున్నారు. యీ బ్రహ్మాండమైన దేశాన్ని తమ వలస కింద, తమ విపణి కింద మార్చుకోవడం కోసం సోవియట్ యూనియన్‌మీద దాడికి సన్నద్ధం అవుతున్నారు. సోవియట్ యూనియన్ ప్రజలు పెట్టుబడిదారులకి వ్యతిరేకంగా ఆత్మరక్షణ కోసం యెంతో శక్తినీ, వనరుల్నీ ఖర్చుపెడుతున్నారు. వాటిని మానవాళి సాంస్కృతిక పునరుజ్జీవన కోసం కాదనలేని ప్రయోజనసంగా వ్యయం చెయ్యవచ్చు, యేమంటే సోవియట్ యూనియన్ నిర్మాణక్రమం మానవాళి అంతటికీ ముఖ్యమైంది.

భవిష్యత్తు పట్ల భయంతో నిండిపోయి, విద్వేషం వల్ల పిచ్చి పట్టిపోయిన బూర్జువావర్గ వాతావరణం తాము దేన్ని గురించి కేకలు వేస్తున్నారో దాని ప్రాముఖ్యం గురించి యీషణ్మాత్రం కూడా అంచనావేని మూఢుల సంఖ్యని యెక్కువ చేస్తోంది. వాళ్లల్లో ఒకడు "యూరప్‌లోని పాలకులకీ, దౌత్యనీతిజ్ఞులకీ" యీలాంటి విజ్ఞాపనలని చేస్తున్నాడు: "మూడవ ఇంటర్నేషనల్‌ని[206] నాశనం చెయ్యడానికి పసుప్పచ్చ జాతిని వాడే సమయం వచ్చింది యూరప్‌కి." యీ మూఢుడు తనలాంటి "దౌత్య నీతిజ్ఞులా పరిపాలకులా" కలలనీ, ఉద్దేశాలనీ వెల్లడి చేస్తూ కూడా వుండి వుండచ్చు. యీ మూఢుడు బహిరంగంగా అరిచిన దాన్ని గురించి సీరియస్‌గానే ఆలోచించే "పెద్ద మనుషులూ" వుండే అవకాశం లేకపోలేదు. యూరప్‌నీ, అమెరికానీ బాధ్యత లేని "పెద్దమనుషులు" పాలిస్తున్నారు. ఇండియా, చైనా, ఇండో—చైనాలలోని ఘటనలు యూరపియన్ల పట్లా, మామూలుగా "శ్వేతజాతుల" పట్లా జాతి విద్వేషం పెరగడానికి తోడ్పడవచ్చు. యిది మూడవ విద్వేషం అవుతుంది. మరి మీరు, మానవతావాదులు, యిది మీకు గాని మీ పిల్లలకి గాని అవసరం అవుతుందేమో ఆలోచిస్తే మంచిది. "పరిశుద్ధ జాతిని" గురించి—అదిగో, అది మళ్లీ జాతి విద్వేషం—జర్మనీలో బోధించడంవల్ల యేమిటి మీకు ఒరిగే మేలు? యిదిగో మచ్చుకి:

'రాబోయే గ్యోతే శతవర్ధంతికి గెర్హార్డ్ హౌప్ట్‌మాన్[207], థామస్ మాన్[208], వాల్టర్ ఫాన్ మోలో, సార్బోన్‌కి చెందిన ప్రొ. ఆన్రీ లిఖ్‌తెన్‌బెర్‌జేలు వైమర్ పట్టణానికి రావడానికి వ్యతిరేకంగా నిరసన తెలియచెయ్యమని వైమర్ పట్టణపు నేషనల్-సోషలిస్టు గ్రూపుని ట్యూరింగియాలోని నాజీ నాయకుడు సౌకెల్ ఆదేశించాడు. వాళ్ళు ఆర్యేతరులని సౌకెల్ ఆరోపించాడు.

అలాగే యీ సాదా సమస్యని పరిష్కరించడానికి మీకు అదును యిదే: "సంస్కృతీ నిష్ణాతులారా" మీరు యెవరి పక్షం? సంస్కృతీ నిర్మాతల పక్షానా, నూతన జీవిత రూపాల సృష్టికీ వుంటారా మీరు? లేదా, వాళ్లకి వ్యతిరేకంగా, ఆపాదమస్తకం కుళ్లిపోయి, జడత్వంలోనుంచే పనిచేస్తూ వున్న బాధ్యతారహితులైన దోపిడీగాళ్ల సజ్జు వర్ధిల్లడానికి అటు వేపు వుంటారా?

# నాటకాల సమీక్ష

సులభమ్మైన భావాలని ఆపోశన పట్టడం కష్టం. ఉదాహరణకి వంద యేళ్ల క్రితం గ్యోతే అన్నాడు: ''అస్తిత్వానికి ఆరంభం కార్యాచరణ''209 అని.

యీ భావం చాలా సులభమ్మైంది, సర్వజనీనమ్మైందీనీ. దీని పిండితార్థమూ అంతే సులభమే: ప్రకృతిని జ్ఞేయం చేసుకోవడం, సామాజిక పరిస్థితుల్ని మార్చడం కార్యాచరణద్వారానే సాధ్యం. దీన్నుంచి ముందుకు అడుగు వేస్తూ కార్ల్ మార్క్స్ అన్నాడు: ''తత్వవేత్తలు ఇంతవరకూ ప్రపంచాన్ని అనేక విధాలుగా వ్యాఖ్యానించారు, కాని అసలు విషయం దాన్ని మార్చడం.''210

సులభమ్మైన భావాలని వక్రంగా అర్థం చేసుకోవడమూ జరిగింది. యేమంటే వర్గ సామాజిక వైరుధ్యాల అవమానం, భీతి, విరుద్ధతలని మరుగు పరచడం కోసం జీవిత పాలకులకి అవసరం అయిన ఆకర్షక, కుటిల యుక్తి అనే పొగమంచులోనే మానవాళి అనేక శతాబ్దాలుగా బతికింది. యీ వైరుధ్యాలు యివాళ యెంత అసహ్యాకరమ్మైన స్థాయికి చేరాయంటే వాటిని యే రకమ్మైన శుష్కవేదాంతంతో గాని, వంచనాత్మక అనృతాలతో గాని దాచిపెట్టడం అసాధ్యం. కాని తాత్వీకరించే పాత కాలపు అలవాటు ఒకటి యింకా వుంది, జీవితపు హైన్యాలకి తమ బాధ్యత లేదని భావించే మనుషుల మనసుల్ని గట్టిగా పట్టుకొని వుంది. సాదా అయింది యీ మనుషుల మనసులకి రసాయనికంగా పొసగనిదేమో అనిపిస్తుంది.

నీతి కథలు చెప్పే ఇవాన్ ఖెమ్‌నిత్సెర్211 తన నీతి కథ ''వేదాంతి''లో వేదాంతుల వృత్తి గతంలో యేమిటీ, యిప్పుడు యేమిటీ అన్నదాన్ని గురించి సూక్ష్మంగా, సులభావబోధంగా మనకి చెప్పాడు. ఆ కథ సారాంశం యిది. ''సకల ఆరంభాలకీ ఆరంభమ్మైంది యేమిటి'' అనేదాన్ని గురించి యేకాగ్రతతోటి ఆలోచిస్తూ ఒక యువకుడు సంచరించాట్ట. యింతట్లో వున్నట్టుండి ఒక బిలంలో జారిపడిపోయాట్ట. అక్కణ్ణుంచి తనకిగా తను యివతలికి రాలేకపోయాట్ట. అతని కందేటట్టు యెవరో ఒక తాటిని

విసిరారుట. అతను వెంటనే ''రజ్జువు అంటే యేమిటి?'' అని అడిగాట్ట. తాడు అని జవాబు చెప్తే ''తనకిగా తను ఒక వస్తువు'' అన్నాట్ట. వేదాంతం మాట్లా డ్డానికి అది కాలం కాదు, తను ముందు బయటపడాలని అతనికి చెప్పారట. అతను ''కాలం అంటే యేమిటి?'' అని మళ్లీ అడిగాట్ట. దాంతోటి అతని ఖర్మకి అతన్ని వదిలేశార్ట. యీ విశ్వపు ఉనికి అవసరమా, అయితే యెందుకు అని తర్కిస్తూ అత నింకా ఆ బిలంలోనే వున్నాడుట.

జడవాదులు ఒక భావాన్ని ఆచరణనుంచి విడదీసి, దాన్ని శుద్ధ శాబ్దిక, తార్కిక నిర్మాణం అనే ఊషర క్షేత్రంలోకి బదలాయించేస్తారు, కాలం అనేదాన్ని చల నానికి ఛషకంలా, అంటే కార్యాచరణకి తగ్గ దాని లాగానే గ్రహించాల్సి వుండగా.

ప్రపంచాధికారం కోసం ప్రయత్నించే శ్రామికవర్గం యిప్పుడు ఒక నూతన సమా జానికి, ప్రపంచం పట్ల పరమ నూతన దృక్పథానికి త్రాత అవుతోంది. అది కాలాన్ని తన కృషితో నింపేసి, సర్వ ప్రపంచాన్నీ తన క్షేత్రంగా గ్రహిస్తుంది.

శ్రామికవర్గాన్ని ఒక చారిత్రక రూపంలో, ప్రపంచ మానవుడిగా, అత్యంత బలోపేతమై సర్వాన్నీ జయించేటువంటి శక్తికీ ఆధారభూతమైన దానిగా, ''విశ్వా మిత్ర సృష్టి'' చేసేదిగా — అంటే పాదార్థిక ''ఆధ్యాత్మిక'' సంస్కృతికి సృష్టి కర్తగా వర్ణించే హక్కు శాబ్దిక కళాకారుడికి వుంది.

శ్రమ ఆలోచనకి ప్రేరకం. ఆలోచన శ్రమానుభవాన్ని మాటలలోకి మారుస్తుంది; భావాలలోకి, పరికల్పనలలోకి, సూత్రాలలోకి, లౌకిక వ్యావహారిక సత్యంలోకి పిండుతుంది.

ఒక చర్యని మాటల్లోకి మార్చడం కంటే ఒక మాటని చర్యల్లోకి మార్చడం చాలా కష్టమని ప్రతివాళ్లకీ తెలుసు.

ఒక రచయిత శ్రమించేటప్పుడు చర్యని మాటగానూ, మాటని చర్యగానూ యేక కాలంలో మారుస్తున్నాడు. మాట అనేదే రచయిత శ్రమించే ప్రధాన సాధనం.

జానపద యుక్తి ఒక మాటకి వుండే అర్థాన్ని సరిగ్గా, కచ్చితంగా పొడుపు కథ రూపంలో నిర్ణయిస్తుంది: ''ఏమిటది? తేనె కాదు, కాని ప్రతిదాన్నీ అంటుకుని వుంటుంది?''

ప్రపంచంలో పేరు లేనిది, మాటలో పొదగనిది, యేదీ లేదు. యిదంతా కూడా ప్రాకృతికంగా సులభం. కాని ఒక మాటకి వుండే అర్థాన్ని యువ నాటక రచయితలు తగినంతగా కరతలామలకం చేసుకోలేదని నాకు అనిపిస్తుంది.

యీ కింద నేను చెపుతున్నదంతా నేను ఒక నాటక రచయితగా చెప్ప డంలేదనీ, మామూలు రచయితగా, నాటక ప్రేక్షకుడిగా చెపుతున్నాననీ హెచ్చరించడం

అవసరం అని నాకు అనిపిస్తుంది. ఒకటి రెండు నాటకాలు రాసిన యువ రచయిత తనో ''సిద్ధహస్తుణ్ణి''ని భావించుకుని, ''యావన్మంది ప్రజానీకానికీ'' తన సృజనాత్మక పద్ధతుల గురించి చెపుతూ వార్తాపత్రికలకి వ్యాసాలు రాయడమూ, నివేదికలు యివ్వడమూ, ఒకో అప్పుడు ''నాటక సిద్ధాంతం'' అనే లాంటి దాన్ని దేన్నో సృష్టించడమూ కూడా, దురదృష్టవశాత్తూ మనలో సామాన్యం అయిపోయింది. తర్వాత సరిగా అవగాహన చేసుకోబోయే కారణాలవల్ల, చెడ్డ ఉదాహరణని అనుసరించడం నా హక్కుని భావిస్తున్నాను. నేను ఒకటి కాదు, రెండు కాదు, నాలుగు కాదు యిరవై చెడ్డ నాటకాలు రాశాను. పాత రచయితగా యువ రచయితలకి నా అనుభవాన్ని అందివ్వాలి.

నాటకం — ట్రాజెడీలు, కామెడీలు — మహా కష్టమైన సాహిత్య ప్రక్రియ. అది కష్టం యెందుకని అంటే, నాటకంలో నటించే ప్రతి వ్యక్తి మాటలచేతా, నటనచేతా విశిష్టం అవాలి తప్ప రచయిత సహాయంవల్ల కాదు. ఒక నవలలోనో, కథలోనో రచయిత వర్ణించిన మనుషులు అతని సహాయంతో ప్రవర్తిస్తున్నారు, అతను యెప్పుడూ వాళ్ల దగ్గర వున్నాడు. మనుషుల్ని యెలా పాఠకుడు అర్థం చేసుకోవాలో రచయిత సహాయం చేస్తూ వుంటాడు, వాళ్ల రహస్యపుటూహాలని వివరిస్తాడు. పాత్రల చర్యలనీ, ఉద్దేశాలనీ వివరిస్తాడు; ప్రకృతి పరిసరాల, రంగస్థం వర్ణన చేసి వాళ్ల మానసిక స్థితిని వర్ణశోభితం చేస్తాడు. తన లక్ష్యానికి తగ్గట్టుగా పాత్రలని వాస్తవానికి రచయిత యథేచ్ఛగా పాఠకుడికి తరచు గమనంలోకి రాకుండా వుండేట్టు, దారాలతో పట్టుకుంటాడు. అచితూచినట్టు, కాని నిరంకుశంగా వాళ్ల చర్యలని, మాటలని, సంబంధాలని, ప్రతి విధంగానూ తన పాత్రలు మరింత కళాత్మకంగా స్పష్టంగా, హత్తుకునేటట్టు వుండేలా పాలిస్తాడు.

రచయితకి యథేచ్ఛగా జోక్యం చేసుకోవడానికి నాటకం వీలు యివ్వదు. ప్రేక్షకులకి అతని సహాయం అందదు. ఒక నాటకంలోని పాత్రలని విశిష్టంగా, వాళ్ల మాటలద్వారా, అంటే వర్ణనాత్మక భాషద్వారా కాక శుద్ధ మౌఖిక భాషద్వారానే, సృష్టించడం జరుగుతుంది. యీ విషయాన్ని అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం యేమంటే నటుల దశలో ప్రదర్శితమైన నాటకపు పాత్రలు కళాత్మక విలువనీ, సామాజిక ఆమోదాన్నీ సంతరించుకోవాలని మనం అనుకుంటే, ప్రతి పాత్ర భాషా విశేషంగా, అత్యంత వ్యక్తీకరంగా వుండడం అవసరం. యీ షరతుమీదనే ప్రతి ప్రేక్షకుడూ కూడా నాటకంలోని ప్రతి పాత్రా రచయిత చాటినట్టూ, నటుడు ప్రదర్శించినట్టూ మాత్రమే మాట్లాడగలదనీ, నటించగలదనీ అర్థం చేసుకుంటాడు. మన ప్రతిభాసమన్విత కామెడీల పాత్రలని ఉదాహరణకి తీసుకుందాం: ఫాముసావ్, స్కలొజూబ్, మొల్చాలిన్, రెపెతిలొవ్[212], ఖ్లెస్తకోవ్, పట్టణపు గవర్నరు[213] మొదలైనవాళ్లు — ప్రతి

పాత్రనీ కొన్ని మాటలతో సృష్టించడం జరిగింది. కాని ప్రతి పాత్రా కూడా తన వర్గపూ, తన యుగపూ కచ్చితమైన భావాన్ని పరిపూర్ణంగా అందిస్తుంది. యీ పాత్రల సంభాషణా పడికట్లు — ప్రతి పలుకుబడిలోనూ యెంతో కచ్చితంగా యేదో అసందిగ్ధమైందీ, నమూనా ప్రాయం అయిందీ వ్యక్తం అయిన దాని పుణ్యమా అని — నిత్య జీవితంలో ప్రవేశించాయి.

నాటకానికి సంభాషణా ప్రాముఖ్యం యెంత మహత్తరమైందీ, తూకమైందీ, మౌఖిక భాషని అధ్యయనం చెయ్యాల్సిన అవసరం, జరూరు కర్తవ్యం మన యువ రచయితలకి యెంత వున్నదీ స్పష్టపడ్డాయని అనుకుంటాను.

మన తరుణ నాటక ప్రక్రియలో సామాన్యంగా, దురదృష్టకరంగా వున్న లోటు, మొట్టమొదటగా రచయిత భాషలో వున్న లోపం; దాని నిస్తేజత్వం, జీవరాహిత్యం, వ్యక్తిత్వం లేకపోవడం. నాటకాలలోని పాత్రలన్నీ ఒకే పదబంధాలని వాడతాయి. ఉధృతమైన వాస్తవంతోటి యే మాత్రం పొసగకుండా, మన దేశం జీవంతో తొణికిసలాడేటటువంటీ, మన సాహిత్యంలో ప్రతిబింబించకుండా వుండలేనటువంటి సృజనాత్మక శక్తులు చాలుతో పొసగకుండా వుండేటువంటీ అరిగిపోయిన వైవిధ్యరహిత నీరస పదాలతో, పాత్రలూ కనిపిస్తాయి. నికృష్టమైన అపాయకరమైన లేదా నిజాయితీపూర్వకమైన, సాంఘికంగా ఔపయోగికమైన పథం రంగస్థలంమీద వెలవెల బోయేటువంటి, అజాగ్రత్తగా సంధించినటువంటి మాటల నీరసపు గోలగా మారిపోతోంది.

యూరప్‌లోని పెట్టుబడిదారుల పగబట్టి వున్న వాతావరణంలో మనం జీవిస్తున్నాం. మనం కూడా పగబట్టడం నేర్చుకుని తీరాలి. రంగస్థల కళ మనకి ఆ విషయంలో సాయం చెయ్యాలి. దిగాలుపడ్డ సంస్కారహీనవర్గం మన చుట్టూతా, మన మధ్యలో బుసకొడుతోంది. రంగస్థలం ప్రేక్షకుల ముందు సంస్కారహీనుడి దుష్ట స్వభావాన్ని బట్టబయలు చేస్తూ వాడి పట్ల యేవగింపుని కలిగించాలి. మనం గర్వించదగ్గది యెంతో వుంది, సంతోషించతగ్గది యెంతో వుంది. కాని అది అంతా తగినంత బలంగా, కళాత్మకంగా ప్రతిబింబించడం లేదు. కళకి గల ప్రధాన గమ్యం యదార్థం కంటే ఉన్నతంగా వుండడం. నూతన మానవాళికి జనకుడైన శ్రామికవర్గం మన ముందు వుంచిన సౌందర్య పూరిత లక్ష్యాల శిఖరంనుంచి నిత్య జీవితపథాన్ని చూడడం. కాగా, మన తరుణ నాటక ప్రక్రియ వీరోచిత వాస్తవానికి దిగువనే వుంది. మనం తొలగించుకోవాల్సిన లోట్లనీ, మనం సృష్టించి తీరాల్సిన మంచినీ మరింత గాఢంగా స్పష్టంగా అర్థం చేసుకోవడానికి అవసరం అయినంత మేరకి వర్ణన కచ్చితంగా చెయ్యడంలో మనకి ప్రయోజనం వుంది. వీరోచితమైన కృత్యానికి వీరోచితమైన మాట అవసరం.

కళ ''తనకి తానే ఒక లక్ష్యం'' అయ్యేట్లుగా యెప్పుడూ గతంలో లేదనీ, వుండలేదనీ ప్రస్తుత కాలంలో బాగా తేట తెల్లమైంది. యేమంటే తన పాత కక్షిదారుడూ, దాతా దారుడూ అయిన బూర్జువావర్గపు వార్థక్యంతో బాటుగా కళ విషాదభరితంగా తన శక్తిని పోగొట్టుకొంది, కళ శ్రామికవర్గపు సాంస్కృతిక విప్లవాత్మక పెరుగుదలతోబాటుగా వేగంగా పెరుగుతోంది. బూర్జువా సమాజంలో కళ, మతం లాగానే, కొన్ని వర్గ లక్ష్యాలకి సేవ చేసింది. మతంలో మాదిరిగానే కళలో కూడా ''మత భ్రష్టులు'' వున్నారు. వాళ్లు వర్గ హింసా బానిసత్వంనుంచి బయటపడ్డానికి నిరర్థకంగా ప్రయత్నించారు. సంస్కార హీనత్వపు ''అచల సత్యం''లో గుడ్డి అవమానకరమైన నమ్మకం వాళ్లకు వుంది. ఒక చారిత్రక మానవుడి అనంత సృజనాత్మక శక్తిలోనూ, పాత దాన్ని ధ్వంసంచేసి, కొత్త దాన్ని సృష్టించేటువంటి అతని అసందిగ్ధమైన హక్కులోనూ అపనమ్మకపు రోషణాత్మక హెచ్చరికతో వుండే ఈ నమ్మకానికి మూల్యం చెల్లించారు.

అలాంటి అపనమ్మకానికి కారణం జ్ఞేయానికి సంబంధించి ఆవేశం లేకపోవడమూ, పరిజ్ఞానం కొరవడ్డమూ అని నాకు అనిపిస్తుంది. కాని జ్ఞేయానికి అందులో నమ్మకం అవసరం అని నేను నొక్కి చెప్పను. జ్ఞేయం అనేది ఒక నిరంతర అధ్యయనా క్రమం, పరిశోధన; నమ్మకం అయిన మరుక్షణం అది ఆగిపోతుంది.

యీ దేశంలో జ్ఞేయానికి సంబంధించి ఆవేశం యింకా యింకా తీవ్రంగా మండుతోంది, అది ముఖ్యంగా విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లో బ్రహ్మాండంగా, ఉత్పాదకంగా వుంది. తమ పరిణతత్వంతోటీ, తమకి గల విజ్ఞాన దాహంతోటీ, తమ విజయాల నిండుదనంతోటీ, తమ ఉద్దేశాల సాహసంతోటీ మన యువ శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లు మనల్ని చకితులై పోయేటట్లు చేస్తున్నారు. యువ రచయితలు జ్ఞాన ప్రాముఖ్యాన్ని స్పష్టంగానే తక్కువ అంచనా వేస్తున్నారు. వాళ్లు ''ఇన్‌స్పిరేషన్''మీద మరీ ఆశలు పెట్టుకున్నారల్లే వుంది. కాని ''ఇన్‌స్పిరేషన్''ని శ్రమకి ప్రేరకంగా తప్పుగా పరిగణిస్తున్నారని నాకు అనిపిస్తోంది. ఒక విజయవంతమైన కృషిలో, దాని పర్యవసానంగా అది రావచ్చు, ఒక సంతోషానుభూతిలాగా రావచ్చు. యువ రచయితలు తరచుగా, మరీ సమంజసంగా కాకుండా, ఘనమైనటువంటి, కాని అంత కచ్చితంగాని చర్చి పదం, ''సృష్టి'' అనే మాటని వాడతారు. నవలల్ని, నాటకాలని మొదలైన వాటిని కూర్చడం అనేది చాలా కష్టమైనటువంటి, ప్రయాసభరితమైనటువంటి, నేర్పయిన కృషి. దానికి యెంతో జీవిత దృగ్విషయ పరిశీలనా, వాస్తవాల సేకరణా, భాషాధ్యయనమూ పూర్వరంగంగా వుండాలి.

ఎక్కువమంది మన నాటకరచయితల ''సృజనాత్మక కృషి'', నిరంకుశ ''వాస్తవాల'' దగ్గర తేలుతుంది, యివి ''యిదివరకే పరిశీలించిన ఉద్దేశపూ,'' పై పైన గ్రహించిన ''వర్గ మూస''

తాలూకూ, అలాగే అస్తవ్యస్తంగా పరిశీలించిన ''ఉద్దేశపూ'' పరిమితుల్లో యాంత్రికమైన, తరచుగా హేతుబద్ధంగాని తరహాపి. అలా అస్తవ్యస్తంగా పరిశీలించిన ఉద్దేశం వాస్తవాలని ఛిన్నం చేస్తుంది, వాటి అర్థాన్ని వివరించడంలో విఫలం అవుతుంది. దీనికి ''వర్గ సూత్రం'' ప్రకారం మనుషులని శీల పరీక్ష చేసేటువంటి ముతక రసహీనత జత అవుతుంది. ''వర్గ సూత్రం'' ''మనస్తత్వాన్ని'' ప్రధానంగా, నిర్ణాయకంగా వ్యవస్థీకరిస్తుందనేదీ, యెప్పుడూ కూడా భిన్న పరిమాణ తేజంతో మనుషుల మాటలనీ, చేష్టలనీ శోభాయమానం చేస్తుందనేదీ నిర్వివాదం. పెట్టుబడిదారీ విధానపు దుర్భర, భంగకర పరిస్థితుల్లో మనిషి చీమలపుట్టలో వుండాల్సిన వినయపూరిత చీమలా వుండాలి. కుటుంబం, బడి, చర్చి, యజమానులు వరసగా పెట్టే ఒత్తిడివల్ల అతను యీ స్థితికి లొంగిపోతాడు. ఆత్మరక్షణాభావం అనేది చట్టానికీ, నిత్య జీవితానికీ అతను విధేయుడై వుండేట్టు చేస్తుంది. యిదంతా నిజమే. కాని చీమలపుట్టలోపల పోటీ యెంత తీవ్రంగా వుంటుందంటే, బూర్జువా సమాజంలో సాంఘిక గందరగోళం యెంత స్పష్టంగా పెరుగుతోందంటే, ఒక మనిషిని పెట్టుబడిదారుడికి అణిగిమణిగి వుండేట్టు చేసే అదే ఆత్మరక్షణ భావం, యిప్పుడు తన ''వర్గ చిహ్నం''తో విషాద ఘర్షణకి గురయేట్టు చేస్తుంది.

ప్రస్తుతకాలంలో యూరపియన్ మేధావి వర్గం లోపల అలాంటి ''ఘర్షణలు'' సామాన్యం అయిపోయాయి. అవి సాంఘిక గందరగోళపు పెరుగుదలతో బాటుగా విధిగా సంఖ్యలో పెరుగుతాయి, మరి సహజంగానే అవి గందరగోళాన్ని పెంచుతాయి. ''వర్గ చిహ్నపు'' నశింపు, లేదా బలహీనపడిపోవడం కూడా, గాఢమైన సైద్ధాంతిక పునరుజ్జీవనపు ఉనికి చూపిస్తున్నది అలాంటి వాస్తవాలలో అన్నీ వాస్తవాలు కాదని వేరే చెప్పక్కర్లేదు. వుహుఁ, తరచుగా యీ వివరణ తేలికగా వుంటుంది: పాత యజమాని ఉడిగిపోయాడు, శిథిలం అయిపోయాడు — సేవకులు నూతన యజమాని కోసం చూస్తున్నారు, ఆయనతో కలిసి పనిచెయ్యాలనే ఉద్దేశంతోనే కాదు, వూరికే ఆయన సద్గుణాలతో తాము పరిచయం కలిగించుకోవాలనే. దీనికి తోడుగా, కొన్ని జంతువులకి ''అనుకరించే'' సామర్థ్యం వుందని — పరిసరాల్ని అనుకరించే సామర్థ్యం, ఆత్మరక్షణ కోసం, ఆత్మ అస్తిత్వం కోసం దాంతో మిళితమైనటువంటిది — మర్చిపోకండి. సామాన్యంగా యీ మేళన గాఢంగా వుండదు, అపాయం దాటిపోయీ పోగానే అది అదృశ్యం అయిపోతుంది.

అలాంటి అనుకరణకి ప్రామాణికమైన ఉదాహరణ 1904–1908లలో రష్యన్ ''విప్లవ'' మేధావుల ప్రవర్తన. కొన్ని వర్గ సంస్కారహీన గుణాలు విస్తారంగా వ్యాప్తి చెందాయనీ, మానవాళి అంతటికీ సామాన్యమైనవిగా యెత్తబడ్డాయనీ, ఆఖరికి శ్రామి

కులకి కూడా యీ గుణాలు వుంటాయనీ, అభిప్రాయాలు ఒకటీ, గుణాలు వేరొకటీ అనీ తెలుసుకోవడం గుర్తుంచుకోవడం అవసరం.

చారిత్రక మానవుడు — అసలోటి స్నేహంగా కంటే యెక్కువ విద్వేషంతో వుండే ప్రకృతిమీద అత్యంత వైభవోపేత ఉపరినిర్మాణం అయినటువంటి, అతని శక్తిలోని అధిక భాగాన్ని నింపుకుని వున్నటువంటి, మనం సంస్కృతి అని పిలిచేటువంటి ప్రతిదాన్నీ అయిదు, ఆరు వేల సంవత్సరాల కాలంలో సృష్టించిన యీ మనిషి — కళాత్మక ప్రతి మగా అత్యద్భుతమైన ప్రాణి! కాని ఒక సమకాలీన రచయిత గాని, నాటకకర్త గాని యుగాలుగా వర్గపోరాట పరిస్థితుల్లో పెరిగి, పశువులకు సమమైన వ్యష్టి తత్వం కంఠదఘ్నంగా సోకి, వాస్తవానికి పరమ నానావర్ణ, సంక్లిష్ట, వైరుధ్య పూరిత మూర్తి అయిన నిత్యజీవిత మానవుణ్ణి తీసుకుంటున్నారు. అందుకనే అతన్ని మనం విముక్తి చెయ్యాలనుకుంటే — మరి మనం అనుకుంటున్నాం — మనం యీనాటి రోజువారీ మనిషిని సరళంగా ప్రదర్శించకూడదు. కాని మనం అతన్ని తనకి వున్న అంతర్గత సంక్లిష్టతతోనూ, భిన్నత్వంతోనూ, హృదయానికీ మేధకీ మధ్యన వుండే సకల వైరుధ్యాలతోనూ దర్శింపచెయ్యాలి. ప్రదర్శిస్తూ వున్న ప్రతి మనిషిలోనూ, సామాన్యంగా వుండే వర్గ లక్షణాలతోబాటుగా, అతనికి విశిష్టంగా వుండేటువంటీ ఆఖరులో అతని సాంఘిక ప్రవర్తనని నిర్ణయించేటువంటీ వైయక్తిక కీలకాంశాన్ని మనం చూడాలి.

''వర్గ చిహ్నా''న్ని ఓ మనిషి ముఖంమీద బయటనుంచి అతికించకూడదు. మనకి వున్న అలవాటు అదీ. ఒక వర్గ చిహ్నం అనేది మొటిమకాదు. నరాలకీ, మెదడుకీ జీవశాస్త్రపరమైన దానికీ దేనికో అంతర్గతమైంది అది. కళాత్మకంగా హత్తుకునే మూర్తులతోటి, ప్రేక్షకుడ్ని గాఢంగా కదిలించివేసి, మార్చగలిగేటువంటి ''కళాత్మక సత్యాన్ని'' సాధించడం కోసం ఒక నాటకాన్ని కూర్చడమే సీరియస్ రచయిత కర్తవ్యం. ఉదాహరణకి విన్‌స్టన్ చర్చిల్[214]ని తీసుకుందాం. తన వర్గ చిహ్నం తన కన్సర్వేటిజం రూపంలో, సోవియట్ యూనియన్ శ్రామికజనం పట్ల తనకి గల పాశవిక వైషమ్యం రూపంలో అచ్చంగా వెల్లడి అయే మనిషిగా ఆయన చక్కని నమూనా అవుతాడు. కాని యే నాటక రచయితయేనా ఆయన్ని యీ కోణంనుంచి మాత్రమే, ద్వేషించే మనిషిగా మాత్రమే, చూసినట్లయితే, అప్పుడు అసలైన చర్చిల్ పాత్ర కాదు, ఆ రకంగా సజీవ చర్చిల్ కాదు.

మనుషులు భిన్నంగా వుంటారని మనకి తెలుసు: యీ మనిషి వాగుడుకాయ, ఆ మనిషి ముక్తసరిగా వుంటాడు. యీ మనిషి నచ్చుగాడు, స్వార్థపూరితుడు, ఆ మనిషికి బెరుకూ బిడియమూనూ. పేరాశగాళ్లు, నీచులు, ఉత్సాహవంతులు దురాశాపరులు, స్వాప్నికులు, ఉల్లాసవంతులు, ముడుచుకుని వుండేవాళ్లు, కష్టించి పనిచేసేవాళ్లు, సోమరి

పోతులు, దయార్ద్రహృదయులు, చీదరించుకునేవాళ్లు, ఉదాసీనులు వుండేటువంటి వలయంలో రచయిత జీవిస్తున్నట్టుంటాడు. కాని యీ గుణాల్లో యే ఒక్కటీ కూడా ఎప్పుడూ ఒక వ్యక్తి పాత్రని నిర్ణయించదు. అది తరచుగా కొట్టవచ్చినట్టు కనిపించడం యెందుకుంటే వేరు గుణం దాన్ని తక్కువ నేర్పుతో, దాచివుండడంవల్లనే; ఈ వేరు గుణం మొదటి గుణానికి అనురూపంగా వుంది, కాని దానితోటి సరిపోవడం లేదు. ఆ కారణంగా ఒక మనిషి ద్విముఖ స్వభావాన్ని, వంచనని ఈ వేరు గుణం మరీ వెల్లడిగా బయటపడెయ్యగలదు.

యీ వ్యక్తిదో ఆ వ్యక్తిదో పాత్రని రూపొందించడానికి, ఆ వ్యక్తి స్వభావంలో ప్రధాన, నిర్ణాయక గుణంగా చెయ్యడానికి, యీ గుణాల్లో దేన్నేనాగాని గాఢం చేసేందుకూ, విస్తృతం చేసేందుకూ, దాన్ని నిశితం చేసేందుకూ, దానికి కాంతి నిచ్చేందుకు తీసుకునే హక్కు నాటక రచయితకి వుంది. పాత్ర నిర్మాణానికి సంబంధించిన యెవళ్ల కృషేనా యింతే అవుతుంది. భాషద్వారానే, అతి కచ్చితమైన, బింకమైన మాటలని యెంచుకోవడంద్వారా మాత్రమే, మహత్తర యూరపియన్ రచయితలు చేసినట్టుగా, దీన్ని యెవళ్లేనా సాధించగలరు. బోధించడానికి నమూనా ప్రాయంగా వుండేందుకు గ్రిబొయేదొవ్ రాసిన ఆహ్లాదకరమైన, పరిపూర్ణమైన కామెడీని చూద్దాం. అతి పొదుపుగా మాటలని వాడుతూ, అతి తక్కువ పదబంధాలని ప్రయోగిస్తూ రచయిత ఫాముసొవ్, స్కలొజూబ్, మొల్చాలిన్, రెపెతీలొవ్ లాంటి పాత్రలని సృష్టించాడు. అయినా కూడా, ఆ పాత్రలు, ఆ యుగాన్ని చారిత్రకంగా కచ్చితంగా ప్రతిబింబిస్తాయి. ఆ పాత్రల్లో ప్రతి ఒక్క దానికీ తన వర్గ, "వృత్తిపర" చిహ్నాలు వున్నాయి. అవన్నీ కూడా తమ యుగ పరిధిని దాటిపోయి, యిప్పటి దాకా వున్నాయి. అంటే అవి యెంత మాత్రమూ యిక ఆ పాత్రలు కావు; షేక్స్పియర్ ఫాల్స్టాఫ్[215]లాగా, మొల్యేర్ మిసాంత్రోప్[216]లాగా, టార్టూఫ్లాగా యింకా తదితరమైన అలాంటి వాటిలాగా నమూనాలు అయ్యాయి. ఒక రచయిత తన నాటకంలోని పాత్రని, ఆ పాత్ర ప్రతి పదబంధమూ, చర్యా పరమ స్పష్టంగా వుండేటట్టూ, యెవళ్లేనా గానీ ఆ పాత్రని అది సజీవమైన దానిలా, అసహ్యించుకోవడమో, చీదరించుకోవడమో ప్రేమించడమో చేయగలిగేటట్టూ తయారుచెయ్యాలి. అలాంటి నైపుణ్యాన్ని సాధించడానికి యెవళ్లేనాగానీ చదవడం, అధ్యయనం చెయ్యడం, పుస్తకాలని చదివినట్టుగానే మనుషుల్ని చదవడం నేర్చుకోవాలి. మనుషులని గురించి రాసిన పుస్తకాలని అధ్యయనం చెయ్యడంకంటే మనుషుల్ని అధ్యయనం చెయ్యడం చాలా కష్టమని గుర్తించాలి. ఇనుముతో చేసిన వస్తువు ముడి యినుముకంటే యెక్కువ అర్థం అవుతున్నట్టు మనకి తప్పుగా అనిపిస్తుంది.

మనుషులు చాలా సంక్లిష్టంగా వుంటారు. యిదే వాళ్లని అందంగా వుండే

టట్టు చేస్తుందని దురదృష్టవశాత్తూ మనలో చాలామంది అనుకుంటాం. కాని సంక్లిష్టత అనేది భిన్నత్వం. అది ఖాయంగా ఆయా పరిస్థితులకి, "అనుకరణ" నిమిత్తం, మార్చుకోవడానికి చాలా సౌకర్యంగా వుంటుంది.

సంస్కారహీన సమాజపు దైనందిన పరిస్థితులవల్ల, జీవితంలో లాభదాయక, ప్రశాంత స్థానం కోసం జరిపే తీవ్ర పోరాటాలవల్ల విపరీతంగా "ఆత్మ" ఛిన్నం అయినదాని నివారకర అసహ్యకర ఫలితం సంక్లిష్టత అనేది. లక్షలాది, కోట్లాది ప్రజల్లో అంత తక్కువ మంది ప్రఖ్యాతులు వుండటం, విశిష్టమైన స్వభావాలు గల మనుషులు వుండటం ఒకే కాంక్షతో నిండిపోయిన వాళ్ళు — గొప్పవాళ్ళు — వుండటం అనే వాస్తవాన్ని పూరికే యీ "సంక్లిష్టత"ని బట్టి వివరించవచ్చు. లక్షలాది శ్రామికప్రజల్ని ఇంగ్లీషు టోరీల లాంటి సినిక్‌లుగాని, అమెరికన్ పత్రికలే మట్టుమీ మర్యాదా లేకుండా "మందబుద్ధి మనిషి" అని పిలిచిన నాజీ అనుకూల అధ్యక్షుడు హూవర్ లాంటి వాళ్ళుగాని, లేదా హిట్లరూ తదితర పగాకోర్లుగాని, ఆత్మహత్య చేసుకు చచ్చిన "కింగ్ ఆఫ్ మాచెస్" క్రిగర్ లాంటి వాళ్ళుగాని పరిపాలించడం మనం చూస్తున్నాం. చివరగా, అలాంటి "వీరుల"కి, పరస్పరం రాజీ లేకుండా వైషమ్యంతో వుండే అంతర్జాతీయ పెట్టుబడిదారుల చిన్న గ్రూపు, ముబ్బు కమ్మిన వ్యంగ్య చిత్ర రూపుల గ్రూపు, వత్తాసు వుంది.

జరగవలసింది యేదో పెట్టుబడిదారీ ప్రపంచంలో జరిగింది: ప్రాకృతిక శక్తుల్నీ, ప్రకృతి సంపదలనీ సంస్కృతినీ శ్రామికుల శక్తిద్వారా చేజిక్కించుకోవడంతోబాటు వర్గ దేశపు సాంఘిక పరిస్థితుల్లో ప్రజలు యింకా శక్తిహీనంగా, నిర్భాగ్యులైన బానిసలుగా తయారవుతున్నారు. అలాంటి బానిసత్వాన్ని నిర్వహించేవాళ్ళు — పెట్టుబడిదారులు — కూడా దీన్ని గుర్తించ నారంభించారు. వెనక్కి పోవాలంటే, భయకంపితులై పోయే దశకి వాళ్ళు చేరారు; వాళ్ళ అనుభూతులకీ ఆలోచనలకీ ఊడిగం చేసే వాళ్ళు అరుస్తున్నారు: విజ్ఞానశాస్త్రం వున్నది చాలు, సాంకేతిక పరిజ్ఞానపు పెరుగుదలకి స్వస్తి చెప్పండి.

ఆర్థిక సంక్షోభాన్నీ, నిరుద్యోగాన్నీ అధిగమించడానికి యంత్రాలనుంచి శారీరక శ్రమకి మళ్లడం ఒక్కటే వీలు కల్పిస్తుందని వాళ్లల్లో కొంతమంది ప్రచారం చేస్తున్నారు. కాని దీని నరసనే వాళ్లంతా సాయుధులవుతున్నారు. లాయిడ్ జార్జ్[217] యిటీవల ప్రకటించాడు: "ప్రపంచం ఒక నూతన యుద్ధ ప్రాంగణంలో వుంది" అని. ప్రజల సామూహిక విధ్వంసన నిర్వహించకుండా వాళ్లు బతకలేరు. వాళ్లు శ్రామిక జన సమూహాలని హతమార్చే కసాయివాళ్లు. సోవియట్ యూనియన్ ప్రజలమైన మనం, ప్రపంచ దోపిడీ గాళ్లా, హంతకులా గుంపు ఉనికిని ఆటంక పరుస్తున్నామనీ, మనలో ఒక

భాగాన్ని వాళ్ళు నాశనం చెయ్యడానికీ, మరొక భాగాన్ని బానిసలని చెయ్యడానికీ ఆతృతగా వున్నారనీ తెలిసిన విషయమే.

శ్రామికవర్గం కష్టమైనటువంటి, కాని అందమైనటువంటి, లక్ష్యాన్ని పెట్టుకున్న దేశంలో మనం వుంటున్నాం: బాల్యంనుంచీ ప్రజల్ని వక్రీకరించే అన్ని పరిస్థితుల్నీ తుడిచెయ్యడం. అసూయని, దురాశని, శత్రుత్వాన్ని కలిగించే సకల కారణాలూ అదృశ్యం అయినప్పుడే సాధ్యమయే నిజమైన స్వేచ్ఛ కోసం మనం పోరాడుతున్నాం. యీ కారణాలని నిర్మూలించగలమనీ, నిర్మూలిస్తామనీ మనకి నమ్మకం వుంది. సోవియట్ యూనియన్ సోషలిస్టుల కార్యకలాపాలన్నీ వాటి ప్రధాన అర్థంలో మానవుడికి వ్యతిరేకంగా పోరాటానికి కాదు. కాని పతనమయేటువంటి, మానసికంగా అనారోగ్యంగా వున్నటువంటి బూర్జువావర్గం పోషింపచేసినటువంటి, పోషింప చేస్తూ వున్నటువంటి, సకల దుష్ట లక్షణాలనీ, ఆచారాలనీ, దురభిప్రాయాలనీ తొలగించి మానవుణ్ణి విముక్తం చేసే పోరాటం కోసం వుంటాయి. తేజోవంతమైన వ్యక్తుల స్వేచ్ఛాయుత అభివృద్ధికి పరిస్థితుల్ని సిద్ధం చెయ్యడం కోసం, సకల రంగాలలోనూ సర్వప్రజలకీ సృజనాత్మక సంపూర్తి స్వేచ్ఛని పరిరక్షించడానికిగాను మనం సంస్కారహీనుల జంతుధర్మ భావవాదానికి వ్యతిరేకంగా పోరాడతాం.

మానవుణ్ణి మార్చవచ్చనీ, యుగయుగాల హింసాత్మక ధూళినుంచీ, మురికినుంచీ విముక్తి చెయ్యవచ్చనీ నమ్మని మనుషులు వున్నారు. వాళ్ళు నమ్మరు, కారణం తామే యెంతలా దుమ్ము కొట్టుకుపోయారంటే వాళ్ళు తెలుసుకోనశక్తులు, జీవితాన్ని అధ్యయనం చెయ్యలేని అశక్తులు. దాని కలుషిత లజ్జాకరమైన అసహ్యాన్ని చూడ్డానికీ, యీ అసహ్యాన్ని నిర్వహించేటటువంటి వాళ్ళకి వ్యతిరేకంగా ఆగ్రహంతో సాయుధులు కావడానికీ అశక్తులు. వీళ్ళు బద్ధకమైన, ఉదాసీనమైన మెదడు వున్న మనుషులు. వాళ్ళు కోరుకునేదంతా కడుపులో చల్ల కదలకుండా బతకడం. వాళ్ళల్లో కొంతమంది మృత్యువుని గురించిన ప్రాక్తన చింతనతో జీవితంనుంచి దాంకుంటారు. ఉదాహరణకి ''మృత్యువు జీవితపు అత్యంత ప్రముఖమైన క్షణం'' అనీ, ''జీవితపు ఉత్తరార్ధంలోని మామూలు మనస్తత్వం యేమిటంటే మృత్యువు కోసం సంసిద్ధం చేసే మనస్తత్వం'' అనీ చాటతారు. యిది నిజమే కావచ్చు, యేమంటే చర్చిలో వున్న మనస్తత్వం సంస్కారహీనుల, వృద్ధ, మరణోన్ముఖ సమాజపు మనస్తత్వం. మనకి మృత్యువుని గురించి తలపోసే వ్యవధిలేదు. మనం జీవితాన్ని చేతులతో పట్టుకున్నాం, మనం జీవితాన్ని పునర్నిర్మిస్తున్నాం — యిచ్ఛా, సంకల్పాల సర్వశక్తుల నిరంతర వీరోచిత శ్రమనీ అపేక్షించే పరమ కష్టభూయిష్టమైన కర్తవ్యం యిది.

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమూఖ్యలో ఒక నూతన తరహా మానవాళి ఆవిర్భవిస్తోంది.

ఒక కొత్త భవనాన్ని కట్టేటప్పుడు యెవడూ కూడా దాన్ని నాశనం చేసే భూకంపం గురించి ఆలోచించడు. విశ్వాంతర సంక్షోభాల గురించిన నిష్ఫల, పరిహాసాస్పద చింతనలోనూ, ఒక మిలియన్ సంవత్సరాలలో సూర్యుడు అదృశ్యం అయిపోయే అవకాశం గురించిన చింతనలోనూ జీవితాన్నుంచి దాంకోవాలనే కోరిక మనకి లేదు. స్వయంబోధన అనే కఠోర పాఠశాలలో మనం వున్నాం. మన శ్రమ క్రమాలు, ఫలితాలు మనకి ఆలోచించడాన్ని నేర్పుతున్నాయి. శ్రమద్వారా మనం ప్రపంచపు మాయలని తెలుసుకుంటున్నాం. మనం నిజంగా జీవితాన్ని మారుస్తున్నాం. కొన్ని విషయాలలో మనం సక్రమంగా లేమనుకోండి; కాని యెల్లవేళలా సక్రమంగా వుండేది మృతులే, యేమంటే వాళ్లు ఆచరించలేరు కనక.

మనలో కొంతమంది జీవచ్ఛవాలు వున్నారు. వాళ్లు తాగుతారు, తింటారు, వీధుల్లో నడుస్తారు, గాలి పీలుస్తారు. కాని చుట్టూతా వున్న ప్రతీదీ శిథిలత్వపు తీవ్ర దుర్గంధంతో విషపూరితమైపోయింది. కాని వాళ్లు త్వరలోనే అదృశ్యం అయిపోతారు. తాము దేంతో నిర్మితమయ్యారో ఆ విలువైన పాంచ భౌతిక పదార్థాన్ని, తమ చుట్టూతా వున్న వాళ్లకీ, తమకీ కూడా అపాయకరంగా వాడేటువంటి దాన్ని, వాళ్లు ప్రకృతికి తిరిగి అప్పగించేస్తారు.

పైన అనుకున్న దాంట్లో చాలా భాగాన్ని మనకి తెలిసిన దాన్ని దేన్నో గుర్తు చెయ్యడం కోసం మాత్రమే అయితే చెప్పకోనక్కర్లేదు: అనిదంపూర్వకంగా, సర్వగ్రాహకంగా గాఢమైన, సంఘటనాభరితమైన యుగంలో మనం వున్నాం. విధ్వంసన, సృష్టి అనే శ్రమభూయిష్ట ఘటనాభరిత క్రమపు యుగంలో వున్నాం. కాని కార్యాచరణలో వున్న వాళ్లకే యిది అర్థం అవుతుంది. కాని మనం యింకా సోమరితనపు సాదా తత్వంతో ప్రలోభితమైన మనుషులు సుమారుగా వున్న చోట జీవించి పనిచేస్తున్నాం: తమ సోమరితనాన్ని కార్యాచరణ దోషాల విమర్శవల్ల సమర్థించుకునేందుకు మాత్రమే యోచిస్తూ, పరిశీలిస్తూ తమ అమాయకత్వంతో కదిలి పోయేటువంటి ప్రేక్షకుల మధ్య జీవించి పనిచేస్తున్నాం. వాళ్లు అమాయకులు యెందుకంటే వాళ్లు, భద్రంగా బాధ్యతారహితంగా యెవళ్లనో కాళ్లు అడ్డం పెట్టి పడవేసే దాకా, యెవళ్ల దారిలోనో రాతిని అడ్డం పెట్టే దాకా యెవళ్లనీ కదిలించరు.

ప్రస్తుత కాలంలో మనిషి అల్లకల్లోలంగా, ఉరవడిగా వుండే వాస్తవపు అనేక ప్రభావాలకి లొంగివున్నాడు. అతను వ్యష్టి తత్వానికీ, సోషలిస్టు తత్వానికీ మధ్యన ఆంతరంగిక పోరాటం అనుభవిస్తున్నాడు. అది రాజీలేని వైరుధ్యాల మధ్య పోరాటం.

మన కళ వాస్తవాన్ని అధిగమించాలి, ఒక మనిషిని వాస్తవాన్నుంచి తిప్పకుండా దానికంటే పైకి యెత్తాలి. యిది రొమాంటిసిజాన్ని ప్రచారం చేస్తున్నట్టుంది, కదూ? ఉవును, అలాగే వుంది. సాంఘిక వీరత్వాన్నీ, యీ దేశంలో ప్రదర్శితమవుతున్నట్టి రూపాల్లో నూతన జీవిత పరిస్థితుల్లో సృజన తాలూకు సాంస్కృతిక విప్లవాత్మక ఉత్సాహాన్ని రొమాంటిసిజం అని పిలవగలిగితే. కాని సహజంగా, యీ రొమాంటిసిజాన్ని షిల్లర్, హ్యూగోల రొమాంటిసిజంతోటీ, సింబలిస్టులతోటీ కంగాపుంగం చెయ్యకూడదు.

పైగా, మన నాటక రచయితలు అదృష్టవంతులు. యేమంటే వాళ్లు ''లాక్ష ణిక'' ''సంప్రదాయాం''కి బద్ధులై రాయనవసరం లేదు. రష్యన్ నాటక ప్రక్రియకి ఆ పదాలకిగల అసలైన అర్థం ద్యోతకం చేసే భావాలేమీ లేవు. యూరప్‌లో వున్న లాంటి నాటక రూపం రష్యాలో లేనట్టే నాకు అనిపిస్తుంది. మన ప్రతిభా సమన్వితమైన కామెడీలు ''తెలివితేటలు కడగండ్లకు దారితీస్తున్నాయి,'' ''ఇన్‌స్పెక్టర్ జనరల్'', ''చదువు ఫలితం''219 యే రకంగానూ మొల్యేర్, బొమార్షె220 కామెడీలకి తీసిపోవు. కాని మనకి షేక్‌స్పియర్‌గాని, కాల్డెరోన్‌గాని, లోపె దె వేగాగాని, షిల్లర్ గాని, క్లైస్ట్221గాని, హ్యూగోగాని లేరు. మనకి స్క్రైబ్, ఒజ్యే, పత్యెరోన్, సర్దూ యింకా తదితరమైన అల్లిక బిగి, కల్పనా చాతుర్యం వున్న నాటక కర్తలూ లేరు. మన నాటకం పశ్చిమ దేశాల నాటకం అందుకున్న స్థాయిని, ముఖ్యంగా స్పెయిన్, ఇంగ్లండ్‌లలో, మధ్యయుగాల నాటికే అందుకున్న స్థాయిని, అందుకోలేదన్నది అంగీకరిం చిన విషయమూ, స్పష్టమైన విషయమూనూ. పశ్చిమ దేశాల నాటక ప్రక్రియ ''జాన పద కళ'' ఆధారంగా అభివృద్ధి చెందిందనే విషయం దీన్ని వివరిస్తుంది. క్రిస్టఫర్ మార్లోకి యెన్నడో ముందుగానే, గ్యోతేకి రెండు వందల యేళ్లు ముందుగానే, ఇంగ్లీషు, జర్మన్ చేతి నిపుణులైన పనివాళ్లు తమ వృత్తి పండగల్లో ''డాక్టర్ ఫౌస్ట్ కామెడీ'' అనే ఔత్సాహిక నాటకాన్ని ప్రదర్శించారు. పదహారవ శతాబ్దంలో జీవించి, మరణించిన హాన్స్ సాక్స్ అనే న్యూరెంబర్గ్ చర్మకారుడు రాసిన పద్యాలని గ్యోతే తన ''ఫౌస్ట్'' నాటక రచనలో వాడుకున్నాడు.

యూరపియన్ నాటకకర్తలు జానపద సాహిత్యాన్ని, అంటే శ్రామికజనుల మౌఖిక కవిత్వాన్ని వాడుకోవడాన్ని చీదరించుకునే వాళ్లు కారు. వాళ్లు ట్రుబాదూర్ల,222 మీస్టర్ సింగర్ల223 పాటలని వాడుకున్నారు. పదిహేడవ శతాబ్దపు తొలి నాటిదాకా మనకీ మన ఔత్సాహిక నటులు వుండేవాళ్లు — బఫూన్లు, మన సొంత మీస్టర్‌సింగర్లు. వాళ్లు దేశమంతటా కూడా 'గొప్ప కల్లోలం'' గురించీ, ఇవాన్ బొలోత్నికొవ్224 గురించీ, స్తెపాన్ రాజిన్225 యుద్ధం గురించీ, విజయాల గురించీ మరణం గురించీ బఫూనరీ లని పాటలనీ ప్రచారంచేశారు.

కాని మొదటి రొమానొవ్వూ,[226] ముఖ్యంగా అతని కొడుకు అలెక్సేయ్[227] సింహాసనం అధిష్టించినప్పుడు చర్చీ, బోయర్లూ బఫూన్లనీ, సంచార పాటగాళ్లనీ మట్టుపెట్టెయ్యడం జరిగింది. ఆ బఫూన్ పాటల్ని జ్ఞాపకం పెట్టుకుని పాడినటువంటి భూస్వామ్యదాసుల్ని నిర్దాక్షిణ్యంగా కొరడా దెబ్బలు కొట్టి హింసించారు. జానపద కవిత్వం పట్ల ప్రభుత్వానికి వున్న ఆ దృక్పథం చాలా కాలం, దృఢంగా భయంకర రష్యన్ వాస్తవికతలో ప్రవేశించింది. 1830లలో కూడా నీజ్ని నొవ్‌గొరొడ్‌లో "బోనపార్ట్‌ని గురించి హాస్యకరమైన పాటలు పాడినందుకు ఒక గ్రామ కమ్మరి సెమ్యోన్ నెచేస అనే అతన్ని కొరడా దెబ్బలు కొట్టడం జరిగింది.

రష్యన్ ప్రభువంశ రచయితలు నాటకీయ వస్తువుతో యెంతో సంపద్వంతమైన జానపద సాహిత్యం పట్ల దృష్టి పెట్టలేదు సర్వజ్ఞుడైన అలెగ్జాండర్ పూష్కిన్ తప్ప. వాళ్లు యే చారిత్రక వస్తువునీ స్పృశించారని కాదు. వాళ్ల పూర్వులు చరిత్రని చెడ్డగా తయారుచెయ్యడంవల్ల కావచ్చు. "ప్రభుత్వపు సప్త బోయర్ల"[228] వీరుల్లో ఒకడైన రాకుమారుడు త్రుబెత్‌స్కోయ్ ప్రవర్తన గురించి చెప్పే నాటకం గాని, నవల గాని 19వ శతాబ్దంలో త్రుబెత్‌స్కోయ్ రాకుమారులలో ఒకడు రాయ సాహించేవాడని వూహించడం అసంభవం.

నాటకంలో ప్రధానంగా అవసరమైనవి సామయికత, బిగిగల కథానిర్మాణం, ఉద్విగ్నభరిత నటన. ఉత్తమ భాషాభిరుచి గలవాడూ, రష్యన్ జీవితాన్ని — అందులోనూ ముఖ్యంగా మాస్కో వర్తకుల నిత్యజీవితాన్ని — ప్రతిభావంతంగా చిత్రించిన కళాకారుడూ అయిన ఒస్త్రోవ్‌స్కీని రష్యన్ నాటకపు జనకుడు అంటారు. ఆయన నాటకాలలో యెప్పుడూ కథా నిర్మాణం బిగిగా వుంటుంది. ఆ విషయాన్ని ఖాయంగా అనుకోవడానికి ఆ నాటకాల పేర్లు గుర్తుచేసుకుంటే చాలు: "పరాయి బండిలో యెక్కద్దు", "మీరు యిష్టపడ్డట్టు బతకద్దు", "సత్యం దేవుడే, కాని అదృష్టం మేలు," "ఆలు మగల కొట్లాట: అనవసర జోక్యం కూడదు", "ఏగాణీ లేదు గాని హఠాత్తుగా అందలం", "అందరికీ జోస్యం చెప్పే బల్లి కుడితిలో బడ్డట్టు", లాంటివి. అవన్నీ కూడా నిత్య జీవితపు కామెడీలే. కొట్టవచ్చినట్టు కనిపించే వెక్కసమైన, పానమత్తమైన అనాగరికుల తిరోగమనతత్వాన్ని, క్షుద్ర నిరంకుశత్వాన్ని, అజ్ఞానాన్ని వెల్లడి చెయ్యడానికి రాసినవే. కాని కామెడీకి వ్యంగ్యం, అధిక్షేపం కావాలి. మరి ఒస్త్రోవ్‌స్కీ హాస్య చతురుడు మాత్రమే.

ఆయన నాటకాలు నిస్సందేహంగా ప్రతిభా సమన్వితమైనవే. కాని వాటి నిండా పూర్ణత్వమైన శక్తి పెద్దది కాదు. అపరాధిగా వుండాల్సిన ప్రేక్షకులు కూడా రచయిత మంచి స్వభావం అంటే యిష్టపడ్డారు అని యెవళ్లకేనా అనిపిస్తుంది. పొడుగాటి ఫ్రాక్ కోట్లూ, సిల్కు బట్టలూ తొడుక్కున్న పెంపుడు జంతువుల లాగా తమని తాము

రంగస్థలంమీద చూసి వాళ్ళు అచ్చంగా ముచ్చట పడివుండవచ్చు. కాని తమని తాము అలా చూసుకుని వాళ్ళు తమ మనుషుల పట్ల ప్రేమ లేసందుకు యెప్పుడూ సిగ్గు పడరు, అసలు వాళ్ళా లోపాన్ని గుర్తించను కూడా గుర్తించరు.

ఒక యువ సమకాలీన నాటకకర్త ఒస్త్రోవ్‌స్కీనుంచి యేమిటి నేర్చుకుంటాడు అనేది నేను వూహించలేదు. మనకి వున్న మరో ప్రఖ్యాత నాటక రచయిత ఎ. చేహొవ్. ఆయన పూర్తి నూతన తరహా నాటకాన్ని — కవితాత్మక కామెడీని, రాశాడని నాకు అనిపిస్తుంది. ఆయన ఉన్నత దృశ్య కావ్యాలని ట్రాజెడీలుగా ప్రదర్శించినప్పుడు అవి భారంగా వికృతంగా తయారవుతాయి. ఆయన నాటకాలలోని నాయకులు, తమ జీవితకాలంలో, ''ఒకే సారి రెండు కుర్చీలమీద కూర్చోవడం యెందుకు సౌకర్యం కాదు?'' అనే దాన్ని అర్థం చేసుకో ప్రయత్నించిన లాంటి మేధావుల రకం వాళ్ళు. తక్కువలో తక్కువ మనకిప్పుడు అవసరం అయింది కవితాత్మకత.

లియొనిద్ అంద్రేయెవ్ నాటకాలని గురించి కూడా చెప్పాలి. ''యెవళ్లైనా గానీ నిత్యం మెదళ్లమీదే బతకలేరు, పైగా అవి యెప్పుడూ తక్కువ వేయించినవే'' అని వాటిని గురించి దుష్టంగానే కావచ్చు గాని సరిగానే చెప్పడం జరిగింది.

నా గురించి నేను కొన్ని మాటలు కనీసం చెప్పాలి. యేమంటే, అతిగా పొగుడుతూ వుండడంవల్ల, నా నాటకాలను యువ రచయితలు నిరర్థకంగా అధ్యయనం చేసేటట్టు ఆకర్షితం కావచ్చు. యింకా అధ్వాన్నం యేమంటే వాటిని ఆదర్శంగా తీసుకోవచ్చు. మన విమర్శకులు మామూలుగా మహా తొందరతో వుంటారు — వాళ్ళు పొగడనేనా పొగుడుతారు, తిట్టనేనా తిడతారు. కాని సరిగా, తగినంత శ్రద్ధగా చదవరు.

ఉదాహరణకి ''ఎగోర్ బులిచ్యోవూ ఇతరులూ'' సందర్భంగా ఒక విమర్శకుడు అంటాడు:

''మనం ఒక నూతన నాటక శిల్పాన్ని గురించి అనుకోవాలనేది పరమ స్పష్టం. నిర్ణాయకమైన సూత్రం ఆచరణ. నాటకకర్త గోర్కీకి గల బ్రహ్మాండమైన పలుకుబడిని, గోర్కీ రంగస్థలానికి గల మహత్తర శక్తిని ఆచరణ చూపిస్తోంది. యీ రంగస్థలాన్ని అధ్యయనం చెయ్యాలి.''

వుహూఁ, దాన్ని అధ్యయనం చెయ్యాల్సిన అవసరం లేదు. యేమంటే అధ్యయనం చెయ్యాల్సినంత యేమీ అందులో లేదు. నేను కొంచెమించులో యిరవై నాటకాలని రాశాను. కాని అన్నీ కూడా వూరికే కొంచెం హెచ్చు తగ్గుల్లో నీరసంగా సంధించిన రంగాలు. వాటిల్లో కథానిర్మాణ రేఖ పూరాగా లేదు. పాత్రలు తగినంత స్పష్టంగా లేవు. అవి ఛాయా మాత్రంగా, నిష్ఫలంగా వుంటాయి. నాటకం అనేది కచ్చితంగా, ఆమూలాగ్రం యాక్షన్‌తో వుండాలి. అలా వున్నప్పుడే అది తక్షణ ఉద్వే

గాలని ఉద్దీప్తం చేస్తుంది. యివాళ, మన ఆత్మల్లోని సంస్కారహీనత్వపు చెత్తని దగ్ధం చెయ్యడానికి సమరశీల, జ్వాలాపూరిత శబ్దం అవసరం అయిన యీ రోజుల్లో అవి విధిగా అవసరం.

నా నాటకం ఒకటి ముప్పై యేళ్లుగా ప్రదర్శితమవుతోంది.[229] కాని అది వింత, యేమంటే అది పాతబడిపోయింది. నేనా నాటకపు కథని చెప్పలేమో. నేను, దగ్గర దగ్గర యిరవై యేళ్లు, "పూర్వపు మనుషులు" అని పిలిచే ప్రపంచాన్ని -- యిందులో దిమ్మరుల్ని, పూటకూళ్ల యిళ్లల్లో వుండేవాళ్లనీ, మామూలుగా "లంపెన్ ప్రొలెటేరియన్ల"నీ మాత్రమే గాక, "ఆకర్షణ కోల్పోయిన," నిరాశచెందిన, ఆగ్రహపూరితులైన, ఓటములవల్ల అవమానితులైన కొంత భాగం మేధావుల్ని కూడా నేను కలుపుతాను -- పరిశీలించిన దాని ఫలితం అది. అలాంటి వాళ్లని బాగు చెయ్యడం అసాధ్యం అని చాలా చిన్నప్పుడే నేను అనుకుని, అవగాహన చేసుకున్నాను. కొనొవాలొవ్[230]లు వీరత్వాన్ని అభినందించగలరు. కాని తామే వీరులు కాలేరు, పూరికే ఒకో అప్పుడు వాళ్లు "క్షణ కాలం సేపు ఘనుల"వుతారు.

నేను కొనొవాలొవ్‌లని మేధావులలో కూడా చూశాను. నేను బూబ్నొవ్ రూపాన్ని చిత్రించేటప్పుడు నా ముందు నాకు పరిచితమైన తిరుగుబోతు మాత్రమే కాదు, ఒక మేధావి కూడా వున్నాడు -- మా టీచరు. సాటిన్[231] గొప్పింటివాడు; పోస్ట్ -- టెలిగ్రాఫ్ గుమాస్తా. హత్యానేరానికి నాలుగేళ్లు శిక్ష అనుభవించాడు. తాగుబోతూ, పేచీకోరూ. అతనికి కూడా "ప్రతిరూపం" వుంది -- ఒక ప్రఖ్యాత విప్లవకారుని సోదరుడు, ఆత్మహత్య చేసుకున్నాడు జైల్లో. కువాల్దా పూటకూళ్ల యింటితో సామాన్యంగా వుండే దాన్ని త్వేర్, సింబిర్స్క్‌లలో టాల్‌స్టాయన్ల కాలనీని సందర్శించి, చూశాను.

1880ల ఉత్తరార్థమూ, 1890ల నాటి తొలి ప్రాంతమూ, మృత్యు వాత పడిన వాళ్లను ఓదార్పూ బలహీనత్వపు క్షమాపణ వున్న సంవత్సరాలని అనవచ్చు. సాహిత్యం "నాన్ హీరో"[232]ని నాయకుడిగా గ్రహించింది. ఆ కాలం నాటి ఒక కథకి పూరికే "నాన్ హీరో" అని పేరు వుండింది. ఆ కథని మహా ఆబగా చదివారు. ఆ నాటి నినాదం యిలా వుంది: "మన కాలం మహత్తర కృత్యాల కాలం కాదు." మరి "నాన్ హీరోలు" యీ నినాదంలోని సామంజస్యాన్ని ఒకళ్లకొకళ్లు రుజువు చేసుకున్నారు.

ఓదార్చేవాడి పాత్రలో ప్రత్యేకమైన విజయం సాధించినవాడు ఎమ్. మేన్‌షికొవ్. మొదటగా ఉదారవాద పత్రిక "వారం"కి రాసేవాడు, తర్వాత "నవ యుగం"కి స్తంభం అయాడు. సల్తికోవ్--ష్చేద్రిన్ దాన్ని నిర్ద్వంద్వంగా సరిగా "మీకేం కావాలి?" అని పిలిచాడు. మేన్‌షికొవ్ సాదా పుస్తకాలైన "ప్రేమని గురించి", "రాయడం గురించి"

లాంటి వాటిని సాదా మేధావి ఉద్యోగస్థులు, ముఖ్యంగా గ్రామ ప్రాంతపు ఉపాధ్యాయులు, — ఆ కాలంలో గణనీయమైన సాంస్కృతిక శక్తి అయిన వాళ్లు, — ఆతృతగా చదివేవాళ్లు. వాటిని చదివి బుర్రలు చెడగొట్టుకునేవాళ్లు.

కాని చపకహారు పంచకుడైన మేన్‌షికొవ్‌తోబాటుగా, "నా దగ్గరకి రండి బాధితులూ, భారం మోసేవాళ్లూ అందరూ, నేను వూరడిస్తాను" అనే విషయానికి సంబంధించి చాలా మంది ఓదార్చే వాళ్లూ, రాజీ చేసే వాళ్లూ, బోధకులూ వుండేవాళ్లు. "నివేదన", "నా విశ్వాసం యేమిటి?", "మనలోని భగవంతుని రాజ్యం" మొదలైన లాంటి వాటి అధిక పలుకుబడిగల రచయిత[233] కూడా ఈ విషయంమీద వేదాంతపరమైన సొలెగూడును అల్లాడు.

మానవ ప్రేమని ప్రతి చోటా ప్రచారం చేశారు. సిద్ధాంతపరంగా అది వర్గ విభేదం లేకుండా అందరికీ విస్తరించింది. కాని ఆచరణలో కొంత మంది వసీలీలని వసీలీలనడం జరిగింది; ఎక్కువమందిని చులకనగా వాస్కాలని, కొంతమంది మరీయాలని మరీయాలనీ, మిగిలిన అందర్నీ చులకనగా మాష్కాలనీ అనడం జరిగింది.

పై నుంచి "ఉత్సాహ పరిచేటువంటి" అభ్యర్థనలు యెన్నడూ వాస్కాల, మాష్కాల చెవుల సోకనేలేదు. నిత్యజీవిత విషపూరిత పంకంలో ఆత్మ పతనం అనే క్రమం నిరాటంకంగా, యెప్పటి లాగానే వైవిధ్యభరితంగా సాగింది.

జీవితపు పై అంతస్తులలోని ఓదార్పుదారులకి శ్రామిక జనసమూహాల్లో, అడుగు వర్గాల్లో చాలా ప్రతిరూపాలు వున్నాయి. నేను వాళ్లని చాలా దగ్గరగా చూశాను, వాళ్లు అనేదాన్ని చాలా శ్రద్ధగా విన్నాను. పై అంతస్తుల వాళ్లల్లో మాదిరీ బోలు కబుర్ల మాటున దాంకోవడం గాని, వేదాంతం వల్లించడంలో జిత్తులమారి నటనగాని వాళ్లకి లేవు. యీ వ్యక్తి నిజాయితీతో ఓదారుస్తున్నాడనీ, "గుండెలోని నొప్పి"ని మాయం చేస్తున్నాడనీ, అది మనుషులకి యెంత బాధాకరమైందీ తెలుసుననీ తక్షణం స్పష్టమైంది. కాని అలాంటి ఓదార్చేవాడు చాలా అరుదు. పై పెచ్చు, తిరుగుబోతుల్లోనూ, ద్రిమరుల్లోనూ వృత్తిపరమైన ఓదార్పుకాడు, చేతినిపుణుడు కనిపిస్తాడు. అతను ఓదార్చేవాడు, యేమంటే దానికి గాను అతనికి భుక్తి లభించేది. "బాధపడుతూ వున్న, భారం వహిస్తూ వున్న" పెట్టుబడిదారులని ఓదార్చే కోవకి చెందిన ఆధునిక యూరపియన్ పత్రికల వాళ్లని అలాంటి ఓదార్చేవాళ్లతో చక్కగా పోల్చగలం.

అతి యేహ్యమైన తరహా ఓదార్పుదారుడు యెవరంటే దురాశా పరుడైన మానవుడు. ప్రజల బాధలమీద తల్లడిల్లిపోతూ తనకి తనే గొప్ప చేసేసుకుంటాడు. గుర్తింపు పొందాలని కోరుకుని, తనకి మన్ననని మాత్రమే కాకుండా ప్రేమ కూడా కావాలనుకునేవాడు. అలాంటి వాళ్లు తక్కువేమీ లేరు.

ఆఖరికి ఓదార్చే వాళ్లు చాలా పెద్ద సంఖ్యలో వున్నారు. వాళ్లు మనుష్యుల్ని, వూరికే ఫిర్యాదులతో వాళ్లు తమని విసిగించకుండా వుండాలనే, ఓదారుస్తారు. ఆ రకంగా ప్రతిదానికీ అలవాటు పడిన ఉదాసీన ఆత్మకి వుండే మామూలు విశ్రాంతిని ప్రజలు భగ్నం చెయ్యకుండా వుండాలనే చేస్తారు.

యీ విశ్రాంతి, తమ అనుభూతులూ ఆలోచనలూ స్థిరమైన తూకం వాళ్లకి అమిత విలువైంది. వాళ్లకి తమ తుండుగుడ్డ, పిడత, వంట పాత్ర చాలా ప్రియమైనవి. వాళ్లు రాగి పాత్ర అన్నా, కెటిల్ అన్నా యిష్టపడతారు. యీ బాపతు ఓదార్పుదారులు మహా యుక్తివంతులూ, నేర్పుగలవాళ్లూ, వాగ్ధాటి వున్న వాళ్లూనూ. అందుకనే అది మహా అపాయకరమైంది. నా నాటకం ''అధోజనం''లోని లుకా యిలా వుండి వుండాల్సింది, కాని నేను అలా అతన్ని తయారు చెయ్యడంలో విఫలమయినట్టు తెలుస్తూనే వుంది.

యీ నాటకాన్ని గురించి నేను చెప్పిందంతా అది యెంత విఫలమైందో, పైన చెప్పిన పరిశీలనన్నీ యెంత చెడ్డగా యిందులో ప్రతిఫలించాయో, కథానిర్మాణానికి సంబంధించి యిది యెంత నీరసంగా వుందో రుజువు చేస్తాయనే అనుకుంటున్నాను. ''అధోజనం'' యీ నాటికి పనికి రాదు, యింకా చెప్పాలంటే యిప్పుడది హానికరం కూడనూ.

ఈ ఆత్మ విమర్శ అనేది ఆలస్యం అయినా, అది యిప్పుడు 1932లోనే రాలేదనీ, యెప్పుడో అక్టోబరు విప్లవానికి ముందే వచ్చిందనీ నేను చెప్పాలి. తాము పరిశీలించే వస్తువుని తొందరగా, తగినంత యోచన లేకుండా ప్రక్రియాత్మకం చేసుకునే యువకులకిది నిరుపయోగమైందని అనుకోను. యీ రోజుల్లో ఒక ఓదార్చేవాణ్ణి ప్రతికూలంగా, హాస్యాత్మక వ్యక్తిగా మాత్రమే రంగస్థలంమీద ప్రదర్శించవచ్చు.

ఒక చారిత్రకమైనటువంటి, కాని అసాధారణమైన మనిషి, మహా మానవుడు అయిన వ్లదీమిర్ లెనిన్, ఖాయంగా, శాశ్వతంగా ఓదార్చేవాడి జీవిత సమూనాని దాటిపోయి, అతని స్థానంలో శ్రామికవర్గపు విప్లవ హక్కుని బోధించే బోధకుణ్ణి వుంచాడు. అలాంటి బోధకుడు, ప్రజామానవుడు, నూతన సమాజ నిర్మాత ఆధునిక నాటకపు నాయకుడు కావాలి. అలాంటి నాయకుణ్ణి మాటకి గల తగినంత ఓజస్సుతోటీ, తేజస్సుతోటీ రూపొందించాలంటే యెవళ్లైనా గానీ యీ సాహితీ ప్రక్రియలోని చెయ్యి తిరిగిన, సాటిలేని నిపుణులనుంచి, మొట్టమొదటగా షేక్స్పియర్‌నుంచి రాసే నైపుణ్యాన్ని నేర్చుకోవాలి.

# యువ రచయితలతోటి సంభాషణ

జీవిత దృగ్విషయాలని లోతుగా పరిశీలించాలనే కోరిక వుండడంవల్ల కాకుండా, తమ ఆలోచనకి సురక్షితమైన ఆశ్రయం కనిపెట్టాలనీ, అనేకమైన ''నిర్వివాద సత్యాలని'' వేగంగా స్థాపించాలనీ అధిక సంఖ్యాక ప్రజలు వివేచన చేస్తారు, తర్కిస్తారు. అలాంటి నిర్వివాద సత్యాల తొందరపాటు కల్పన ముఖ్యంగా విమర్శకులకి సాధారణంగా వుంటుంది, రచయితలమీద అత్యంత దుష్ప్రభావం కలిగిస్తుంది. సూక్తులు, పిడిసూత్రాలు లేదా యే ముతక నిర్వివాద సత్యాలేనా గానీ రచయితల గంభీరమైన బాధ్యతాయుత కృషి మీద రుద్దబడినప్పుడు విధిగా పరిమితం కావడానికీ, సజీవంగా వేగంగా మారిపోయేటు వంటి యదార్థపు తాత్పర్యాల వక్రీకరణకీ దారితీస్తాయి. ''మన బోధన పిడిసూత్రం కాదనీ, కార్యాచరణకి కరదీపిక'' అనీ, ప్రోది చేస్తే మన చర్యలన్నీ ''పాత ప్రపంచాన్ని మార్చడానికీ'', నూతన ప్రపంచాన్ని నిర్మించడానికీ లక్షించినవనీ మేధావి అయిన ఫ్రెడరిక్ ఎంగెల్స్ అన్నాడు. నమ్మలేనంత వేగంగా పాత ప్రపంచం కూలిపోతున్న యుగంలో మనం జీవించి కృషి చేస్తున్నాం. యీ పతనానికి కారణాలని ఆమూలాగ్రం అధ్యయనం చేసి, ముందే చెప్పడం జరిగింది. వర్గ సమాజాలు కాలం చెల్లిపోయి శిథిలం అయిపోతున్నాయి. సాంఘిక దోషాలు పుష్కలంగా వుండడాన్ని సృజనాత్మక శక్తి వున్నట్టుగా పొరపాటు పడి, తమ ఉక్కు దారుఢ్యం గురించి వాళ్ళు డబ్బాకొట్టుకొని యెంతో కాలం అవలేదు. మన రోజుల్లో సర్వ ప్రపంచ బూర్జువా వర్గమూ తన నిస్సహాయతనీ, అసమర్థతనీ స్పష్టంగా వెల్లడి చేసుకుంటూ తన కున్న ఒకేఒక్క శక్తిని ప్రదర్శించుకొంటోంది — అది రాజకీయ సినిసిజం. సకల దేశాల దుకాణదార్లూ రాజకీయ దుండగీడుల్ని నాయకత్వంలోకి యెగదోస్తున్నారు. తమ ఆత్మ రక్షణకి వున్న ఒకే ఒక్క నైపుణ్యం అయిన భీతాంగం సృష్టించడానికి దిగుతున్నారు. తమ మోక్షానికి వున్న ఒకే ఒక్క మార్గం ఫాసిజం అని చాటుతున్నారు, అంటే మనుషుల్లోని తుక్కుమూకని (కుటిలురు, పిచ్చివాళ్ళు, పతితులు, క్షుద్బాధ భయంవల్ల

నిశ్చేష్టులైన వాళ్ళు) తడి గుడ్డతో గొంతు కోసేవాళ్ల సైన్యంగా వ్యవస్థీకరించడం అన్నమాట. యీ సైన్యం, పోలీసుల ఆధిపత్యంకింద, సామాజిక సృజనకి సామర్థ్యం గల ఆరోగ్యకరమైన శక్తి అయిన విప్లవ శ్రామికవర్గాన్ని, తుడిచిపెట్టేయ్యాలన్న మాట. బూర్జువావర్గ శక్తులు ఛిన్నాభిన్నం అయిపోయే క్రమపు ప్రాముఖ్యాన్ని గురించీ, అర్థం గురించీ, యీ ఛిన్నాభిన్న క్రమపు ఉత్పత్తులనుంచి తన రక్షణ నేర్పాటు చేసుకునే దాని ప్రయత్నాల గురించీ సోవియట్ రచయితలమైన మనకి తగినంత స్పష్టమైన అవగాహన లేదు. శ్రామికవర్గపు జీవయోగ్యత, సహజ శక్తి, సృజనాత్మక సామర్థ్యపు విస్తారమైన సంచితాలు సోవియట్ శ్రామికవర్గపు యీ పదహారేళ్ల వీరోచిత శ్రమ వల్లా, సాధించిన అనూహ్య ఫలితాలవల్లా ప్రపంచానికి వెల్లడి అయ్యాయి. యీ శ్రమకి గల బ్రహ్మాండమైన సామర్థ్యం గురించి గాని, లేదా దాని విజయాల పౌష్కల్యం, వైవిధ్యాల గురించి గాని సోవియట్ రచయితలమైన మనకి ఉండవలసినంత అవగాహన లేదు. యిటీవలి కాలం దాకా మన దేశం అనాగరిక నిరక్షరాస్యతలో వుందనీ, నానా రకాల మూఢనమ్మకాలతోటీ, దురభిప్రాయాలతోటీ యెంతో విష పూరితం అయిపోయిందనీ, దీని విశిష్ట లక్షణాల్లో ఒకటి యేమిటంటే పాత కాలపు తిక్కలు దాన్ని జిడ్డులా పట్టుకుని వుండడమేననీ మనం పరాకు పడుతూ వుంటాం.

సాహిత్యపు అంశలు యేమిటీ? ఆలంకారిక రూపాల్ని, పాత్రలని, వాస్తవ సంఘటనలని, ప్రకృతిదృశ్యాన్ని ఆలోచనా సరళిని మాటలతో సృష్టించడం అంటే యేమిటి?

సాహిత్యపు ప్రధానమైన అంశం ప్రధానమైన పరికరం అయిన భాష వాస్తవాలతోటీ, జీవిత దృగ్విషయాలతోటీ కలిసి సాహిత్యపు ముడి వస్తువు అవుతుంది. యుక్తివంతమైన జానపద పొడుపు కథలకి జవాబు భాష అవుతుంది: ''ఏమిటది? తెనె కాదు, కాని ప్రతిదాన్నీ అంటి పెట్టుకుని వుంటుంది.'' వేరేలా చెప్పాలంటే పేరు లేనిదంటూ ప్రపంచంలో యేదీ లేదు. సర్వ వాస్తవాలకీ, సకల ఆలోచనలకీ ఉడుపుల తొడుగు మాటలే. కాని వాస్తవాలకి గర్భీకృత సాంఘిక అర్థాలూ వున్నాయి, ప్రతి ఆలోచనకీ గర్భీకృత కారణం వుంది. వాస్తవాల మరుగున వున్న సాంఘిక జీవిత అర్థాలని వాటి పూర్తి ప్రాముఖ్యంతో, పూర్ణత్వంతో, స్పష్టతతో వెలికి తీసుకురావాలని ఉద్దేశించే కల్పనా కృతిని సూటి అయిన, నిర్దిష్టమైన భాషతో, జాగ్రత్తగా యెంపిక చేసిన మాటలతో రాయాలి. శతాబ్దాలుగా, తమ భాషని ప్రయాసపడి మన్నిస్తూ ఉత్కృష్ట రచయితలు అలా రాశారు. వాళ్లది నిజమైన సాహిత్య భాష. ఆ భాషని శ్రామిక జనుల వ్యవహార భాషనుంచి గ్రహించినప్పటికీ అది తన వర్ణనాత్మక అనూదితంలో సామాన్య భాషలో సందర్భవశంగా, తాత్కాలికంగా, అస్థిరంగా, చపలంగా, వాక్సంబంధ

మైన వక్రీకృతంగా వున్న ప్రతిదాన్నీ, అనేక కారణాలవల్ల ముఖ్య ''జీవలక్షణం''తో లేదా జాతీయ భాషా ధోరణితో విభేదించే ప్రతిదాన్నీ పరిత్యజించడంవల్ల తన మూలాధారంనుంచి తీవ్రంగా విభేదించి వుంటుంది. పాత్రల ప్రత్యక్ష సంభాషణలో వ్యవహార భాషనే వాడడం వుంటుందని చెప్పనవసరం లేదు, కాని పాత్రలని సజీవం చెయ్యడానికీ, వాటిని స్ఫుటంగా చెక్కిన ఉద్భూతశిల్పంగా చెయ్యడానికీ అవసరమైనంత మేరకే అలా వాడడం వుంటుంది.

డిఫెన్స్ లాయర్లూ ప్రాసెక్యూటర్లూ వాగ్ధాటివల్ల ప్రేరణ పొందిన అసూయక త్వపు ఆకాంక్షలో, నేను మరీ చిన్నతనంలో వున్నప్పుడు నూతన పదాలని తయారు చెయ్య ప్రయత్నించాను. ''మంచి''నీ ''చెడ్డ''నీ కప్పడానికి అందమైన మాటలని వాడడం, డిఫెన్స్ వాళ్ళూ, ప్రాసెక్యూటర్ వాళ్ళూ యిద్దరూ అదే యుక్తితోటి ఒకే పద జాలాన్ని వాడడం నాకు వింతగా కనిపించింది. అందుకని నేను ''నా సొంత'' మాటలని కల్పించుకుంటూ, నోటు పుస్తకం తర్వాత నోటు పుస్తకాన్ని నింపేస్తూ పరిహాసాస్పదంగా శ్రమించాను. అది పూరికే మరో ''బాలారిష్టం.'' వాస్తవికతే అత్యుత్తమ ఔషధకారి, త్వరలోనే అది నన్ను కుదిర్చింది, అదీ సంతోషించదగ్గ విషయం.

అత్యంత శక్తివంతమైన ప్రజా కార్యాచరణ, అనేక నవ్య శ్రామిక నైపుణ్యాల అవతరణ, వర్గ వైరుధ్యాల తీవ్రత మిళితమైన యుగాల్లో భాష అతివేగవంతంగా సంపద్వంతం అయిందని సంస్కృతీ చరిత్ర తెలియజేస్తోంది.

దీనికి దాఖలా మనకి జానపద సాహిత్యంలో కూడా కనిపిస్తుంది. సామెతల్లో, సూక్తుల్లో, పాటల్లో వ్యావహారిక భాష సహజ అభివృద్ధిని సాక్షీభూతం చేస్తూ అది ద్యోతకం అవుతుంది. చక్రం తిప్పలేనంతగా అర్థాలు తుడిచిపెట్టుకుపోయిన పాత పదాలని ఛాందసంగా కాపాడ్డం యెంత నిరర్థకమో కృతక, కల్పిత ''ప్రయోగాలు'' కూడా అంతే నిరర్థకం. పూష్కిన్ తన ముసలి దాది దగ్గర నుంచి యెంతో నేర్చుకున్నాడనీ, వ్యావహారిక భాషా పరిజ్ఞానం గణనీయంగా వున్న లెస్కోవ్ కూడా సైనికుని భార్య అయిన తన దాది దగ్గర నుంచి నేర్చుకున్నాడనీ గుర్తుచేసుకుందాం. మొత్తం మీద మన అణకువగల దాదులు, బళ్ళుతోలే వాళ్ళు, చేపలు పట్టే వాళ్ళు, పల్లెటూరి వేటగాళ్ళు యింకా తదితరులైన కాయకష్టం చేసే వాళ్ళు నిస్సందేహంగా మన సాహిత్య భాష అభివృద్ధి చెందడానికి దోహదం చేసారని చెప్పితీరాలి. కాని రచయితలు అందులోనుంచి తాలూతంపూ లేకుండా జల్లించి శుభ్రం చేసి అతి కచ్చితమైన, సూటి అయిన అర్థవంతమైన పదాలని యెంచుకున్నారు. మన ప్రస్తుత కాలపు రచయితలు అలాంటి యెంపిక అవసరాన్ని యే మాత్రమూ ఆదరించడం లేదు. అది వాళ్ల రచనల గుణయోగ్యతలకి హానికరంగా పరిణమిస్తోంది. యీ ఆదరణలేమి గుణ

విచార చర్చలో వ్యత్యయానికి దాన్ని వ్యాకరణపరమైన సమస్యలకి కుంచించి వేసి పరీక్షించి కొట్టివేసేటటు వంటి సోమరి, ద్విముఖ నవ నాజూకు కొంటెగాళ్ళకి ప్రోత్సాహం యిస్తుంది. మరి మన దేశంలో అదే సమయంలో సాహిత్య గుణ సంబంధమైన సమస్యకి కచ్చితమైన, గాఢమైన సాంఘిక ప్రయోజనం వుంది.

సాహిత్యపు రెండవ అంశం వస్తువు. యిది రచయిత తన వ్యక్తిగత అనుభవ క్రమంలో వూహించుకున్న భావం. జీవితమే అతనికి సూచించిన భావం. అయినా అది అతని అనుభూతుల్లో రెక్కలురాని పక్షి పిల్లలా గిజగిజలాడుతూ వుండి, దాన్ని ఒక రూపసమన్వితం చేసేటట్టు, మాటలలో రూపొందించేటట్టూ ప్రేరణ కలిగిస్తూ వుంటుంది.

''శాశ్వత'' కావ్య వస్తువులు అనేవి వున్నాయి: మృత్యువు, ప్రేమ. అలాగే వైయక్తిక తత్వంమీద నిర్మితమై సమాజంలో స్థాపితం అయిన అసూయ, పగ, లోభత్వం, యింకా అలాంటివీ వున్నాయి. ''ప్రతీదీ మారుతుంది'' అనేది ప్రాచీన సూక్తి. యీ భూమ్మీద యేదీ శాశ్వతం కాదు. వర్గాల మధ్య జరిగే తీవ్ర పోరాటంమీద, ప్రతివాడూ యింకొకడితో భుక్తి కోసం, అధికారం కోసం చేసే పోరాటంమీద నిర్మితమైన సమాజంలో వ్యక్తి అనుభవిస్తున్న విచారగ్రస్తమైన ఒంటరితనం, నిస్సహాయతలు ఆ ''శాశ్వత'' కావ్య వస్తువుకి ఆధారం అని యీ ప్రపంచంమీద తేజోవంతమైన విప్లవ సూర్యుడు ఉదయిస్తూ మనకి చూపిస్తున్నాడు. బూర్జువా సమాజంలో అత్యధిక సంఖ్యాక జనం తమ శక్తినంతటినీ కూడా ఒక ఆదిమ, దినదిన గండపు మనుగడ కోసం ధార పొయ్యాల్సి వుండడం అనేది ఆ సమాజపు విశిష్ట, అపరిహార్య లక్షణమని ప్రతివాళ్ళకీ తెలుసు. తమ మనుగడలోని యీ అసహ్యకరమైన, అవమానకరమైన ''విచిత్ర లక్షణా''నికి మనుషులు అలవాటు పడిపోయారు. ప్రతివాడూ తన గురించే మధన పడిపోయేట్టూ, తన సొంత ప్రయత్నాలమీదనే కేంద్రీకరించేటట్టూ నిర్బంధితులైపోయారు. యీ సాంఘిక వ్యవస్థలోని విరూపాన్ని చాలా కొద్ది మంది మాత్రమే అర్థం చేసుకున్నారు. సామాన్యంగా చెప్పాలంటే, తాము బతుకుతూ చూస్తూ వున్న దాంట్లో ఆవగింజంత మాత్రమే మనుషులు అర్థం చేసుకుంటున్నారు. తాము చూసే దాని తాత్పర్యం యేమిటో ఆలోచించే వ్యవధి వాళ్ళకి లేదు. తమని గురించిన క్షుద్రమైన చికాకుల ఉచ్చులోనే గిజగిజ తన్నుకుంటున్నారు. తమ శారీరక అవసరాలనీ, తమ అహాన్నీ, జీవితంలో ఓ మెత్తటి జాగాని అంకించుకోవాలన్న దురాశనీ తృప్తి పరుచుకోవాలని యాతన పడుతున్నారు. బతకడం కోసం వాళ్ళు యిది చెయ్యాల్సి వుందనుకోండి. తాము చూసిందాన్ని గురించి ఆలోచించకపోవడం అనే కలిగించుకున్న అలవాటు చాలా మందికి ఆత్మరక్షణకి మంచి సాధనంగా పనికి వస్తోంది. ఆత్మరక్షణ నిమిత్తమూ, పనికి మాలిన క్షుద్ర విషయాల కోసమూ తాము యెంత శక్తిని వ్యయం చేస్తున్నారో

బూర్జువా సమాజంలోని జనం బేరీజు వేసుకుంటే, వాళ్ల ఆత్మహత్యల శాతం వంద రెట్లు పెరుగుతుంది.

తను చూసేదాని అర్థాన్ని గురించి ఒక వ్యక్తి ఆలోచించకపోయినా, అతను చూసేది యెలాగైనా అతని అనుభూతుల ఖజానాలో నిక్షిప్తమైపోతుంది. అతన్ని వేసట పెడుతుంది. జీవితపు తెలివి మాలినతనాన్ని గురించి వ్యాకులకరమైన అనుభూతిని యిస్తుంది. యెవడు యెల్లా బతికినా యేం ఒరిగేది లేదనే తుచ్ఛమైన నిర్ణయానికి, కడకి మార్మికతకి, అరాచకత్వానికి, నినిసిజానికి దారితీస్తుంది. యీ రకంగా బూర్జువా సమాజం తన విషవాయువుల్ని ఉత్పత్తి చేస్తుంది. అవి క్రమేపీ తమ వినాశకర కర్తవ్యాన్ని నిర్వహిస్తాయి. బూర్జువా సమాజపు శైథిల్యాన్నీ, విచ్ఛిన్నతనీ ఆపు చేసే శక్తి మతపరమైనా, నైతిక, న్యాయపరమైనా పిడి సూత్రాలకి లేదని మనకి అర్థమవుతోంది. వర్గ రహిత, సోషలిస్టు సమాజం సృష్టించేటువంటి పరిస్థితుల్లో ''అనశ్వరమైన'' కావ్య వస్తువులనేవి ఒక మేరకి గతించిపోతూ వున్నాయి, ఒక మేరకి భిన్న అర్థాన్ని సంతరించుకుంటూ వున్నాయి. మన యుగం ఒక వ్యక్తి — అతని సాంఘిక ప్రయోజనం యెంతటిదైనాగానీ — మరణంకంటే యెక్కువ అసదృశ ప్రబలమైన, విషాదకర కావ్య వస్తువులని అందిస్తోంది. వ్యష్టివాదులకి యిది యిష్టం వుండదు. కాని మరి వ్యష్టివాదానికి చరిత్ర మరణశిక్షని విధించింది కదా.

సాహిత్యపు మూడవ అంశం కావ్య నిర్మాణం. వేరే మాటల్లో చెప్పాలంటే యేదో ఒక పాత్రగాని, నమూనాగాని రూపు తీసుకునే క్రమంలో వుండే సంబంధాలు, వైరుధ్యాలు, సానుభూతులు, వైరాలు; సామాన్యంగా మనుషుల మధ్య వుండే సంబంధాలు.

సాహిత్యం అనే భావనకి యీ మూడు అంశాలు సరిపోతాయని నాకు తోస్తోంది, సాహిత్యం అంటే కాల్పనికమైన నాటకం, నవల, కథ అని అనుకుంటే. శిల్పం గురించీ, శైలి గురించీ మనం చెప్పుకుంటూ పోవచ్చునుగాని అదంతా రచయిత వ్యక్తిగత సామర్థ్యాలకి సంబంధించిన సమస్య.

యిక యిప్పుడు పంథొమ్మిదవ శతాబ్దపు సాహిత్యంలోనూ, యిరవైయవ శతాబ్దంలోకి విస్తరించుకున్న సాహిత్యంలోనూ వున్న ప్రధానమైన, విశాలమైన, అత్యంత ఫలవంతమైన ధోరణిగా వాస్తవికవాదం గురించి కొన్ని మాటలు. యిది నిశిత హేతువాదతత్వం వల్లా, విమర్శనతత్వంవల్లా విలక్షణమైంది. ప్రధానంగా యీ ధోరణిని మేధావరంగా తమ జీవన పరిసరాలని అధిగమించిన వాళ్లూ, తమ వర్గపు సాంఘిక సృజనాత్మక దౌర్బల్యాన్ని ముతక శారీరక శక్తిగుండా స్పష్టంగా చూసిన వాళ్లూ అయిన మనుషులు ఆరంభించారు. వీళ్లని బూర్జువావర్గపు ''ప్రాడిగల్ సన్స్'' అనవచ్చును. వాళ్లు తమ తండ్రుల దాస్యాన్నుంచి, పిడిసూత్రాలా, సంప్రదాయాలా దాస్యంనుంచి పారిపోయారు. మరి యీ

అసమ్మతీయుల సుగుణం యేమంటే వాళ్లలో చాలమంది కొవ్వు పట్టిన మాంసం తినడాని కని చెప్పి తమ వర్గం దగ్గరకి మళ్లీ తిరిగిరాలేదు. బూర్జువా విమర్శకులు వాళ్ల భాష, శైలి, కథా నిర్మాణాల్లోని గుణాలనీ, లోటుపాట్లనీ చర్చించారు కాని వాళ్ల పుస్త కాలలోని వస్తువుని సమకూర్చిన వాస్తవాల సాంఘిక అర్థాన్ని యే మాత్రమూ వెల్లడి చెయ్యలేదు. యీ పంధొమ్మిదవ శతాబ్దపు యూరోపియన్ వాస్తవికవాద రచయితల పట్ల మన వైఖరి రూపు తీసుకోవడానికి తెలియకుండానే ప్రముఖ పాత్ర వహించారు. ఒక్క మార్క్స్ ఎంగెల్స్‌లు మాత్రమే బాల్జాక్ రచనల సామాజిక ప్రాముఖ్యాన్ని గుర్తించారు.[234] విమర్శకులు స్టెండాల్‌ని పూరికే "దాటి పోయారు." విదేశీ సాహిత్యాన్ని అనువాదంలో కాకుండా మాతృకలో చదవడం మన దేశంలో తక్కువ. పశ్చిమ దేశాల రచయితల జీవితాల గురించీ, వాళ్ల ఉద్యోగాలూ సద్యోగాలూ గురించీ, శిల్పాల గురించీ యింకా అలాంటి వాటిని గురించీ జనానికి తెలిసింది యింకా తక్కువ.

బూర్జువావర్గపు "ప్రాడిగల్ సన్స్" సృష్టించిన సాహిత్యం వాస్తవంపట్ల విమర్శ నాత్మక వైఖరికి అత్యంత విలువైంది. ఆత్మ సంతృప్తితోటి, కడుపు నిండిన సంస్కార హీనులు సృష్టించి, నిలబెట్టేటువంటి దుర్గంధపూరిత అరాచకత్వంలోనుంచి బయటపడే మార్గాన్ని ఆ రచయితలు చూపించకపోయినప్పటికీ కూడా అది విలువైంది అనుకోండి. జనస్తూయమైన తత్వానికీ, పలుకుబడిగల విమర్శకీ లొంగిపోయి ఉత్తర దక్షిణ ధృవసమ వైరుధ్యాలని రాజీ పర్చడంద్వారా బూర్జువావర్గపు సాంఘిక వ్యవస్థకి గల స్పష్టమైన, అప్రతిష్టాకరమైన అనృతాన్ని కప్పి పెడతాయని భ్రమించిన మూర్ఖపు సత్యాలని స్థాపిం చాలని ప్రయత్నించిన రచయితలు, అందునా రెండవ రకం రచయితలు కొద్ది మంది వున్నారు. పంధొమ్మిదవ శతాబ్దంలో విజ్ఞానశాస్త్రమూ, ఇంజనీరింగూ పెట్టుబడిదారీ రాజ్యాల పాదార్థిక పునాదిని యెంతో విజయవంతంగా విస్తృత పరుస్తున్నాయి, పటుతరం చేస్తున్నాయి. కాని యూరప్ ఖండపు అగ్ర సాహిత్యం అయిన ఫ్రాన్స్ దేశపు సాహిత్యం యూరప్ ఖండపు పెటీబూర్జువాల యీ "యాంత్రిక" కార్యాచరణలో గాని, లేదా దాని "యాంత్రిక" పురోగతిలో గాని యే ఆసక్తీ చూపించలేదు.

తన సాంఘిక అస్తిత్వపు అరక్షణకి సంబంధించి వ్యక్తికి గల నిరాశాభరిత స్పృహే పంధొమ్మిదవ శతాబ్దపు ప్రధమ కావ్య వస్తువు. షొపెన్‌హావర్, గార్ట్‌మన్,[235] లెయొ పార్డీ,[236] ష్టిర్నెర్[237] యింకా తదితర తత్వవేత్తలు జీవితపు విశ్వంభర బుద్ధిలేమిని బోధించడంద్వారా యీ స్పృహని నిలబెట్టారు. యీ బోధన వ్యక్తికి గల సాంఘిక నిస్సహాయ స్థితికీ, సాంఘికమైన ఒంటరితనానికీ సంబంధించిన అదే స్పృహలో వేళ్లు తన్నుకున్నది తప్ప వేరేది కాదు. సోవియట్ యూనియన్‌లో శ్రామికవర్గ నియంతృత్వం సృష్టించిన నూతన వాస్తవికతలో యే వ్యక్తీ కూడా, అతను ఉత్తర ధృవపు మంచు

కెరళ్లలో చిక్కుపడిపోయి, యే క్షణంలోనేనా గానీ చనిపోవచ్చని యెరిగివుండీ కూడా, ఒంటరితనంతో బాధపడడు, నిస్సహాయంగా వున్నట్టు భావించుకోడు.

పంధొమ్మిదవ శతాబ్దం ముఖ్యంగా నిరాశావాదాన్ని ఉపదేశించింది. యిరవయ్యో శతాబ్దంలో యీ ఉపదేశం మరి సహజంగానే సామాజిక సినిసిజపు ప్రచారంగా దిగజారిపోయింది. సంస్కారహీనులు ప్రతిచోటా అంత తెలివిగా పూరేగించుకుని, నిజంగా డప్పు కొట్టుకున్నటువంటి, మానవత్వపు సంపూర్ణ నిష్ఫల నిరాకరణగా దిగజారిపోయింది. షోపెన్‌హోవర్ చెప్పిన సానుతాప ప్రకటనాత్మక, దయాధారిత నీతి, — అది చర్చి ఆరాధనగా వంచనాత్మకంగా వుంది — యెంతో మంది అనుసరించినట్టిది, నిచ్చే దుష్టబుద్ధితో దాన్ని తిరస్కరించాడు. అంతకంటే దృఢంగా యిప్పుడు ఆచరణలో ఫాసిజం దాన్ని కాలదన్నింది. పట్టుసడలి పోతూవున్నా, యింకా గట్టిగా వున్న గుప్పిటిలోనుంచి జారిపోతూ వున్న అధికారం కోసం, పెటీబూర్జువావర్గం చేసే పోరాటంలో నిరాశావాదం వెల్లడి కావడమే హిట్లరు ఫాసిజం.

వ్యక్తి సామాజిక అస్తిత్వపు విపరీత అస్థిరత, అరక్షణంకి సంబంధించిన స్పృహ, వాస్తవానికి ఆ అవగాహనా పెట్టుబడిదారీ విధానపు అధిక ప్రతిభావంతులైన సేవకులకి పరాయిది కాదు. దాదాపు 19వ శతాబ్దపు ''మహత్తర,'' ''ప్రసిద్ధ'' మనుషులందరూ యిప్పటి దాకా ప్రచురితమైన తమ స్మృతులలో, డైరీలలో, ఉత్తరాలలో బూర్జువా సమాజం యెంత అధ్వాన్నంగా నిర్వహింపబడుతూ వుందో దాన్ని గురించి చెప్పారు.

సోవియట్ యూనియన్‌లోని శ్రామిక నియంతృత్వం చేస్తూ వున్న చర్యల్లో, నిరాశావాదం ప్రపంచాన్ని పంకిలం చెయ్యకుండా, హరింప చెయ్యకుండా శుద్ధి చేసే ఆశ్చర్యకరమైన వీరోచిత కార్యకలాపం వుందని చెప్పడం విధాయకం.

బూర్జువావర్గపు ''ప్రాడిగల్ సన్స్'' చేపట్టిన వాస్తవికత సవిమర్శక వాస్తవికత. సమాజాన్ని పీడించే తెగుళ్లని బట్టబయలు చేస్తూనే, ఒక వ్యక్తి జీవితాన్ని కుటుంబ సంప్రదాయాలా, మత మౌఢ్యాలా, న్యాయ సూత్రాలా సందంశకంలో చిత్రిస్తూనే సవిమర్శక వాస్తవికత యీ బానిసత్వంనుంచి బయటపడే దారిని ప్రజలకి చూపించలేకపోయింది. ప్రతి దాన్నీ విమర్శించడం సులభంగానే వుండింది, కాని అలాంటి సాంఘిక మనుగడలోని సామాన్యంగా జీవితంలోని స్పష్టమైన బుద్ధిలేమిని, కంఠోక్తిగా చెప్పడం తప్ప మరేమీ లేక పోయింది. దీన్ని యెన్నో బిగ్గర గొంతుకలతో, బహుశా, బైరన్‌తో మొదలై 1932లో చనిపోయిన థామస్ హార్డీ[238] దాకా, షతొబ్రియాన్[239] రాసిన ''మృత్యు స్మృతులు'' యింకా యితరులతో మొదలై, యెవరి సంశయవాదమైతే నిరాశావాదానికి అతి దగ్గరగా

వస్తుందో ఆ బొద్‌లేర్, అనతోల్ ఫ్రాన్స్‌ల దాకా కంఠోక్తిగా చెప్పడం జరిగింది. కొంతమంది రచయితలు నిరాశావాదానికి బదులుగా కాథొలిసిజాన్ని ప్రవేశపెట్టారు కాని దొందూదొందే, యేమంటే సకల చర్చిలూ కూడా అదే పూనికతోటి జనానికి వాళ్ల జీవన పోరాటంలో ఒక నిస్సహాయతని యెక్కించాయి. చర్చి యువరాజుల స్వార్థపూరిత పార్థిక ప్రయోజనాలకి దోహద పడకుండా, అస్పష్టంగా ఉద్దేశించిన యే శక్తి నేనా చల్లార్చడానికి ప్రయత్నించడంలో మతానికి గల దుష్టతత్వం అత్యంత స్పష్టంగా వెల్ల డైంది. పూజారివర్గానికి మహా లాభదాయకమైన వ్యాపారం క్రైస్తవ మతం అని అతి చక్కగా చెప్పిన పూజారి ఒకాయన ఉన్నాడు.

మన దేశంలో సోషలిస్టు వాస్తవికతని గురించి యెక్కువగా రాయడం జరుగు తోంది. యీ మధ్యనే గోగొల్‌ని గురించి రాసిన ఒక వ్యాసంలో రచయిత చాలా ఆసక్తి కరమైన ఆవిష్కరణ చేశాడు. గోగొల్ సోషలిస్టు వాస్తవికవాది అని అతను అన్నాడు. పచ్చిపచ్చిగా బయట పడిన సాహిత్య విమర్శనాత్మక సత్యాలు యెవర్నైనా యెలాంటి చెత్తకి తీసుకుపోగలవో యీ ''ఆవిష్కరణ'' తెలియజేస్తుంది. యీ చెత్త రాసిన రచయితకి తను అంటున్న మాటల పట్ల యే మాత్రం బాధ్యత లేదనీ తెలియచేస్తుంది.

సాహిత్యంలో వాస్తవికత జీవితపు వాస్తవ విషయాలకి సంబంధించి వుంటుంది. సోష లిస్టు లక్షణం వున్న వాస్తవాలని ''ఇన్‌స్పెక్టర్ జనరల్,'' ''మృత జీవులు'' రాసిన రోజుల్లో రష్యాలో యెవరూ యెక్కడా పరిశీలించలేదు. అందుచేత గోగొల్ ఫ్లైస్తకోవ్, చీచికొవ్, సొబకేవిచ్, నొజ్‌ద్ర్యోవ్, ప్ల్యూష్‌కిన్[240] యింకా తదితర పాత్రల సాంఘిక కార్యాచరణలో అలాంటి వాస్తవాలని ప్రతిఫలింపచేయలేకపోయాడు. అంటే గోగొల్‌ని సోష లిస్టు వాస్తవికవాది అని తప్పుగా పిలవడం జరిగిందన్న మాట. ఆయన సవిమర్శక వాస్తవవాది. యెంత శక్తివంతుడంటే తన విమర్శనా శక్తి వల్ల అక్షరాలా తన మతి చెదిరిపోయినంతటి వాడు. ఉన్మాదం ఒక గాఢమైన బోధనాత్మక సాంఘిక-తాత్విక ప్రాము ఖ్యం సంతరించుకున్న దానికి ఆయన ఒక్కడే ఉదాహరణ కాదు. మరో పక్క మిడిమిడి జ్ఞానానికి అలాంటి ప్రాముఖ్యం యెన్నడూ రాదు, రాలేదు. కొంతమంది రచయితలు దీన్ని అర్థం చేసుకోవడంలో విఫలమవడం నాకు మహా చిత్రంగా కనిపిస్తుంది.

ఆచరణలో సోషలిస్టు సృజన తాలూకు వాస్తవాల ప్రతిబింబం మాత్రమే సాహి త్యంలో సోషలిస్టు వాస్తవికత. యీ బాపతు వాస్తవికత మన సాహిత్యంలో వుండ గలదా? స్పష్టంగా విధిగా. యేమంటే విప్లవాత్మక సోషలిస్టు సృజన వాస్తవాలు మనకి యిప్పటికే వున్నాయి, వాటి సంఖ్య వేగంగా పెరుగుతూ వుంది. కీర్తి, గౌరవాల, మహత్కార్యాలు యెంత సామాన్యం అవుతున్న దేశంలో మనం వుంటున్నామంటే వార్తా పత్రికలు కూడా వాటిలో కొన్నిటిని ప్రస్తావన చెయ్యడం లేదు. రచయితలు వాటిని

గమనించడంలేదు, యేమంటే, వాళ్ళ దృష్టి యింకా సవిమర్శక వాస్తవికతవాదం కేసే వుంది. సవిమర్శక వాస్తవికతవాదం సహజంగానూ న్యాయంగానూ ''జీవితపు రుణపక్ష పార్శ్వాలని'' ''స్పెషలైజ్'' చేసే పాత పద్ధతి. దృష్టి మాంద్యం, అసత్యం, వంచన యింకా తదితర చిత్త చాంచల్యాల లాంటి దోషాలకి వాటి సహజ కారణాలున్నాయనీ ఆ కారణాలు తొలగించబడగలవనీ యీ సందర్భంగా రచయితలకి గుర్తుచెయ్యడం సమంజసం.

సవిమర్శక వాస్తవికవాదపు ఛాందస స్థిరత్వానికి గల ముఖ్య కారణాల్లో ఒకటి యేమిటంటే రచయితలకి వృత్తిపర శిల్ప నైపుణ్యం లోపించడం లేదా యింకా నిర్మోహ మాటంగా చెప్పాలంటే వాళ్ల అజ్ఞానమూ, చూసి జ్ఞేయం చేసుకునే శక్తి వాళ్లకి లోపించడమూ. తరచుగా యీ కారణం గతం వైపు, పాపం ముసలితాత వైపు — జీవితంలో ఆయనకున్న భవిష్యదాశ అల్లా మర్యాదైన దహన సంస్కారమే — అనుభూతి పూర్వక ఆకర్షణతో మిళితమైపోతుంది. దీనికి యే మాత్రమూ ప్రతిఘటన లేని పంథాని జత చెయ్యండి: శిల కంటే కొయ్య పనికి లొంగుతుంది, యినుము కంటే శిల లొంగుతుంది, ఇనుము ఉక్కుకంటే సులభం. ఒక చిన్న కొయ్య కొంపలోని గృహ దృశ్యాన్ని చిత్రించడం, రాతితోటో రెయిన్ ఫోర్స్డ్ కాంక్రీట్‌తోటో కట్టిన అనేక అంతస్తుల భవనంలోని జీవితాన్ని వర్ణించడం కంటే చాలా చాలా సులభం.

చిల్లర విషయాలని యెత్తుకోవడం అనే అలవాటు పెద్ద విషయాలని తడమలేని అసామర్థ్యానికి దారితీస్తుంది. ఉదాహరణకి, ఒక పారిశ్రామిక సంస్థ నిర్మాణం లాంటిది. రచయిత ప్రధాన విషయాన్ని, సిద్ధాంతపర సందేశాన్ని, అనేక చిల్లర వివరణల వర్ణన తోటి అతిభారం చేసేసి, దాన్ని కాగితం పువ్వుల పెద్ద గుట్టకింద — అవి అంత మెరిసిపోతూనూ వుండవు — తన వాగ్ధోరణిలో పుట్టుకొచ్చే వాటి కింద, కప్పెట్టే స్తాడు. వివరణలు అధిక ప్రాముఖ్యంతో వుండటం హానిదాయకం, అది నప్పుతూ వున్న ప్పటికీ కూడా. ఉదాహరణకి, ఒక సమష్టి క్షేత్రపు అభివృద్ధిని గురించిన కథలో ఒక వ్యష్టివాది సమష్టివాదిగా క్రమేపీ పరిణమించడాన్ని తెలియచేసేదైనాగానీ. వివరాలకి సంబం ధించిన యీ వ్యామోహానిదే, దురదృష్టవశాత్తూ మనలో ఒక అలవాటుగా పరిణమిం చిన దానికి, దోషమని నాకు అనిపిస్తుంది: ఒక రచయిత తన పుస్తకపు మొదటి భాగాన్ని అచ్చుకిచ్చేస్తాడు, కాని తర్వాత భాగాన్ని యింకా ఆరంభించను కూడా అరం భించడు యేమంటే తను సేకరించిన వస్తువునంతా అప్పటికే ఖర్చుపెట్టేశాడు, యిక చెప్పడానికేమీ లేదు.

వర్ధమాన రచయిత పెద్ద నవల రాయడంతో ఆరంభించడం యే మాత్రం మంచిది కాదు. యీనాడు మన దేశంలో వెలువడుతూ వున్న మాటల చెత్త కుప్పకి మనం రుణపడి వుండటం యిదిగో యీ అలవాటుదే; దాదాపు అందరు పెద్ద విదేశ రచ

యితలూ, రష్యన్ రచయితలూ చేసినట్టుగా యెవరేనా గానీ రాయడం నేర్చుకోడానికి మాధ్యమికం చిన్న కథ. యువ రచయితకి మాటలని పొదుపుగా వాడడం, తను యెంచుకున్న వస్తువుని తార్కికంగా విభజించుకోవడం, ఆ వస్తువుని స్పష్టంగా, హత్తు కునేటట్టుగా మలచుకోవడం కథానిక నేర్పుతుంది. యేమైనా, యిక బృహత్ నవల అని రాయడం విరమించుకుని మార్పుకి గాను చిన్న కథలని రాయమని నేను ఒక ప్రతిభావంతుడైన రచయితకి సలహా యిస్తే అతను అంటాడు: ''అమ్మో, వద్దు, కథా నిక చాలా కష్టమైన ప్రక్రియ'' అని. అవును మరి, పిస్టల్‌ని తయారుచెయ్యడం కంటే ఫిరంగిని తయారుచెయ్యడం సులభం.

నా ముందుమాట మరీ యెక్కువ పదభూయిష్టమైనట్టు వుంది, కాని అవస రార్థం మాత్రమే అలా వుంది. యువ రచయితలు తమ వృత్తిలో యెదురయ్యే కష్టాల గురించి తెలుసుకుని వుండాలి. యీ యుగం తమమీద వుంచిన కర్తవ్యాలని గురించి వాళ్లు చైతన్యం సంతరించుకునేటట్టు అవాలి, అలాగే పాఠకుడి పట్ల తమకి గల బాధ్యతని గురించీ వాళ్లకి యెరుక రావాలి. మన సోవియట్ పాఠకుడి కంటే యెక్కువగా రచయితల ఆదరాభిమానాలకి పాత్రమైన పాఠకుడు ప్రపంచంలో యెన్నడూ లేడు.

విజ్ఞానపు పరికరాలుగా, మనుషులు అధిరోహించే సోపానాలుగా సత్యాలు మానవ ప్రయత్నంవల్ల నిర్మితమవుతాయి. మొత్తం మానవాళి సాంస్కృతికాభివృద్ధివల్ల దృఢంగా స్థాపితమైన సత్యం అది.

మానవుడి లక్ష్యం యెంత ఉన్నతమైందైతే అతని ప్రతిభా విశేషాల అభివృద్ధి అంత వేగంగానూ, అంత సాంఘిక ఉత్పాదకంగానూ వుంటుందని నేను పదేపదే చెబుతూ వుంటాను. నా మొత్తం జీవితానుభవం మీదా నేను పరిశీలించి, చదివి, తులనాత్మ కంగా చూసి ఆలోచించిన ప్రతిదాని ఆధారంగానూ నేను చాటి చెప్పే సత్యం అది. దీన్ని యెంతో విశ్వసనీయంగా, గట్టిగా రుజువు చేసేది మన సోవియట్ వాస్తవికతే నను కోండి.

వ్లదీమిర్ లెనిన్ విప్లవ మేధ యు.ఎస్.ఎస్.ఆర్. శ్రామికవర్గం ముందు అత్యున్నత మైన లక్ష్యాన్ని పెట్టింది. యివాళ సోవియట్ యూనియన్‌లోని లక్షలాది శ్రామికులు సంభ్రమజనకమైన యీ లక్ష్యసాధన వేపు ఒక శక్తివంతమైన రూపంగా, సకల దేశాల శ్రామికవర్గ విప్లవశక్తికి యింకా యింకా స్పష్టంగా ప్రేరణనిస్తూ, నిజాయితీపరులలో మన్ననపూర్వకమైన ఆశ్చర్యాన్నీ, దుర్మార్గులలో వికటమైన పగనీ రెచ్చగొడుతూ పురోగ మిస్తున్నారు.

''పుష్కలమైన లోకజ్ఞానం'' వున్న వాళ్లు, అంటే పట్టించుకోకుండా వుండడం

అనే దాన్ని యుక్తంగా భావించిన వాళ్ళు, వాస్తవాలా, సంప్రదాయాలా, పిడిసూత్రాలా, ప్రమాణాలా శక్తిని గుట్టు చప్పుడుకాకుండా నమ్మడమే ఉత్తమం అని భావిస్తారు. వాళ్ళు శ్రామికవర్గపు యీ లక్ష్యాన్ని అవాస్తవికమైందనీ, అసంగతమైందనీ అంటారు. వాళ్ళు యే పోరాటాల్లోనూ పాల్గొకపోయినప్పటికీ, సాధించిన విజయాల ఫలితాన్ని తెలివిగా ఉపయోగించుకుంటారు. అలాంటి వాళ్ళకి డాంటె వర్ణించిన "నరకపు" సంపుటాల్లో[241] ఒక ప్రత్యేక స్థానం కేటాయింపై వుంది, అది వాళ్ళకి బాగా తగినట్టు నిప్పేయి వంటిది కూడానూ.

సోవియట్ యూనియన్‌లో మన "అసంబద్ధ" లక్ష్యం కోసం ప్రయత్నించడం అనేది వూహించలేని అద్భుతకృత్యాలని, వీరోచిత ప్రయత్నాలని, అత్యంత సాహసోపేత ఉద్దేశాలని ప్రేరేపిస్తున్నాయి. నేను వాటిని యిక్కడ వివరించబోవడం లేదు కాని ఉద్దేశాలు — యింకా వాటిని సాధించక ముందే — వాస్తవాలు యెలా అవుతాయో మన రచయితలు తమకి తాము తెలుసుకోవాలి. రొట్టెని తినడం మంచిదే. కాని పొలాలని దున్నడంలో ప్రతి యేడూ వ్యయం చేసే బ్రహ్మాండమైన శ్రమని మరొక చోట ఉపయోగించుకోవడానికి గాసు, గోధుమ మొక్కని నిరంతరంగా వుంచుకునేటందుకు యే ప్రయత్నాలు జరుగుతున్నాయో తెలుసుకోవడమూ అంతే మంచిది.

ఆ రకంగా, వర్గరహిత సోషలిస్టు సమాజ నిర్మాణం పరమ లక్ష్యంగా గల సామాజికంగా ఔపయోగికమైన శ్రమతోటి సత్యాలని సృష్టించడం జరుగుతుంది. ఆ సమాజంలో మానవుడు నిష్ఫలంగా వ్యయం చేసే శారీరక శ్రమ మేధా శ్రమగా మారుతుంది; ఆ సమాజంలో వ్యక్తి ప్రతిభా విశేషాలు అభివృద్ధి చెందడానికి అపరిమితమైన అవకాశాలు వుంటాయి.

సాహిత్యం నిర్వర్తించాల్సిన కర్తవ్యం యేమిటంటే యీ శ్రామిక జీవితాన్ని చిత్రించడం, సత్యాలని ప్రతిమలలో — పాత్రలలో, నమూనాలలో, రూపొందించడం. "నువ్వు యెంత యెత్తులో నుంచుంటే అంత దూరం నీకు కనిపిస్తుంది" అని ఒక సామెత వుంది. సరే, అంచేత, మీ పుస్తకాల్లోని ప్రధాన యితివృత్తాలూ, కథా నిర్మాణాలూ విప్లవం ప్రేరేపించిన సృజనాత్మక శక్తి తాలుకు ప్రధాన ఆకాంక్షకి సరితూగుతున్నాయో, యీ శక్తివంతమైన ప్రేరణా ప్రభావాన్ని మీకుగా మీరు యెలా అనుభూతం చేసుకుంటున్నారో యీ లక్ష్యపు యెత్తునుంచి చూద్దాం.

# సోవియట్ సాహిత్యం

సోవియట్ రచయితల ప్రథమ అఖిల యూనియన్ మహాసభలో
(ఆగస్టు 17, 1934) చేసిన ఉపన్యాసం

నిటారుగా వున్న జంతువుని మానవుడి కింద మార్చి, సంస్కృతికి పునాదులని వేసిన శ్రమ క్రమాల పాత్రని, క్షుణ్ణంగా అధ్యయనం చెయ్యడమనేది జరగలేదు. అంటే ఆ విషయానికి తగినంత గాఢంగా. అది సహజమే. యేమంటే శ్రమని దోచుకునేవాళ్ల ప్రయోజనానికి ఆ బాపతు పరిశోధన అనుగుణంగా వుండదు. వాళ్లు ప్రజల శక్తి అనే ముడి పదార్థాన్ని సొమ్ము కింద మార్చుకుంటారు. కానీ ఆ ముడి సరుకు విలువని పెంచడంలో వాళ్లకి ఆసక్తి లేదు. ఇక్ష్వాకుల కాలంనుంచీ, బానిస యజమానుల కిందా బానిసల కిందా ప్రజలు విభజితం అయినప్పటినుంచి శ్రమించేవాళ్ల కండరాలని, మనం యీనాడు నదుల విద్యుత్ శక్తిని ఉపయోగించుకుంటున్నట్టుగా, ఉపయోగించడం జరిగింది. యింకా జరుగుతూనే వుంది. ఆదిమ మానవులని తాత్త్వీకరించే భావవాదులుగా, ఛాయావాదులుగా, దేవుళ్లని సృష్టించినవాళ్లుగా, ''జీవిత పరమార్థం'' గురించి శోధించేవాళ్లుగా సంస్కృతీ చరిత్రకారులు వర్ణించారు. 16, 17 శతాబ్దాల ఉత్తర పూర్వ భాగాల్లో జీవించిన చర్మకారుడు జాకబ్ బ్యోమ్ మానసిక స్థితిని ఆదిమ మానవుడికి అంటకట్టడం జరిగింది. మిగతా విషయాలెలా వున్నా అతను బూర్జువా ఛాయావాదులకి ప్రియమైన తత్వశాస్త్రపు ధోరణిని అవలంబించాడు. ''మానవుడు స్వర్గాన్ని గురించీ, నక్షత్రాల గురించీ, పాంచ భౌతిక శక్తుల గురించీ, వాటి నుంచి ఉద్భవించిన జంతువుల గురించీ, అలాగే పవిత్ర దేవతల గురించీ, భూతం గురించీ, స్వర్గాన్ని గురించీ, నరకాన్ని గురించీ ధ్యానం చెయ్యాల''ని యీయన బోధించాడు.

పురాతత్వ పరిశోధన వల్ల లభ్యమైన సమాచారాన్నీ ప్రాచీన మతాల ప్రభావాన్నీ ఆదిమ సంస్కృతీ చరిత్ర ఉపయోగ పెట్టుకుందని మీకు తెలుసు. యీ ప్రాచీన

మతాలని ఆఖరికి నాస్తిక చరిత్రకారులకి కూడా పరాయిదిగాని క్రైస్తవ తాత్విక పిడి వాదపు ప్రభావంలో, ఆ వెలుగులో పరిశీలించడం జరిగింది. దీని ప్రభావం అతీంద్రియ అభివృద్ధి అనే స్పెన్సర్[242] సిద్ధాంతంలో ద్యోతకమైంది. అంతే కాదు. అది ఫ్రేజర్‌కీ,[243] యింకా యితరులకీ కూడా సోకింది. యేమైనప్పటికీ, ప్రాచీన, ఆదిమ సంస్కృతీ చరిత్ర కారుల్లో యెవళ్ళూ కూడా జానపద సాహిత్యాన్ని, ప్రజల మౌఖిక కళ సమాచారాన్ని ఉపయోగపెట్టుకోలేదు. లేదా పురాణాల సాక్ష్యాన్ని ఉపయోగపెట్టుకోలేదు. పురాణం అనేది మొత్తంమీద ప్రకృతి దృగ్గోచర విషయాల ప్రతిబింబం, ప్రకృతిమీద పోరాటపు ప్రతి బింబం, విశాల కళా సాధారణీకరణల్లో సాంఘిక జీవితపు ప్రతిబింబం.

తన సర్వ ప్రయత్నాలనీ జీవన పోరాటంలోనే వ్యయపరుస్తూ, శ్రమ క్రమాల నుంచీ, తన శాఖకీ, తెగలకీ గల సమస్యలనుంచీ వెలి అయిపోయిన ఆలోచనాధోరణిలో నిమగ్నమైన ద్విపాద జంతువుని గురించి వూహించుకోవడం కష్టం. దిసపాదంతో, జంతు చర్మాలు కప్పుకుని, ''స్వయం సంపూర్ణ''మైన దాన్ని గురించి పూరా ఆలోచించే ఇమ్మా న్యుయెల్ కాంట్[244]ని గురించి వూహించడమూ కష్టమే. నైరూప్య ఆలోచన అనేది తర్వాతి కాలపు మానవుడికి సంబంధించింది. అలాంటి యేకాంత మానవుణ్ణి గురించి ఆరిస్టాటిల్[245] తన ''పొలిటికా'' అనే గ్రంథంలో యిలా అన్నాడు: ''సమాజపు యెల్లలు లేనట్లయితే మానవుడు దేవుడేనా అవుతాడు, పశువేనా అవుతాడు.'' పశువుగా అతను ఒకో అప్పుడు మిగతావాళ్ళ తనని దేవునిగా గుర్తించేటట్టు నిర్బంధం చేశాడు. కాని జంతుసమ మానవుల గురించి అనేకమైన కథలకి పిండిగానూ పని కొచ్చాడు, గుర్రా లని మచ్చిక చేసి స్వారీచేసిన తొలి మానవులు సెంటార్ * పురాణాలకి కారణభూతులైనట్టుగా.

ప్రాచీన మానవుడి సాంఘిక జీవిత సత్యాల మొత్తం, శ్రమ క్రమంలో విధిగా కలిగిన భౌతికవాద ఆలోచనా ధోరణి తాలూకు స్పష్టమైన చిహ్నాలకి సంబంధించి ప్రాచీన సంస్కృతీ చరిత్రకారులు పూర్తిగా మౌనంగా వున్నారు. యీ చిహ్నాలు మనకి అద్భుత కథలు, పూరాణాలు రూపంలో సంక్రమించాయి. అవి అడివి జంతువులని మచ్చిక చెయ్యడం, వనమూలికలని కనిపెట్టడం, పరికరాలని కనిపెట్టడం తాలూకు జ్ఞాపకాలని పొదువుకుని వుంటాయి. ప్రాచీన కాలంలో కూడా మానవులు ఆకాశంలో యెగరడం గురించి కలగన్నారు. ఫాయెథాన్, దేదలస్, అతని కొడుకు ఇకారస్ కథల్లోనూ ''యెగిరే తివాచీ'' కథలోనూ అది కనిపిస్తుంది. అమిత వేగంతో ప్రయా ణించడం గురించి కూడా మనుషులు కలగన్నారు, అందుకనే ''ఏడు కోసుల బూట్ల''

* సెంటార్ — గ్రీకు పురాణాల్లో సగం మనిషి, సగం గుర్రం ఆకృతి వున్న దేవత. — అను.

కథ, మచ్చిక అయిన అశ్వం కథ పుట్టాయి. నదులలోని ప్రవాహపు వేగంకంటే యెక్కువ వేగంతో ప్రయాణం చెయ్యాలనే కోరికవల్ల తెడ్లనీ, తెరచాపలనీ పెట్టడం జరిగింది. దూరంనుంచే శత్రువులనీ, జంతువులనీ కొట్టాలనే కో బాణాలూ, అమ్ములూ వచ్చాయి. ఒక్క రాత్రిలో బ్రహ్మాండమైన ణంలో గుడ్డని నెయ్యాలనీ, రాత్రికి రాత్రే "హర్మ్య"లని, యే శత్రువూ ఛేది రక్షిత దుర్గాలని కట్టాలనీ మానవుడు కలగన్నాడు. అతి ప్రాచీనమైన నవిమ సంబెకోల ఒకటి. ప్రాచీన చేతి మగ్గం వచ్చింది, జ్ఞాని వసిలీసా[16] గురించి అద్భుత కథ పుట్టినట్టుగానే. జీవిత వాస్తవాలనుంచి అద్భుత కథలూ, పురా పుట్టుకొచ్చిన పద్ధతి గురించి యెవళ్లైనా డజన్ల కొద్దీ యింకా దాఖలాలని చూ వచ్చు. ప్రతిమలలోనూ, పరికల్పనలలోనూ రూపుతీసుకున్న ప్రాచీన మానవుడి తికమైన ఆలోచనా దూరదృష్టిని గురించి డజన్ల కొద్దీ దాఖలాలు చూపించవచ్చు ఆలోచన సాంకేతికంగా వుంది. తన అక్షంమీద భూమి పరిభ్రమణ శక్తిని వి గించుకోవడం, లేదా ధ్రువప్రాంతపు మంచుని ధ్వంసం చెయ్యడం లాంటి యి పరికల్పనల దాకా దారి తీసిన ఆలోచనా సరళి అన్నమాట. ప్రాచీన కాలపు పురా గాథలూ అన్నీ కూడా టాంటలస్ గురించిన పురాణంతో ముకుటాయ అయాయి. టాంటలస్ కంఠదఘ్నంగా నీట వున్నా తీరని దాహంతోటి పడిపోతాడు — తను యింకా జ్ఞేయం చేసుకోని బాహ్య ప్రపంచపు దృగ్గోచర విష తోటి పరివృతుడైన ప్రాచీన మానవుడి రూపం అది.

మీకు యీ ప్రాచీన కథలు, పురాణాలు, గాథలు తెలియవని గాదు. కాని మూల అర్థాన్ని మరింత లోతుగా అర్థం చేసుకోవాలి. తమ కష్టాన్ని తగ్గించుక ప్రాచీన కాలంలో శ్రమ జీవులు పడే యాతనలో ఈ అర్థం వుంది. ఉత్ పెంచాలనీ, చతుష్పాత్తు శత్రువులకీ, ద్విపాత్తు శత్రువులకీ వ్యతిరేకంగా సాయుధులు లనీ, ఉచ్చరించే మాటతోటి "మంత్రాలు" "ఆవాహనలు" చేసి తమకి విర వున్న ప్రకృతి శక్తులమీద ప్రభావం కలుగచెయ్యాలనీ వాళ్లు పడే యా ఈ అర్థం వుంది. యీ మంత్రాలూ, ఆవాహనలూ చెయ్యాలనేదానికి యింకా ప్రాముఖ్యం వుంది. యేమంటే తాము ఉచ్చరించే మాటకి గల శక్తిని గాఢంగా మానవులు నమ్మిందీ యిది తెలియజేస్తుంది. మానవుడి సాంఘిక జీవి శ్రమ క్రమాన్ని నియతం చేసేది మానవ భాష. దీని వల్ల వచ్చిన స్పష్ట స్పర్శనీయమైన లాభాలనుంచి యీ విశ్వాసం యేర్పడింది. వాళ్లు "ఆవాహనల" దేవుళ్లని ప్రభావితం చెయ్యాలని కూడా ప్రయత్నించారు. యిది సహజమే. యే ప్రాచీన కాలపు దేవుళ్లంతా భూమ్మీదే బతికారు, మానవుడి ఆకృతిలోనే వు

అలాగే ప్రవర్తించారు. వాళ్ళ ఆశ్రితుల పట్ల పక్షపాతంగా వుండేవాళ్ళు, అవిధేయంగా వున్న వాళ్ళని దండించారు. సరిగ్గా మానవుల్లాగానే అంతే అసూయతో, కసితో, ఆశతో వుండేవాళ్ళు. మతపరమైన ఆలోచన ప్రకృతి దృగ్గోచర విషయాలకి సంబంధించిన ధ్యానంనుంచి ఉత్పన్నం కాలేదనీ, సాంఘిక పోరాటంనుంచి ఉత్పన్నం అయిందనీ దేవతలు మానవ ఆకృతిధారులన్న వాస్తవంవల్ల రుజువు అవుతుంది. ప్రాచీన కాలపు "ప్రసిద్ధ జనం" దేవతలని కనిపెట్టడానికి ముడి సరుకు సరఫరా చేసి వుండడానికి అవకాశం వుంది. "శ్రమ వీరుడూ", "సకల నైపుణ్యాలనీ ఆపోశన పట్టినవాడూ" అయిన హెర్క్యులెస్ క్రమేపీ ఒలింపస్‌కి యెదిగి, దేవుళ్ల సరసన కూర్చున్నాడు. ప్రాచీన మానవుడి వూహలో ఒక దేవుడనేవాడు నైరూప్య భావమూ కాదు, లేదా అసహజమైన రూపమూ కాదు. యేదో శ్రమ పరికరంతోటో, యేదో ఒక వృత్తిలో నైపుణ్యంతోటో వుండిన శుద్ధ వాస్తవ ఆకారం, మానవుడి బోధకుడూ, సహ శ్రామికుడూనూ. శ్రమలో సాధించిన విజయాలకి సాకార కళాత్మక రూపమే దేవుడు. అంచేత శ్రమించే ప్రజల "మతపర"మైన ఆలోచన అనేది కొటేషన్ మార్కులతో చెప్పవలసిన విషయం, యేమంటే అది శుద్ధ కళాత్మక సృష్టి. అది మానవుడి సామర్థ్యాలని ఆదర్శీకరించి, వాటి శక్తివంతమైన అభివృద్ధికి పథనిర్దేశకం అయినా, పురాణాల సృష్టి అనేది మౌలికంగా వాస్తవమైనది. ప్రాచీన వూహా విహారాలు ప్రతిదాంట్లోనూ దాని ప్రేరణ గోచరమవుతుంది. తమ కష్టాన్ని తగ్గించుకోవడానికి మానవుల నిరంతర యత్నం ఈ ప్రేరణ. శారీరక శ్రమలో నిమగ్నమైన వాళ్లల్లోనుంచే యీ ప్రేరణ పుట్టింది అనేది స్పష్టమే. శ్రమని దోచుకునే యీ భూమ్మీది ప్రభువులకి అంతగా ఉపయోగకరం కాకపోయినట్లయితే యే దేవుడూ కూడా ప్రత్యక్షమై, అంత కాలం శ్రామిక జనుల దైనందిన జీవితంలో వుండేవాడు కాదు అనేదీ స్పష్టమే. మన దేశంలో దేవుడు వేగంగా, అనాయాసంగా నిరుపయోగం అయి పతనమై పోతున్నాడు. కచ్చితంగా యెందుకంటే దేవుడి ఉనికికి కారణాలు అదృశ్యం అయిపోతున్నాయి, అంటే ఒక మనిషిమీద యింకో మనిషి అధికారాన్ని సమర్థించే దానికి కారణాలు అన్నమాట. యేమంటే మన దేశంలో యెవడేనా గానీ తోటి మానవులతో సహకరించేవాడే; వాళ్ల మిత్రుడే, సహచరుడే, బోధకుడే కాని వాళ్ల మనస్సంకల్పాలమీద పెత్తనం చలాయించేవాడు యెంత మాత్రమూ కాదు.

బానిస యజమాని యెంతగా అధికార కాంక్షితుడై శక్తివంతుడైతే అంతగా దేవతలు స్వర్గంలోకి యెత్తు అధిరోహించి వెళ్లిపోయారు, ప్రజలలో దేవుళ్లతో పోటీపడే భావం పుట్టింది. యిది ప్రొమథ్యూస్ లాంటి మహా వీరుల రూపం ధరించింది. ఈ వీరులు యే దేవుణ్ణైనా గానీ ప్రభువులకు ప్రభువుగా పరిగణించి, తమకి శత్రువుగా చూశారు.

క్రీస్తు పూర్వపు పాగన్ జానపద సాహిత్యంలో "బ్రహ్మ పదార్థం" గురించి గాని, "యే దృగ్గోచర విషయానికైనా గల ఆది కారణం" గురించి గాని, "స్వయంసంపూర్ణ వస్తువు" గురించి గాని వుండే స్పష్టమైన ఆలోచనా అవశేషాలు కనబడవు. అంటే సామాన్యంగా, "అత్తిగా ప్రసక్తి" అయిన ప్లేటో[247] క్రీ.పూ. నాల్గవ శతాబ్దంలో రూపొందించిన ఆలోచనా ధోరణిబాపతు అన్నమాట. శ్రమ క్రమంనుంచీ, నిత్యజీవిత విషయాలనుంచీ పరిస్థితులనుంచీ వేర్పాటు అయిన ప్రపంచ అవగాహనా ధోరణిని ఆయన స్థాపించాడు. చర్చి ప్లేటోని క్రీస్తు మతానికి వైతాళికునిగా గుర్తించిందని మీకు తెలుసు కదా. అది పుట్టిన దగ్గర్నుంచీ "పాగన్ అవశేషాలకి" వ్యతిరేకంగా నడుం కట్టి పోరాడుతూనే వుండింది. అవి శ్రమలో వేళ్లుతన్నుకున్న, ప్రపంచపు భౌతికవాద అవగాహన ప్రతిబింబాలు మాత్రమే. బూర్జువాల శక్తి ఫ్యూడల్ ప్రభువులకి సోకడం మొదలవగానే బిషప్ బెర్క్లీ[248] భావవాద తత్వశాస్త్రం ప్రత్యక్షమైంది. దీని ప్రగతి వ్యతిరేక స్వభావాన్ని భావవాదానికి వ్యతిరేకంగా తను రాసిన సమరశీల గ్రంథంలో[249] లెనిన్ వెల్లడి చేశాడు. పద్దెనిమిదవ శతాబ్దపు ఆఖరులో, ఫ్రెంచి విప్లవ సమయమప్పుడు బూర్జువాలు ఫ్యూడలిజానికీ, దాని ప్రేరకమైన మతానికీ వ్యతిరేకంగా పోరాటంలో భౌతికవాద చింతనని వినియోగించుకున్నారు. శత్రువుమీద తమ విజయం తర్వాత బూర్జువాలు, తమ కొత్త శత్రువు అయిన శ్రామికవర్గం అంటే భయం కొద్దీ వెంటనే భావవాద తత్వశాస్త్రానికీ, చర్చి ఒళ్లోకీ తిరిగి వెళ్లిపోయారు. శ్రమజీవులమీద తమ అధికారపు అనియత, అనిశ్చిత స్వభావాన్ని కొంచెం యించుమించుగా గుర్తించిన వాళ్లై, బూర్జువాలు 19వ శతాబ్దం అంతా కూడా తమ ఉనికిని సమర్థించుకోడానికి విమర్శనవాదం, పోజిటివిజం, హేతువాదం ప్రాయోగికవాదం లాంటి వాదాలతోటీ యింకా తదితర ప్రయత్నాలతోటి శ్రమ క్రమంలో వేళ్ళ తన్నుకుని వున్న శుద్ధ భౌతికవాదాన్ని వక్రీకించడానికి తంటాలు పడుతూనే వున్నారు. యీ ప్రయత్నాలన్నీ కూడా ప్రపంచాన్ని గురించి "వివరించడం"లో పూర్తి అశక్తతని ప్రదర్శించాయి. యిరవైయవ శతాబ్దంలో ఆదర్శవాది బెర్గ్‌సన్[250] మరో సారి తాత్విక చింతనా ధోరణికి నాయకుడుగా గుర్తింపు పొందుతాడు. ఆయన బోధన, సందర్భవశాత్తూ, "కాథలిక్ మతాన్ని అనుగ్రహిస్తుంది." యీ తిరోగమనపు అవసరాన్ని నిర్మొహమాటంగా ఒప్పుకోవడం అనేదాన్ని టెక్నాలజీ—యీ టెక్నాలజీయే వాళ్లకి అమితమైన సంపదని యిచ్చింది—వేగవంతమైన అభివృద్ధిలో దాగి వున్న వినాశకర ఫలితాలని గురించి బూర్జువాలు చేస్తున్న ఫిర్యాదుల సరసన పెట్టి చూస్తే బూర్జువాల మేధా దారిద్ర్యం గురించీ, ఒక చారిత్రక అవశేషంగా బూర్జువావర్గాన్ని నిర్మూలించవలసిన అవసరం గురించీ మనకి స్పష్టమైన అవగాహన వస్తుంది. బూర్జువావర్గపు కుళ్లునుంచి వచ్చి

పడే పదార్థం ప్రపంచాన్ని విషపూరితం చేస్తోంది. జీవితపు ప్రాథమిక దృగ్గోచర విషయాన్ని జ్ఞేయం చేసుకోవడంనుంచి యే మాత్రం పక్కకి మళ్లినా దాన్నుంచే మేధా దారిద్ర్యం అనేది యెప్పుడూ వచ్చింది — జీవిత భయంలో పాతుకున్న పలాయనవాదంనుంచో, లేదా స్వార్థపూరిత ప్రశాంతత కోసం ఆసక్తినుంచో, లేదా పెట్టుబడిదారీ ప్రభుత్వపు వెలపరం పుట్టించే అరాచకత్వ, నీచత్వ జనితమైన సామాజిక ఉదాసీనతనుంచో వచ్చింది.

మార్క్సిస్టులు సంస్కృతి చరిత్ర రాసేటప్పుడు, సంస్కృతీ సృజనాక్రమంలో బూర్జువాల పాత్ర అతిశయోక్తిగా చెప్పబడిందనీ, ముఖ్యంగా సాహిత్యంలో, యింకా యెక్కువగా చిత్రకళలో అలా చెయ్యడం జరిగిందనీ మనకి కనిపిస్తాయని సహేతుకంగానే అనుకోవచ్చు. చిత్రకళా రంగంపై బూర్జువాలు యెప్పుడూ యజమానులే, తత్ఫలితంగా శాసనకర్తలు. సంస్కృతి సృజన అనేదాన్ని భోగవస్తువుల అభివృద్ధికంటే, బాహ్య, జీవిత సౌకర్యాల నిరంతర అభివృద్ధికంటే యెక్కువ అయిందిగా అర్థం చేసుకుంటే బూర్జువాలు అలాంటి కోరికకి యెప్పుడూ ఆశ్రయం యివ్వలేదు. పెట్టుబడిదారీ విధానపు సంస్కృతి అనేది ప్రపంచంమీద, స్త్రీ పురుషులమీద, భూమి సంపదలమీద, ప్రకృతి శక్తులమీద బూర్జువాల భౌతిక, నైతిక అధికారాన్ని విస్తరింపచేసి, పదిల పరచుకోవడం కోసం ఉద్దేశించిన పద్ధతుల వ్యవస్థ తప్ప యింకేమీ కాదు. సకల మానవాళి పురోభివృద్ధికి అవసరం అయిందిగా సాంస్కృతిక అభివృద్ధి అర్థాన్ని బూర్జువాలు యెన్నడూ గ్రహించలేరు. బూర్జువాల ఆర్థిక విధాన ఫలితంగా, ఒక రాజ్యంగా వ్యవస్థితమైన యే పొరుగు జాతిని అయినా సరే శత్రువుగానే చూడ్డం జరుగుతుంది. అంత బాగా వ్యవస్థితం కాని తెగలు, ముఖ్యంగా రంగు తెగలు, బూర్జువాలకి బానిసల్లాగా దాస్యం చేస్తున్నాయి, వాళ్లని పడుపు వృత్తికై మోసగించబడిన యువతుల కంటే కనాకష్టంగా చూడ్డం జరుగుతోంది.

రైతులకీ, శ్రామికులకీ విద్యపొందే హక్కు, తమ తెలివితేటల్ని, జీవితాన్ని జ్ఞేయం చేసుకునే హక్కు తమ యిచ్ఛని అభివృద్ధి చేసుకునే హక్కు, దాన్ని మార్చుకునే హక్కు, పని పరిస్థితులని మెరుగు పరుచుకునే హక్కు లేకుండా చెయ్యడం జరిగింది. పెట్టుబడిదారీ విధానానికి విధేయులైన సేవకులని, పెట్టుబడిదారీ విధానం శాశ్వతం అయిందనీ చట్టబద్ధంగా వుంటుందనీ నమ్మేవాళ్లని, తయారు చెయ్యడానికే పాఠశాల విద్యని లక్షించడం జరిగింది. ''ప్రజల విద్య'' అనేదానిమీద యెంతో రాశారు, యెంతో మాట్లాడారు. అక్షరాస్యత విస్తృతిని గురించి డబ్బాలు కొట్టుకోవడం జరిగింది. కాని వాస్తవంలో శ్రామికుల్ని విభజించి, జాతుల మధ్య, జాతీయతల మధ్య, మతాల మధ్య రాజీలేని భేదాభిప్రాయాలని బోధించి శ్రామికుల బుర్రల్లో కుక్కడం

జరిగింది. యీ బోధన రాక్షసమైన వలసవాద సిద్ధాంతాన్ని సమర్థించడానికి ప్రయత్నిస్తుంది. సంపద కూడబెట్టుకోవాలనే బుద్ధిలేని కోరికకి, దుకాణదార్ల వెధవ దురాశకి యీ సిద్ధాంతం యింకా యెక్కువ అవకాశాలని యిస్తుంది. బూర్జువా సైన్సు యీ బోధనకి పూడిగం చేసింది. మిగతా అన్ని జాతుల పట్లా ఆర్యన్ల విరుద్ధ దృష్టి "మొత్తం ప్రజల అధిభౌతిక కార్యకలాపాల నుంచి అనయవిగా అభివృద్ధి చెందింద"ని ప్రకటించేందుకు దిగజారడానిక్కూడా జంకు లేకపోయింది దానికి. యేమైనా, "మొత్తం ఒక ప్రజ" రంగు జాతులన్నా, సెమైట్స్ అన్నా అవమానకరమైన, ఆటవిక అసహ్యం అనే అంటువ్యాధి పీడితులయారంటే ఆ అంటువ్యాధి బూర్జువాల యదార్థ భౌతిక, పరమ యేహ్యమైన "దహించే, హింసించే" కార్యకలాపాలవల్లనే వ్యాప్తి చెందిందనేది శుద్ధ స్పష్టం. యీ కార్యకలాపాలని దేవుని ప్రియ పుత్రుని బాధకి ప్రతీకగా క్రైస్తవ చర్చి మల్లించిందని గుర్తుచేసుకుంటే, యిందులోని క్రూర వినోదం దాని సర్వ యేహ్యకరమైన నగ్నత్వంతోనూ వెల్లడి అవుతుంది. సందర్భవశాత్తూ "దేవుని కుమారు"డైన క్రీస్తు ఒక్కడే చర్చి సాహిత్యం సృష్టించిన "గుణయుక్త"మైన నమూనా. చర్చి సాహిత్యపు సృజనాత్మక అశక్తత సకల జీవిత వైరుధ్యాలనీ యీ దురదృష్ట సమన్వయ కర్తలో కొట్ట వచ్చినట్టు కనబడుతుంది.

నూతన నైపుణ్యాల అభివృద్ధికి కూడా బూర్జువాల ప్రతిఘటన వుంటుంది. దీన్ని వెల్లడి చేసే అనేక వాస్తవాలు సాంకేతిక, విజ్ఞానశాస్త్ర ఆవిష్కరణ చరిత్రలో వున్నాయి. యీ వాస్తవాలు అందరికీ తెలిసినవే, వాటి కారణంగానే — సజీవ శ్రమశక్తి చవకగా వుండటం. యేమైనా సాంకేతిక విజ్ఞానం పెరిగిందనీ, తగినంత అభివృద్ధి సాధించిందనీ అంటారు. దాన్ని కాదనలేం. కాని, సాంకేతిక విజ్ఞానమే దాని భవిష్యదభివృద్ధినీ, అందులో వున్న అవకాశాలనీ గుర్తించేటట్టు మానవుడికి ప్రేరణ యిస్తుందన్న వాస్తవం నుంచి అది ఉద్భవిస్తుంది.

తమ కాలంలో బూర్జువాలు విప్లవకారులన్న మాటని నేను కాదనను. ఉదాహరణకి ఫ్యూడలిజానికి సంబంధించి. వాళ్లు భౌతిక సంస్కృతి పెరుగుదలకి దోహద పడ్డారు, యీ అభివృద్ధికి శ్రామిక జనుల ప్రయోజనాలనీ శక్తులనీ విధిగా బలి పెడుతూ. తమ విజయం తర్వాత కూడా ఫ్రెంచ్ బూర్జువాలు, వ్యాపారానికీ, ఆత్మరక్షణకీ ఆవిరి ఓడల ప్రాముఖ్యాన్ని తక్షణం గుర్తించలేకపోయారని ఫుల్టన్[251] ఉదాహరణ తెలియజేస్తోంది. సంస్కారహీనుల ఛాందసతత్వానికి యిదొక్కటే ఉదాహరణా కాదు. ప్రపంచంమీద తమ అధికారాన్ని సంఘటిత పరచుకుని, రక్షించుకోవాలనే బూర్జువాల తపనని మరుగు పరిచే యీ తిరోగమనతత్వం, మేధాపరంగా అభివృద్ధి చెందడానికి శ్రామిక జనులకి ప్రతి రకంగానూ అవకాశాలని పరిమితం చేసిందనీ, కాని ప్రపం

చంలో కడకి ఒక నూతన శక్తి, శ్రామికవర్గం అనే శక్తి, ఆవిర్భవించడానికి దారి తీసిందనీ గుర్తించడం ముఖ్యం. యీ శ్రామికవర్గం అప్పడే ఒక రాజ్యాన్ని నిర్మిం చుకుంది, అక్కడ మేధాభివృద్ధి పరిమితం కాదు. బూర్జువాలు యే ఆటంకమూ చెయ్యకుండా సాంకేతిక నూతన కల్పనలని ఆమోదించిన రంగం ఒకటే వుంది — మనుషులని మట్టుపెట్టడానికి ఆయుధాలని ఉత్పత్తి చేసే రంగం. బూర్జువాలు ఆత్మ రక్షణకి చేసే ఆయుధాల ఉత్పత్తి, లోహ పరిశ్రమలో సాంకేతిక విజ్ఞానపు సామాన్యా భివృద్ధిమీద కలిగించిన ప్రభావం యింకా యెవరూ గుర్తించినట్టు లేదు.

చేతులు బుర్రకి బోధించినప్పుడు, తర్వాత బుర్ర నూతన విజ్ఞానాన్ని చేతులకి అందించినప్పుడు, అవి మళ్లీ తమ వంతుగా మెదడు యితోధికంగా అభివృద్ధి చెంద డానికి సహకరించినప్పడే మామూలుగా ప్రజల సాంఘిక, సాంస్కృతిక అభివృద్ధి జరుగు తుంది. శ్రామికజనుల సాంస్కృతికాభివృద్ధికిగల యీ సాధారణ క్రమం, ప్రాచీన కాలంలో మీకు తెలిసిన కారణాలవల్ల అడ్డగింపబడింది. మేధా శ్రమకీ శారీరక శ్రమకీ మధ్యన చీలిక యేర్పడింది. మానవ ఆలోచన నేల విడిచి సాము చేసింది. వాస్తవ జీవితంలో ఆచరణాత్మక కృషి చేసేవాళ్ల మధ్యలోనుంచి, ప్రపంచాన్నీ, ఆలోచనాభివృద్ధినీ నైరూ ప్యంగా, ప్రపంచాన్ని మానవుల ప్రయోజనాల కోసం, లక్ష్యాల కోసం మార్చే శ్రమ క్రమాలతో సంబంధం లేకుండా, వివరించే ఆలోచనాశీలురు తయారయారు. మొదట్లో వాళ్లు బహుశా శ్రామిక అనుభవాన్ని వ్యవస్థీకరించేవాళ్లు అయివుంటారు, యివాళ మనం మన దేశంలో చూసే శ్రమ వీరుల్లాగా వుండి వుంటారు. తర్వాత, అలాంటి వాళ్లల్లో మిగతా వాళ్లమీద అధికారం చేజిక్కించుకోవాలనే ప్రలోభం — సకల సాంఘిక చెడు గులకీ మూలం అయిన ప్రలోభం — ఉద్భవించి వుంటుంది. అలాగే యితరుల శ్రమమీద కులాసాగా బతకాలనే కోరికా, తమ వైయక్తిక శక్తిని గురించి అమిత అతిశయోక్తితో కూడిన భావం వచ్చి వుంటాయి. ఒక ప్రత్యేక వ్యక్తిలోని అసాధారణ సామర్థ్యాలని గుర్తించడంలో యీ భావం మొదట తల యెత్తి వుంటుంది, యీ సామర్థ్యాలు అంటే తెగదో, గణందో, శ్రమ విజయాల సమష్టి, వాటి ప్రతిబింబం అయినా కూడా. శ్రమకీ, ఆలోచనకీ మధ్యన యేర్పడిన చీలికని సంస్కృతి చరిత్రకారులు మొత్తం ప్రాచీన జనసమూహం అంతటికీ ఆపాదించారు. యీ సమాజం వ్యక్తివాదులని సృష్టిం చింది. దీన్ని యీ సంస్కృతి చరిత్రకారులు ఘనమైందిగా పరిగణించారు. సాహిత్య చరిత్ర సంపూర్తిగా, స్పష్టంగా వ్యక్తివాద చరిత్రని అందిస్తుంది. నేను మళ్లీ మరో సారి, కామ్రేడ్స్, మీ దృష్టికి తెస్తున్న విషయం యేమిటంటే అత్యంత

గంభీరమైన, నదురైన, కళాత్మకంగా పరిపూర్ణమైన నాయక నమూనాలని జానపద సాహిత్యం సృష్టించింది. అవి శ్రామిక జనుల మౌఖిక సృష్టి. హెర్క్యులెస్, ప్రొమిథ్యూస్, మికూల సెల్యానీనొవిచ్,[252] స్వ్యాతొగొర్,[253] డాక్టర్ ఫౌస్ట్, జ్ఞాని వసిలీసా, వ్యంగ్యంగా వుండే తిక్క ఇవాన్,[254] పెత్రూష్క[255]ల్లాంటి నమూనాల పూర్ణత్వం – యివన్నీ కూడా హేతువునీ సద్యోవబోధనీ, ఆలోచననీ అనుభూతినీ సామరస్యంతో మేళవించుకున్న సృష్టి గల నమూనాలు. యీ మేళన, దీని సృష్టికర్త జీవితపు సృజనాత్మక కృషిలో ప్రత్యక్షంగా పాత్ర నిర్వహించినప్పుడే, జీవితాన్ని తిరిగి మలచడం అనే పోరాటంలో ప్రత్యక్ష పాత్ర నిర్వహించినప్పుడే సాధ్యం.

దోపిడీదార్లవల్ల తమ బానిస చాకిరీ నిరర్థకమై, రక్షణ లేకుండా నిరంకుశత్వపు దయాదాక్షిణ్యాలమీద తమ సొంత బతుకులు ఆధారపడడంవల్ల జానపద సాహిత్య సృష్టి కర్తలు కష్ట భూయిష్టమైన, వేదనా భరితమైన జీవితాలు గడిపినప్పటికీ కూడా జానపద సాహిత్యానికి నిరాశావాదం అనేది పరాయిదే. యేమైనా సమష్టికి తన అమరత్వం గురించిన స్పృహ వుండేది, సకల విద్వేష శక్తులమీద అంతిమ విజయం సాధిస్తామన్న విశ్వాసం వుండేది. జానపద సాహిత్యంలోని నాయకుడు తండ్రీ, సోదరులూ అసహ్యించుకున్న 'తెలివితక్కువవాడు' యెప్పుడూ కూడా వాళ్ల కంటే తెలివైన వాడు అని రుజువు అయేవాడు, నిత్యజీవితపు ప్రతికూలాల్లో యెప్పుడూ కూడా నెగ్గేవాడు, జ్ఞాని వసిలీసా లాగా.

జీవిత పరమార్థాన్ని గురించి నిరాశా, నిస్పృహలు యెప్పుడేనా జానపద సాహిత్యంలో తలెత్తితే, క్రైస్తవ మతం నిరాశావాదాన్ని రెండు వేల సంవత్సరాలు బోధించిన దాని ఫలితం అవి. అలాగే పెట్టుబడిదారుని సమ్మోటకీ, శ్రమజీవుల దాయకీ మధ్యన వుండే పెటీబూర్జువా పరాన్నభుక్కుల అజ్ఞాన సంశయాత్మకతవల్ల వచ్చినవివీ. శ్రమ విజయాలనుంచి ఉత్పన్నమైన జానపద సాహిత్యపు అద్భుత వూహా విహారాలకీ, "రుషుల జీవితాల" గురించి మత సాహిత్యంలో వున్న మడ్డి, మందకొడి అభూతకల్పనకీ, మధ్య యుగ శూరుల సాహసకృత్యాల నిస్సారమైన విచిత్రానికీ మధ్యన పోల్చి చూస్తే జానపద సాహిత్యపు ప్రాముఖ్యం అర్థం అవుతుంది.

ఫ్యూడల్ కులీనులు సృష్టించిన మధ్య యుగాల నాటి శూరులున్న నవలా,[256] మహా కావ్యమూ నెగ్గినవాణ్ణే తమ నాయకుడుగా ప్రదర్శించేవి. ఫ్యూడల్ సాహిత్యపు ప్రభావం యెప్పుడూ గణనీయంగా లేదనేది మామూలుగా తెలిసిన విషయమే.

యీజిప్షియన్ "దొంగ కథ"తో బూర్జువా సాహిత్యం ప్రాచీన కాలంలో మొదలైంది. దాన్ని గ్రీకులూ, రోమన్లూ కొనసాగించారు. మధ్యయుగాల ఫ్యూడల్ శూరుల వ్యవస్థ పతనం అయేటప్పుడు, మధ్యయుగాల అద్భుత ప్రేమ కథకి మారుగా, మళ్లీ

ప్రత్యక్షం అయింది. యిది నిజంగా బూర్జువా సాహిత్యం, దీని నాయకుడు వంచకుడు, దొంగ; మళ్లీ డిటెక్టివ్, దొంగ; కాని యీ సారి ''ఘరానా దొంగ.''

15వ శతాబ్దానికి చెందిన తిల్ ఉలెన్‌స్పీగిల్[257]తోటి, 17వ శతాబ్దానికి చెందిన సింప్లిస్సిమస్‌లతో ఆరంభించి అప్పుడు తోర్మేస్‌నుంచి లాజరిల్లో,[258] జిల్ బ్లాస్,[259] స్మాలెట్ ఫీల్డింగ్‌ల నాయకులనుంచి మహా ''ప్రాణ మిత్రుడు'', అర్సేన్ లుపేన్,[260] యీనాటి యూరపియన్ సాహిత్యంలోని ''డిటెక్టివ్'' సాహిత్యంలోని నాయకుల దాకా చూస్తే, దగాకోర్లు, దొంగలు, హంతకులు , డిటెక్టివ్‌లు నాయకులుగా వున్న పుస్తకాలని వేలకొద్దీ మనం ఉదాహరించవచ్చు. యిది నిజంగా సిసలైన బూర్జువా సాహిత్యం. యిది యెవళ్లకి వినోదం సమకూరుస్తుందో వాళ్ల సిసలైన అభిరుచులనీ, ప్రయోజనాలనీ, ఆచరణాత్మక ''నీతుల''నీ ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తుంది. యేమైనా దీని వల్ల కొంత మేలు జరిగింది. యేమంటే, సంస్కారహీనుల ''లోకజ్ఞానం'' అనే అరిగిపోయిన మాటతో సహా, సకల రకాల అసభ్యత తాలూకు పుష్కలమైన అలంకరణలూ వున్నప్పటికీనీ, శాంకో పాంజా,[261] ది కస్టోయిర్ తిల్ ఉలెన్‌స్పీగిల్ లాంటివీ యింకా తదితరమైనవీ, అద్భుత కళాత్మక సాధారణీకరణలు పుట్టాయి. నేరాన్ని చిత్రించడంలో బూర్జువాల గాఢ వర్గ ప్రయోజనానికి బలమైన ఉదాహరణ పాన్‌సాన్ ద్యు టెరైల్ ప్రఖ్యాత సందర్భమే. యీ రచయిత రొకమ్‌బోల్[262]ని గురించి ఎక్కువ సంపుటాల నవలని నాయకుడి మరణంతోటి ముగించేస్తే, నవలని కొనసాగించాలని పాఠకులు అతని యింటి ముందు ప్రదర్శన చేశారు. యిలాంటి విజయం అంతకు ముందు యూరప్‌లో యే అత్యంత ప్రఖ్యాతులైన రచయితకీ కూడా రాలేదు. పాఠకులకి యింకా కొన్ని సంపుటాలు రొకమ్‌బోల్‌ని గురించి దక్కాయి. రొకమ్‌బోల్‌ని భౌతికంగానే కాకుండా నైతికంగా కూడా పునరుజ్జీవింప చెయ్యడం జరిగింది. ఒక హంతకుడూ దొంగా మంచి బూర్జువాగా మారే మొరటు ఉదాహరణలు బూర్జువా సాహిత్యం అంతటిలోనూ సాధారణమూ, సామాన్యమూనూ. బూర్జువాలు డిటెక్టివ్ యుక్తిని యెంత ఆస్వాదయోగ్యంగా భావిస్తారో అంతే ఆస్వాదయోగ్యంగా దొంగ నైపుణ్యాన్నీ, హంతకుడి జిత్తులనీ అభిమానిస్తారు. యివాళ యూరప్‌లో కడుపునిండిన వాళ్లకి డిటెక్టివ్ నవల అభిమాన పాత్రమైన కాలక్షేపం. యీ సాహిత్యం అర్ధాకలితో మాడే శ్రామిక జనంలోకి కూడా పాకింది. వాళ్ల వర్గ చైతన్యం కుంటి నడకతో పెరగడానికి యిదొక కారణం. హస్తలాఘవం వున్న దొంగల పట్ల అభిమానాన్ని యిది సృష్టిస్తుంది, దొంగిలించాలనే కోరికని ప్రోత్సహిస్తుంది — బూర్జువా ఆస్తికి వ్యతిరేకంగా వ్యక్తులు చేసే పాక్షిక యుద్ధం. శ్రామికజన జీవితాలంటే బూర్జువాలకి యెంత తక్కువ విలువ వుందో చిత్రిస్తూ యీ సాహిత్యం హత్యలూ, యితర నేరాలూ వ్యాపించడానికి దోహదం చేస్తుంది. యూరపియన్ సంస్కారహీనులకి డిటెక్టివ్

నవలలంటే వున్న తీవ్రమైన అనురాగానికి ఆ బాపతు పుస్తకాలు పెద్ద సంఖ్యలో వెలు వడ్డమూ అలాంటి రచయితలూ, నవలలూ యెక్కువగా వుండడమూనే స్పష్టమైన రుజువు.

ఆసక్తికరమైన విషయం యేమిటంటే 19వ శతాబ్దంలో స్టాక్ ఎక్స్చేంజీలోనూ, పార్లమెంట్‌లోనూ, పత్రికలలోనూ అల్ప మోసాలు వీరోచితమైన ఘనమైన స్థాయికి పెరిగినప్పుడు సాహిత్యంలో వంచకుడు డిటెక్టివ్‌కి పెద్ద పీట వేశాడు. యీ డిటె క్టివ్, శ్రామిక ప్రజలకి వ్యతిరేకంగా బహిరంగ నేరాలు జరిగే ప్రపంచంలో అత్యంత గూఢమైన నేరాలని, వూహాల్లో మాత్రమే వుండే వాటిని, తెలివిగా పరిష్కరించేస్తాడు. సుప్రసిద్ధ షెర్లాక్ హోమ్స్[263] యింగ్లండ్‌లో ప్రత్యక్షం అవడం అనేది యెంత మాత్రం కాకతాళీయం కాదు. యీ సిద్ధహస్తుడైన డిటెక్టివ్ పక్కపక్కనే యెంతటి డిటెక్టివ్‌నేనా కన్ను కప్పెయ్య గల నేర్పు వున్న "ఘరానా దొంగ" ప్రత్యక్షం అవడం కూడా అంతే తక్కువ కాకతాళీయం. యీ నాయకుల మార్పుని "వూహా క్రీడ"గా భావించే వాళ్లు పొరపాటు పడుతున్నారు. వాస్తవం ప్రేరేపించిన దాన్నే వూహ సృష్టిస్తుంది; అది అద్భుత కల్పనల వూహలతోటి ప్రభావితం కాదు, వాస్తవమైన కారణాలతోటే.

సాహిత్యపు రూపాలన్నిటిలోనూ, ట్రాజెడీ, కామెడీ — తమ పాత్రల ఉద్రేకాలనీ, ఆలో చనలనీ రంగస్థల పదర్శన రీత్యా వెల్లడి చేసేవి — ప్రజలమీద అత్యంత ప్రభావం కలిగి వుంటాయి. షేక్స్పియర్‌తోటి మొదలైన యూరపియన్ విషాద నాటకపు పురోగతిని మనం చూసినట్లయితే అది కోట్‌జెబూ, నెస్తర్ కూకొల్నిక్,[264] సర్దూ, యింకా అధమ స్థాయికీ దిగజారడం మనకి కనిపిస్తుంది. యిక మొల్యేర్ కామెడీ స్క్రిబ్, పల్యెరోన్ దాకా వచ్చి, మన దేశంలో అయితే గ్రిబొయేదొవ్, గోగొల్ తర్వాత అదృశ్యమే అయి పోయింది. కళ ప్రజలని చిత్రిస్తుంది కాబట్టి నాటక ప్రక్రియ పతనం కావడమనేది దృఢమైన, చక్కగా నిర్వచింపబడిన పాత్రల పతనం జరిగిందని, "గొప్పవాళ్లు" అదృశ్యం అయారనీ తెలియజేస్తున్నట్టు అనుకోవచ్చు.

అయినా యివాళ కూడా, ఉదాహరణకి, అసహ్యకరమైన థెర్‌సీట్[265] — బూర్జువా పత్రికా రంగంలో; మనుషులంటే కిట్టని ఏథెన్స్ టైమన్[266] — సాహిత్యంలో; రక్తం పీల్చే జలగ షైలాక్[267] — రాజకీయాల్లో; జూడాస్, శ్రామికజన ద్రోహి లాంటి గతంలో చిత్రిం చిన యింకా యెన్నో నమూనాలు వున్నాయి, వృద్ధి పొందుతూనే వున్నాయి. పదిహేడవ శతాబ్దంనుంచి అలాంటి వ్యకుల సంఖ్య పెరిగింది. వాళ్లు గుణంలో యింకా అసహ్య కరంగా తయారయారు. యివాళ పెట్రోల్ చక్రవర్తులు, ఉక్కు చక్రవర్తులు యింకా అలాంటి బోలెడు మంది చక్రవర్తులు లూయీ XI కంటే, లేదా ఇవాన్ ది టెర్రిబుల్[268] కంటే యింకా యెంతో దుర్మార్గులూ, నేరస్థులూనూ. దక్షిణ అమెరికాలోని

చిన్న రిపబ్లిక్కులలో 14, 15 శతాబ్దాల నాటి ఇటాలియన్ కాండోట్యేర్స్[269] కంటే యే మాత్రం తగ్గని మనుషులు చురుకుగా వున్నారు. ఫోర్డ్,[270] రాబర్ట్ ఓవెన్[271]పై ఒక్కడే వ్యంగ్యం చిత్రం కాదు. కరగబెట్టిన బంగారాన్ని గొంతుకలో పోయించిన ఆ చక్రవర్తినెవణ్నో మినహాయిస్తే, ప్యిర్‌పాంట్ మోర్గన్[272] భయంకర విగ్రహానికి గతంలో పోటీయే లేదు.

పంథొమ్మిది, యిరవై శతాబ్దుల్లో బూర్జువాల ఆచరణాత్మక కార్యకలాపాల వల్ల సృష్టి అయిన భిన్న తరహా "గొప్ప వాళ్ల"ని అలాంటి నమూనాలు సమగ్రంగా తెలియజెయ్యవనుకోండి. అలాంటి వ్యక్తులకి డబ్బుని పోగుపెట్టుకోవడంలోనూ, ప్రపంచాన్ని కొల్లగొట్టడంలోనూ, తమ వ్యక్తిగత సంపద కోసం అంతర్జాతీయ పాత్రోచితశక్తి, మారణాన్ని కల్పించడంలోనూ వున్న కరతలామలకమైన ప్రతిభా, లేవని అనలేం. వాళ్ల యేహ్యమైన కార్యకలాపాల్లో వున్న ఆశ్చర్యకరమైన లజ్జా రాహిత్యాన్నీ అమానుషాన్నీ యెవరూ కాదనలేరు. యూరప్‌లోని సవిమర్శనాత్మక వాస్తవిక, కళాత్మక సాహిత్యం అలాంటి జనాన్ని దాటి పోయింది, అలాంటి వాళ్లు వున్నారనే యెరుకే లేనట్టుగా.

సాహిత్యం సాంఘికంగా "అధికమైన వ్యక్తి"ని చిత్రించినంత కళాత్మక శక్తితోటి ఒక బేంకర్ నమూనా, పారిశ్రామికవేత్త నమూనా, రాజకీయవేత్త నమూనా, నాటకంలో గాని నవలలోగాని చిత్రించడం మనకి కనిపించదు. బూర్జువా సంస్కృతి సృష్టికర్తలూ, నాయకులూ — సాంకేతిక రంగంలో కొత్తని కనిపెట్టిన వాళ్లు, కళాకారులు, శాస్త్రవేత్తలు అయిన వీళ్ల విషాదభరిత, సామాన్య జీవిత పథాలని సాహిత్యం ప్రతిబింబించ లేదు. లేదా పరాయి పాలననుంచి జాతుల విముక్తి కోసం పోరాడిన వీరులని యెవర్నీ చిత్రించలేదు. లేదా థామస్ మూర్,[273] కాంపనెల్లా,[274] ఫోరియర్,[275] సెంట్ సైమన్[276] లాంటి సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని కలగన్న వాళ్లనీ చిత్రించలేదు. దీన్నంతటినీ నిందగా చెప్పడం లేదు. గతం అనింద్యమైంది కాదని కాదు, కాని నిందించడం అర్థరహితం. గతాన్ని అధ్యయనం చెయ్యాలి.

యిరవైయవ శతాబ్దపు యూరపియన్ సాహిత్యం ప్రదర్శించిన సృజనాత్మక అశక్తతకి యేది కారణం? కళా స్వాతంత్ర్యాన్నీ, సృజనాత్మక చింతనకి గల స్వయం సంకల్పాన్నీ ఆగ్రహంతోటీ, పదగుంఫనతోటీ సమర్థించడం జరిగింది. సాహిత్యం వర్గాలకి వెలిగా వుండి అభివృద్ధిచెందే అవకాశమూ, సాంఘిక రాజకీయాలమీద ఆధారపడకుండా వుండగలగడమూ నొక్కి చెప్పడం జరిగింది. యీ వాదన చవక రాజకీయం. యేమంటే చాలా మంది రచయితలు వాస్తవ జీవితపు తమ పరిశీలనల పరిధిని కుంచింప చేసుకోవడానికీ, ఆ జీవితాన్ని విశాలంగా సర్వగ్రాసిగా అధ్యయనం చేయ నిరాకరించడానికీ, "అంతరాత్మ ఒంటరితనంతో" తమని తాము బంధించేసుకోడానికీ, జీవితాన్నుంచి

విడిపోయిన అంతర్మథనద్వారా, స్వయం సంకల్పిత ఆలోచనద్వారా నిష్ఫలమైన ''ఆత్మజ్ఞేయత'' గురించి ఆలోచించగలగడానికీ క్రమేపీ దారితియ్యడంలో యిది నిమిత్త మాత్రం. రాజకీయాలు పరివేష్టించి వున్న వాస్తవ జీవితపు యెల్లలకావల మానవుడు అగ్రాహ్యంగానే వుంటాడు. మానవుడు తనకిగా యే సంక్లిష్ట నిర్మాణం తయారుచేసుకున్నా గానీ అతను సాంఘిక అంశంగానే వుండిపోయాడు, గ్రహాలల్లాగా విశ్వసంబంధమైన అంశం కాకుండా. వ్యక్తిత్వవాదం అనేది అహమేవవాదంగా అభివృద్ధి చెందడంవల్ల ''అధికమైన వ్యక్తులు'' అవతరించడానికి దారితీస్తుంది. యెంతో నైపుణ్యంతోటీ, ఆమోదయోగ్యంగానూ 19వ శతాబ్దపు యూరపియన్ సాహిత్యం సృష్టించిన నమూనా ''అధికమైన వ్యక్తి'' అనే విషయాన్ని మళ్లీమళ్లీ చెబుతూ వుంటారు. సాంకేతికంగా యే సరంజనూ లేకపోయినప్పటికీ, తన అంతర్గత శక్తి విజేయతని గుర్తించిన శ్రమ వీరుడి నుంచి అభివృద్ధి చెందడంలో సాహిత్యం చేరుకున్న దశ అదీ; సృష్టించడం కంటే కొల్లగొట్టడం సులభం అని గుర్తించిన ఫ్యూడల్ విజేతనుంచి వచ్చి చేరుకొన్న దశ అదీ; బూర్జువాలకి ''జీవిత గురువూ'', యిప్పుడూ అయిన వంచకుడు, శ్రమించడం కంటే మోసం చెయ్యడం, దొంగిలించడం సులభం అని గుర్తించిన ఆ మనిషినుంచి సాహిత్యం వచ్చి చేరిన దశ అదీ. ఫ్యూడల్ ప్రభువుల కంటే, బిషప్పుల కంటే, చక్రవర్తుల కంటే, జార్ల కంటే పరమ కిరాతకమైన మనుషులని, — పెట్టుబడిదారీ విధానాన్ని స్థాపించి, మానవాళిని అణగదొక్కిన గణనీయమైన మనుషులని, — దాటివచ్చి సాహిత్యం చేరిన దశ అదీ.

పశ్చిమ దేశాల బూర్జువా సాహిత్యంలో రెండు రకాల రచయితలని విభేదించి చూడాలి. ఒక రకం తమ వర్గాన్ని స్తోత్రంచేసి, వినోదపరిచిన వాళ్లు. వీళ్లంతా ''మంచి బూర్జువా''ల నమూనా ప్రాయులు. రెండో రకంలో డజన్ల కొద్దీ మాత్రమే పేర్లు వున్నాయి. యిందులో సవిమర్శక వాస్తవికవాదాన్నీ, విప్లవాత్మక రొమాంటిసిజాన్నీ సృష్టించిన అతి ప్రఖ్యాతులైన వాళ్లు వున్నారు. వీళ్లంతా కూడా తమ వర్గపు పరిధినుంచి బయటపడ్డ మత భ్రష్టులు, బూర్జువాల చేతిలో పతనమైన కులీనులు, లేదా తమ వర్గపు ఉక్కిరిబిక్కిరి చేసే వాతావరణంనుంచి పారిపోయిన పెటీబూర్జువాల పిల్లలు. యీ గ్రూపు రచయితలు రాసిన పుస్తకాలు మనకి నిర్వివాదమైన రెండు విధాల విలువతో వుంటాయి. మొదటిది, అవి సాంకేతికంగా సాహిత్యంలో నమూనా రచనలు. రెండవది, బూర్జువాల ఆవిర్భావ, పతనాల గురించిన పత్రాలుగా, యీ వర్గంనుంచి పతనమైన వాళ్లు, దాని జీవిత మార్గాన్నీ, సంప్రదాయాల్నీ, చర్యల్నీ విమర్శనాత్మక దృక్కోణంనుంచి చిత్రించేవాళ్లు రాసిన పత్రాలుగా ఉపయోగిస్తాయి.

పంథొమ్మిదవ శతాబ్దపు యూరపియన్ సాహిత్యంలో సవిమర్శక వాస్తవవాదం నిర్వ

హించిన పాత్రకి సంబంధించిన వివరమైన విపులీకరణ నా యీ నివేదిక పరిధిలోకి రాదు. బడా పెట్టుబడిదారులు పునరుద్ధరించిన ఫ్యూడల్ తిరోగమనతత్వానికి వ్యతిరేకంగా జరిగే పోరాటం అని దీని సారం తేలుతుంది. ప్రజాస్వామ్యాన్ని వ్యవస్థీకరించడండ్వారా జరిగే పోరాటం అది, అంటే పెటీబూర్జువాలు ఉదారవాద, మానవతావాద అభిప్రాయాలమీద ఆధారపడి. ప్రజాస్వామ్యాన్ని వ్యవస్థీకరించడం అనేది బడా బూర్జువాలకి వ్యతిరేకంగానూ, శ్రామికవర్గంనుంచి నిత్యం పెరిగే ఒత్తిడికి వ్యతిరేకంగానూ ఉభయత్రా రక్షించుకునే అవసరంగా చాలామంది రచయితలూ, అత్యధిక పాఠకులూ అర్థం చేసుకోవడం జరుగుతోంది.

పంథొమ్మిదవ శతాబ్దంనాటి రష్యన్ సాహిత్యపు అసాధారణమైన, అనిదంపూర్వమైన అభివృద్ధి పాశ్చాత్య సాహిత్యపు సర్వధోరణులనీ, ధృక్పథాలనీ — ఒక కచ్చితమైన కాల విలంబనం తర్వాత — పునశ్చరణ చేసింది. తన వంతుగా పశ్చిమ సాహిత్యంమీద ప్రభావం కలగజేసింది. యూరపియన్ సాహిత్యానికి తెలియని యెంతో మౌలికమైన ''ఆకతాయి'' నమూనాతో సహా, జానపద సాహిత్యంలో వసీలీ బుస్లాయెవ్, చరిత్రలో ఫ్యోదొర్ టాల్స్టాయ్,[277] మిహయీల్ బకూనిన్[278] లాంటివాళ్లు, అలాగే సాహిత్యంలో ''పశ్చాత్తప్తుడైన కులీనుడి'' నమూనానీ, జీవితంలో తిక్కగా వుండే అల్ప నిరంకుశడి లాంటి ''అధికమైన వ్యక్తుల'' నమూనాలని కొల్లలుగా సృష్టించడం అనేది రష్యన్ బూర్జువా సాహిత్యపు లక్షణంగా పరిగణించవచ్చు.

పశ్చిమ దేశాలలో లాగానే సరిగ్గా మన దేశంలో సాహిత్యం రెండు మార్గాల్లో అభివృద్ధి చెందింది. ఫాన్‌వీజిన్[279], గ్రిబొయేదొవ్, గోగొల్ మొదలైన వాళ్లనుంచి చేహొవ్, బూనిన్‌లదాకా వుండే సవిమర్శక వాస్తవికవాదం ఒకటి. బుల్గారిన్,[280] మసాల్స్కీ,[281] జోతొవ్[282] మొదలైన వాళ్లనుంచి అవేర్‌చెంకొ[283], యింకా అలాంటి వాళ్లదాకా వుండే శుద్ధ పెటీబూర్జువా ధోరణి యింకొకటి.

ఫ్యూడల్ విజేత పక్కనే విజయవంతమైన ధనికుడైన దుర్మార్గుడు తలెత్తగానే మన జానపద సాహిత్యం ఆ ధనికుడి నర్మసచివుడిగా 'తిక్క ఇవాన్'ని సృష్టించింది. సంపదని సాధించి, శూరుల అద్భుత గాథల్లోని మంచి దేవతకి బదులుగా వచ్చిన గూనిగుర్రం సాయంతోటి జార్ కూడా అయేటువంటి వ్యంగ్య నమూనా తిక్క ఇవాన్. ఆ ధనికుడు బీద బానిసలకి బిచ్చం పడేసి వీరఖ్యాతి నార్జిస్తాడు. వాళ్ల అంధశక్తి విజేతకీ, ధనికుడికీ, యిద్దరికీ కూడా వాళ్లని దోచుకునేటట్టు చేస్తుంది.

బానిస తన ఖర్మకి తను సమాధాన పడిపోవడానికీ, అతని ఆలోచనమీద తమ అధికారాన్ని సుదృఢం కావించడానికీ చేసిన ప్రయత్నాలలో చర్చి ఓర్మికీ, అణకువకీ

నమూనాలనీ, ''క్రీస్తు మహిమకోసం'' అమరులైన వాళ్లనీ సృష్టించి పూరట ప్రసాదించింది. అది మునులనీ సృష్టించింది. ఆ రకంగా తనకి నిరుపయోగం అయిన వాళ్లని యెడారుల్లోకీ, అడవుల్లోకీ, మఠాల్లోకీ తరిమేసింది.

పాలకవర్గం యెన్ని చిన్ని భాగాలుగా చీలిపోతే నాయకులు అంత సాదా మనుషులుగా తయారయారు. జానపద సాహిత్యంలోని ''హాస్యగాడు'' శాంకో పాంజాలుగా, సింప్లిస్సిమస్‌లుగా, ఉలెన్‌స్పీగిల్‌లుగా మారి తమ వివేకంలో ఫ్యూడల్ ప్రభువులని మించిపోయి, తమ ప్రభువులని పరిహసించే కాలం వచ్చింది. 16వ శతాబ్దపు పూర్వార్ధభాగంలో టబొరైట్స్[284] భావాల్లోనూ, ఫ్యూడల్ శూరులకి వ్యతిరేకంగా జరిగిన రైతు యుద్ధాల్లోనూ వ్యక్తమైన ధోరణుల పెరుగుదలకి వాళ్లు నిస్సందేహంగా దోహదం చేశారు.

శ్రామిక ప్రజల నిజమైన చరిత్రని జానపద సాహిత్య పరిజ్ఞానం లేకుండా నేర్చుకోలేం. జానపద సాహిత్యమే నిరంతరంగా, కచ్చితంగా ఫౌస్ట్, ''బారన్ మ్యున్‌హౌసెన్ సాహసకృత్యాలు,''[285] ''గార్గంటువా, పెంటాగ్రూయెల్,'' షార్ల్ ది కస్ట్యేర్ రాసిన ''తిల్ ఉలెన్‌స్పీగిల్,'' షెల్లీ రాసిన ''విముక్తుడైన ప్రొమథ్యూస్'' లాంటి వాటి సృష్టికి ప్రభావం కలిగించింది. ఇక్ష్వాకుల నాటినుంచీ జానపద సాహిత్యం తన పద్ధతిలోనే అశ్రాంతంగా చరిత్రని అనుసరించి వచ్చింది. లూయీ XI, ఇవాన్ ది టెర్రిబుల్‌ల కార్యకలాపాల గురించి జానపద సాహిత్యం తన అభిప్రాయాలని తను యేర్పాటు చేసుకొంది. యివి చరిత్ర అంచనాలతో సూటిగా విభేదిస్తాయి. చరిత్ర అంచనాలు నిపుణులనుంచి వసాయి. చక్రవర్తులకీ ఫ్యూడల్ ప్రభువులకీ మధ్య జరిగిన పోరాటాలవల్ల శ్రమజీవుల బతుకుల్లో సరిగ్గా యేం జరిగిందీ అన్నది ఆ నిపుణులకి పట్టదు.

కల్పిత కథనం వూహలోనుంచి పుట్టిందే. వూహించడం అంటే ఒక నిర్దేశిత వాస్తవంకింద గర్భీకృతమైన మౌలిక భావాన్ని సంగ్రహించడం, దాన్ని ఒక ప్రతిమకింద రూపొందించడం అని. అప్పుడు మనకి వాస్తవికత వస్తుంది. కాని వాస్తవంనుంచి సంగ్రహించిన దాని అర్థాన్ని, వాంఛితమైన దానితోటీ, అవకాశం వున్నదానితోటీ జతచేసి పెంచడంవల్ల — మనం దాని పరికల్పన తర్కంద్వారా పూరకం చేస్తే — ప్రతిమని ఆ రకంగా సమగ్రం చెయ్యడం జరిగితే — అప్పుడు కల్పనకింద వుండే రొమాంటిసిజం వస్తుంది. అది వాస్తవంపట్ల ఒక విప్లవ దృక్పథాన్ని పెంపొందించడంలోను ఆచరణలో ప్రపంచాన్ని తిరిగి నిర్మించే దృక్పథాన్ని, పెంపొందించడంలోను దాని గొప్ప ప్రయోజనం వుంది.

మనం చూసినట్టుగా కళా రంగంలో వూహించే శక్తిని బూర్జువా సమాజం పూర్తిగా పోగొట్టుకుంది. ప్రయోగంలో నిలబడిన విజ్ఞానశాస్త్రంలోనే పరికల్పన తర్కం నిలిచి వుంది, ప్రేరణతో వర్తిస్తోంది. అసంబద్ధమూ, మార్మికమూ అయినదానిపట్ల ప్రీతితోటి బూర్జువా వ్యక్తివాద రొమాంటిసిజం వూహని ప్రేరేపించడం గాని, ఆలో

తను పూష్కిన్‌మీద ఉపన్యాసం యిచ్చిన తక్షణమూ, రాజరికాన్ని కూలదొయ్యాలని ప్రయత్నించిన "నరోద్నయా వోల్య" పార్టీ ఛిన్నాభిన్నమైపోయిన తక్షణమూ, దొస్తొయేవ్‌స్కీ భావాలు ప్రచారంలోకి వచ్చాయి.[291] లెనిన్ చెప్పిన మహత్తర, సులభ సత్యాన్ని అర్థం చేసుకుని, 1905లో శ్రామికవర్గం తన సత్తాని చూపించక ముందే, జాగ్రత్తగల ప్యోత్ర్ స్త్రూవె[292] బోధించి లోబరుచుకోవాలని మేధావి వర్గంపట్ల తన ప్రయత్నాలని ఆరంభించాడు, పొరపాటున తన అమాయకత్వాన్ని పోగొట్టుకున్న ఆడపిల్లని వయసు మళ్లిన పెట్టుబడిదారుడుతోటి చట్ట సమ్మత వివాహం జరిపించడానికి ఒప్పించేవాడిలాగ. వృత్తి రీత్యా పెళ్లిళ్ల సంధానకర్తా, యే రకమైన సొంత ఆలోచనా లేని పుస్తకాల పురుగూ అయిన అతను, 1901లో "ఫిష్టె[293] కేసి వెనక్కి" అని, దుకాణదార్లలోనూ భూస్వాములలోనూ సాకారమైనట్టుగా జాతి సంకల్పానికి ఒదిగి వుండాలనే భావపు నినాదాన్ని తెచ్చాడు. 1907లో "వేహి" (చారిత్రాత్మక సంఘటనలు) అనే సంకలనం ఒకటి ప్రత్యక్షమైంది. దానికి ఆయనే సంపాదకత్వం వహించి, అందులో రాస్తూ వుండేవాడు. అక్షరాలా అందులో యిలా వుంది:

"ప్రజల ఆగ్రహంనుంచి మమ్మల్ని రక్షించేందుకు సన్నీంసు ఉపయోగించిన అధికారులకి మేం కృతజ్ఞతా బద్ధులం."

భూస్వాముల బంటు అయిన మంత్రి స్తొలీపిన్[294] డజన్ల కొద్దీ కార్మికులనీ, రైతులనీ అనునిత్యం ఉరితీయిస్తూ వుంటే అలాంటి వెలపరం పుట్టించే మాటలు ప్రజాస్వామిక మేధావివర్గంనుంచి వస్తున్నాయి. "రష్యాని గజగజ వణికించెయ్యడం అవసరం," అంటే సాంఘిక విప్లవపు అన్ని రవ్వలనీ మట్టు పెట్టెయ్యాలి, అన్న పద్దెనిమిది వందల డెబ్బైయవ దశకం నాటి పరమ సనాతనవాది కె. లియోన్‌త్యేవ్[295] సినికల్ ప్రకటనని "వేహి" వెల్లడించిన మౌలిక ఆలోచన పునరుక్తం చేస్తోంది. "రాజ్యాంగ ప్రజాస్వామిక వాదుల" ద్రోహ ఫలితం అయిన "వేహి" ఆ పాత ద్రోహి లెవ్ తిఖొమీరొవ్[296] ఆమోదం పొందింది. అతను అది "రష్యన్ ఉత్సాహాన్ని అదుపులో పెట్టుందనీ, అంతరాత్మ పునరుత్థాన" మనీ అన్నాడు.

1907నుంచి 1917 దాకా ఆ దశాబ్దకాలమూ బాధ్యతా రహిత ఆలోచన కళ్లేలు లేకుండా విహరించిన కాలం. రష్యన్ రచయితలకి పూర్తి "సృజనాత్మక స్వేచ్ఛ"గల కాలం. యీ దశలో సకల పాశ్చాత్య బూర్జువా ఛాందస భావాలు ప్రచారం పొందాయి. అవి 18వ శతాబ్దం చివరన (ఫ్రెంచి విప్లవం తర్వాత) ప్రచారంలోకి వచ్చి, 1848తర్వాతా, 1871తర్వాతా[297] క్రమంగా యెగిసాయి. "మానవ చింతనా చరిత్రలో సాధించిన బ్రహ్మాండమైన అభివృద్ధికి బెర్గ్‌సన్ తత్వశాస్త్రం సూచకం" అని ఛ్లాటభర్మ

జరిగింది. పైగా, బెర్గ్సన్ ''బెర్క్లీ సిద్ధాంతాన్ని విస్తృతం చేసి, గంభీరం చేసాట్ట.'' ''కాంట్, లైబ్నిట్స్,[298] డెకార్ట్స్,[299] హెగెల్[300]ల ధోరణులన్నీ మృత ధోరణులు, వాటిమీద, సూర్యుని లాగా, ప్లేటో రచనలు అజరామరమైన సౌందర్యంతో ప్రకాశిస్తాయి'' అనడం జరిగింది. వాస్తవంనుంచి విడిపోయిన ఆలోచనా ధోరణిని, శ్రమలోనూ సృజనాత్మకత క్రమంలోనూ నిరంతరంగా, విశ్వవ్యాప్తంగా అభివృద్ధి చెందే వాస్తవంనుంచి విడిపోయిన ఆలోచనా ధోరణిని, భావవాద తత్త్వశాస్త్రాన్ని స్థాపించింది ఆ ప్లేటోయే.

స్పష్టంగా బోద్లేర్ యింకా ఆ ''విధివంచితు''లనబడేవాళ్ల ప్రభావంలో వుండి, షొపెన్హావర్ అడుగు జాడల్లో వెడుతూ, సొలొగూబ్[301] ''వ్యక్తిత్వపు మనుగడ తాలూకు విశ్వతాత్త్విక అసంబద్ధత''ని అద్భుతమైన ప్రత్యేకతతోటి వర్ణించాడు. ఆయన పద్యాలు దీన్ని గురించి దుఃఖించినా ఆయన మాత్రం భౌతికంగా వృద్ధిపొందే సంస్కారహీనుడి జీవితాన్నే గడిపాడు. 1914లో యీ మనిషి ''లోయల్లో మంచు కరిగిపోతూ''నే, బెర్లిన్ వినాశం అని జర్మన్లని బెదిరించాడు. ''రాజకీయాలలో ప్రణయాధిష్ఠాన దేవత,'' ''మార్మిక అరాచకత్వం'' లాంటి భావాలని ఆ సమయంలోనే బోధించడం జరిగింది. పరమజిత్తులమారి వసీలీ రొజానొవ్ ప్రణయతత్వాన్ని బోధించాడు. లియొనీద్ అంద్రేయెవ్ తన దుర్మార్గపు కథలని, నాటకాలని రాశాడు. మొత్తంమీద రష్యన్ మేధావి వర్గపు చరిత్రలో 1907–1917 మధ్య కాలానికి అత్యంత అవమానకరమైన దశకం అనే విశేషణం సరిపడుతుంది.

పశ్చిమ దేశాల్లో తమ జోడీలైన వాళ్లకంటే మన ప్రజాస్వామిక మేధావివర్గం తక్కువ చారిత్రక శిక్షణ కలిగిన వాళ్లవడంతోటి, వాళ్ల ''నైతిక'' పతనం, మేధా దారిద్ర్యం యింకా వేగంగా జరిగాయి. యీ క్రమం యేమైనా అన్ని దేశాల చిన్న తరహా బూర్జువాలకీ ఉమ్మడిగా వుండేది; నిజాయితీపూర్వక శ్రమ చేసే అందరి ప్రజల సమష్టి సౌఖ్యం కోసం ప్రపంచాన్ని పునర్ నిర్మించాలనే చారిత్రక కర్తవ్యం కలిగిన శ్రామిక వర్గానికి నిర్ణాయకంగా అంటిపెట్టుకుని వుండే నైతిక శక్తిలేని యే మేధావి కేనా గానీ తప్పనిది.

పశ్చిమ దేశాల సాహిత్యం లాగానే, రష్యన్ సాహిత్యం కూడా, విప్లవాత్పూర్వపు భూస్వాములనీ, పారిశ్రామికవేత్తలనీ, నగదు పెట్టుబడిదారులనీ చిత్రించలేదని చెప్పాలి, మన దేశంలో అలాంటి వాళ్లు తమ పశ్చిమ దేశాల ప్రతిరూపాల కంటే యింకా విశిష్టంగా వైవిధ్యభరితంగా వున్నా. దుర్భరమైన భూస్వామి నమూనాలని, ఉదాహరణకి, పేరుమోసిన సల్తీచీఖా[302] యింకా అలాంటి డజన్లు, వందలాది రకాలని, రష్యన్ సాహిత్యంలో చిత్రించడం జరగలేదు. గోగొల్ ''మృత జీవులు''లోని వ్యంగ్య రూపాలు, హాస్యాస్పద వికృత మనుషులు భూస్వామ్య, ఫ్యూడల్ రష్యాకి సంబంధించి అంత విలక్షణ

మైనవి కావు. గోగొల్ వర్ణించిన కొరోబొచ్‌కాలు, మనీలొవ్‌లు, పెతూఖ్‌లు,[303] సొబకేవిచ్‌లు, నొజ్‌ద్ర్యోవ్‌లు తమ ఉనికి అనే ఉదాసీన యదార్థంవల్ల మాత్రమే జార్ రాజకీయాలని ప్రభావితం చేశారు గాని, రైతుల రక్తాన్ని పీల్చే జలగలుగా విశిష్ట లక్షణం సంతరించుకున్న వాళ్లు కాదు. ప్రజల రక్తాన్ని పీల్చడంలో నిష్ణాతులూ, ఆ కళని ఆపోశన పట్టిన వాళ్లు వున్నారు. నాజూకైన క్రూరత్వంలో పరమానందాన్ని పొందే టటువంటి, భయభ్రాంతం చేసే నీతులు వున్న మనుషులు వున్నారు. వాళ్ల దుర్మార్గాలని రచయితలు చిత్రించలేదు. మహా గొప్ప రచయితలూ, రైతు అంటే స్పందించి పోయే రచయితలూ కూడా. మన పై మెట్టు బూర్జువాలని, పశ్చిమ దేశాల బూర్జువాలతో విభేదింపచేసే లక్షణాలు స్పష్టమైనవీ, బహు సంఖ్యాకమైనవీనీ. చారిత్రకంగా చిన్నదైన మన బూర్జువావర్గం, యెప్పుడో చాలా తర్వాత పుట్టినటువంటిది, రైతాంగంనుంచి ఉద్భవించింది. పశ్చిమ దేశాల్లోని తమ అనుభవజ్ఞులైన బంధువులకంటే యింకా యెక్కువ వేగంగా, సులభతరంగా సంపదని పోగుచేసుకుంది, ఆ కారణాలు అందులో వున్నాయి. పశ్చిమ దేశాల్లో సామాన్యంగా వుండే తడిగుడ్డతో గొంతు కోసే పోటీలో తరిఫీదు పొందని మన పారిశ్రామికవేత్తలు, యిరవైయవ శతాబ్దం వరకూ అద్భుత వూహావిహారం చేస్తూనే వున్నారు. అనేకమైన పిచ్చి పనులు చేస్తున్నారు. యిది బహుశా తాము యెంత పరిహాసాస్పద అలవోకతనంతో లక్షలు లక్షలు కూడబెడుతున్నారో ఆ ఆశ్చర్యంనుంచి జనించి వుంటుంది. టిబెట్ వైద్యుడు ఆ ప్రసిద్ధ పి. బద్‌మాయెవ్ 1917లో ప్రచురించిన ''రష్యన్ ప్రజలకి వున్న తెలివి'' అనే పేరు వున్న చిన్న పుస్తకంలో యీ ధనిక ఉత్పత్తిదారుల్లో ఒకడైన ప్యోత్ర్ గుబోనిన్‌ని వర్ణించాడు. తమని ''స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం లాంటి శుష్క పదాల''తో ప్రలోభ పెట్టే ''పైశాచిక రచనలను విసర్జించవలసిందిగా'' యువజనానికి హితబోధ చేసే యీ ఆసక్తికరమైన పుస్తకం, తాపీవాని కొడుకూ, తనే తాపీవాడూ అయిన రైల్వే ప్రముఖుని గురించి వర్ణిస్తుంది:

''భూస్వామ్య దాస్యం రద్దునాటి ఘనత వహించిన అధికారులు, గుబోనిన్ నాటి రోజులని యింకా జ్ఞాపకం వుంచుకున్న వాళ్లు, ఆయన్ని గురించి యీ కథని చెప్తారు. సంచీనిండా వెండి నాణాలని మోసుకుపోతూ భారమైన బూట్లూ, రైతు కోటూ తొడుక్కుని, ఆయన మంత్రికార్యాలయం దగ్గరకి వచ్చి, అక్కడున్న పహరావాణ్ణీ, నిరీక్షిస్తున్న వార్తాహరులనీ పలకరించి, సంచీలోనుంచి కొన్ని వెండి నాణాలని తీసి, ప్రతి ఒక్కళ్లకి ధారాళంగా బక్షీలిచ్చి, వాళ్లందరూ కూడా తనని గుర్తుంచుకో నేటట్టు వంగి వందనం చేసేవాడు. తర్వాత అతను అనేక శాఖలకి, ఆఫీసులకీ వెళ్లే

వాడు. అక్కడ ప్రతి అధికారికీ, ప్రతి వాళ్లనీ పేరుతో సంబోధిస్తూ, వంగి వందనం చేసి, వాళ్లవాళ్ల హోదాని బట్టి, ఒక సీల్డు కవరు యిచ్చేవాడు. ఘనత వహించిన వాళ్లయితే ఆ మర్యాదలకి ముద్దులు కూడా తోడై వుండేవి, అతను వాళ్లని ప్రజాపోషకులని పిలిచేవాడు. దీనివల్ల అతనికి మహా ఘనత వహించిన వ్యక్తి దర్శనం లభించేది. ప్యోత్ర్ గుబోనిన్ నిష్క్రమించిన తర్వాత అందరూ సంతుష్టులై వుండేవారు, యేమంటే ఆయన రాక క్రిస్టమస్‌తోటీ, లేదా ఈస్టర్‌తోటీ పోల్చదగ్గ సాధారణ పండగ అయి వుండేది. ప్రతివాడూ తన రాబడిని లెక్కపెట్టుకొని, నవ్వి, హుషారుగా, ఉల్లాసంగా ఆ మిగిలిన దినాన్నీ మర్నాటి ఉదయం దాకా ఆ రాత్రినీ యెలా గడపాలా అని వూహించుకునేవాడు. గుబోనిన్ తమలోనుంచే పైకి వెళ్లినవాడని పోర్టర్లవాడలో వాళ్లు గొప్పగా చెప్పుకునేవాళ్ళు. అతన్ని గురించి దయగలవాడనీ, తెలివైనవాడనీ అనుకొనేవాళ్లు. యెంత ముట్టిందని ఒకళ్లనొకళ్లు అడిగేవాళ్లు. కాని యెవళ్ల ముట్టుకి వాళ్లు గుంభనగా వుండేవాళ్లు, తమ దాతకి చెడ్డపేరు తేవడం యిష్టంలేక. చిన్న ఉద్యోగులు సహృదయుడైన ప్యోత్ర్ గుబోనిన్ తమని కూడా మరిచి పోలేదనీ, అతను యెంత నిజాయితీపరుడో, తెలివైనవాడోననీ కృతజ్ఞతతో వాళ్లల్లో వాళ్లు గుసగుసలాడుకునేవాళ్లు. పెద్ద అధికారులు మహాఘనత వహించిన ప్రభువు దాకా, అతని రాజనీతిజ్ఞతని గురించీ, అతను దేశానికీ, ప్రజలకీ మహత్తరమైన లాభాలని సమకూరుస్తాడనీ, రైల్వేనిర్మాణ పథకాలకి సంబంధించి సంప్రదింపులకి అతన్ని పిలవాలనీ, యేమంటే అతనే ఆ వ్యాపారంలో వున్న ఒక్క తెలివైన బుర్రాననీ పైకి గట్టిగానే మాట్లాడుకునే వాళ్ళు. అతన్ని నిజంగానే దొడ్డవాళ్ళూ, ఇంజనీర్లూ హాజరైన ముఖ్యమైన సమావేశాలకి ఆహ్వానించారు. అలాంటి సమావేశాలల్లో గుబోనిన్ మాటే నిర్ణాయకమయ్యేది.''

యీ కథ వ్యంగ్యహేళన వాసన కొట్టవచ్చు, కాని వాస్తవానికి యిది ఒక పద్ధతి విషయాలని మనస్ఫూర్తిగా స్తోత్రంచెయ్యడం. ఆ పద్ధతిలో ''స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరత్వం'' లాంటి బూర్జువా నినాదాలు బోలు మాటలే.

బూర్జువా సాహిత్యంలో ప్రతిబింబితమైనట్టుగా, బూర్జువా సృజనాత్మక అశక్తతని గురించి చెప్పిందంతా అతి విషాదకరంగా కనిపించి నేనేదో నిగూఢమైన ప్రయోజనం గల అతిశయోక్తి చెప్తున్నానన్న నింద రావచ్చు. కాని యదార్థం యదార్థమే కదా, మరి నేను వాటిని యథాతథంగా దర్శిస్తున్నాను.

శత్రువు శక్తులని తక్కువ అంచనా వెయ్యడం తెలివితక్కువతనం, యింకా చెప్తే నేరం కూడా. అతని పారిశ్రామిక నైపుణ్యాల గురించీ, ముఖ్యంగా అతని యుద్ధ

పరిశ్రమ గురించీ — దాని ఉత్పత్తి కొంచెం అటూ యిటూగా మాకేసే ఎక్కు పెట్ట బడింది — మాకు క్షుణ్ణంగా తెలుసు. పశ్చిమ దేశాల సైనిక నిపుణులు యుద్ధం మొత్తం వెనక తట్టు సంతటనీ నిమగ్నం చేస్తుందనీ, యుద్ధంలో పుష్ప దేశాల మొత్తం జనాభాని నిమగ్నం చేస్తుందని, గొంతు చించుకుని హెచ్చరికలు చేస్తున్నారు. 1914–1918 నాటి విస్తృత మారణపు మహా భీతిని పూర్తిగా మరిచి పోనటువంటే, మరో కొత్త, భయంకర యుద్ధపు ప్రమాదంతోటి భయ విహ్వలువైనట్టే యూరప్‌లోని అనేక అల్ప బూర్జువాలు, యీ ఆసన్న సాంఘిక సర్వ నాశనం యెవరి ప్రయోజనంకోసం వుంటుందో, తన అప్రతిష్ఠాకరమైన లాభాలకోసం మధ్యమధ్యన లక్షలాది ప్రజలని మట్టుబెట్టే ఆ నేరస్థుడు యెవరో గుర్తిస్తారని భావిస్తాం; వాళ్ళు వాస్తవాలని గుర్తించి పెట్టుబడిదారీ విధానపు నడ్డి విరగ్గొట్టడంలో శ్రామికవర్గానికి సాయంచేస్తారనీ భావిస్తాం. శ్రామికవర్గపు విప్లవ చైతన్యం పెరగడంమీదనే మనం నమ్మకం పెట్టుకోవాలి, కాని మన శక్తిమీద మనం నమ్మకం పెట్టుకుని, దాన్ని పెంపొందించుకుంటూ వుండటం మనకి యింకా మేలు. శ్రామిక ప్రజల విప్లవ చైతన్యాన్ని పెంపొందించడమూ, తాము నిర్మిస్తున్న మాతృదేశంపట్ల వాళ్ల ప్రేమని పెంపొందించడమూ, వాళ్ల మాతృదేశాన్ని రక్షించడమూ — అదే మన సాహిత్యపు ప్రధాన కర్తవ్యం.

కష్టించి పనిచేసేవాళ్ల మౌఖిక సాహిత్యమే వాళ్ల అనుభవపు ఒకే ఒక సంఘటిత శక్తి గానూ, వాళ్ల భావాలని ప్రతిమలలోకి మార్చేది గానూ, సమష్టి శ్రమశక్తికి చోదకం గానూ వుండే దశ ప్రాచీనకాలంలో వుండింది. అది మనం గుర్తించి తీరా ల్సిన విషయం. మన దేశంలో అందరికీ సమాన విద్యావకాశాలని కల్పించాలన్న గమ్యం పెట్టుకున్నాం; ప్రకృతి శక్తులని అదుపులోకి తెచ్చుకోవాలనే కళగా మానవ శ్రమని మార్చాలనే ప్రయత్నంలో శ్రమ సాధించినవాటినీ, విజయాలనీ మన సంఘంలోని సభ్యు లందరికీ సమంగా పరిచయం చెయ్యాలి. ప్రజల ఆర్థిక — ఆ విధంగా రాజకీయ — విభజన క్రమానికి సంబంధించిన గాఢ పరిజ్ఞానం మనకి కొంచెం యించుమించులో వుంది, అలాగే తమ మానసికాభివృద్ధికి సంబంధించిన ప్రజల హక్కుని అక్రమంగా ఆక్ర మించుకోవడం గురించీ మనకి కొంచెమించుమించులో పరిజ్ఞానం వుంది. పురోహితులు ప్రపంచావగాహనని తమ వ్యాపారంగా చేసుకున్నప్పుడు, వాళ్ళు దృగ్విషయాలనీ, శ్రామిక ప్రజల శక్తికీ, ఉద్దేశాలకీ పొంచ భౌతిక శక్తుల ప్రతిఘటననీ ఆధిభౌతిక రీతిలో వివరిస్తూ తద్వారా దాన్ని తమ గుత్త హక్కు చేసుకున్నారు. ప్రాచీన కాలంలో మొదలై, యీనాటి దాకా సాగుతూ వస్తూన్నటువంటి యిది, ప్రపంచ అవగాహననుంచి లక్షలాది

ప్రజలని దోష భూయిష్టమైన మినహాయింపునకీ, బహిష్కరణకీ గురి చెయ్యడం, వాళ్ళని కులం, జాతి, మతం లాంటి భావాలతో అనైక్యం చెయ్యడం వాళ్ళని అజ్ఞాన గాఢాంధ కారంలో, భయంకరమైన మేధా తిమిరంలో, ప్రతి ఒక్క రకపు దురభిప్రాయాల, మూఢనమ్మకాల తమస్సులో పడేశాయి. అఖిల జారిస్టు రష్యాలోనూ పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించి, రాజకీయాధికారాన్ని శ్రామికుల, రైతుల హస్తగతం చేసి లెని నిస్టు కమ్యూనిస్టుల పార్టీ, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య శ్రామికుల, రైతుల ప్రభుత్వం స్వేచ్ఛాయుతమైన, వర్గరహిత సమాజాన్ని నిర్మిస్తూ, సాహసోపేత మైన, యుక్తివంతమైన, పట్టుసడలని తమ కృషిద్వారా శ్రామిక ప్రజలని ప్రాచీన, చారిత్రకంగా కాలం చెల్లిన పెట్టుబడిదారీ సంస్కృతి పురాతన దాస్యంనుంచి విముక్తం చెయ్యడం తమ లక్ష్యంగా పెట్టుకున్నాయి. యీ పెట్టుబడిదారీ సంస్కృతి తన సకల దోషాలనీ, సృజనాత్మక అశక్తతనీ యిప్పుడు బహిరంగంగా వెల్లడి చేసుకుంటోంది. మనం, సోవియట్ యూనియన్‌కి చెందిన నిజాయితీపరులమైన రచయితలం, యీ మహోన్నత లక్ష్యం అనే యెత్తునుంచి మన కార్యకలాపాలని పరిశీలించి, అంచనావేసి, వ్యవస్థీకరించు కోవాలి.

అన్ని రకాల భావాలనీ సృష్టించేదీ, సంస్కృతిని ప్రధానంగా వ్యవస్థీకరించేదీ ప్రజా బాహుళ్యపు శ్రమ అని మనం గుర్తించాలి. కొన్ని భావాలు యుగాలుగా మన సకల పరిజ్ఞానానికీ అధారమైన శ్రమ నిర్ణాయక ప్రాముఖ్యంనుంచి దూరం అయాయి. యింకొన్ని భావాలు — మార్క్స్, లెనిన్‌వి — సకల దేశాలలోనూ శ్రామికులలో తమ హక్కుల గురించిన విప్లవాత్మక చైతన్యాన్ని కలిగించి, మన దేశంలో విజ్ఞానశాస్త్రానికీ, కళకీ సృజనాత్మక పునాది అయేట్టుగా శ్రమ ఉత్పత్తి కలిగిస్తున్నాయి. మన దేశంలో అర్ధ లక్షరాస్యులైన శ్రామికులా, పాతకాలపు రైతాంగపూ శ్రమ, యిప్పుడు సోషలిస్టు సూత్రాలమీద వ్యవస్థీకృతమై, పదహారు సంవత్సరాల అతి తక్కువ కాలంలో బ్రహ్మాండ మైన విలువలని సృష్టించిందనీ, మన దేశాన్ని శత్రు దాడినుంచి రక్షించుకోవడంకోసం అద్భుతంగా సాయుధం చేసిందనీ మన కృషి విజయం సాధించడం కోసం మనం గుర్తించి తీరాలి. సకలదేశాల కార్మికులనీ ఐక్యం చేసే బోధనకి గల సాంస్కృ తిక, విప్లవాత్మక శక్తిని యీ వాస్తవపు సరియైన అంచనా మనకి చూపిస్తుంది.

మనమందరం — రచయితలమైనా, ఫాక్టరీ శ్రామికులమైనా, లేదా సమష్టి క్షేత్రపు రైతులమైనా — యింకా అంత బాగా పని చెయ్యడం లేదు, మనకోసం, మనం సృష్టిం చుకున్న దాన్నంతటినీ సరిగా అంచనా వేసే దృష్టితో పరిశీలించడం లేదు. తాము తమ కోసమే పని చేస్తున్నారని మన శ్రామిక జనం యింకా యింకా సరిగా అర్థం చేసుకోలేదు. యీ చైతన్యం గుప్తంగా అన్ని వేపులా వుంది, కాని యింకా భళ్ళన

తెల్లవారినట్టు ప్రకాశమానం కావడం లేదు. ఒక నిర్దేశిత ఉష్ణోగ్రతకి చేరుకుంటూనే గాని యేదీ కూడా భగ్గున మండదు, వ్లదీమిర్ లెనిన్ మేధ నిర్మించిన పార్టీ లాగా శ్రామికుల శక్తి అనే ఉష్ణోగ్రతని అంత విజయంగా సహించింది మరేదీ లేదు.

మనం శ్రమని మన పుస్తకాల ప్రధాన నాయక పాత్రగా చెయ్యాలి. అంటే శ్రమ క్రమంలో వ్యవస్థీకృతుడైనట్టుగా, మన దేశంలో ఆధునిక నైపుణ్యాల శక్తితో వుండి, తన వంతుగా శ్రమని సులభతరంగా, అధిక ఉత్పాదకంగా చేస్తూ, దాన్ని ఒక కళ స్థాయికి ఉన్నతం చేస్తున్న మనిషిని, నాయకుణ్ణిగా చెయ్యాలి. శ్రమని ఒక సృజనాత్మక కళగా మనం అర్థం చేసుకోవాలి. సృజనాత్మకత అనేది రచయితలమైన మనం తరచుగా వాడే భావం, అలా చేసే హక్కు మనకి లేకపోయినా. సృజనాత్మకత అనేది జ్ఞాపకపు కృషిలో వుండే తీవ్రత స్థాయి. అది పనిచేసేటటువంటి వేగం దాని జ్ఞాన అనుభూతుల భాండారంనుంచి, అతి ప్రముఖమైన, విశిష్టమైన వాస్తవాలనీ, చిత్రాలనీ, వివరాలనీ, ఉత్పత్తి చేసి వాటిని అందరూ అర్థం చేసుకోగల అతి కచ్చితమైన, స్పష్టమైన మాటలలో పెడుతుంది. మన అపరిణత సాహిత్యం యింకా ఆ లక్షణాన్ని గురించి గొప్ప చెప్పుకోలేదు. మన రచయితల జ్ఞాన, అనుభూతుల భాండారం విస్తృత మైంది గాదు, ఆ భాండారాన్ని నిర్మించి, విస్తృతమూ గాఢమూ చెయ్యాలనే యత్నం యింకా స్పష్టం అవలేదు.

పంధొమ్మిదవ శతాబ్దపు యూరపియన్, రష్యన్ సాహిత్యాల ప్రధాన యితివృత్తం సమాజంతోటీ, ప్రభుత్వంతోటీ, ప్రకృతితోటీ ప్రతిస్పర్థించేట్టుగా వున్న వ్యక్తి. బూర్జువా సమాజంతో వ్యక్తి స్పర్థించడానికి ప్రధాన కారణం యేమిటంటే తన వర్గ భావాలకీ, జీవిత సంప్రదాయాలకీ వ్యతిరేకంగా వుండే నిషేధాత్మక అనుభూతుల కొల్లలుగా వుండడం. యీ అనుభూతులు తన అభివృద్ధి క్రమాన్ని కుంటు పరుస్తున్నాయనీ, అణగదొక్కే స్తున్నాయనీ నిశితంగానే అనుకుంటాడు వ్యక్తి, కాని బూర్జువా సమాజపు పునాదులైన నైచ్యానికీ, అల్పత్వానికీ, నేరానికీ తన బాధ్యతని గురించిన తక్కువ అవగాహన మాత్రమే వుంటుంది అతనికి. జొనాథన్ స్విఫ్ట్ మొత్తం యూరప్‌ని యేకేశాడు, కాని యూరప్ బూర్జువాలు ఆయన తన వ్యంగ్యాన్ని ఒక బ్రిటన్‌కి వ్యతిరేకంగానే యెక్కు పెట్టాడని అనుకున్నారు. మొత్తంమీద తన సమాజ జీవితాన్ని విమర్శించిన తిరుగుబాటుదారుడైన వ్యక్తి, సమాజపు లజ్జాకరమైన ఆచరణల్లో తన బాధ్యతని అరుదుగా, తక్కువగా గుర్తించాడు. మనుతూ వున్న వ్యవస్థమీద అతని విమర్శకి గాఢమైన, సవ్యమైన సామా జిక, ఆర్థిక కారణాల అవగాహన యింకా అరుదుగా ప్రధాన కారణమై వుండేది. పెట్టుబడిదారీ విధానపు ఇనప చట్రంలో తన మనుగడ తాలూకు నైరాశ్యంలోనుంచో లేదా జీవితంలోని తన వైఫల్యాలకీ, జీవితం రుద్దిన అవమానాలకీ వ్యతిరేకంగా ప్రతీ

కారం తీర్చుకోవాలన్న ప్రయత్నంనుంచో తరుచుగా అతని విమర్శ ఉద్భవించేది. ఒక వ్యక్తి శ్రామిక ప్రజల కేసి ఉన్ముఖుడైయ్యాడూ అంటే అతను వాళ్ల ప్రయోజనాల కోసం అలా చెయ్యలేదు. కాని యెందుకంటే బూర్జువా సమాజాన్ని నిర్మూలనం చెయ్యడంద్వారా శ్రామికవర్గం తన ఆలోచనా స్వేచ్ఛనీ, స్వసంకల్ప ఆచరణనీ పదిల పరుస్తుందనే ఆశతోనే. నేను పునరుద్ఘాటిస్తున్నాను: విప్లవాత్పూర్వపు సాహిత్యంలోని ప్రధా నేతివృత్తం, జీవితం సంకోంచించుకుపోయినట్టు కనిపించినటువంటి సమాజంలో అతిరిక్తంగా వున్నట్టు బాధపడి తన కోసం ఒక సౌకర్యకరమైన స్థానాన్ని అన్వేషించినటువంటి వ్యక్తి విషాద జీవితం. తనకి ఒక స్థానం దొరక్కపోవడంవల్ల, తనపట్ల విద్వేషంగా వున్న సమాజంతో సమాధాన పడిపోయో, లేదా తాగుడుకి అలవాటుపడి ఆత్మ హత్యతో జీవితాన్ని అంతం చేసుకునో అతను బాధపడి నాశనం అయిపోయేవాడు.

మన దేశంలో, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్యలో, యే అధికమైన వ్యక్తీ వుండడు, వుండలేడు. ప్రతి పౌరుడికీ తన సామర్థ్యాలనీ, తన ప్రతిభా విశేషాలనీ అభివృద్ధి చేసుకునే స్వేచ్ఛ వుంది. వ్యక్తినుంచి అపేక్షించేది ఒక్కటీ యేమిటంటే వర్గరహిత సమాజ నిర్మాణంలో జరిగే వీరోచిత కృషిపట్ల తన దృక్పథంలో అతను నిజాయితీగా వుండాలనేదే.

నూతన సంస్కృతీ నిర్మాణంలో పాల్గొనవలసిందిగా కార్మిక, కర్షక ప్రభుత్వం మొత్తం యు.ఎస్.ఎస్.ఆర్. ప్రజానీకానికి విజ్ఞప్తి చేసింది. అందుచేత మనలో ప్రతి ఒక్కళ్లం ప్రతి వ్యక్తి చేసిన తప్పులకి, పొరపాట్లకి, ఉత్పత్తి చెడిపోడానికి, సర్వవిధాల సంస్కారహీన నైచ్యం, అల్పత్వం, మోసం, కాఠిన్యం వెల్లడి అవడానికి బాధ్యులమే. అంటే మన విమర్శ సిసలైన ఆత్మ విమర్శగా వుండాలి, మన కృషినీ, పరస్పర సంబంధాలనీ నియతం చెయ్యడానికి సోషలిస్టు నీతి సూత్రాలని రూపొందించాలి.

శ్రామికుల మేధాభివృద్ధిని వెల్లడిచేసే వాస్తవాలని చిత్రించేటప్పుడు, యుగయుగాల నాటి చిల్లర యజమాని సమష్టి రైతుగా యెలా మారుతున్నాడో చిత్రించేటప్పుడు రచయితలమైన మనం, వూరికే సాక్షిగా కథనం చెయ్యడానికే పరిమితం అవుతున్నాం. యేమంటే యీ మార్పుల వెనక వున్న ఉద్రేక క్రమాలని మనం చాలా అరకొరగా చిత్రిస్తున్నాం.

యదార్థ విషయాలకి సంబంధించి మనకి తగినంత నిశిత దృష్టి లేదు. దేశపు బాహ్య స్వరూపం కూడా కొట్టవచ్చినట్టుగా మారిపోయింది, పొలాల దారిద్ర్యభరిత రంగు రంగుల రూపం పోయింది. మనకి యిక యెంత మాత్రమూ ఓ లేత నీలం పీలిక మీద ఓట్లు ధాన్యం చల్లి వుండడం, దాని పక్కనే బంగారు రై, ఆకుపచ్చ గోధుమ మడి, కలుపు మొక్కలు పెరిగిపోయిన తునకలు వుండటం, మొత్తంమీద విచారభరి

తంగా కనిపించే చెక్కలుగా వున్న విశాల భూభాగం కనిపించవు. యివాళ విస్తార మైన భూఖండాలు ఒకే తరహాగా, ఒకే రంగుతో కనిపిస్తాయి. గ్రామాల్లోనూ, పట్ట ణాల్లోనూ ప్రబలంగా వున్నవి చర్చీలు కాదు, ప్రజా భవనాలు. బ్రహ్మాండమైన ఫాక్టరీల పెద్ద లద్దాల్లో సూర్యకాంతి ప్రతిఫలిస్తూ వుంటుంది. ప్రాచీన చర్చీలు ఆకారంలో బొమ్మల్లాగా వుంటూ నానా రకాల కలగూరగంపలాగా కనిపించి, చర్చి వాస్తుశిల్పంలో వెల్లడి అయిన మన ప్రజల ప్రతిభకి తార్కాణంగా వుంటాయి. యేమైనా మన దేశపు నూతన రూపం, దానిలో వచ్చే స్ఫుటమైన మార్పులు మన సాహిత్యంలో ప్రతిబింబించడం లేదు.

పాత జీవిత విధానం మౌలికంగా మారిపోయేటటువంటి కాలంలో మనం జీవిస్తు న్నాం. మానవుడిలో ఒక యోగ్యతాభావం జాగృతం అవుతోంది. వాస్తవంగా ప్రపంచాన్ని మార్చేటటువంటి శక్తి తను అని మానవుడు గుర్తిస్తున్నాడు.

మన సాహిత్య దృష్టికి బయట వున్న పిల్లల్లో నూతన మానవ గుణాల ఆవి ర్భావం స్ఫుటంగా తెలుస్తోంది. పిల్లల్ని గురించీ, పిల్లల కోసం రాయడం అనేదీ మన రచయితలకి గౌరవ లోపంగా కనిపిస్తోంది.

పిల్లల్ని తండ్రులు యింకా యెక్కువ జాగ్రత్తతోటీ, మృదుత్వంతోటీ చూస్తున్నా రని చాటడంలో నేను పొరపాటు పడ్డం లేదనే అనుకుంటున్నాను. అలా చూడ్డం చాలా సహజమని నా అభిప్రాయం. మానవ చరిత్రలో మొట్టమొదటి సారిగా పిల్లలు తమ తల్లిదండ్రుల డబ్బుకి, యిళ్లకి, సామాన్లకి వారసులు కావడం లేదు, మహత్తర మైన నిజమైన విలువకి — తమ తండ్రులూ, తల్లులూ వాళ్ల శ్రమతోటి సృష్టిం చిన సోషలిస్టు రాజ్యానికి వారసులవుతున్నారు.

మన చుట్టూతా వున్న జీవితం కళాత్మక సాధారణీకరణలకి యింకా యింకా ''పిండి''ని సరఫరాచేస్తూనే వుంది. సోషలిస్టు నిర్మాణపు సర్వరంగాల్లోనూ అంతటి ముఖ్యమైన పాత్రని నిర్వహిస్తున్న సోవియట్ మహిళని తగినంత వివరంగా చిత్రించడం అనేది నాటకం గాని నవల గాని చెయ్యలేదు. నాటక రచయితలు యెంత తక్కువ వీలైతే అంత తక్కువ స్త్రీ పాత్రలనే యెందుకు సృష్టించ ప్రయత్నిస్తున్నారో వివరిం చడం యింకా కష్టం. మన దేశంలో మహిళల సాంఘిక హోదా పురుషులతో సమ మైన దైనప్పటికీ, పని చెయ్యడానికి తమకి గల సామర్థ్యాన్నీ, తమ వైవిధ్యభరిత ప్రతిభలనీ పూర్తిగా రుజువు చేసుకున్నప్పటికీ యీ సమానత్వం తరచుగా, చాలా విధాలుగా నామకః, పైపైదిగా వుంటోంది. అనేక శతాబ్దాలుగా ఆడవాళ్లు ఇంద్రియ సుఖాల కోసమూ, మచ్చిక అయిన జంతువుల్లాగా ''యిల్లుచక్కదిద్దే'' సమర్థత కోసమూ శిక్షితమై వున్నారన్న విషయాన్ని మగవాళ్లు యింకా మర్చిపోలేదు, లేదా సంపూర్తిగా

మరిచిపోయారు. జనాభాలోని సగ భాగానికి చరిత్రతో మిగిలిపోయిన యీ అవమానకరమైన రుణాన్ని మొట్టమొదటగా మన దేశపు పురుషులు తీర్చాలి, ప్రపంచంలోని మిగతా వాళ్ళకి అదర్శప్రాయం అయేటందుకు గాను. ఆడవాళ్ల పట్ల వైఖరి అంగీకృత సంస్కారహీన వైఖరినుంచి, హీనజాతి పశువులనుంచి తెచ్చుకున్న యీ వైఖరినుంచి, యెదగగలందులకు గాను, యిక్కడ కూడా, సాహిత్యం మహిళల కృషినీ మనస్తత్వాన్నీ చిత్రించే ప్రయత్నం చెయ్యాలి.

యికపోతే, సోవియట్ సాహిత్యం అనేది ఒక్క రష్యన్ భాషా సాహిత్యమే కాదనీ, అఖిల యూనియన్ సాహిత్యం అనీ చెప్పడం అవసరం అనుకుంటున్నాను. సోదర రిపబ్లిక్కుల రచయితలు, మనతోటి ఒక్క భాషకి సంబంధించే విభేదించేవాళ్ళు, పెట్టుబడిదారీ విధానంచేత విభజితమైన శ్రామిక ప్రజల సకల లోకాన్నీ ఐక్యంచేసే భావపు ప్రయోజనకర ప్రభావం కిందా, ప్రాబల్యం కిందా జీవించి పని చేస్తున్నారు కాబట్టి జాతీయ అల్పసంఖ్యాకుల రచనలని, మనం సంఖ్యాత్మకంగా అధికంగా వున్నాం కాబట్టి, మనకి ఉపేక్షించే హక్కులేదు. కళకిగల విలువని రాశినిబట్టి గాక గుణాన్నిబట్టి అంచనా కట్టాలి. మహా మేరువులాంటి పూష్కిన్ మనకి గతంలో వున్నంత మాత్రాన ఆర్మీనియన్లకి, జార్జియన్లకి, తాతార్లకి, ఉక్రెనియన్లకి, యింకా తదితర జాతీయతల వాళ్లకి సాహిత్య, సంగీత, చిత్రకళా, వాస్తుశిల్ప కోవిదుల్ని తయారుచేసే సామర్థ్యం లేదు అని అనలేం. మొత్తం సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య అంతటా ఒక నిజాయితీపూర్వక, మానవత కలిగిన జీవితం వేపు, నూతన చరిత్రని స్వేచ్ఛాయుతంగా నిర్మించడం కేసి, ఒక సోషలిస్టు సంస్కృతిని నిర్మించడం కేసి పురోగతిలో మొత్తం శ్రామిక ప్రజల వేగవంతమైన నవ చైతన్యం జాగృతం అవుతోందన్న విషయాన్ని మరిచి పోకూడదు. యీ పురోగతి యెంత గొప్పగా వుంటే అంత శక్తివంతంగా యీ క్రమం 170 మిలియన్ల స్త్రీ పురుషులలో దాగివున్న ప్రతిభా విశేషాలని వెల్లడి చేస్తోందని మనం యిప్పటికే చూడగలుగుతున్నాం.

ఒక తాతార్ రచయిత నాకు రాసిన ఉత్తరాన్ని చదవడం ఉచితంగా వుంటుందని భావిస్తున్నాను.

''యిదివరలో అణగారిపోయి, వెనకబడి వున్న జాతీయతల రచయితలమైన మాకు మహత్తర అక్టోబరు విప్లవం, మా రచనలతోటి — యింకా పరిపూర్ణం కాకపోయినప్పటికీ — రష్యన్ సాహిత్యంలోకి ప్రవేశించే అవధిలేని అవకాశాలని యిచ్చింది. మీకు తెలిసినట్టుగా, యిప్పటికే, పదుల సంఖ్యలో, యింకా చెప్తే వందల సంఖ్యలో అల్పసంఖ్యాక

జాతీయతల రచయితల రచనలు రష్యన్ భాషలో ప్రచురితమవుతున్నాయి. మరో పక్క, సోవియట్ రష్యన్ సాహిత్యాన్ని రష్యన్ ప్రజానీకమే కాక, మన సోవియట్ యూనియన్ సర్వ జాతుల శ్రామిక ప్రజలూ చదువుతున్నారు. అన్ని జాతులకీ చెందిన లక్షలాది యువ తరాలవాళ్లు దీనిమీద పెరుగుతున్నారు. ఆ రకంగా, రష్యన్ భాషలోని సోవియట్ శ్రామికవర్గ సాహిత్యం రష్యన్ మాట్లాడేవాళ్లకీ, పుట్టుకతో రష్యన్ అయిన వాళ్లకీనే గాదు సేవచేసేది. అవి క్రమేపీ ఒక అంతర్జాతీయ స్వభావాన్ని రూపంలో సంతరించు కుంటున్నాయి. యీ ముఖ్యమైన చారిత్రక క్రమం పరమ నూతన, అనూహ్య కర్తవ్యాలని, నూతన కోరికలనీ ముందుకు తెస్తోంది.

''యీ విషయాన్ని అందరు రచయితలూ, విమర్శకులూ, సంపాదకులూ అర్థం చేసుకోకపోవడం విచారకరం. ఒక పుస్తకం ప్రచురితమైతే విమర్శకులు మహా అయితే కొన్ని ''ఆదరణ పూర్వక''మైన మాటలు చెప్తారు రచయితని గురించీ పుస్తకాన్ని గురించీ. మరి సహజంగానే మేం మా విజయాలని గురించి వివాలని కుతూహల పడతాం, అలాంటివేవైనా వుంటే, అలాగే అధికంగా వున్న మా లోపాలని గురించీ దోషాలని గురించీ కూడా, యేమంటే భవిష్యత్తులో వాటిని తొలగించు కోవాలని. మేం సామూహిక పాఠకుడికి అందుబాటులోకి రావాలని కోరు కుంటాం.''

అన్ని యూనియన్ రిపబ్లిక్కుల, స్వయంపాలిత ప్రాంతాల సాహిత్య ప్రతినిధులు యీ ఉత్తరానికి తమ సంతకాలని జతచెయ్యడానికి బహుశా సిద్ధపడతారు. మన సాహిత్య చరిత్రకారులూ, విమర్శకులూ యీ ఉత్తరాన్ని గణనలోకి తీసుకోవాలి. తాము భిన్న జాతీయతలకి చెందినవారైనప్పటికీ కూడా భిన్న భాషలు మాట్లాడే వాళ్లైనప్పటికీ కూడా తమలో ప్రతి ఒక్కళ్లూ ప్రపంచపు ప్రథమ సోషలిస్టు రాజ్యపు పౌరులేనని మన దేశ ప్రజలకి వివరించే కృషిచేయాలి. మన విమర్శకులని ఉద్దేశించి చేసిన నింద సబబే. మన సాహిత్య విమర్శ — ముఖ్యంగా రచయితలు విస్తృతంగా చదివే వార్తాపత్రికలలో వచ్చేటువంటిది — నీరసంగా, పాండిత్య ప్రకర్షకంగా, ప్రస్తుత కాలపు జీవితానికి సంబంధించి పరిజ్ఞానం లేనట్టుగా వుంటోంది. అన్ని రకాల కార్యకలాపాలు పుష్కలంగా వుండి, జీవితంలో మార్పులు వేగవంతమవుతున్న యీ కాలంలో పుస్తకాలకి సంబంధించిన అసంపూర్తి జ్ఞానం చాలా యెక్కువగా వెల్లడి అవుతోంది. ఒక్క మార్గదర్శక విమర్శనాత్మక — తాత్విక భావాన్ని పెంపొందించకుండా, కలిగి వుండకుండా, మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌లనుంచి మార్పు లేకుండా అదే ఉల్లేఖనలని ఆశ్రయించుకొని వుంటోంది. జీవితం కథా వస్తువుని, పాత్రలని, మానవ సంబంధాలని యిస్తూ వుంటే,

జీవితపు వేగవంతమైన నడకని పరిశీలిస్తే వచ్చే వాస్తవాలనుంచి మన సాహిత్య విమర్శ ఆరంభం అవడమే లేదు. మార్క్స్, ఎంగెల్సులు ముందుగా దర్శించలేనిది మన దేశంలోనూ, మన కృషిలోనూ యెంతో వుందనుకోండి. విమర్శకుడు రచయితతోటి అంటాడు: ''చూడండి యిది తప్పు, యేమంటే మన బోధకులు యీ విషయంమీద చెప్పింది యిదిగో.'' ''అది తప్పు యేమంటే జీవిత వాస్తవాలు రచయిత చెప్పినదాన్ని వ్యతిరేకిస్తున్నాయి'' అనగలగడం లేదు వాళ్లు. ఎన్ని భావాలు యెరువు తెచ్చుకున్నా విమర్శకులు ఎంగెల్స్ చెప్పిన అతి విలువైన మాటని మరిచిపోతున్నారు: ''మన సిద్ధాంతం ఒక పిడిసూత్రం కాదు, ఆచరణకి కరదీపిక.'' మన సాహిత్య విమర్శ పటువుగా, నవ్య మైనదిగా లేదు. పైగా విమర్శకుడు రచయితకి సులభమైన, స్పష్టమైన, పొంకమైన భాషలో రాయమని బోధించలేడు యేమంటే తన శైలే చాంతాడులా చట్టుగా వుంటుంది. యింకా అధ్వాన్నం యేమంటే ఉద్రేకరహితం గానేనా వుంటుంది, లేకపోతే అమితోద్రేకంగానేనా వుంటుంది. రచయితతోటి విమర్శకుడికి స్నేహబంధాలు వున్నప్పుడు గాని, లేదా ''నాయకతత్వం'' అనేటువంటి సంస్కారహీన అంటుజాడ్యంతోటి ఒక చిన్న గ్రూపు మనుషుల ప్రయోజనాలు ముడికలైనప్పుడు గాని యీ అమితోద్రేకం గోచర మవుతోంది.

''నాయకతత్వం'' అనేది యీ కాలపు జబ్బు. పెట్టీబూర్జువాలో తగ్గిపోయిన జీవ యోగ్యతనుంచి, పెట్టుబడిదార్లకీ, శ్రామికవర్గానికీ మధ్య జరిగే పోరాటంలో ఉత్పన్నమయ్యే తన అనివార్య వినాశన భావంనుంచి యిది వస్తుంది. అతని వినాశన భయం, తను యెంతో కాలంగా భౌతికంగా బలమైనదని పరిగణించే వైపు, యితరుల శ్రమని దోచుకుని ప్రపంచాన్ని నాశనం చేసి కొల్లగొట్టే యజమాని వైపు అతన్ని తరుముతుంది. మన స్తత్వ రీత్యా ''నాయకతత్వం'' అనేది కాలం చెల్లిన దాన్నుంచి, అశక్తతనుంచి, వైయక్తిక తత్వ దారిద్ర్యంనుంచి ఉత్పన్నం అవుతుంది. భౌతికంగా అది చీముపట్టే పుళ్ల రూపం తీసుకుంటుంది. ఉదాహరణకి ఎబర్ట్,[304] నోస్కె,[305] హిట్లర్ యింకా అలాంటి పెట్టుబడి దారీ వాస్తవపు వీరుల లాగా. సోషలిస్టు జీవిత విధానం నిర్మితమయ్యే మన దేశంలో అలాంటి దుర్మాంసాలు పెరగడం అసంభవం అనుకోండి. యేమైన సంస్కారహీనత వార సత్వంగా, ''నాయకతత్వా''నికీ ''నాయకత్వాని''కీ మధ్యన వుండే భేదాన్ని, ఆ భేదం స్పష్టంగా వున్నప్పటికీ కూడా — అర్థం చేసుకోగల శక్తిలేని మొటిమలు యింకా వున్నాయి: మానవ శక్తిమీద తను వుంచిన ఉన్నత విలువతోటి, అతి తక్కువ శక్తి వ్యయంచేసి అత్యుత్తమ ఆచరణాత్మక ఫలితాలని సాధించేటట్టు నిర్దేశిస్తుంది నాయకత్వం. మరి ''నాయకతత్వం'' అనేది తన తోటి వాళ్లకంటే ఒక అడుగు యెత్తులో నిలబడడానికి

సంస్కారహీనత్వపు వైయక్తికమైన వెంపరలాట. యాంత్రికమైన చురుకు, ఓటి బుర్ర, లోటు హృదయం వున్న యెవడేనా సాధించగలది.

సమీక్షకులకి సాహిత్య విమర్శ చాలా అవకాశం యిస్తుంది. వాళ్లు రచయితలని గందరగోళపెట్టేసి, బాధపెట్టేస్తారుగాని వాళ్లు యేం చెప్పడానికి అశక్తులై వుంటారు. అలాంటి విమర్శ సరోద్నిక్కు సాహిత్యపు కొన్ని భావాలని పునరుద్ధరించడానికి జరిగే ప్రయత్నాలని గుర్తించదు. పైగా — యిది చాలా ముఖ్యం — స్థానిక రచనలు అభివృద్ధి చెందడంలో దీనికి యేమీ ఆసక్తి వుండదు, యితర రిపబ్లిక్కుల సాహిత్యం సంగతి సరేసరి. తమ సాహిత్య నైపుణ్యాలని గురించి రచయితలు చేసే బహిరంగ నివేదికలకి సంబంధించి, విమర్శకుడి దృష్టి అందుకోవాల్సిన అలాంటి నివేదికలకి సంబంధించి, సాహిత్య విమర్శ పట్టించుకోవడం లేదన్న విషయాన్ని జత చేసి తీరాలి.

ఆత్మ విమర్శ అవసరం, కామ్రేడ్స్. యింకా యింకా అక్షరాస్యత సంతరించుకుంటూ, మన కళనుంచీ, అదే సమయంలో, మన సాంఘిక నడవడికనుంచీ అధికంగా అపేక్షించేటువంటి శ్రామికవర్గం కోసం మనం కృషిచేస్తున్నాం.

మన కార్యకలాపాల స్వభావమూ, మన మధ్యలో వున్న సంబంధాల స్వభావమూ కమ్యూనిజపు సిద్ధాంతంతో సరితూగేటట్టుగా లేవు. యీ సంబంధాలలో సంస్కారహీనత ప్రముఖ పాత్ర వహిస్తోంది. అసూయలో, దురాశలో, అసభ్యమైన ప్రసంగంలో, ఒకళ్లకొకళ్లకి పడకపోవడంలో అది వ్యక్తం అవుతోంది.

మనం సంస్కారహీనతని గురించి చాలా రాస్తున్నాం. కాని సంస్కారహీనతని ఒక్క సాహిత్య వ్యక్తిలో గాని, ప్రతిమలో గాని సోదాహరణంగా నిరూపితం చెయ్యలేదు. ఒక్క వ్యక్తిలో, ఫౌస్ట్, హామ్లెట్ లాంటి ప్రపంచ నమూనాల మాదిరీ అంతశక్తివంతంగా దాన్ని వర్ణించాల్సి వుంది.

పరాన్న భుక్కుల అసంఖ్యాక వర్గం సంస్కారహీనతతో వుందని మీకు గుర్తు చేస్తున్నాను. వాళ్లు యేమీ ఉత్పత్తి చెయ్యకపోయినా, యెంత వీలైతే అంత మెక్కుతారు. నిజంగా అలా చేస్తున్నారు కూడా. రైతాంగంమీదా, శ్రామికవర్గంమీదా ఆధారపడి పరోపజీవులుగా వుంటూ, యెప్పుడూ బూర్జువాలకే మొగ్గు చూపిస్తూ, కాని ఒకో అప్పుడు బాహ్య పరిస్థితులవల్ల, శ్రామికవర్గం కేసి పోతూ, తమతో అరాచకత్వాన్నీ, అహంభావత్వాన్నీ యింకా సంస్కారహీనతలో చారిత్రకంగా భాగమైన ఆ నైచ్యాన్నంతటినీ సంస్కారహీనత అనేది మోసుకువస్తుంది. శ్రమతోటి ప్రేరణ పొందకుండా, నిత్య జీవిత వాస్తవాలమీదనే ప్రత్యేకంగా ఆలోచనకి మేత యిస్తూ వుండేటువంటి నికృష్ట నైచ్యం. అది ఆలోచనా సామర్థ్యపు పరిమితుల్లో, యెప్పుడూ కూడా వ్యక్తి అభివృద్ధి వాదానికే వత్తాసు యిస్తుంది. అతి తక్కువ ప్రతిఘటన కనబరుస్తుంది. యిలా చేస్తూ యెప్పుడూ

కూడా రెండు శక్తుల మధ్య కొంచెం యించుమించులో స్థిరీకృత సరితూకాన్నే అన్వేషించింది. సంస్కారహీనతకి శ్రామికవర్గంపట్ల వున్న దృక్పథం ఒక యదార్థంలో కొట్టవచ్చినట్టు కనబడుతుంది. బీదవాడైన రైతు, నిర్భాగ్యమైన మడి చెక్క సొంతంగా వుండిన రైతు, తన చేతులు తప్ప యేమీ ఆస్తిలేని ఫాక్టరీ కార్మికుణ్ణి అసహ్యించుకుంటాడు. శ్రామికుడి చేతులు ఫాక్టరీ బయట విప్లవాత్మక ఆచరణని ప్రదర్శించినప్పుడే, శ్రామికుడికి బుర్ర కూడా వుందని సంస్కారహీనులు గుర్తించారు.

అన్ని కలుపు మొక్కలూ హానికరమైనవీ కాదు, నిరుపయోగకరమైనవీ కాదు. యేమంటే వాటిల్లో చాలా వాటినుంచి రోగనివారణ ఔషధాలని తీయడం జరుగుతుంది. కాని సంస్కారహీనత మాత్రం నష్టదాయకమైన విషాన్నే యిస్తుంది. పెట్టుబడిదారీ యంత్రాంగపు పరిగణింప నక్కరలేనంత భాగమే సంస్కారహీనుడు అనుభవించక పోయి వున్నట్టయితే, అతను తన ప్రాముఖ్యాన్నీ, తన ఆలోచనా సంకల్పాల స్వేచ్ఛనీ, బతికే తన హక్కునీ రుజువు చేసుకోడానికి అంత మొండిగా, నిష్ఫలంగా యాతన పడి వుండడు. 19వ, 20వ శతాబ్దాల కాలంలో ''అధికమైన వ్యక్తులనూ,'' ''పశ్చాత్తప్త గొప్పింటివాళ్లనీ,'' ''సాంఘిక స్తబ్ధతా దశలలోని వీరులనీ,'' ''కాకులూ గాని కోకిలలూ గాని మనుషులనీ'' ఆ సంఖ్యలో సృష్టించి వుండడు.

సాహిత్యపు పార్టీ నాయకత్వాన్ని సకల సంస్కారహీన ప్రభావాలనుంచీ మూలమట్టంగా శుద్ధి చేసి తీరాలి. సాహిత్యంలో పనిచేసే పార్టీ సభ్యులు స్వేచ్ఛకోసం జరిగే ఆఖరి పోరాటానికి సకల దేశ కార్మికులనీ వ్యవస్థీకరించే సిద్ధాంతాన్ని బోధించే ఉపాధ్యాయులుగా వుండడమే కాదు; తన సర్వ ప్రవర్తనలోనూ పార్టీ నాయకత్వం నైతికంగా ప్రామాణిక శక్తిగా కూడా వుండాలి. యీ శక్తి అన్నిటికంటే కూడా యెక్కువగా రచయితలలో తమ చుట్టూతా జరిగే ప్రతి దాంట్లోనూ సమష్టి బాధ్యతా చైతన్యాన్ని బోధించాలి. తనకి వున్న సర్వ వైవిధ్యభరిత ప్రతిభతోటీ, నూతన ప్రతిభా సమన్వితులైన రచయితల పెరుగుదలతోటీ సోవియట్ సాహిత్యం ఒక ఐక్య, సమష్టి మొత్తంగా, సోవియట్ సంస్కృతికి ఒక శక్తివంతమైన ఆయుధంగా తయారవాలి.

ఒక యూనియన్ రచయితల కోసం నిర్మాణం అవుతోంది. వూరికే రచయితలని భౌతికంగా ఐక్యం చెయ్యడం కోసమే కాదు. తమ వృత్తిపర కలయికద్వారా తమ సమష్టి శక్తిని వాళ్లు గుర్తించి, ఆ శక్తికి గల సృజనాత్మక సామర్థ్యాలలోని వైవిధ్యాన్నీ, దాని లక్ష్యాలనీ అత్యంత స్పష్టతతో నిర్వచించుకుని, సకల లక్ష్యాలనీ దేశపు శ్రామిక సృజనాత్మక శక్తిని నడిపించేలా సారూప్యతతో మేళవించుకుని వుండగలిగేటట్టు చెయ్యడం కోసం యూనియన్ యేర్పడుతోంది.

యీ కర్తవ్యం వైయక్తిక సృజనాత్మకతని పరిమితం చెయ్యడం కాదనుకోండి కాని,

ఆ సృజనాత్మకత నిరాటంకంగా అభివృద్ధి చెందేటట్టు వీలైనంత మహత్తర అవకాశాన్ని అందుబాటులో వుండేటట్టు చెయ్యడమే.

సవిమర్శక వాస్తవికతావాదం అనేది ఆ ''అధికమైన వ్యక్తుల'' వైయక్తిక సృజనాత్మకతనుంచి ఉద్భూతం అయిందని తెలుసుకోవాలి. జీవితం కోసం పోరాడే శక్తి లేక, ఆ జీవితంలో స్థాన భ్రంశం చెంది, యెవడి ఉనికి కోసం వాడు బతకడంలోని అర్థ రాహిత్యాన్ని గురించి కొంచెం యించుమించులో స్పష్టంగా యెరిగి వుండి, ఆ అర్థ రాహిత్యాన్ని సకల సాంఘిక దృగ్గోచర విషయాలా, మొత్తం చారిత్రక క్రమపూ అసంబద్ధతగా మాత్రమే వాళ్లు అవగతం చేసుకున్నారు.

సవిమర్శక వాస్తవికతావాదం చేసిన బ్రహ్మాండమైన కృషిని కాదనకుండానే, పద ఆలంకారికత కళలో దాని లాక్షణిక సంబంధమైన విజయాలని పూర్తిగా అంచనా వేస్తూనే ఆ వాస్తవికతావాదం గతకాలపు అవశేషాలని వెల్లడి చెయ్యడానికీ, వాటి నిర్మూలన కోసం పోరాటం జరపడానికీ మాత్రమే మనకి అవసరమని మనం గుర్తించాలి.

యీ వాస్తవికతావాదపు రూపం, యేమైనప్పటికీ కూడా, సోషలిస్టు వైయక్తికతని బోధించడానికి ఉపకరించలేదు, ఉపకరించదు. యేమంటే అన్నిటినీ విమర్శిస్తూనే అది దేన్నీ స్థాపించలేదు, లేదా, అన్నిటికంటే అధ్వాన్నమైందేమంటే, తను కాలదన్నిన అన్నిటినీ తనే ఔనని చెప్పేదానికి తిరిగి చేరింది.

శ్రామిక జన పంకజం, మన శ్రమ వీరుల ఉదాహరణ తెలియజేస్తున్నట్టుగా సోషలిస్టు వైయక్తికత సమష్టి శ్రమ పరిస్థితులనుంచే అభివృద్ధి చెందగలదు. మానవుణ్ణి వక్రీకరించే పెట్టుబడిదారీ విధానపు అధికారంనుంచి సర్వప్రపంచ శ్రామికులనీ విముక్తి చేసేటటువంటి ఉన్నత, వివేకవంతమైన లక్ష్యం సమష్టి శ్రమకి వుంది.

జీవితం ఆచరణ అనీ, సృజనాత్మకత అనీ సోషలిస్టు వాస్తవికత చాటుతుంది. ప్రకృతి శక్తులమీద విజయానికీ, ఆరోగ్యానికీ, దీర్ఘాయుష్షుకీ, భూమిమీద జీవించే మహత్తర ఆనందానికీ, మానవుడి అత్యుత్తమ వైయక్తిక సామర్థ్యాలని విశృంఖలంగా అభివృద్ధి చెయ్యడం అనేది ఈ సృజనాత్మకత లక్ష్యం. మానవుడు నిరంతరం పెరిగే తన అవసరాలతో తూగేటట్టు, యేక కుటుంబంగా కలిసి పోయేటట్టు మానవాళి అద్భుత నివాసంగా యీ భూమిని నిర్మించాలని కోరుకుంటాడు.

మన సాహిత్యంలోని లోటుపాట్లని గురించి అంత చెప్పిం తర్వాత నేను దీని గుణాలని, విజయాలనీ గురించి కూడా చెప్పాలి. మన సాహిత్యానికీ, పాశ్చాత్య సాహిత్యానికీ మధ్య గల స్ఫుటమైన విభేదాలని గురించి చెప్పే వ్యవధి నాకు లేదు. కథావస్తువుకి సంబం

ధించిన నూతనత్వంలో మన సాహిత్యం పాశ్చాత్య సాహిత్యాన్ని మించిపోయిందనే విషయం నిష్పాక్షికంగా చూసే యెవరికేనా గానీ తేటతెల్లంగానే వుంటుంది. మన రచయితలు చాలా మందికి తమ దేశంలోకంటే పశ్చిమ దేశాల్లో యెక్కువ గుర్తింపు లభించిందన్న సంగతి మీకు గుర్తు చేస్తున్నాను. "సాహిత్యం గురించి" అన్న వ్యాస సంకలనంలో ఒక దాంట్లోనూ, అలాగే అందులోని చాలా యితర వ్యాసాల్లోనూ మన సాహిత్యం సాధించిన విజయాలని గురించి 1930లో నేను గంభీరంగా స్పష్టంగా సంతోషంతో చెప్పాను. అప్పటినుంచి కుంభిత కృషి వున్న నాలుగేళ్ళు జరిగిపోయాయి. మన సాహిత్య విజయాల గురించిన అంచనాలు లేవనెత్తే హక్కు ఆ కృషి యిస్తుందా నాకు? అవును, మన ముఖ్య పాఠకులనుంచి — కార్మికులనుంచి, సమష్టిక్షేత్ర రైతుల నుంచి — అనేక పుస్తకాలని పొగుడుతూ వచ్చే ఉత్తరాలు అలా చేసే హక్కుని నాకు యిస్తున్నాయి. మన సాహిత్యాభివృద్ధిలో నాయకులుగా గుర్తించదగ్గ శ్రేష్ఠమైన రచయితల బృందం మనకి వుంది.

యీ బృందం అత్యంత ప్రతిభావంతులైన పార్టీ, పార్టీయేతర రచయితలని ఐక్యం చేసుకోవడంతోటి పార్టీయేతర రచయితలు నామకః మాత్రమే కాకుండా వాస్తవంగా "సోవియట్" అయ్యారు. యేమంటే వాళ్ళు యింకా యింకా యెక్కువగా పార్టీ, కార్మిక, కర్షక సోవియట్ అధికారమూ చేస్తూ వున్న వీరోచిత కృషి తాలూకు సాధారణమైనా, విశ్వజనీనమైనా అర్థాన్ని ఆకళింపు చేసుకున్నారు. పద్దెనిమిదవ శతాబ్దం తర్వాత, జీవితంలోకి శక్తివంతంగా ప్రవేశించడానికీ, దానిమీద కచ్చితమైన ప్రభావాన్ని కలిగించడానికీ రష్యన్ బూర్జువా సాహిత్యానికి దగ్గర దగ్గర నంద యేళ్ళు పట్టిందన్న విషయాన్ని దృష్టిలో వుంచుకోవాలి. సోవియట్ విప్లవ సాహిత్యం ఆ ప్రభావాన్ని పది హేనేళ్ల కాలంలో సాధించింది.

వేగవంతంగా పెరుగుతూ వున్న మన జీవితమూ లెనిన్ పార్టీ నిర్వహిస్తూన్న సాంస్కృతిక, విప్లవాత్మక కృషీ మన సాహిత్యంనుంచి ఆశించేటటువంటి ఉన్నత కోరికలు, సాహిత్యానికి పార్టీ యిచ్చేటటువంటి మహత్తర ప్రాముఖ్యంనుంచే ఉద్భవిస్తున్నాయి. ప్రపంచంలో వున్నటువంటి మరే యితర భూత, వర్తమాన దేశాల్లోనూ కూడా విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం యింత ఆదరపూర్వక సహాయాన్ని పొందలేదు. లేదా కళా, విజ్ఞానశాస్త్ర కార్యకర్తల వృత్తిపర గుణాలని పెంపొందించడంలో యింత శ్రద్ధనీ యే దేశమూ చూపెట్టలేదు.

శ్రామిక రాజ్యం వేలాది మొదటి శ్రేణి "సంస్కృతీ నిష్ణాతుల"నీ, "అనుభూతి ఇంజనీర్లనీ" తయారుచేసుకోవాలి. ప్రపంచమంతా కూడా శ్రామిక వర్గానికి లుప్తం అయిన ఆ హక్కుని, తమ బుద్ధినీ, ప్రతిభలనీ, సామర్థ్యాలనీ లభివృద్ధి చేసుకొనే

హక్కుని మొత్తం శ్రామిక జనావళికి తిరిగి యిచ్చేందుకు గాను యిది అవసరం. రచయితలమైన మనమీద యీ సాధింప వీలయిన లక్ష్యం, మన కృషికీ, సాంఘిక ప్రవర్తనకీ సంబంధించి కఠినమైన బాధ్యతని విధిస్తోంది. వాస్తవికతావాద సాహిత్యానికి సంప్రదాయికంగా వుండేటటువంటి "ప్రజలా, ప్రపంచపూ న్యాయ నిర్ణేతలు," "జీవిత విమర్శకులు"లాంటి స్థానంలోనే కాకుండా, "ప్రపంచాన్ని మార్చేటు"వంటి క్రమంలో నూతన జీవిత నిర్మాణంలో ప్రత్యక్షంగా పాల్గొనే స్థానంలో అది రచయితలమైన మనలని పెడుతోంది.

ఆ హక్కుని కలిగి వుండటం అనేది ప్రతి రచయితలోనూ తన కర్తవ్యాన్ని గురించిన చైతన్యాన్నీ, మొత్తం సాహిత్యానికి సంబంధించిన బాధ్యతనీ, అందులో కనిపించకూడని విషయాలకి సంబంధించిన చైతన్యాన్నీ నేర్పాలి.

సోవియట్ రచయితల యూనియన్ 1500 మంది సభ్యులని సంఘటిత పరుస్తోంది. అంటే 1,00,000 మంది పాఠకులకి ఒక రచయిత అన్నమాట. యీ శతాబ్దపు ఆరంభంలో స్కాండినేవియన్ ద్వీపకల్పపు వాసులలో 230 మంది పాఠకులకి ఒక రచయిత వుండటంబట్టి చూస్తే యిది యెక్కువ కాదు. యు.ఎస్.ఎస్.ఆర్.లో నివశించేవాళ్లు నిరంతరంగా, దాదాపు అనునిత్యమూ తమ ప్రతిభని ప్రదర్శిస్తున్నారు. యేమైనా, అలా అని, త్వరలోనే మనకి మేధావులైన 1500 మంది రచయితలు వస్తారని కాదనుకోండి. ఒక్క యాభై మంది వస్తారని ఆశిద్దాం. ఆత్మవంచన లేకుండా వుండటం కోసం మేధావులైన అయిదుగురు రచయితల కోసం, నలభై అయిదు మంది ప్రతిభావంతులకోసం మనం ప్రణాళిక వేసుకుందాం. ఆరంభించడానికి గాను అది సరిపోతుందని అనుకుంటున్నాను. మిగతా వాళ్లల్లో జీవిత వాస్తవాలపట్ల తగినంత శ్రద్ధ యింకా చూపించని వాళ్లూ, తమ ముడిసరుకుని సరిగా వ్యవస్థీకరించుకోలేని వాళ్లూ, అశ్రద్ధగా దానితో వ్యవహరించే వాళ్లూ వుంటారు. యీ సంఖ్యకి వందలాది అభ్యర్థులనీ, అన్ని రిపబ్లిక్కులనుంచీ, ప్రాంతాలనుంచీ వందలాది "ఆరంభకుల"నీ మనం జోడించాలి. వాళ్లల్లో వందలాదిమంది రచనా వ్యాసంగంలో వున్నారు. డజన్ల కొద్దీ అచ్చులో దర్శనం యిచ్చారు. 1933–34 మధ్య హబారోవ్స్క్, కొమ్సొమోల్స్క్‌నుంచి రోస్తోవ్, స్టాలిన్‌గ్రాడ్, తాష్కెంట్, వొరోనెజ్, కబర్డినో – బల్కారియా, త్బిలీసి దాకా యింకా అలా అలా అనేక ప్రాంతాల్లో స్థానిక రచయితల రచనలు వున్న ముప్పై సాహిత్య పత్రికలు, కథాసంకలనాలు వెలువడ్డాయి.

యీ కృషిని అంచనా కట్టడం మన విమర్శకుల విధి. సమయం పక్వమైనా కూడా వాళ్లు దీన్ని గుర్తించలేదు. వున్నదున్నట్టుగా యీ కృషి జనసామాన్యంలో వున్న సాంస్కృతిక క్రమపు గాంభీర్యతని తెలియజేస్తుంది. యీ ప్రచురణలని యెవరేనా చదివి

వితే యీ పద్యాలని, నాటకాలని, కథలని రాసినవాళ్లు ఫాక్టరీల్లోనూ, గ్రామీణ ప్రాంతం లోనూ వుండే రచయితలని తెలుస్తుంది. సాహిత్య కృషి జరపాలని ఆతృతపడే యువ జనం మన దేశంలో 10,000 మందికి తక్కువ వుండరని అంచనా. భవిష్యత్ సాహిత్య ఇన్‌స్టిట్యూట్ యిందులో పదో వంతు మందిని కూడా యిముడ్చుకోలేదను కోండి.

నేను యిప్పుడు ఓ ప్రశ్న అడుగుతాను: యీ రచయితల మహాసభని యెందుకు నిర్వహిస్తున్నట్టు, యీ భవిష్యత్ యూనియన్ పెట్టుకొనే లక్ష్యాలు యేమిటి? సాహిత్య కారుల వ్యక్తిపర సంక్షేమమే లక్ష్యాలైనట్టయితే యీ యత్నం చమురు దండుగ వ్యవహారం అవుతుంది. యూనియన్ రచయితల వృత్తిపర ప్రయోజనాలని మాత్రమేకాక మొత్తం సాహిత్య ప్రయోజనాలని తన ముందు వుంచుకోవాలి. ఒక మేరకి యూని యన్ యీ ఆరంభకుల శ్రేణికి నాయకత్వం వహించాలి. వాళ్లని వ్యవస్థీకరించాలి. వాళ్లని భిన్న కార్యకలాపాలమీద నియోగించాలి. గత కాలపూ, వర్తమాన కాలపూ ముడి సరుకుని యెలా వాడాలో నేర్పాలి.

మన గత చరిత్ర మనకి తెలీదు. ఒకప్పుడు స్వతంత్ర రాజకుమారులు పరి పాలించిన పట్టణాలది గాని, సరిహద్దులమీద వున్న పట్టణాలది గాని అవి పుట్టిందగ్గర నుంచి మన కాలం దాకా వాటి చరిత్రని రాయడానికి పథకం తయారైంది. కొంత ఆరంభం కూడా జరిగింది. యీ కృషి స్కెచ్‌ల రూపంలోనూ, కథల రూపంలోనూ ఫ్యూడల్ రష్యాలోని జీవితాన్ని గురించీ, మాస్కో గ్రాండ్ డ్యూక్‌లా, జార్‌లా వలస వాద విధానం గురించీ, వాణిజ్యం పరిశ్రమలు అభివృద్ధిచెందడం గురించీ, రాజకుమా రులు, వర్తకులు, చర్చి రైతాంగాన్ని దోచుకోవడం గురించీ వర్ణించి, సమష్టిక్షేత్రాల నిర్మాణంతోటి — ఆస్తి బానిసత్వంనుంచీ, ''భూ అధికారం''నుంచీ రైతాంగాన్ని, నిజంగా సంపూర్తిగా విముక్తం చేసే ఆ చర్యతోటి ముగింపుకు రావాలి.

మన యూనియన్ రిపబ్లిక్కుల గత చరిత్రని గురించి మనం తెలుసుకోవాలి. వందలాది వర్ధమాన రచయితలని యీ కృషిలోకి తీసుకు రావచ్చు. యిది వాళ్లకి ముడి సరుకుమీద సమష్టికృషిద్వారానూ, పరస్పర విమర్శద్వారానూ స్వయంబోధనకీ, తమ అర్హ తని పెంపొందించుకోవడానికీ విస్తృత అవకాశాలని యిస్తుంది.

గతంలో జరిగిన ప్రతిదాన్ని గురించీ మనం తెలుసుకోవాలి. అంటే యిప్పటిదాకా అది మనకి అందుతూ వున్న రీతిలో కాకుండా మార్క్స్, లెనిన్‌ల బోధనల్లో గోచర మైనట్టుగా, శ్రమవల్ల ఫాక్టరీల్లోనూ, క్షేత్రాల్లోనూ ఆచరణలోకి వస్తున్నట్టుగా తెలుసు కోవాలి. యీ శ్రమ అనేదాన్ని సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్యలోని శ్రామికవర్గపు సంకల్ప నిమిత్తాలనే నూతన చారిత్రక శక్తి వ్యవస్థీకరించి, నడిపించేటటువంటిది,

అదీ, నా అభిప్రాయంలో, రచయితల సమాఖ్యని యెదుర్కొంటున్న సమస్య. మన మహాసభ పాఠకులకి ఒక నివేదిక మాత్రమే కాదు లేదా మన ప్రతిభావిశేషాల ప్రదర్శన కాదు. యిది సాహిత్యాన్ని వ్యవస్థీకరించాలి. అఖిల సమాఖ్య ప్రాముఖ్యం వున్న కృషిలో — మన దేశపు భూత వర్తమానాలని సర్వతోముఖంగా తెలుసుకోవడంలో, యువ రచయితలకి బోధించాలి.

# ''అమ్మ'' నవల ఫ్రెంచి ప్రచురణకి ముందుమాట

ప్రచురణకర్తలారా!

యీ పుస్తకపు నూతన ఫ్రెంచి ప్రచురణకి కొన్ని మాటలు రాయాల్సిందిగా నాకు మా కామ్రేడ్లు సూచించారు. ఆ కర్తవ్యం సులభమైంది కాదు. తమ పుస్తకాల లోటు పాట్లు తమకే బాగా తెలిసినటువంటి రచయితల కోవకి చెందిన వాణ్ణి నేను. నిరంకుశ ప్రభుత్వానికీ, బూర్జువావర్గానికీ వ్యతిరేకంగా రష్యన్ శ్రామికవర్గపు తొలి పోరాటం యింకా జరుగుతూ వుండగానే నేనీ పుస్తకాన్ని రాసానన్న దాన్ని బట్టే యీ పుస్తకపు లోటు పాట్లు తెలుసుకోవచ్చు. నేను దీన్ని అమెరికాలో వుండగా, హడా వుడిగా,[306] తగినంత సమాచారం అందుబాటులో లేనప్పుడు రాశాను. యిప్పటికి యిరవై యెనిమిది యేళ్ళు గడిచిపోయాయి. యింత కాలమూ కూడా శ్రామికవర్గం ''అమ్మ'' నవలని చదువుతూనే వుంది. దీనిలో వున్న లోపాలు బహుశా శ్రామికవర్గంలో విప్లవ వర్గ చైతన్యం అభివృద్ధి చెందడానికి ఆటంకం కాలేదేమో.[307] అలాంటి వర్గ చైత న్యపు అభివృద్ధి చరిత్ర కఠోర తర్కం అపేక్షించే ముఖ్యమైన, అతి ప్రధానమైన వాటిల్లో ఒకటి. గతించిపోతూ వున్న పెట్టుబడిదారీ విధానపు యేహ్యమైన కంపనాలు ఫ్రెంచి శ్రామికవర్గానికీ, ప్రపంచ శ్రామికవర్గానికీ యింకా యింకా స్పష్టంగా గోచర మయ్యేటప్పుడు యీ పుస్తకపు నూతన ముద్రణ వెలువడుతోంది; శ్రామికవర్గానికి వ్యతి రేకంగా తన నిర్దాక్షిణ్య పోరాటంలో బూర్జువావర్గపు కడపటి ప్రయత్నం అయిన ఫాసిజం, ప్రపంచపు అన్ని దేశాల్లోనూ, సోషల్ డెమోక్రాట్ నాయకుల సాయంతో జర్మన్ బూర్జువావర్గం చేసిన దారుణ నేరాలన్నిటినీ పునరుక్తం చేసే బెదిరింపు కలి గిస్తున్నప్పుడు యీ పుస్తకపు నూతన ముద్రణ వెలువడుతోంది; పెట్టుబడిదారులతోటి తన ''ఆత్మిక'' బంధాన్నీ, శ్రామికవర్గం ముందు తన పిరికితనాన్నీ అల్ప బుద్ధితో మరో సారి రెండవ ఇంటర్నేషనల్ ప్రదర్శించుకున్న సమయంలో యీ పుస్తకపు నూతన ముద్రణ వెలువడుతోంది; పెట్టుబడిదారులు లక్షలాది శ్రామికులనీ, రైతులనీ కొత్తగా

నిర్మూలించడం కోసం అకస్మాత్తుగా పథకం వేస్తున్నప్పుడు యీ పుస్తకపు నూతన ముద్రణ వెలువడుతోంది.

ఆస్ట్రియాలోనూ, హాలండ్‌లోనూ శ్రామికవర్గపు అద్భుత యుద్ధాలు విరుచుకుపడి యెంతో కాలం అవలేదు. స్పానిష్ గని కార్మికుల వీరోచిత పోరాటం యింకా సాగుతూనే వుంది. ఎర్ర సైన్యం చాంగ్ కై షెక్ దోపిడీ ముఠాతో మొక్కవోకుండా పోరాడుతూనే వుంది.[308] శ్రామికవర్గం యెంతో రక్తాన్ని చిందిస్తోంది. కాని దాని పాక్షికమైన ఓటములూ, విజయాలూ దాని బ్రహ్మాండమైన పెరుగుదలని యింకా స్పష్టంగా సూచిస్తున్నాయి; దాన్ని ప్రపంచ పోరాటం కోసమూ, శత్రువుమీద కడపటి విజయం కోసమూ వ్యవస్థీకరిస్తున్నాయి. శ్రామిక ప్రజానీకపు బుద్ధిస్థైర్యపు యీ మహత్తర, విషాదకర దినాల్లో అధికారం కోసం, నియంతృత్వం కోసం శ్రామికవర్గపు పోరాటంలో నిజాయితీ గల విప్లవ రచయితల కృషి విప్లవాత్మక వర్గ చైతన్యపు అభివృద్ధి మార్గం కోసమే సంపూర్తిగా అంకితం కావాలి; ప్రపంచ పెట్టుబడిదారులకి వ్యతిరేకంగా ప్రపంచ శ్రామికులని వ్యవస్థీకరించి, సంఘటితపరచడానికే అంకితం కావాలి; విప్లవకర శ్రామికవర్గపు నిర్మూలనే అప్రకటిత లక్ష్యంగా గల యుద్ధానికి వ్యతిరేకంగా పోరాడేదాని కోసమే అంకితం కావాలి; బూర్జువావర్గపు నైచ్యాన్నీ, నీతిబాహ్యతనీ, నేర స్వభావాన్నీ వెల్లడి చేసి, నిర్దాక్షిణ్యంగా బట్టబయలు చేసేదాని కోసమే అంకితం కావాలి. బూర్జువావర్గం శ్రామికుల్ని క్రూరంగా నాశనం చేస్తోంది — బూర్జువాలపట్ల శ్రామికుల ఆలోచనకీ, దిశకీ గల క్రూరత్వం యింకా యెన్నో రెట్లు పటుతరంగా వుండాలి.

పెట్టుబడిదారీ విధానపు వెయ్యి సంవత్సరాల నైతిక, భౌతిక బానిసత్వానికి వ్యతిరేకంగా పూర్తి విముక్తి కోసం పోరాడేటువంటి యోధులకి, పాఠకులకి నా హృదయపూర్వక అభినందనలు అందజేస్తున్నాను.

## వివరణలు

యీ సంకలనంలో చేర్చిన వ్యాసాలు ఎమ్. గోర్కీ "రచనలు" 30 వాల్యూమ్ లలో, "కల్పనా సాహిత్య" ప్రచురణలు, మాస్కో, 1949–1956 అనే వాటి ఆధారంగా ప్రచురితం.

అంతోన్ చేహొవ్ – 1904లో రాసినది. 1914లో గోర్కీ అనేక కొత్త జ్ఞాపకాలని చేహొవ్ గురించి రాశాడు. 1923లో గోర్కీ రెండు భాగాలనీ కలిపి ఒకే పుస్తకంగా ప్రచురించడం కోసం సిద్ధం చేశాడు. కొంచెం సంక్షిప్తం చేసి ఆ జ్ఞాపకాలని ప్రచురించడం జరిగింది.

1 "యుద్ధం యెలా ముగుస్తుందనుకుంటున్నారు?" – 1897లో గ్రీసుకీ టర్కీకీ మధ్య జరిగిన యుద్ధానికి ప్రస్తావన. – పేజి 26.

2 "...కర్కోటక వ్యాధిని – యుద్ధాన్ని..." – 1914–1918 మధ్య జరిగిన మొదటి ప్రపంచ యుద్ధానికి ప్రస్తావన. – పేజి 35.

3 "...మంచూరియానుంచి తీసుకువచ్చిన జనరల్ కెల్లర్ శవపేటిక..." – 1904లో రష్యాకీ జపాన్‌కీ మధ్య యుద్ధం జరుగుతూ వుంది. – పేజి 36.

4 సువోరిన్, అలెక్సేయ్ (1834–1912) – రష్యన్ పాత్రికేయుడు, ప్రచారకుడు, 1876నుంచీ "నోవొయె వ్రేమ్యా" (నూతన యుగం) అనే వార్తాపత్రిక ప్రచురణకర్త. 1868నుంచి అక్టోబరు 1917 దాకా ప్రచురితం. – పేజి 36.

5 లండన్, జాక్ (1876–1916) – అమెరికన్ రచయిత; తన రచనల్లో ఉత్తర ప్రాంతపు కటువైన ప్రకృతి కవిత్వాన్నీ సాహసోపేతమైన కాల్పనికతనీ బంగారం

కోసం అన్వేషణ చేసే కఠినమైన శారీరక నైతిక పరీక్షలతో కళాత్మకంగా మేళవించినాడు. — పేజి 36.

6 వసీలీ బుస్లాయెవ్ — రష్యన్ జానపద కావ్యాల నాయకుడు, 14–15 శతాబ్దాలు.— పేజి 37.

7 డార్విన్, చార్లెస్ (1809–1882) — ఇంగ్లీషు ప్రకృతి శాస్త్రజ్ఞుడు, డార్వినిజం స్థాపకుడు. జీవ ప్రపంచపు పరిణామానికి సంబంధించిన ముఖ్య అంశాలని వెల్లడించాడు. నరుడు వానరుడినుంచి పరిణామం చెందాడన్న పరికల్పనని పెట్టినవాడు.—పేజి 38.

8 మొరోజొవ్, సవ్వ (1862–1905) — రష్యన్ పెట్టుబడిదారుల కుటుంబంనుంచి వచ్చినవాడు. గోర్కీ మిత్రుడు. మాస్కో ఆర్ట్ థియేటర్ పోషకుడు. విప్లవకారుల పట్ల సానుభూతి చూపించి, సహాయం చేశాడు. — పేజి 39.

9 సులెర్‌జీత్‌స్కీ, లియొపోల్డ్ (1872–1916) — రష్యన్ ప్రజా జీవితంలో ప్రసిద్ధుడు, కళారంగ ప్రముఖుడు. నిర్మాత. టాల్‌స్టాయ్, చేహొవ్, గోర్కీలకి సన్నిహితుడు. — పేజి 40.

10 ఎక్కెర్‌మాన్ ఐ. పి. (1792–1854) — మహా రచయిత గ్యోతే సొంత సెక్రెటరీ. — పేజి 41.

<u>''బాల్జాక్''</u> — పారిస్‌లో 1911లో ప్రచురితమైంది. రష్యన్‌లో 1927లో ప్రచురితమైంది.

11 బాల్జాక్, ఒనొరే డి (1799–1850) — ఫ్రెంచి నవలా రచయిత. ''మానవ ప్రహసనం'' అనే యీయన ఇతిహాసంలో 90 నవలలు, కథలు వున్నాయి. ప్రపంచ సాహిత్యంలో వాస్తవికతవాద అభివృద్ధికి దోహదం చేశాడు. — పేజీ 43.

12 గొన్‌కూర్, ఎడ్మాం (1822–1896), జూల్ (1830–1870) — ఫ్రెంచి రచయితలు, సోదరులు. ఎడ్మాం వీలునామా ప్రకారం (1896) నవలారంగంలో విజయాలకి సాంవత్సరికంగా గొన్‌కూర్ట్ బహుమతిని యిచ్చేందుకు గొన్‌కూర్ అకాడెమీని స్థాపించడం జరిగింది. — పేజి 43.

13 డ్యూమా, అలెగ్జాండ్ర్ (1803–1870) — ఫ్రెంచి నవలా రచయిత; సుప్రసిద్ధ చారిత్రక నవలలు ''కౌంట్ ఆఫ్ మాంటె క్రీస్టో'', ''ముగ్గురు వీరులు'' రాశాడు. — పేజి 43.

14 గబోరియో, ఎమిలీ (1832–1873) – ఫ్రెంచి నవలా రచయిత; డిటెక్టివ్ ధోరణి స్థాపకులలో ఒకడు. – పేజి 43.

15 హ్యూగో, విక్టోర్ (1802–1885) – ఫ్రెంచి రచయిత. ఫ్రెంచి రొమాంటిసిస్టుల ప్రజాస్వామిక విభాగపు నాయకుడు. ''నాటర్ డామ్ ది పారిస్'', ''బీదల పాట్లు'', వగైరా నవలలు రాశాడు. హ్యూగో సృజనాత్మక కృషిలోని సాంఘిక విషయాన్ని 19వ శతాబ్దపు రష్యన్ అభ్యుదయ రచయితలు యెంతగానో మెచ్చుకున్నారు. – పేజి 45.

16 ఫ్లొబెర్, గుస్తావ్ (1821–1880) – ఫ్రెంచి నవలా రచయిత, అద్భుత శైలీ విన్యాసం వున్నవాడు. ''మేడమ్ బొవరీ'', ''భావోద్వేగ పరిణామం'' అనే నవలలలో బూర్జువాల ఆచారాలనీ, అలవాట్లనీ, నైతిక రాహిత్యాన్నీ వర్ణించాడు. బాల్జాక్ వాస్తవికవాద ధోరణులని కొనసాగించాడు. ప్రపంచ సాహిత్యంలో వాస్తవికతావాదపు అభివృద్ధి మీద ప్రభావం కలిగించాడు. – పేజి 45.

17 స్టెండాల్, అ(ంరీ (1783–1842) – ఫ్రెంచి నవలా రచయిత. మానసిక విశ్లేషణలో, సామాజిక వైరుధ్యాలని వాస్తవంగా ప్రతిబింబించడంలో అందె వేసిన రచయిత. (''ఎరుపు నలుపు'', ''పర్మలో వున్న ఆశ్రయం''). – పేజి 45.

18 మపాసా, గి డె (1850–1893) – ఫ్రెంచి రచయిత. బూర్జువా వ్యతిరేక ధోరణికీ, నిశిత సాంఘిక విశ్లేషణకీ యీాయన రచనలు విశిష్టం అయాయి. (''ప్రాణ మిత్రుడు'', ''జీవితం'', ''ప్యేర్, జాన్''). – పేజి 45.

19 డికెన్స్, ఛార్లెస్ (1812–1870) – ఇంగ్లీషు నవలా రచయిత. సామయికమైన సామాజిక వస్తువు గల సాహస భరిత నవలలు రాశాడు. పెట్టుబడికి గల వినాశకర లక్షణాన్ని వాస్తవికంగా చిత్రించాడు. (''ది పాస్త్యుమస్ పేపర్స్ ఆఫ్ పిక్విక్ క్లబ్'', ''అడ్వెంచర్స్ ఆఫ్ ఆలివర్ ట్విస్ట్'', ''డాంబీ, కొడుకూ''). – పేజి 45.

20 థాకరే, విలియం (1811–1863) – ఇంగ్లీషు నవలా రచయిత. బూర్జువా సమాజపు సాంఘిక అధోగతిని ప్రతిభావంతంగా చిత్రించాడు. చారిత్రక నవలల రచయిత (''వానిటీ ఫెయిర్''). – పేజి 45.

''శ్రామికవర్గ రచయితల సంకలనానికి ముందుమాట'' – పెట్రోగ్రాడ్‌లో 1914లో ప్రచురితమైంది. సంక్షిప్తం.

[21] మొదటి రష్యన్ విప్లవం (1905–1907) తర్వాత జరిగిన అభివృద్ధినిరోధక కాలానికి ప్రస్తావన. — పేజి 50.

''రష్యన్ కళా సమీక్ష'' — 1917లో ప్రచురితమైంది. యీ వ్యాసం సంక్షిప్తం.

[22] పూష్కిన్, అలెగ్జాండ్ర్ (1799–1837) — రష్యన్ మహా కవి. నూతన రష్యన్ సాహిత్య స్థాపకుడు. రష్యన్ సాహిత్య భాషని సృష్టించినవాడు. 19వ శతాబ్దపు రష్యన్ సాహిత్యంలో ప్రముఖ సమస్యల్ని లేవనెత్తిన మొదటివాడు. రష్యన్ సాహిత్యంలో, ప్రపంచ సాహిత్యంలో కళాత్మక సౌష్ఠవానికీ, పరిణతికీ అత్యుత్తమ ఉదాహరణ యీాయన కవిత్వం. (''ఎవ్‌గేని ఒనేగిన్,'' ''ఇస్పేటు రాణీ'') — పేజి 52.

[23] గ్లింక, మిహాయీల్ (1804–1857) — రష్యన్ స్వరమేళనకర్త. రష్యన్ ప్రామాణిక సంగీత స్థాపకుడు. రష్యన్ ఒపెరా, సింఫోనీల పునాదులు వేశాడు. — పేజి 52.

[24] బ్రుల్లోవ్, కారల్ (1799–1852) — రష్యన్ కళాకారుడు, చిత్రకారుడు. రష్యన్ ప్రామాణికతలోకి యీాయన సృజనాత్మక కృషి రొమాంటిసిజపు హాయినీ, జీవిత సాన్నిహిత్యాన్నీ తీసుకువచ్చింది. — పేజి 52.

[25] గొగొల్, నికొలాయ్ (1809–1852) — రష్యన్ రచయిత. సవిమర్శక వాస్తవికతవాద అభివృద్ధికీ, అధిక్షేప ధోరణి రూపు దీసుకోవడానికీ, రష్యన్ సాహిత్యంలో మానవత్వ సూత్రాలనీ, ప్రజాస్వామిక సూత్రాలనీ స్థాపించడానికీ యీాయన ప్రభావం చాలా వుంది. (''ఇన్‌స్పెక్టర్ జనరల్'', ''మృత జీవులు'' వగైరా రచనలు). — పేజి 52.

[26] లేర్మొంతొవ్, మిహాయీల్ (1814–1841) — రష్యన్ కవి, రచయిత. యీాయన లాలిత్య భరిత గీతాల్లో సామాజిక, తాత్విక గాఢ వైయక్తిక అనుభూతులు పడుగు పేకల్లా కలిసిపోతాయి. రష్యన్ కవిత్వంలో, వీరోచిత ఆలోచనలు, గాఢమైన శక్తీ, చిత్రమైన మధురిమలూ వున్న గీత గమకాన్ని ప్రవేశపెట్టాడు. లోతైన సామాజిక, మనస్తత్వ వస్తువులుగల నవల ''మన కాలం వీరుడు'' లేర్మొంతొవ్ వాస్తవికతకి మకుటాయమానమైంది. — పేజి 52.

[27] తుర్గేనెవ్, ఇవాన్ (1818–1883) — రష్యన్ రచయిత; ప్రసిద్ధ వాస్తవికతావాది;

మానసిక విశ్లేషణకీ, ప్రకృతి వర్ణనా లాలిత్యానికీ నిష్ణాతుడు; రష్యన్ సాహిత్య, ప్రపంచ సాహిత్య అభివృద్ధిమీద మౌలికంగా ప్రభావం కలిగించినవాడు. ("తండ్రులూ–కొడుకులూ," "గొప్పవారి గూడు" వగైరా). – పేజి 52.

[28] దొస్తొయేవ్‌స్కీ, ఫ్యొదొర్ (1821–1881) – రష్యన్ రచయిత. మానవ బాధల ప్రపంచాన్ని, పీడిత, తాడిత వ్యక్తుల విషాద జీవితాన్ని దొస్తొయేవ్‌స్కీ చిత్రించాడు ("పేద జనం", "శ్వేత రాత్రులు"). దొస్తొయేవ్‌స్కీ నవలల్లో కథా గమనం భావాల పోరాటంమీద ఆధారపడి వుంది. యీ భావాలు నవలా పాత్రల స్వభావాలలో మూర్తిమంతం అవుతాయి. మనోవిశ్లేషణలో నిపుణుడు ("నేరమూ, శిక్ష", "కరమాజొవ్ సోదరులూ" వగైరా నవలలు). – పేజి 52.

[29] క్రామ్‌స్కోయ్, ఇవాన్ (1837–1887) – రష్యన్ చిత్రకారుడు, ప్రజాస్వామిక వాస్తవికతావాద కళ సూత్రాలని స్థాపించాడు. ట్రావెలింగ్ ఆర్ట్ ఎగ్జిబిషన్‌ల సంఘపు స్థాపకుల్లో ఒకడు. – పేజి 52.

[30] రేపిన్, ఇల్యా (1844–1930) – రష్యన్ చిత్రకారుడు, వాస్తవికతావాది. ప్రజల పీడనని వెల్లడిచేశాడు. ప్రజల మహత్తర శక్తినీ, విప్లవోద్యమాన్నీ ప్రదర్శించాడు. ప్రజల స్వేచ్ఛా ప్రియత్వాన్ని మహోన్నతం చేశాడు. – పేజి 52.

[31] మూసొర్గ్‌స్కీ, మొదేస్త్ (1839–1881) – రష్యన్ స్వరమేళనకర్త. ప్రజా సంగీత రూపకాలని కూర్చినవాడు. గ్రహించిన పాటలలో ప్రజా జీవితంనుంచి యీయన వస్తువు వుంది. – పేజి 52.

[32] చైకొవ్‌స్కీ, ప్యొత్ర్ (1840–1893) – రష్యన్ స్వరమేళనకర్త. పెద్ద సింఫనిస్ట్, సంగీత రూపకకర్త; ప్రసిద్ధ ఓపెరా, బాలే, సింఫనీ, ఛాంబర్ మ్యూజిక్‌ల కూర్పరి. పేజి – 52.

[33] ఒస్త్రొవ్‌స్కీ, అలెగ్జాండ్ర్ (1823–1886) – రష్యన్ నాటక రచయిత. రష్యన్ వాస్తవిక నాటకరంగాన్ని సృష్టించడంలో యీయన నాటక కళ ప్రముఖ పాత్ర వహించింది. – పేజి 52.

[34] కొరొలేంకొ, వ్లదీమిర్ (1853–1921) – రష్యన్ రచయిత, పాత్రికేయుడు. యీయన కథలలో, నవలలో ప్రజాస్వామిక మానవత్వ భావాలు నిండుగా వుంటాయి. ("మకార్ కల," "అంధ సంగీతకారుడు"). – పేజి 53.

35 ''నరోద్నిక్కులు'' — నరోద్నిచెస్త్వో — రష్యాలో మధ్యతరగతి మేధావుల ఉద్యమం, భావ జాలం, (1861–1895). వాళ్లు రైతుల ప్రయోజనాలని వ్యక్తం చేశారు; రష్యాలో పెట్టుబడిదారీ విధాన అభివృద్ధిని వ్యతిరేకించారు. రైతు విప్లవం ద్వారా రాచరిక నిరంకుశత్వాన్ని కూలదొయ్యాలన్నారు. — పేజి 53.

36 ''పెరెద్విజ్నిక్కులు'' ( సంచారులు) — 1870లో స్థాపించిన ట్రావెలింగ్ ఆర్ట్ ఎగ్జిబి షన్ల సంఘ కృషిలో పాల్గొన్న చిత్రకారులు, వాస్తవికవాదులు. ప్రజాస్వామిక భావా లతో ఒకటిగా కలిసినవాళ్లు. — పేజి 53.

37 ''కుచ్కీస్టులు'' — ''మొగూచయా కూచ్క'' (బలమైన బృందం) సభ్యులు. 1862లో ప్రారంభమై పంథొమ్మిదవ శతాబ్దపు డబ్బైయ్యవ దశకపు మధ్య భాగం దాక వున్న రష్యన్ సంగీతకారుల కళా సంఘం. ఎమ్. గ్లింక సంప్రదాయంమీద ఆధార పడి వాళ్లు ఒక జాతీయ శైలి కోసం, సంగీతంలో ఉన్నత దృక్పథం కోసం వాస్తవికత కోసం పోరాడారు. — పేజి 53.

''లియో టాల్‌స్టాయ్'' — గోర్కీ పుస్తకం ''జ్ఞాపకాలు''లో సంపూర్తిగా 1923లో ప్రచురితం. అచ్చుకివ్వడం కోసం యీ వ్యాసాన్ని తయారుచేసేటప్పుడు, గోర్కీ 1910 నవంబరులో యాస్నయా పొల్యానానుంచి టాల్‌స్టాయ్ నిష్క్రమణ, మరణం సమయంలో వి. కొరొలేంకొకి రాసిన ఉత్తరాన్ని చేర్చాడు. యీ ఉత్త రాన్ని పూర్తిచెయ్యనూ లేదు, పోస్టు చెయ్యనూ లేదు.

రచయిత చెప్పినదాని ప్రకారం, టాల్‌స్టాయ్‌ని గురించిన యీ జ్ఞాపకాలని, అవి విడిగా ఒక పుస్తకంగా రాగానే, లెనిన్ చదివాడట.

సంక్షిప్త పాఠం.

38 లియొనార్డో డావిన్చి (1452–1519) — ఇటాలియన్ చిత్రకారుడు, శిల్పి, వాస్తు శిల్పి, శాస్త్రజ్ఞుడు, ఇంజనీరు. కళాత్మక భాష నూతన మార్గాలని రూపొందించాడు. పునర్వికాస యుగపు ఉన్నత మానవతావాద ఆదర్శాలకి సమంగా తూగే మానవ మూర్తిని సృష్టించాడు. — పేజి 55.

39 క్రొపోత్కిన్, ప్యోత్ర్ (1842–1921) — రష్యన్ విప్లవకారుడు, అరాచక సిద్ధాంత వేత్త, భౌగోళికశాస్త్రజ్ఞుడు, భూగర్భశాస్త్రజ్ఞుడు. — పేజి 56.

40 ఏండర్సన్, హాన్స్ క్రిస్టియన్ (1805–1875) — డేనిష్ నవలా రచయిత, కథా

రచయిత. తన అద్భుత కథలద్వారా ప్రపంచ వ్యాప్త కీర్తిని గడించాడు. వాటిలో కాల్పనికత వాస్తవికత, అద్భుతం, హాస్యం, అధిక్షేపం కలిసి వుంటాయి. — పేజి 57.

41 వొవ్‌చోక్, మార్కో (అసలు పేరు — మరీయా విలీన్‌స్కయా మార్కోవిచ్) (1833–1907) — ఉక్రేనియన్, రష్యన్ విప్లవ ప్రజాతంత్ర రచయిత్రి. ఆమె సృజనాత్మక కృషి అణగారిన రైతాంగం పట్ల కరుణతో నిండి వుంటుంది. ("ఉక్రేనియన్ జానపద కథలు," వగైరా). — పేజి 57.

42 ఫ్రెడెరిక్ ప్రష్యా — ఫ్రెడరిక్ ది గ్రేట్ (1712–1786), ప్రష్యా చక్రవర్తి (1740–1786). యీతని విస్తరణవాద విధానంవల్ల ప్రష్యా దాదాపు రెండింతలు అయింది. — పేజి 58.

43 గ్యోతే, యొహాన్ వోల్ఫ్‌గాంగ్ (1749–1832) — జర్మన్ రచయిత. నూతన యుగపు జర్మన్ సాహిత్య స్థాపకుడు. ఆలోచనా పరుడు, ప్రకృతిశాస్త్రజ్ఞుడు. ఆయన సృజనాత్మక కృషి ఆ యుగపు ప్రధాన ధోరణులనీ వైరుధ్యాలనీ ప్రతిబింబించింది. తన కడపటి తాత్విక రచన అయిన "ఫౌస్ట్"లో గ్యోతే జీవిత పరమార్థాన్ని అన్వేషించాడు, కార్యాచరణలో దాన్ని చూశాడు. — పేజి 59.

44 బాల్‌మంట్, కొన్‌స్తంతీన్ (1867–1942) — రష్యన్ కవి, సింబాలిస్టు. వ్యక్తిత్వవాదపు వస్తువుతో నిండి వుంటుంది ఆయన కవిత్వం. — పేజి 59.

45 ఫెత్, అఫనాసీ (అసలు వంశనామం — షెన్‌షిన్) (1820–1892) — రష్యన్ కవి. "పరిశుద్ధ కళ" భావాన్ని సైద్ధాంతికంగా బలపరిచినవాడు. కవిత్వంలో ప్రకృతి చిత్రాలనీ, మానవ క్షణ భంగుర ఉద్రేకాలనీ నైపుణ్యంగా చిత్రించాడు. — పేజి 59.

46 కిట్టీ — టాల్‌స్టాయ్ నవల "అన్నా కరేనినా"లో నాయిక. — పేజి 62.

47 నతాషా రొస్తోవా — టాల్‌స్టాయ్ నవల "యుద్ధమూ — శాంతీ"లో నాయిక. — పేజి 62.

48 రూసో, జాన్ జాక్ (1712–1778) — ఫ్రెంచి రచయిత, తాత్వికుడు. సామాజిక అసమానత్వానికి సొంత ఆస్తి కారణం అని చూపించాడు. యూరపియన్ పురోగామి చింతననీ, తత్వశాస్త్రాన్నీ, సాహిత్యాన్నీ ప్రభావితం చేశాడు. సెంటిమెంటలిజపు ప్రతినిధి కావడంవల్ల రూసో తన సృజనాత్మక కృషిద్వారా ("జూలీ", "కన్‌ఫెషన్సు") పంథొమ్మిదవ శతాబ్దంలో సైకోలాజిజాన్ని యూరపియన్ సాహిత్యంలో స్థాపించాడు. — పేజి 62.

49 యెల్‌పాతియేవ్‌స్కీ, సెర్గేయ్ (1854–1933) – రష్యన్ రచయిత, విప్లవోద్యమంలో పాల్గొన్నాడు. ఆత్మ కథలాంటి "గత కాలపు కథలు", "యాభై యేళ్ల జ్ఞాపకాలు." – పేజి 62.

50 ఇబ్సెన్, హెన్రిక్ (1828–1906) – నార్వీజియన్ నాటక రచయిత, కవి. యీాయన వాస్తవికతావాద సృజనాత్మక కృషి ప్రపంచ నాటక సాహిత్యాన్నీ, నాటకరంగాన్నీ యెంతో ప్రభావితం చేసింది. తాత్విక ప్రతీకవాద నాటక కవితలు "బ్రాండ్ట్", "పేర్ గ్యూంట్" స్వభావంలో బూర్జువా వ్యతిరేకంగా వుంటాయి. – పేజి 63.

51 రొజానొవ్, వసిలీ (1856–1919) – రష్యన్ రచయిత, ప్రతికేయుడు, తత్వవేత్త. మతపర అస్తిత్వవాద ఆలోచనా ధోరణిని క్రిస్టియన్ సన్యాసితత్వ విమర్శతో మేళవించాడు. ఎన్. గోగొల్, ఎఫ్. దొస్తొయేవ్‌స్కీల గురించి సాహిత్య వ్యాసాలు రాశాడు. – పేజి 63.

52 ష్టుందిస్టులు – 19 శతాబ్దపు ఉత్తరార్థంలో రష్యన్, ఉక్రేనియన్ రైతుంలో వేర్పాటు మతశాఖోద్యమం. – పేజి 63.

53 టాల్‌స్టాయ్, లెవ్ (1869–1945) – రష్యన్ రచయిత, శిల్పి; లియో టాల్‌స్టాయ్ కొడుకు. – పేజి 64.

54 టాల్‌స్టాయా, సోఫ్యా (1844–1919) – లియో టాల్‌స్టాయ్ భార్య. – పేజి 64.

55 హాఫ్‌మన్, ఎర్నెస్ట్ థియొడోర్ ఆమాడేయ్ (1776–1822) – జర్మన్ రచయిత, సంగీతకారుడు, చిత్రకారుడు. రొమాంటిక్ సంగీత సౌందర్యశాస్త్రాన్నీ, విమర్శనని స్థాపించిన వాళ్లలో ఒకడు. తన రచనలలో సున్నితమైన తాత్విక అధిక్షేపాన్ని వాస్తవికతకి సంబంధించిన విమర్శనాత్మక గ్రహణతోటి, జర్మన్ పశుబుద్ధులమీద అధిక్షేపాన్ని ఫ్యూడల్ నిరంకుశత్వం తోటీ కలిపాడు. – పేజి 67.

56 ప్లేవె, వ్యచెస్లావ్ (1846–1904) – రష్యా ఆంతరంగిక శాఖ మంత్రి, రహస్య పోలీసు దళపు అధిపతి (1902–1904). పరమ ప్రగతివ్యతిరేకి. – పేజి 68.

57 ఎంద్రేయెవ్, లియొనీద్ (1871–1919) – రష్యన్ రచయిత. యీాయన తొలి రచనలు ప్రజాస్వామిక, వాస్తవిక స్వభావంతో వుంటాయి. తర్వాత క్షీణ సాహిత్య ధోరణులు పెరిగాయి. – పేజి 70.

58 తెర్తులియాన్, క్వింటస్ సెప్టిమస్ ఫ్లారెన్స్ (సుమారు క్రీ.శ. 160–200 తర్వాత)

క్రైస్తవవేత్త, రచయిత. విశ్వాసం బలమైందని నమ్మాడు, అది హేతువుతో పొసగదని అన్నాడు. ఒక ప్రత్యేక మార్మిక భౌతికవాదాన్ని అభివృద్ధిచేశాడు. — పేజి 71.

59 తనేయెవ్, సెర్గేయ్ (1856–1915) — రష్యన్ సంగీతకారుడు, పియానిస్టు; సంగీత ప్రముఖుడు, ప్రజా ప్రముఖుడు. — పేజి 71.

60 షొపెన్‌హావర్, ఆర్థర్ (1788–1860) — జర్మన్ తత్వవేత్త, అహేతుకవాది; ఐచ్ఛిక వాదపు ప్రతినిధి; యీయన నిరాశావాద తాత్విక ధోరణి 19వ శతాబ్దపు ద్వితీయార్థంలో యూరప్‌లో ప్రాచుర్యం పొందింది. — పేజి 71.

61 సొలొవ్యోవ్, యెవ్‌గేని (స్కీబా, ఆంద్రేయెవిచ్ కలం పేర్లు) (1866–1905) — రష్యన్ సాహిత్య విమర్శకుడు, ప్రాతికేయుడు. — పేజి 74.

62 షెస్తోవ్, లెవ్ (అసలు పేరు — లెవ్ ష్వార్ట్స్‌మన్) (1866–1938) — రష్యన్ తాత్విక అహేతుకవాది, రచయిత; అస్తిత్వవాద ప్రతినిధి. ఎఫ్. దొస్తొయేవ్‌స్కి, ఎఫ్. నిచ్చేల భావాలని సమర్థించాడు. హేతువాద తత్వశాస్త్రంతోటి వాదనకి దిగాడు. — పేజీ 76.

63 నిచ్చే, ఫ్రెడరిక్ (1844–1900) — జర్మన్ తత్వవేత్త; అహేతుకవాదానికీ, ఐచ్ఛిక వాదానికీ ప్రతినిధి. ''జీవిత తత్వశాస్త్రపు'' స్థాపకుల్లో ఒకడు. ''అతీత మానవుడు'' అనే నిచ్చే బోధనలో బలవంతుడైన వానిపట్ల వ్యక్తి ఆరాధనతోటి ''భవిష్యత్ మానవుడు'' అనే కాల్పనిక ఆదర్శం మిళితం అయింది. యీయన బోధనలోని ప్రగతి వ్యతిరేక ధోరణులని ఫాసిస్టు భావజాలం వాళ్లు ఉపయోగపెట్టుకున్నారు. — పేజీ 76.

64 అవ్వకూమ్ (1620 లేదా 1621–1682) — రష్యన్ మత విభేద ధోరణి నాయకుడు. ఉన్నత స్థాయి మత ఆచార్యుడు, రచయిత. అధికారిక మతానికి వ్యతిరేకంగా మాట్లాడినందుకు శిక్షించబడి, బహిష్కారానికి గురయాడు. జార్ ఆజ్ఞ మేరకి యీయన్ని ఉరితీసారు. — పేజీ 79.

65 ''ఇలియడ్'' — ప్రాచీన గ్రీకు ఇతిహాసం. హోమర్ కృతమని అంటారు. ట్రాయ్ యుద్ధాన్ని గురించిన కథల ఆధారంగా క్రీ.పూ. 9–8 శతాబ్దాల్లో వచ్చిందట. — పేజీ 81.

66 ''బాల్యం,'' ''యుక్తవయస్సు'' — టాల్‌స్టాయ్ రచనలు. — పేజీ 81.

67 లావోత్సే (లేదా లావోత్సు, 6–5 శతాబ్దాలు క్రీ.పూ.) — జనశ్రుతి ప్రకారం ప్రాచీన చైనా తత్వవేత్త. ''లావోత్సు'' అనే టావోయిజపు మత గ్రంథం రాసినవాడు. — పేజీ 84.

68 నెక్రాసొవ్, నికొలాయ్ (1821–1877/78) – రష్యన్ కవి, ప్రజా జీవితాన్ని విప్లవ ప్రజాతంత్ర స్థానంనుంచి అర్థం చేసుకుని చిత్రించాడు. ("రష్యాలో యెవరు సంతోషంగా వుండగలరు?", "రష్యన్ స్త్రీలూ", వగైరా.) యీాయన ప్రజాతంత్ర కవిత్వం జానపద సాహిత్యంతో సన్నిహితంగా కలిసి, రష్యన్ సాహిత్య అభివృద్ధిమీద ముఖ్యంగా ప్రభావం కలిగించింది. – పేజీ 85.

69 ఉస్పేన్‌స్కీ, గ్లెబ్ (1843–1902) – రష్యన్ రచయిత. పట్టణ పేదవాళ్ల దారిద్ర్యాన్నీ, పీడననీ, గ్రామీణ ప్రాంతంలో పెట్టుబడిదారీ సంబంధాల అభివృద్ధినీ యదార్థంగా చూపించాడు. యీాయన సృజనాత్మక కృషి ప్రజాతంత్ర, విప్లవ నరోద్నిక్కు భావాలతో నిండి వుంటుంది. – పేజీ 85.

70 కన్‌ఫ్యూషియస్ (సుమారుగా 551–479 క్రీ.పూ.) – ప్రాచీన చైనా తత్వవేత్త, వారసత్వంగా వుండే ఉన్నత వంశీకుల ప్రయోజనాలని వ్యక్తం చేశాడు. ఆయన ముఖ్య భావాలు "లూన్ యూ" ("సంభాషణలు, అభిప్రాయాలు") అన్న గ్రంథంలో వ్యక్తం అయ్యాయి. – పేజీ 86.

71 ఫోరియరిస్టులు – ఫ్రెంచి ఊహాజనిత సోషలిస్టు అయిన ఛార్లెస్ ఫోరియర్ (1772–1837) అనుయాయులు. – పేజీ 86.

72 "ఇడియట్" – కౌంట్ మీష్‌కిన్, యిదే పేరుతో దొస్తొయేవ్‌స్కీ రాసిన నవల్లో ముఖ్య పాత్ర. – పేజీ 86.

73 "యువకుడు" – అక్రమ సంతానం అయిన యువకుడు దొల్గొరూకియ్ – యిదే పేరుతో దొస్తొయేవ్‌స్కీ రాసిన నవల నాయకుడు. – పేజీ 86.

74 రస్కోల్‌నికొవ్ – దొస్తొయేవ్‌స్కీ నవల "నేరమూ – శిక్షా"లో నాయకుడు. – పేజీ 86.

75 త్యూత్‌చెవ్, ఫ్యోదొర్ (1803–1873) – రష్యన్ కవి; గాఢమైన సైకాలజిస్టు; ప్రకృతి గీతాల నిష్ణాతుడు. సామాజిక చరిత్రకీ మానవుడి పాట్లకీగల వైరుధ్యాల విషాద అనుభూతిని యీాయన కవిత్వం వెల్లడి చేస్తుంది. – పేజీ 87.

76 టాల్‌స్టాయా, అలెగ్జాంద్రా (1884–1979) – టాల్‌స్టాయ్ కూతురు. – పేజీ 87.

77 టాల్‌స్టాయ్, సెర్గేయ్ (1863–1947) – రష్యన్ సోవియట్ స్మృతుల రచయిత, సంగీతకారుడు, టాల్‌స్టాయ్ కొడుకు. – పేజీ 88,

78 చాదాయెవ్, ప్యోత్ర్ (1794–1856) – రష్యన్ మత తత్వవేత్త; తన "తాత్విక లేఖల"లో రష్యన్ రాచరిక నిరంకుశత్వం పైనా, భూస్వామ్యదాస్యం పైనా, రష్యన్ చర్చి పైనా విమర్శనాత్మక దృక్పథాన్ని వెల్లడించాడు. – పేజీ 88.

79 డాంటె, అలిగ్యేరి (1265–1321) – ఇటాలియన్ మహా కవి. ఇటాలియన్ సాహిత్య భాషా స్రష్ట. ఆయన సృజనాత్మక రచనలు యూరపియన్ సంస్కృతి వికాసానికి యెంతో దోహదం చేశాయి. – పేజీ 88.

80 షేక్స్పియర్, విలియమ్ (1564–1616) – ఇంగ్లీషు నాటక రచయిత, మహా కవి. పునరుజ్జీవన ఉత్తర కాలపు మహత్తర మానవతావాది. పాత్రలని సకల వైవిధ్య భరితంగా పరిణతి చెందేవిగా చిత్రించడం మానవ సంస్కృతికి యీాయన చేసిన సేవ. – పేజీ 88.

81 "సింప్లిసిస్సిమస్" – జర్మన్ అధిక్షేప పత్రిక. 1896నుంచి 1942 దాకా మ్యూనిక్‌లో ప్రచురితం. – పేజీ 88.

82 టాల్‌స్టాయన్లు – మతపర, నైతిక స్వయంసంపూర్ణతద్వారా సమాజాన్ని మార్పు చెయ్యగలమని టాల్‌స్టాయ్ బోధనమీద ఆధారపడిన మతపర, ఊహాజనిత స్వర్గవాద సామాజిక ఉద్యమంలో పాల్గొన్నవాళ్లు. – పేజీ 89.

83 "వారెంకా ఒలేసొవా", "యిరవై ఆరుమంది పురుషులూ, ఒక అమ్మాయీ" – ఎమ్. గోర్కీ కథలు. – పేజీ 90.

84 వెల్ట్‌మాన్, అలెగ్జాండ్ర్ (1800–1870) – రష్యన్ రచయిత. తన నవలలో అద్భుతాన్నీ వాస్తవికతనీ, సాహసాన్నీ నిత్య జీవితాన్నీ మేళవించాడు. – పేజీ 91.

85 మర్లిన్‌స్కీ – బెస్తూజెవ్, అలెగ్జాండ్ర్ (1797–1837) కలం పేరు. రష్యన్ రచయిత. డిసెంబరిస్టు. కాల్పనిక కవితలు, నవలికలు. – పేజీ 91.

86 స్టెర్న్, లారెన్స్ (1713–1768) – ఇంగ్లీషు నవలా రచయిత, సెంటిమెంటలిజం సాహిత్య స్థాపకుడు. సాహిత్య పారడీలలో నిష్ణాతుడు. – పేజీ 91.

87 కొల్‌త్సోవ్, అలెక్సేయ్ (1809–1842) – రష్యన్ కవి; పల్లె జీవితం గురించిన కవితలు రాశాడు. – పేజీ 91.

88 చెర్వి-ఫ్లెరోవ్స్కీ, వసీలి (1829–1918) – రష్యన్ సామాజిక శాస్త్రవేత్త, సాంతికేయుడు, ఆర్థికవేత్త – పేజీ 93.

89 దొదే, అల్ఫాన్స్ (1840–1897) – ఫ్రెంచి నవలా రచయిత. పెటీబూర్జువా దంభాల రాయుడి తరహా హాస్య నమూనాని సృష్టించాడు. – పేజీ 93.

90 పెల్ ఆస్టియే – దొదే నవల "అమృతుడు"లో పాత్ర. – పేజీ 93.

91 నార్మన్లు – స్కాండినేవియన్ సముద్ర దొంగలు. 8–11 శతాబ్దుల్లో యూరప్ తీరాలని కొల్లగొట్టారు. – పేజీ 93.

92 కువాల్దా – గోర్కీ కథ "చిత్తయిపోయిన వాళ్లు"లో పాత్ర. – పేజీ 94.

93 గిబ్బన్ ఎడ్వర్డ్ (1737–1794) – ఇంగ్లీషు చరిత్రకారుడు "రోమన్ సామ్రాజ్య క్షీణ దశ పతనం" అన్న గ్రంథం రాశాడు – రోమ్, బైజాంటియల చరిత్ర రెండవ శతాబ్దంనుంచి 1453 దాకా వున్న గ్రంథం. – పేజీ 95.

94 కొస్తొమారొవ్, నికొలాయ్ (1817–1885) – రష్యన్, ఉక్రేనియన్ చరిత్రకారుడు, రచయిత. రష్యా, ఉక్రేనియన్ల సాంఘిక, రాజకీయ, ఆర్థిక చరిత్రలని రాశాడు. ఉక్రేనియన్ జానపద సాహిత్యంమీద పరిశోధనలు చేసి, ప్రచురణ చేశాడు. – పేజీ 95.

95 మోమ్సెన్, థియొడోర్ (1817–1903) – జర్మన్ చరిత్రకారుడు. ప్రాచీన రోమ్ గురించీ, రోమన్ న్యాయం గురించీ అనేక పుస్తకాలు రాశాడు. – పేజీ 95.

96 లొంబ్రోసో, సెజారె (1835–1909) – ఇటాలియన్ మనస్తత్వశాస్త్రవేత్త, నేరశాస్త్రవేత్త. బూర్జువా నేరశాస్త్రంలోనూ శిక్షాన్యాయశాస్త్రంలోనూ మానవశాస్త్ర ధోరణిని స్థాపించాడు. – పేజీ 95.

ఫెనిమోర్ కూపర్ "ది పాథ్‌ఫైండర్"కి ముందుమాట – 1923.

97 కూపర్, ఫెనిమోర్ (1789–1851) – అమెరికన్ రచయిత. ఉత్తర అమెరికా వలస అయేటప్పుడు జరిగిన అనేక వీరోచిత, విషాద సంఘటనలతో ధారావాహికంగా నవలలు రాశాడు ("ది పాథ్‌ఫైండర్", "ది లెదర్‌స్టాకింగ్ సిరీస్") సముద్ర సాహసకృత్య సంబంధమైన నవలలూ రాశాడు. – పేజీ 102.

98 బెలిన్‌స్కీ, విస్సరియోన్ (1811–1848) – రష్యన్ సాహిత్య విమర్శకుడు, విప్లవ ప్రజాస్వామ్యవాది. భౌతికవాద తత్వవేత్త. కళా దృగ్విషయానికి సంబంధించి నిర్దిష్ట

చారిత్రక విశ్లేషణమీద ఆధారపడి వాస్తవిక అలంకారశాస్త్రపర, సాహిత్య విమర్శపర సూత్రాలని రూపొందించాడు. రష్యన్ సామాజిక చింతననీ సాహిత్యాన్నీ ప్రభావితం చేశాడు. — పేజీ 102.

ఎన్. లెస్కోవ్ — 1923. సంక్షిప్తం.

99 లెస్కోవ్, నికొలాయ్ (1831–1895) — రష్యన్ నవలా రచయిత. భాషమీద మహత్తర ప్రభుత వున్నవాడు. వర్ణనాత్మక పద్ధతి నిపుణుడు ("సమ్మోహిత పథికుడు"). — పేజీ 105.

100 స్లెప్‌చోవ్, వసిలీ (1836–1878) — రష్యన్ రచయిత. వాస్తవిక కథలు, స్కెచ్‌లు. పంథొమ్మిదవ శతాబ్దపు 60వ దశకపు మధ్య భాగంలో ప్రజాతంత్ర ఉద్యమపు సంక్షోభం గురించి, ప్రతిఘాత కాలంలో రజ్నొచీనెత్స్ మేధావుల పాట్లని గురించి రాశాడు. — పేజీ 106.

101 మొదటి నీకొలస్ (1796–1855) — రష్యా చక్రవర్తి (1825–1855). డిసెంబరిస్టుల తిరుగుబాటుని అణిచేశాడు (1825), స్వేచ్ఛాయుత ఆలోచనాశీలుర్ని నిర్దాక్షిణ్యంగా పీడించాడు. (పూష్కిన్, లేర్మొంతొవ్, హెర్జెన్, షెవ్‌చేంకొ వగైరా.) — పేజీ 106.

102 చెర్నిషేవ్‌స్కీ, నికొలాయ్ (1828–1889) — రష్యన్ విప్లవ ప్రజాతంత్రవాది, శాస్త్రజ్ఞుడు, రచయిత, సాహిత్య విమర్శకుడు. వాస్తవికవాదాన్ని స్థిరంగా సమర్థించాడు. రష్యాలో విప్లవోద్యమానికి 1860వ దశకంలో నాయకుడు. "యేం చెయ్యాలి?", "నాంది" లన్న నవలలు అనేక తరాల రష్యన్ విప్లవకారులు ఉద్భవించడంలో అతి ముఖ్యమైన పాత్ర వహించాయి. — పేజీ 107.

103 పీసరెవ్, ద్మీత్రి (1840–1868) — రష్యన్ రచయిత, సాహిత్య విమర్శకుడు, భౌతికవాద తత్వవేత్త, ఊహాజనిత సోషలిస్టు, విప్లవ ప్రజాతంత్రవాది. యీ ప్రస్తావన ఆయన వ్యాసం "రష్యన్ సాహిత్య వనంలో విహారం" అనే దానికి సంబంధించింది. — పేజీ 107.

104 "...సాహసోపేతమైన కృత్యాలు చెయ్యడానికి నిస్సంకోచంగా, నిర్భయంగా...." — ప్లెష్చేయెవ్, అలెక్సేయ్ (1825–1893) రాసిన పద్యంనుంచి. — పేజీ 110.

105 హైనె, హైన్‌రిఖ్ (1797–1856) — జర్మన్ కవి, రచయిత. లాలిత్య భరిత కవిత్వంలోనూ రాజకీయ కవిత్వంలోనూ ప్రముఖుడు. — పేజీ 112.

106 సెవస్తోపోల్ యుద్ధం -- క్రైమియా యుద్ధకాలంలో (1853–1856) 349 రోజుల పాటు సాగించిన సెవస్తోపోల్ నగరపు రక్షణ. — పేజీ 112.

107 గొంచరోవ్, ఇవాన్ (1812–1891) — రష్యన్ రచయిత, వాస్తవికవాద వచన నిష్ణాతుడు. ఆయన రచనల్లో రష్యన్ సమాజంలో 19వ శతాబ్దపు 40–60 దశకాల ముఖ్యమైన సంఘటనలు ప్రతిబింబించాయి. — పేజీ 113.

108 హెరొడోటస్ (క్రీ.పూ. 490–480 మధ్య నుంచి 425 దాకా) — ప్రాచీన గ్రీకు చరిత్రకారుడు. "చరిత్ర పితామహుడం"టారు. అఖిమెండెస్ రాజ్యం, ఈజిప్టు చరిత్ర వగైరా పుస్తకాలు రాశాడు. స్కిథియన్ల జీవిత, నడవడికల గురించి తొలి క్రమ రీతి వర్ణన చేసినవాడు. — పేజీ 114.

రొమేన్ రోలాన్ — ఫ్రెంచి అనువాదం పారిస్‌లో 1926లో ప్రచురితమైంది; రష్యన్‌లో 1927లో ప్రచురితమైంది.

109 రోలాన్, రొమేన్ (1866–1944) — ఫ్రెంచి నవలా రచయిత, సంగీత విమర్శకుడు, పౌర ప్రముఖుడు. ఐతిహాసిక నవలలు "జాన్ క్రిస్టోఫ్" "సమ్మోహక ఆత్మ". మహా వ్యక్తుల గురించిన కళాత్మక జీవిత చరిత్రలు (బీథొవెన్, మైకెలాంజెలొ, ఎల్. టాల్‌స్టాయ్). నోబెల్ బహుమతీ గ్రహీత (1915). — పేజీ 117.

110 డాన్ క్విక్సట్ — స్పానిష్ రచయిత సెర్వాంటెస్ (1547–1616) అదే పేరుతో రాసిన నవల నాయకుడు. — పేజీ 118.

ఎమ్. ప్రిష్విన్ — 1926లో ప్రచురితం. సంక్షిప్తం.

111 ప్రిష్విన్, మిహాయిల్ (1873–1954) — రష్యన్ సోవియట్ రచయిత, తాత్త్విక, లాలిత్యభరిత రచనలు. — పేజీ 120.

112 అక్సాకొవ్, సెర్గేయ్ (1791–1859) — రష్యన్ రచయిత; భూస్వాముల జీవిత విధానాన్నీ నడవడికనీ వాస్తవికంగా చిత్రించాడు. రష్యన్ ప్రకృతి కవి. — పేజీ 121.

113 సెర్గేయెవ్-త్సేన్‌స్కీ, సెర్గేయ్ (1875–1958) — రష్యన్ సోవియట్ రచయిత. "రష్యా పరివర్తన" అనే చారిత్రక విప్లవాత్మక ఇతిహాసం. — పేజీ 121.

114 షొపెన్, ఫ్రెడరిక్ (1810–1849) — పోలిష్ సంగీతకారుడు, పియానో వాయిద్యకారుడు. జానపద సంప్రదాయాలమీద ఆధారపడిన ఆయన రొమాంటిక్ సృజనాత్మక కృషివల్ల పోలిష్ సంగీతానికి ప్రపంచ వ్యాప్త గుర్తింపు వచ్చింది. — పేజీ 121.

115 లెవితాన్, ఐసాక్ (1860–1900) – రష్యన్ చిత్రకారుడు. చిత్రకళలో వర్ణ ఛాయలని సున్నితంగా పొందు పరిచాడు. – పేజీ 121.

116 రూస్‌దాయెల్, జాకబ్ (1628 లేదా 1629 – 1681) – డచ్ చిత్రకారుడు, జాతీయ ప్రకృతిని వాస్తవికంగా చిత్రించడంలో నిపుణుడు. – పేజీ 122.

117 లొ్రెయిన్, క్లాడ్ (1600–1682) – ఫ్రెంచి చిత్రకారుడు. సంప్రదాయిక ధోరణి ప్రతినిధి. – పేజీ 122.

118 హుంబోల్ట్, అలెగ్జాండ్ర్ (1769–1859) – జర్మన్ ప్రకృతిశాస్త్రజ్ఞుడు, భౌగోళిక శాస్త్రజ్ఞుడు, పర్యాటకుడు. పరిణామ సిద్ధాంతాన్ని యెంతగానో ప్రభావితం చేశాడు, అలాగే ప్రకృతిశాస్త్రాలకి సంబంధించి తులనాత్మక పద్ధతిని కూడా. – పేజీ 122.

119 హేక్కెల్, ఎర్న్‌స్ట్ (1834–1919) – జర్మన్ జీవశాస్త్రజ్ఞుడు, పరిణామవాది. ప్రాకృతిక శాస్త్రీయ భౌతికవాద ప్రతినిధి. – పేజీ 122.

"అనతోల్ ఫ్రాన్స్" – 1927లో ప్రచురితం. యీ వ్యాసం 1924లో అనతోల్ ఫ్రాన్స్ చనిపోయినప్పుడు రాసింది. గోర్కీ వ్యాసాల్లో, ఉత్తరాల్లో అనతోల్ ఫ్రాన్స్ పేరు తరుచుగా ప్రసక్తం అవుతూ వుంటుంది. యేళ్లు గడిచే కొద్దీ ఫ్రాన్స్ పట్ల గోర్కీ వైఖరి మరింత అభినందనాత్మకంగా పెరిగింది.

120 ప్రొతాగరస్ (క్రీ.పూ. 480–410) – ప్రాచీన గ్రీకు తత్వవేత్త. సోఫీజం అనే తత్వశాస్త్ర ధోరణి అత్యంత ప్రముఖ ప్రతినిధి. హెరాక్లిటస్ బోధనమీద ఆధార పడి జ్ఞానపు స్వీయ పరాధీనతని సమర్థించాడు. – పేజీ 126.

121 పిర్రోన్ (క్రీ.పూ. 360–270) – ప్రాచీన గ్రీకు తత్వవేత్త, సంశయాత్మక ధోరణి స్థాపకుడు. వాస్తవాన్ని గురించి మానవ అభిప్రాయాలు నిరంకుశంగా వుంటాయని భావించి, వాటినుంచి నిస్సంగత్వంతో వుండాలనీ, నిశ్చింత భావంతో వుండాలనీ అనుకున్నాడు. – పేజీ 126.

122 సోక్రటేస్ (క్రీ.పూ. 470/469–399) – ప్రాచీన గ్రీకు తత్వవేత్త. శోధించే ప్రశ్నలు వేసి తద్వారా సత్యాన్ని రాబట్టవచ్చని ఒక పద్ధతిగా గతితర్కపు స్థాపకులలో ఒకడు. తర్వాతి యుగాల్లో ఆదర్శఋషిగా మూర్తిమంతం అయాడు. – పేజీ 126.

123 ప్రొక్రూస్టియన్ తల్పం – గ్రీకు పురాణాల్లో ఇనప మంచం. దానిమీద అట్టేకా

ప్రొక్రూస్టస్ అనే రాక్షస దొంగ తను బాధించేవాళ్లని కట్టేసి ఆ మంచం పొడుగుకి సరిపడేటట్టుగా వాళ్లని సాగదీసేవాడు లేదా వాళ్ల కాళ్లని నరికేసేవాడు. — పేజీ 126.

124 వోల్టేర్ (1694–1778) — ఫ్రెంచి రచయిత, వికాసదాయకుడు, ఆస్తికవాద తత్వవేత్త. మహత్తర ఫ్రెంచి విప్లవానికి సైద్ధాంతికంగా సన్నాహం చెయ్యడంలో, రష్యన్ సామాజిక చింతనతో సహా ప్రపంచ సామాజిక చింతనాభివృద్ధిలో యెంతో ప్రముఖ పాత్ర వహించాడు. — పేజీ 127.

125 రాబ్లే, ఫ్రాంసువా (1494–1553) — ఫ్రెంచి రచయిత, మానవతావాది. "గార్గంటువా, పెంటాగ్రూయెల్" అనే యీాయన అయిదు సంపుటాల నవల ఫ్రెంచి పునర్వికాసపు సాంస్కృతిక విజ్ఞాన కోశం. — పేజీ 127.

126 మాంటేన్, మిషెల్ (1533–1592) — ఫ్రెంచి తత్వవేత్త, మానవతావాది. మతం, మౌఢ్యం, కుతర్కం అనే వాటికి వ్యతిరేకంగా యెక్కుపెట్టిన తన "అనుభవాలు" అన్న గ్రంథంలో, మనిషిని అధిక విలువ వున్నట్టు పరిగణించాడు. — పేజీ 127.

127 స్విఫ్ట్, జొనాథన్ (1667–1745) — ఇంగ్లీషు రచయిత, రాజకీయ ప్రముఖుడు. చర్చిమీద, సాంఘిక వ్యవస్థమీద, పాలకవర్గాల విధానంమీద ఆయన చేసిన అధిక్షేప వ్యాఖ్యలు ప్రపంచ సాహిత్యంలో చిరస్థాయిగా, ఫలవంతంగా వుంటాయి. — పేజీ 127.

128 బొద్‌లేర్, షర్ల్ (1821–1867) — ఫ్రెంచి కవి, ఫ్రెంచి ప్రతీకవాదపు పథ నిర్దేశకుడు. — పేజీ 127.

129 ఫ్రాన్స్, అనతోల్ (1844–1924) — ఫ్రెంచి నవలా రచయిత. బూర్జువా వాస్తవికతని ఆయన అంగీకరించలేదు. క్రిస్టియన్ మౌఢ్యాన్ని, సన్యాసితత్వాన్నీ నిరసించాడు. యీ భావాలు సంశయాత్మక అధిక్షేప రూపంతో యీాయన నవలలో వెల్లడి అయాయి. యీాయన నోబెల్ బహుమతీ గ్రహీత (1921). — పేజీ 127.

130 ట్రాజన్ (53–117) — రోమన్ చక్రవర్తి (98–117). యీాయన దండయాత్రలద్వారా రోమన్ సామ్రాజ్యానికి అతివిస్తారమైన భూభాగం వచ్చింది. — పేజీ 128.

131 "డ్రేఫుస్ అభియోగం కేసు" — ఫ్రెంచి జనరల్ స్టాఫ్‌లో యూదు ఆఫీసరైన డ్రేఫుస్‌కి వ్యతిరేకంగా ఫ్రెంచి తిరోగమనవాద సైనిక ముఠాలు పురిగొల్పిన విచారణ (1894). జర్మనీ కోసం గూఢచారి పని చేశాడనీ, దేశ ద్రోహం నేరం మోపీ ఆయనకి యావజ్జీవ కారాగార శిక్ష విధించారు. — పేజీ 129.

132 అబదోన్నా — జూడాయిజ్ పురాణాల్లో పాతాళ లోకపు దేవత. — పేజీ 130.

"శ్రామికవర్గ రచయిత" — 1928లో ప్రచురితం. 1928 మార్చి 13న పోక్‌రోవ్స్క్ పట్టణంలోని ఒక సాంకేతిక పాఠశాల సాహిత్య బృంద సభ్యులు రాసిన ఉత్తరానికి జవాబుగా రాసినది యీ వ్యాసం. గోర్కీని "శ్రామికవర్గ సాహిత్యపు సహపథికుని"గా అంచనాకట్టే కొంతమంది విమర్శకుల ప్రయత్నాలతోటి వాళ్ళు గజిబిజి పడ్డారు.

133 నానా జాతి సమితి — అంతర్జాతీయ సంస్థ (1919–1946) ప్రజల మధ్య సహకారం కోసమూ, "శాంతి భద్రతలని" హామీ యిచ్చేందుకూ లక్షించినది; నిజానికి సామ్రాజ్యవాద దేశాల విధానపు సాధనం. సోవియట్ యూనియన్‌కి యీ సమితిలో 1934–1939 మధ్య సభ్యత్వం వుంది. — పేజీ 135.

"నేను రాయడం యెలా నేర్చుకున్నాను" — విడిగా 1928లో మొదటి సారి ప్రచురితం అయింది. సంక్షిప్తం.

134 మెందెలేయెవ్, ద్మీత్రి (1834–1907) — రష్యన్ రసాయన శాస్త్రజ్ఞుడు, అభ్యుదయ సామాజిక కార్యకర్త. రసాయనిక మూలకాల ఆవర్తన పట్టికని ఆవిష్కరించాడు. — పేజీ 138.

135 లొమొనోసొవ్, మిహాయిల్ (1711–1765) — ప్రపంచ ప్రాముఖ్యం వున్న మొట్టమొదటి రష్యన్ శాస్త్రజ్ఞుడు; ప్రకృతి శాస్త్రజ్ఞుడు, కవి; ఆధునిక రష్యన్ సాహిత్య భాషకి పునాదులు వేశాడు. — పేజీ 138.

136 స్ట్రిండ్‌బెర్గ్.... "కేప్టెన్ కోల్" అనే తన నవలలో — స్వీడిష్ నవలా రచయిత స్ట్రిండ్‌బెర్గ్ (1849–1912) రాసిన "అంతరాత్మ క్షోభ" అనే కథకి ప్రస్తావన. — పేజీ 138.

137 ఇల్యా మూరొమెట్స్ — ఐతిహాసిక వీరుడు, 12–16 శతాబ్దాల నాటి రష్యన్ ఇతిహాసాల ముఖ్య వీరుల్లో ఒకడు. — పేజీ 141.

138 ఫౌస్ట్ — జర్మన్ జానపద గాథల వీరుడు, అలాగే ప్రపంచ సాహిత్యంలోనూ కళలోనూ. విజ్ఞానం కోసం మానవాళి చేసిన ప్రయత్నానికి ప్రతీక. గ్యోతే నాటకం "ఫౌస్ట్" ప్రపంచ ఖ్యాతి గడించింది. — పేజీ 141.

139 హామ్లెట్ — యిదే పేరుతో షేక్‌స్పియర్ రాసిన నాటకపు నాయక పాత్ర. — పేజీ 141.

140 ప్లతోన్ కరతాయెవ్ – టాల్‌స్టాయ్ నవల ''యుద్ధమూ – శాంతీ''లో నాయకుడు. – పేజీ 141.

141 కరమాజొవ్‌లు – యఫ్. దొస్తొయేవ్‌స్కీ నవల ''కరమాజొవ్ సోదరులు''లో నాయకులు.– పేజీ 141.

142 స్విద్రిగైలొవ్ – దొస్తొయేవ్‌స్కీ నవల ''నేరమూ – శిక్షా''లో ఒక పాత్ర. – పేజీ 141.

143 ఒబ్లోమొవ్ – గొంచరోవ్ యిదే పేరుతో రాసిన నవలా నాయకుడు. – పేజీ 141.

144 హ్లెస్తకోవ్ – గోగొల్ కామెడీ ''ఇన్‌స్పెక్టర్ జనరల్'' నాయకుడు. – పేజీ 141.

145 మొల్చాలిన్ – రష్యన్ రచయిత ఎ. గ్రిబొయేదొవ్ రాసిన ''తెలివితేటలు కడగండ్లకు దారితీస్తున్నాయి'' అనే కామెడీ నాయక పాత్ర. – పేజీ 141.

146 టార్‌టూఫ్ – ''టార్‌టూఫ్'' అని మొల్యేర్ రాసిన కామెడీ నాయక పాత్ర. మొల్యేర్ ఫ్రెంచి నాటక రచయిత, నటుడు, నాటక కళా సంస్కర్త. – పేజీ 141.

147 ఒథెల్లో – యిదే పేరుతో షేక్‌స్పియర్ రాసిన నాటకపు నాయకుడు. – పేజీ 141.

148 బూనిన్, ఇవాన్ (1870–1953) – రష్యన్ రచయిత. గొప్ప వంశీకుల గ్రామీణ స్థానాల క్షీణతని, గ్రామీణ జీవితపు కష్ట జీవితాన్నీ చూపించాడు. రష్యన్ ప్రకృతిని కవితాత్మకంగా పొగిడాడు. రష్యాలో సవిమర్శక వాస్తవికతా ప్రముఖ ప్రతినిధుల కడపటి వాళ్లల్లో ఒకడు. నోబెల్ బహుమతి గ్రహీత (1933). – పేజీ 142.

149 ''మండే హృదయపు కథ'' – గోర్కీ కథ ''ముసలి ఇజెర్గీల్''లో దాంకొ గురించిన గాథకి ప్రస్తావన. – పేజీ 144.

150 సల్తికోవ్-శ్చెద్రీన్, మిహాయీల్ (1826–1889) – పెద్ద రష్యన్ అధిక్షేప రచయిత. ప్రజాతంత్ర వికాస దాయకుడు. ఆయన సృజనాత్మక కృషి రాచరిక నిరంకుశత్వానికీ, భూస్వామ్య దాస్యానికీ వ్యతిరేకంగా లక్షించింది. – పేజీ 145.

151 ''...విదేశీయుడైన బల్గేరియనో....'' – తుర్గేనెవ్ నవల ''ఆ సందర్భంలో'' నాయకుడు ఇన్‌సారొవ్‌కి ప్రస్తావన. – పేజీ 145.

152 రూదిన్ – యిదే పేరుతో తుర్గేనెవ్ రాసిన నవల నాయకుడు. – పేజీ 145.

153 షిల్లర్, జోహాన్ ఫ్రిడ్రిఖ్ (1759–1805) – జర్మన్ కవి, నాటక రచయిత,

కళా సిద్ధాంతవేత్త. జర్మన్ సాంప్రదాయిక సాహిత్య స్థాపకుల్లో ఒకడు. ''ది రాబ్బర్స్'' యీాయన నాటకం. — పేజీ 145.

154 ''జీవచ్ఛవం'' — టాల్‌స్టాయ్ నాటకం. — పేజీ 145.

155 ''మృత గృహాలు'' — దొస్తొయేవ్‌స్కీ నవల ''మృతగృహంనుండి చిన్న జాబులు''కి ప్రస్తావన. — పేజీ 145.

156 ''మూడు చావులు'' — టాల్‌స్టాయ్ రాసిన కథ. — పేజీ 145.

157 రజ్నొచీన్‌త్సి — రజ్నొ అంటే రష్యన్‌లో భిన్నమైన అనీ, చీన్ అంటే అంతస్తు అనీ అర్థం. గొప్పింటివాళ్లు కాని వేరు అంతస్తు — మధ్యతరగతివాళ్లు. 19వ శతాబ్ది ద్వితీయార్థంలో యీ మధ్యతరగతి అంతస్తు మేధావులకి ఆ పేరు వుండేది. — పేజీ 145.

158 ఒసిపొవిచ్-నొవొద్వోర్‌స్కీ, అంద్రేయ్ (1853–1882) — విప్లవ నరోద్నికుల్తో సంబంధం వున్న రష్యన్ రచయిత. — పేజీ 146.

159 పొమ్యలోవ్‌స్కీ, నికొలాయ్ (1835–1863) — రష్యన్ రచయిత; రజ్నొచీన్‌త్సి మేధావుల యదార్థ పాత్రలని సృష్టించాడు. — పేజీ 146.

160 హెర్జెన్, అలెగ్జాండ్ర్ (1812–1870) — రష్యన్ విప్లవకారుడు, రచయిత, తత్వవేత్త. డిసెంబరిస్టుల ప్రభావంవల్ల విప్లవ మార్గాన్ని యెంచుకున్నాడు. రష్యాలోని భూస్వామ్య దాస్య వ్యవస్థని నిశితంగా విమర్శించాడు. రాచరిక నిరంకుశత్వాన్ని బట్టబయలు చేశాడు. విప్లవ ప్రచారాన్ని నిర్వహించాడు. యీాయన ఆత్మ కథ ''నా గతమూ ఆలోచనా'' అన్నది రష్యన్ ప్రామాణిక సాహిత్యపు అనర్ఘరత్నాల్లో ఒకటి. — పేజీ 146.

161 మిహైలోవ్‌స్కీ, నికొలాయ్ (1842–1904) — రష్యన్ సాంఘికశాస్త్రవేత్త, ప్రతికేయుడు, సాహిత్య విమర్శకుడు. — పేజీ 146.

162 మినాయ్, మిత్యాయ్ — గోగొల్ నవల ''మృత జీవులు''లో పాత్రలు. — పేజీ 146.

163 పొలికూష్క — యిదే పేరుతో టాల్‌స్టాయ్ రాసిన కథలో నాయకుడు. — పేజీ 146.

164 మామిన్-సిబిర్యాక్, దీమిత్రి (1852–1912) — రష్యన్ రచయిత; యీాయన నవ

లు 19 శతాబ్దపు ద్వితీయార్థ భాగంతో సైబీరియాలోని జీవితాన్ని నవల డికనీ వాస్తవికంగా చిత్రిస్తాయి. — పేజీ 146.

165 వోల్నోవ్, ఇవాన్ (1885–1931) – రష్యన్ సోవియట్ రచయిత. విప్లవాత్పూర్వపు రైతాంగ భవిష్యత్తుమీద "నా జీవిత కథ" అన్న ఆత్మ కథాత్మక నవలిక రాశాడు. — పేజీ 147.

166 ఫారడే, మైఖేల్ (1791–1867) – ఇంగ్లీషు భౌతికశాస్త్రజ్ఞుడు, ఎలక్ట్రో-మాగ్నెటిక్ ఫీల్డు సిద్ధాంత స్థాపకుడు. — పేజీ 153.

167 ఎడిసన్, థామస్ (1847–1931) – అమెరికన్ పరిశోధకుడు, వ్యాపారస్థుడు. — పేజీ 153.

168 ఆర్క్‌రైట్, రిచర్డ్ (1732–1792) – ఇంగ్లీషు వ్యాపారి, వడుకు యంత్రాల చక్రం కనిపెట్టాడు. మొదటి ఫాక్టరీల వ్యవస్థాపకుడు. — పేజీ 153.

169 పాలిస్సీ, బెర్నార్డ్ (1510–1589 లేదా 1590) – ఫ్రెంచి కళాకారుడు, ప్రకృతి వాది. — పేజీ 153.

170 మొల్యేర్, జాన్ బాప్టిస్ట్ (1622–1673) – ఫ్రెంచి నాటక రచయిత, నటుడు, నాటక కళా సంస్కర్త. కామెడీ ఆఫ్ మేన్నర్స్‌ని సృష్టించాడు. గొప్ప వంశీకుల దురభిప్రాయాలని, బూర్జువావర్గపు సంకుచిత మనస్తత్వాన్ని, మతగురువుల నైష్ఠిక తని పరిహసించాడు. రష్యన్ నాటక రంగంతో సహా ప్రపంచ నాటకరంగ అభివృద్ధిని, ప్రభావితం చేశాడు. — పేజీ 153.

171 డేవిడ్ – క్రీ.పూ. 11 శతాబ్దపు చివర్లో ఇజ్రాయిలీ-జూడా రాజ్య పాలకుడు. — పేజీ 155.

172 జరూబిన్, పావెల్ (1816–1886) – రష్యన్ పాత్రికేయుడు, రచయిత, స్వంత కృషిమీద ఆవిష్కర్త అయినవాడు. — పేజీ 156.

173 రీడ్, మైయన్ (1818–1883) – ఇంగ్లీషు రచయిత. మానవతావాద సాహస నవలలు. ఆకట్టుకునే సంవిధానంతోటే, అమెరికా పీడిత ప్రజల పోరాటానికి సంబంధించిన నవలలు రాశాడు. — పేజీ 157.

174 ఎమార్, గుస్తావ్ (1818–1883) – ఫ్రెంచి రచయిత. సాహస భరిత నవలలు రాశాడు. — పేజీ 157.

175 రూబెన్స్, పీటర్ (1577–1640) — ఫ్లెమిష్ చిత్రకారుడు, మతపర పౌరాణిక వస్తువుల చిత్రాలు. రైతుల జీవితం గురించి మైదాన చిత్రాలు ప్రజాస్వామిక తత్వంతోటీ, బ్రహ్మాండమైన ప్రాకృతిక శక్తులతోటీ నిండి వుంటాయి. — పేజీ 158.

176 జోలా, ఎమిల్ (1840–1902) — ఫ్రెంచి నాచురలిస్ట్ నవలాకారుడు. బూర్జువా సమాజపు సాంఘిక వైరుధ్యాల్ని యదార్థంగా చిత్రించే "రుగోన్ — మక్కార్‌లు" అనే ధారావాహిక యిరవై వాల్యూమ్‌ల నవలలు. — పేజీ 158.

177 కూరొచ్కిన్, వసీలీ (1831–1875) — రష్యన్ కవి; సామయికమైన అధిక్షేప వ్యాసాలూ, పారడీలూ ప్రచురించాడు. — పేజీ 160.

178 బెరంజే, ప్యేర్ జాన్ (1780–1857) — ఫ్రెంచి కవి. జానపద ద్విపదని వృత్తి పర కళ స్థాయికి తీసుకుపోయాడు. యీాయన కవితలు విప్లవ భావంతోటీ, హాస్యం తోటీ, ఆశావాదంతోటీ నిండి పోయివుంటాయి. — పేజీ 160.

179 "'జీవిత సుడిగుండం' అనే.... వ్యాసం...." — ఎ. బ్ల్యూమెన్‌తాల్ రాసిన "చారిత్రక సుడిగుండం" అనే వ్యాసానికి ప్రస్తావన. — పేజీ 160.

180 "మాటల చిత్రహింసని మించిన నిశితమైన చిత్రహింస ప్రపంచంలో లేదు" — రష్యన్ కవి నాద్‌సన్, సెమ్యోన్ (1862–1887) "ప్రియ మిత్రమా నాకు తెలుసు..." అనే ఒక పద్యంనుంచి. — పేజీ 162.

181 "మన బీద భాష శీతలంగా దయనీయంగా వుంది" — అదే పద్యంనుంచి. — పేజీ 162.

182 లియోనొవ్, లియొనీద్ (జననం 1899) — రష్యన్ సోవియట్ రచయిత. సాంఘిక, నైతిక తాత్త్విక సమస్యల గాఢత్వం, మానసిక విశ్లేషణ; దృశ్యమానమైన అలంకారిక శైలి యీాయన వచనాన్ని విశిష్టం చేశాయి. — పేజీ 162.

183 మార్లో, క్రిస్టఫర్ (1564–1593) — ఇంగ్లీషు నాటక రచయిత; మధ్య యుగాల నాటి సన్యాసి నీతినుంచి విమోచన కోరినవాడు. "తామర్లేన్", "డాక్టర్ ఫౌస్టస్" అనే విషాదాంత నాటకాలలో దైవాన్ని ఎదిరించే ఉగ్ర ఉత్సాహం కనిపిస్తుంది. — పేజీ 165.

184 ది కస్టేర్, షర్ల్ (1827–1879) — ఫ్రెంచ్‌లో రాసిన బెల్జియన్ రచయిత. "ఉలెన్‌స్పీగిల్ గాథ" అనే పుస్తకంతోటి ప్రపంచ ప్రఖ్యాతి గడించాడు. 16వ శతా

బ్రంలో స్పానిష్ పాలనకి వ్యతిరేకంగా ఫ్లాండర్సు జరిపిన పోరాటం గురించిన పుస్తకం. – పేజీ 166.

''సంస్కృతి'' – 1928లో ప్రచురితం.

''వర్తమాన సాహిత్యం, దాని కర్తవ్యాలు.'' రచయిత చనిపోయిం తర్వాత మొట్ట మొదటి సారిగా 1941లో ప్రచురితం. ప్రసక్తం అయిన విషయాలని బట్టి 1929 నాటిది. సంక్షిప్త పాఠం.

185 బొకాచియో, జియొవన్నీ (1313–1375) – ఇటాలియన్ రచయిత, తొలి పున ర్వికాస కాలపు మానవతావాది. ముఖ్య గ్రంథం ''డికామెరాన్.'' – పేజీ 177.

186 కల్దెరోన్ (1600–1681) – స్పానిష్ బారుక్ అతి ప్రముఖ నాటకకర్త. – పేజీ 177

187 బైరన్, జార్జి గోర్డన్ (1788–1824) – ఇంగ్లీషు రొమాంటిక్ కవి. యీయన కవిత్వపు ఉద్దేశ్యాలూ, భావనలూ 19వ శతాబ్దపు యూరపియన్ సాహి త్యంమీద (రష్యన్‌తో సహా) ప్రభావం కలిగించాయి. – పేజీ 177.

188 షెల్లీ, పెర్సీ బిష్షే (1792–1822) – ఇంగ్లీషు రొమాంటిక్ కవి. సమకాలీన సమాజపు చెడుగుల్నీ, రాజకీయ వ్యవస్థ దోషాల్నీ వెల్లడి చేసి (''ది క్వీన్ ఆఫ్ మాబ్'') హింసతోటి నియంతృత్వాన్ని కూలదొయ్యడాన్ని సమర్థించాడు (''ది అప్‌రై జింగ్ ఆఫ్ ఇస్లామ్''). – పేజీ 177.

189 వైల్డ్, ఆస్కార్ (1856–1900) – ఇంగ్లీషు రచయిత. యీయన కవిత్వం ఫ్రెంచి సింబాలిస్టులకి సన్నిహితంగా వుంటుంది. యీయన నాటకాల్లోనూ, రచనల్లోనూ సాంఘిక విమర్శనాత్మక ధోరణులు వెల్లడవడం కనిపిస్తుంది. – పేజీ 177.

190 షా, జార్జ్ బెర్నార్డ్ (1856–1950) – ఇంగ్లీషు రచయిత; చర్చాత్మక నాట: సృష్టికర్త. పిడివాదాన్ని, దురభిప్రాయాన్ని కూలదోసే సాధనంగా విరోధాభాసమీ: ఆధార పడింది యీయన కళాత్మక పద్ధతి. – పేజీ 177.

191 ఓ హేన్రీ (అసలు పేరు విలియం సిడ్నీ పోర్టర్, 1862–1910) – అమెరికన్ రచయిత. ఉల్లాసకరంగా వుండే కథా సంవిధానంతో, విరోధాభాస ముగింపుతో హాస్య చతురమైన కథలు రాశాడు. – పేజీ 177.

192 లూయిస్, సింక్లర్ (1885–1951) – అమెరికన్ రచయిత. యీయన నవలల్

''మధ్య తరగతి'' జీవితాల నిజమైన దృశ్యం, ''డాలర్ నాగరికత''పై విమర్శ కనిపిస్తాయి. నోబెల్ బహుమతీ గ్రహీత (1930). – పేజీ 177.

193 ష్టీండె, జూలియుస్ (1841–?) – జర్మన్ రచయిత, బుఖ్‌గోల్ట్స్ బూర్జువా కుటుంబ జీవితం గురించి కథలు రాశాడు. – పేజీ 177.

194 బిస్మార్క్, ఒట్టో (1815–1898) – ప్రిన్స్, జర్మన్ సామ్రాజ్యపు మొదటి రీచ్‌చాన్సలర్ (1871–1890). – పేజీ 177.

''సంస్కృతీ నిష్ణాతులారా'' మీరు ఎవరి పక్షం? (అమెరికన్ విలేకరులకు జవాబు) – 1932లో ప్రచురితం. సంక్షిప్తం.

195 స్పెంగ్లర్, ఓస్వాల్డ్ (1880–1936) – జర్మన్ భావవాద తాత్వికుడు, చరిత్రకారుడు, ''జీవిత తత్వపు'' ప్రతినిధి. ముఖ్య రచన ''యూరప్ అస్తమయం''. – పేజీ 181.

196 వాన్ లూన్, హైన్‌రిఖ్ (1882–1944) – అమెరికన్ చరిత్రకారుడు. – పేజీ 181.

197 ''సమాజాన్ని పాలించడానికి అది అనర్హం...'' – గోర్కీ ''కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక''ని ఉల్లేఖిస్తున్నాడు. – పేజీ 183.

198 మిలుకోవ్, పావెల్ (1859–1943) – రష్యన్ రాజనీతిజ్ఞుడు, చరిత్రకారుడు, పత్రికా రచయిత. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో జారిజపు సామ్రాజ్యవాద విధానాన్ని బలపరిచాడు. – పేజీ 183.

199 వాలెరీ, పాల్ (1871–1945) – ఫ్రెంచి కవి; యీాయన తాత్విక గీతాలు భాషా పటుత్వంతోటీ, సాహసవంతమైన కల్పనలతోటీ విశిష్టం అయాయి. వీటి ప్రధాన యితివృత్తం సృష్టి స్వభావం గురించీ, జ్ఞానపు మూలతత్వం గురించీ శోధించడం. – పేజీ 184.

200 వాలెస్, ఎడ్గార్ (1875–1932) – ఇంగ్లీషు రచయిత; అపరాధ పరిశోధనా సాహిత్యపు ప్రముఖ ప్రతినిధుల్లో ఒకడు. – పేజీ 189.

201 ''చైనాలోని ఘటనలు....'' – 1932 జనవరి – ఫిబ్రవరి నెలల్లో షాంగ్‌హై పైన జపాన్ దాడిని గోర్కీ ప్రస్తావిస్తున్నాడు. – పేజీ 189.

202 ''...లూవైన్ విశ్వవిద్యాలయాన్నీ దాని లైబ్రరీనీ 1914లో నాశనం చేసిన సంగతిని....'' – 1914 జర్మన్ దాడిలో యెంతగాలో నష్టపోయిన పాత బెల్జియం పట్టణపు ప్రస్తావన. అతి పెద్ద విశ్వవిద్యాలయం నాశనమై, దాని లైబ్రరీ దగ్ధం అయిపోయింది. – పేజీ 189.

203 ఇన్‌క్విజిషన్ – కేథలిక్ చర్చికి చెందిన విచారణ సంస్థ. 13వ శతాబ్ది ఆఖర్లో ఫ్యూడల్ పెత్తనాన్నీ, చర్చి ఆధిపత్యాన్నీ యెదిరించేవాళ్లని విచారించేందుకు యేర్పర చారు. విచారణలు రహస్యంగా జరిగేవి. నిందితుల్ని క్రూరంగా హింసించేవాళ్లు. యీ సంస్థ తీర్పుని రద్దుచేసే అవకాశం లేదు. తరుచుగా బహిరంగ సజీవదహనశిక్ష విధించబడేది. – పేజీ 195.

204 టైటస్ (39–81) – రోమన్ చక్రవరి (79–81). – పేజీ 196.

205 మాల్థూస్, థామస్ రాబర్ట్ (1766–1834) – ఇంగ్లీషు అర్థశాస్త్రవేత్త. జీవన ఆధారాలకంటే వేగంగా జనాభా పెరుగుతుందనీ, జనాభా పెరుగుదలని యుక్తివంతంగా అరికట్టక పోయినట్లయితే, కార్మిక ప్రజల దారిద్ర్యం తప్పని సరి అనీ అశాస్త్రీయ సిద్ధాంతాన్ని స్థాపించినవాడు. – పేజీ 200.

206 మూడవ ఇంటర్నేషనల్ – కమ్యూనిస్టు ఇంటర్నేషనల్. అనేక దేశాల కమ్యూనిస్టు పార్టీల అంతర్జాతీయ విప్లవ శ్రామికవర్గ సంస్థ. 1919 నుంచి 1943 దాకా వుంది. – పేజీ 204.

207 హౌప్ట్‌మాన్, గెర్హార్డ్ (1862–1946) – జర్మన్ రచయిత; జర్మన్ నాచురలిజపు నాయకుడు. నోబెల్ బహుమతి గ్రహీత (1912). – పేజీ 204.

208 మాన్, థామస్ (1875–1955) – జర్మన్ నవలా రచయిత. యిరవయ్యవ శతాబ్దపు సవిమర్శక వాస్తవికవాదపు అత్యుత్తమ సంప్రదాయంలో పశ్చిమ దేశాల ఉదారవాద మేధావుల మేధాపర, నైతిక శోధనలని వ్యక్తం చేశాడు. బూర్జువా జీవిత రూపాల పతనాన్ని, బూర్జువా చైతన్య, సంస్కృతుల సంక్షోభాన్ని చూపించాడు. బైబిల్ కథమీద ఆధార పడిన నవలా త్రయం ''జోసెఫ్, అతని సోదరులు.'' నోబెల్ బహుమతి గ్రహీత (1929). – పేజీ 204.

<u>''నాటకాల సమీక్ష''</u> – 1933లో ప్రచురితం. సంక్షిప్తం.

209 ''అస్తిత్వానికి ఆరంభం కార్యాచరణ'' – గ్యోతే, ''ఫౌస్ట్'' ఒకటవ భాగం, రంగం 3. – పేజీ 205.

210 ''తత్వవేత్తలు ఇంతవరకూ ప్రపంచాన్ని అనేక విధాలుగా వ్యాఖ్యానించారు, కాని అసలు విషయం దాన్ని మార్చడం.'' – ఎల్. ఫొయెర్‌బాఖ్ మీద కార్ల్ మార్క్స్ పదకొండవ సూత్రీకరణని ఉల్లేఖించడం. – పేజీ 205.

211 ఖెమ్‌నిత్సెర్ ఇవాన్ (1745–1784) – రష్యన్ కవి, నీతి కథా రచయిత. – పేజీ 205.

212 ఫాముసొవ్, స్కలొజూబ్, మొల్చాలిన్, రెపెతీలొవ్ – ఎ. గ్రిబొయేదొవ్ కామెడీ ''తెలివి తేటలు కడగండ్లకు దారితీస్తున్నాయి''లోని పాత్రలు. – పేజీ 207.

213 పట్టణపు గవర్నర్ – ఎన్. గోగొల్ కామెడీ ''ఇన్‌స్పెక్టర్ జనరల్''లోని పాత్ర. – పేజీ 207.

214 చర్చిల్, విన్‌స్టన్ (1874–1965) – గ్రేట్ బ్రిటన్ ప్రధాన మంత్రి 1940–1945, 1951–1955. – పేజీ 211.

215 ఫాల్‌స్టాఫ్ – విలియం షేక్‌స్పియర్ నాటకాలు ''హెన్రీ IV'', ''మెర్రీ వైవ్స్ ఆఫ్ విండ్సర్''లలో పాత్ర. – పేజీ 212.

216 మిసాంత్రోప్– యిదే పేరుతో వున్న మొల్యేర్ కామెడీలో నాయక పాత్ర. – పేజీ 212.

217 లాయిడ్ జార్జ్, డేవిడ్ (1863–1945) – 1916–1922 మధ్య గ్రేట్ బ్రిటన్ ప్రధాన మంత్రి. – పేజీ 213.

218 ''ఆఖరి పుస్తకం చెప్పేదేదో....'' – ఎన్. నెక్రాసొవ్ కావ్యం ''సాష''నుంచి. – పేజీ 216.

219 ''చదువు ఫలితం'' – ఎల్. టాల్‌స్టాయ్ నాటకం. – పేజీ 217.

220 బొమర్షె, ప్యేర్ ఒగొయొస్టేన్ (1732–1799) – ఫ్రెంచి నాటక రచయిత. ''ఫిగరో పెళ్లి'' అన్న కామెడీ వల్ల ప్రపంచ ఖ్యాతి సంపాదించాడు. – పేజీ 217.

221 క్లైస్ట్, హైన్రిక్ (1777–1811) – జర్మన్ రచయిత. యీాయన సృజనాత్మక రచనల్లో అహేతుకత, రొమాంటిసిజం జీవిత సత్యంతోటే, అధిక్షేపంతోటే మిళితం అయివుంటాయి. – పేజీ 217.

222 ట్రుబాదూర్లు — లలిత గేయకర్తలు, కవి సంగీతకారులు, ప్రొవెన్స్‌లో 11 నుంచి 13వ శతాబ్దపు ఆఖరు దాకా వర్ధిల్లినవాళ్ళు. — పేజీ 217.

223 మీస్టర్‌సింగర్లు — 14–16 శతాబ్దాల్లో జర్మన్ నగరాల్లో చేతివృత్తులవాళ్లనుంచి వచ్చిన కవులూ, సంగీతకారులూ.

224 బొలోత్నికొవ్, ఇవాన్ (? – 1608) — రష్యాలో 1606–1607 ప్రజల తిరుగుబాటు నాయకుడు. — పేజీ 217.

225 రాజిన్, స్తెపాన్ (1630–1671) — రష్యాలో 1670–1671 రైతు యుద్ధపు నాయకుడు. — పేజీ 217.

226 మొదటి రొమానొవ్ — మిహాయీల్ రొమానొవ్ (1596–1645) — రొమానొవ్ వంశపు ఆద్యుడు. 1613నుంచి 1917 ఫిబ్రవరి విప్లవం దాకా యీ రొమానొవ్ వంశీకులే జార్‌లుగా పాలించారు. — పేజీ 218.

227 అలెక్సేయ్ — అలెక్సేయ్ మిహైలొవిచ్ (1629–1676) — రష్యా జార్ (1645–1676), పీటర్ ది గ్రేట్ చక్రవర్తి తండ్రి. — పేజీ 218.

228 "ప్రభుత్వపు సప్త బోయర్లు" — బోయర్ ప్రభుత్వం (ఏడుగురు సభ్యులు) నామకః 1610నుంచి 1612 దాకా రష్యా ప్రభుత్వం. వాస్తవ అధికారాన్ని పోలిష్ దండయాత్రికులకి బదలాయించింది. దీన్ని ప్రజా ఐచ్ఛికదళం నిర్మూలించింది. — పేజీ 218.

229 "నా నాటకం ఒకటి ముప్పై యేళ్లుగా ప్రదర్శితమవుతోంది." — "అధోజనం" అనే గోర్కీ నాటకపు ప్రస్తావన. — పేజీ 220.

230 కొనొవాలొవ్ — యిదే పేరుతో గోర్కీ రాసిన కథలోని నాయకుడు. — పేజీ 220.

231 బుబ్నొవ్, సాటిన్ — గోర్కీ నాటకం "అధోజనం"లోని పాత్రలు. — పేజీ 220.

232 "నాన్ హీరో" — రష్యన్ రచయిత పొతాపెంకో ఇగ్నాటీ (1856–1929) నవల పేరు. — పేజీ 220.

233 "...అధిక పలుకుబడిగల రచయిత...." — యిది ఎల్. టాల్‌స్టాయ్‌కి ప్రస్తావన. — పేజీ 221.

"యువ రచయితలతోటి సంభాషణ" — మొదటి సారిగా 1934లో పూర్తిగా ప్రచురితం. యిది సంక్షిప్తం.

234 "ఒక్క మార్క్స్, ఎంగెల్స్‌లు మాత్రమే బాల్జాక్ రచనల సామాజిక ప్రాముఖ్యాన్ని గుర్తించారు." — ఎమ్. గార్క్‌నెస్‌కి రాసిన ఉత్తరంలో (1888 ఏప్రిల్ ఆరంభంలో) ఎంగెల్స్ రాశాడు: "భూత భవిష్యత్ వర్తమాన కాలాల్లోని జోలాలందరికంటే నిశిష్టుడైన వాస్తవికవాదిగా బాల్జాక్‌ని నేను పరిగణిస్తాను. అతను తన 'మానవ ప్రహసనం' ఫ్రెంచి 'సమాజపు' అత్యంత వాస్తవిక చరిత్రని అందించాడు... దీన్నుంచి నేను వృత్తిపర చరిత్రకారులు, ఆర్థికవేత్తలు, గణాంకవేత్తలు అందరూ కలిసి యిచ్చిన దానికంటే యెక్కువ ఆర్థిక వివరాలు గ్రహించాను. బాల్జాక్ తన వర్గ సానుభూతులకి, రాజకీయ దురభిప్రాయాలకి, వ్యతిరేకంగా పోవడం అనేది, తన ప్రియమైన సంపన్న వర్గాల పతనపు అనివార్యతని అతను చూశాడన్నది, అంతకంటే మంచిది వాళ్లకి అర్హత లేదన్నట్టుగా ఆ వ్యక్తుల్ని చిత్రించడం అన్న విషయం, అప్పట్లో చూడగలగ సాధ్యమైనట్టు భవిష్యత్ వాస్తవ మనుషుల్ని అతను చూశాడన్నది వాస్తవికవాదపు మహత్తర విజయాల్లో ఒకటిగా, వృద్ధ మానవుడు బాల్జాక్ మహత్తర అంశాల్లో ఒకటిగా నేను భావిస్తాను." — పేజీ 228.

235 గార్ట్‌మన్, ఎడ్వర్డ్ (1842–1906) — జర్మన్ భావవాద తత్వవేత్త. మనుగడకి పరమ అచైతన్య భావనాత్మక ఆరంభం — ప్రపంచ సంకల్పం — ఆధారం అని భావించాడు. — పేజీ 228.

236 లియొపార్డీ, జకోమొ (1798–1837) — ఇటాలియన్ రొమాంటిక్ కవి. దేశభక్తియుత గీతాలు, తాత్విక గేయాలు, వచనం రాశాడు. — పేజీ 228.

237 ష్టిర్నెర్, మాక్స్ (1806–1856) — జర్మన్ తత్వవేత్త. స్థిరమైన ఈగో సెంట్రిజపు సిద్ధాంతవాది. యితని అరాచకవాదాన్ని, వ్యక్తివాదాన్ని కె. మార్క్స్, ఎఫ్. ఎంగెల్స్‌లు "జర్మన్ భావజాలం" అన్న గ్రంథంలో విమర్శించారు. — పేజీ 228.

238 హార్డీ, థామస్ (1840–1928) — ఇంగ్లీషు వాస్తవికవాద నవలా రచయిత. యిరవయ్యవ శతాబ్దపు మహత్తర లలిత గేయకర్తల్లో ఒకడు. — పేజీ 229.

239 షతొబ్రియాన్, ఫ్రన్సువా రెనె (1768–1848) — ఫ్రెంచి రొమాంటిక్ రచయిత; ప్రగతి వ్యతిరేక సంపన్నవర్గాలకీ రాచరికవాదులకీ వాణి. — పేజీ 229.

240 చిచికొవ్, సొబకేవిచ్, నొజ్ద్ర్యోవ్, ప్ల్యూష్కిన్ — ఎన్. గోగొల్ నవల ''మృత జీవులు''లో పాత్రలు. — పేజీ 230.

241 ''...డాంటె వర్ణించిన 'నరకపు' వలయాలలో....'' — ఇటాలియన్ కవి డాంటె అలిగ్యేరి (1265–1321) రాసిన ''డివైన్ కామెడియా''లో ''ఇన్‌ఫర్నో,'' ''పర్గేటరీ'', ''పారడైజ్'' అనే మూడు భాగాలు. — పేజీ 233.

''సోవియట్ సాహిత్యం'' — సోవియట్ రచయితల ప్రథమ అఖిల యూనియన్ మహాసభలో యిచ్చిన నివేదిక, ఆగస్టు 17, 1934. మొట్టమొదటి సారిగా 1934లో అనేక ముద్రణల్లో ప్రచురితం. సంక్షిప్త పాఠం.

242 స్పెన్సర్, హెర్బర్ట్ (1820–1903) — ఇంగ్లీషు తత్వవేత్త, సాంఘికశాస్త్రవేత్త. పోజిటివిజపు స్థాపకుల్లో ఒకడు. — పేజీ 235.

243 ఫ్రేజర్, జేమ్స్ జార్జ్ (1854–1941) — బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు, మత చరిత్రలో నిష్ణాతుడు. — పేజీ 235.

244 కాంట్, ఇమ్మాన్యుయెల్ (1724–1804) — జర్మన్ తత్వవేత్త. జర్మన్ ప్రామాణిక తత్వశాస్త్రపు స్థాపకుడు. యీయన తత్వశాస్త్రంలో స్వీయ భావవాద, భౌతిక వాద ధోరణులు కలిసివుంటాయి. — పేజీ 235.

245 అరిస్టాటిల్ (384–322 క్రీ.పూ.) — ప్రాచీన గ్రీకు తత్వవేత్త, శాస్త్రజ్ఞుడు. తన కాలంలో వున్న అన్ని విషయాలమీదా రచనలు చేశాడు. లాక్షణిక తర్కశాస్త్రాన్నీ, సిల్లగిస్టిక్స్‌నీ స్థాపించాడు. భౌతికవాద భావవాదాల మధ్య వూగులాడాడు. — పేజీ 235.

246 జ్ఞాని వసిలీసా — రష్యన్ అద్భుత కథల్లోని పాత్ర. — పేజీ 236.

247 ప్లేటో (క్రీ.పూ. 428 లేదా 427 నుంచి 348 లేదా 347) — ప్రాచీన గ్రీకు భావవాద తత్వవేత్త. వస్తుగత భావవాదపు తొలి ప్రామాణిక రూపం యీయన బోధనలు. — పేజీ 238.

248 బెర్క్లీ జార్జి (1685–1753) — బ్రిటిష్ తత్వవేత్త, స్వీయ భావవాద ధోరణి ప్రతినిధి. బిషప్. — పేజీ 238.

249 లెనిన్ గ్రంథం ''భౌతికవాదమూ, ఎంపిరియో క్రిటిసిజమూ. ప్రగతి వ్యతిరేక తత్వశాస్త్రంమీద విమర్శనాత్మక వ్యాఖ్యానాలు''కి ప్రస్తావన. — పేజీ 238.

250 బెర్గ్సన్, ఆంరీ (1859–1941) – ఫ్రెంచి భావవాద తత్వవేత్త. సద్యోజనిత తత్వపు ప్రతినిధి, జీవిత తత్వశాస్త్రపు ప్రతినిధి. – పేజీ 238.

251 ఫుల్టన్, రాబర్ట్ (1765–1815) – అమెరికన్ ఇంజనీర్, శోధకుడు, తొలి చక్రాల ఆవిరి ఓడని నిర్మించాడు. – పేజీ 240.

252 మికూల సెల్యనీనొవిచ్ – హాలిక వీరుడు, రష్యన్ ఇతిహాసాల నాయకుడు. – పేజీ 242.

253 స్వ్యతొగొర్ – యుద్ధ వీరుడు, రష్యన్ ఇతిహాసాల నాయకుడు. – పేజీ 242.

254 తిక్క ఇవాన్ – రష్యన్ జానపద గాథల నాయకుడు. – పేజీ 242.

255 పెత్రూష్క – రష్యన్ జానపద బొమ్మలాటల్లోని పాత్ర. – పేజీ 242.

256 శూరులున్న నవల – మధ్య యుగాల్లో మర్యాద సాహిత్యంలోని ఒక ధోరణి. కేంద్ర బిందువుగా శూర పాత్ర వుంటుంది. ఆ శూరుడు కీర్తి కోసం, ప్రేమ కోసం చేసే వీరోచిత చర్యలుంటాయి. – పేజీ 242.

257 తిల్ ఉలెన్స్పీగెల్ – మధ్య యుగాలలో జర్మన్, డచ్ జానపద గాథల నాయకుడు. – పేజీ 243.

258 తోర్మెన్నుంచి లాజరిల్లో – అజ్ఞాత రచయిత కృత స్పానిష్ నవల "తోర్మెన్నుంచి లాజరిల్లో" నాయకుడు. 1554లో ప్రచురితం. – పేజీ 243.

259 జిల్ బ్లాన్ – ఫ్రెంచి రచయిత లెసాజ్ అలెన్ రెనే (1668–1747) రాసిన నవలలోని నాయకుడు. – పేజీ 243.

260 అర్సేన్ లుపేన్ – ఫ్రెంచి రచయిత లెబ్లాన్ మొరీస్ (1864–1941) రాసిన సాహస నవలలోని డిటెక్టివ్ నాయకుడు. – పేజీ 243.

261 శాంకో పాంజా – సెర్వాంటెస్ నవల "డాన్ క్విక్సట్"లో పాత్ర. – పేజీ 243.

262 రొకమ్బోల్ – ఫ్రెంచి రచయిత సాన్సాన్ డ్యు టెరైల్ (1871 – ? ) రాసిన అనేక నవలల నాయకుడు. – పేజీ 243.

263 షెర్లాక్ హోమ్స్ – ఇంగ్లీషు రచయిత ఆర్థర్ కానన్ డైల్ (1859–1930) రాసిన అనేక నవలల్లో నాయకుడు. – పేజీ 244.

264 కూకొల్నిక్, నెస్తర్ (1809–1868) – రష్యన్ రచయిత. ప్రగతి వ్యతిరేక రాచరికపు నాటకాలు. – పేజీ 244.

265 థెర్‌సీట్ – ''ఇలియడ్''లో ఒక పాత్ర. – పేజీ 244.

266 ఏథెన్స్ టైమన్ – షేక్‌స్పియర్ యిదే పేరుతో రాసిన ట్రాజెడీలో నాయక పాత్ర. – పేజీ 244.

267 షైలాక్ – షేక్‌స్పియర్ ''మర్చంట్ ఆఫ్ వెనిస్'' అనే కామెడీలో ముఖ్య పాత్ర. – పేజి 244.

268 ఇవాన్ ది టెర్రిబుల్ (1530–1584) – రష్యన్ జార్. – పేజీ 244.

269 కాండోట్యేర్స్ – ఇటలీలో 14–16 శతాబ్దాల్లో తాత్కాలికంగా కూలి యిచ్చి చేర్చుకున్న సైనిక దళాల కేప్టెన్లు. – పేజీ 245.

270 ఫోర్డ్, హెన్రీ (1863–1947) – అమెరికన్ పారిశ్రామికవేత్త, కార్ల కంపెనీ అధినేత. – పేజీ 245.

271 ఓవెన్, రాబర్ట్ (1771–1858) – బ్రిటిష్ ఊహాజనిత సోషలిస్టు. – పేజీ 245.

272 మోర్గన్, జాన్ ప్యెర్‌పాంట్ సీనియర్ (1837–1913) – అమెరికన్ పెట్టుబడిదారుడు, రైల్వేలకీ ఉక్కు ఫాక్టరీలకీ, బేంకులకీ యజమాని. – పేజీ 245.

273 మూర్, థామస్ (1478–1535) – ఇంగ్లీషు మానవతావాద తత్వవేత్త. రాజనీతిజ్ఞుడు, రచయిత. ఊహాజనిత సోషలిజపు స్థాపకుల్లో ఒకడు. – పేజీ 245.

274 కాంపనెల్లా, టొమ్మాసొ (1568–1639) – ఇటాలియన్ తత్వవేత్త, కవి, రాజనీతిజ్ఞుడు. – పేజీ 245.

275 ఫోరియర్, చార్లెస్ (1772–1837) – ఫ్రెంచి ఊహాజనిత సోషలిస్టు. – పేజీ 245.

276 సెంట్ సైమన్ అన్రీ (1760–1825) – ఫ్రెంచి ఊహాజనిత సోషలిస్టు. – పేజీ 245.

277 టాల్‌స్టాయ్, ప్యోదొర్ (1782–1846) – కౌంట్. గార్డ్స్ దళంలో ఆఫీసరు. సాహస కృత్యాలకీ, ద్వంద్వయుద్ధాలకీ ప్రసిద్ధుడు. – పేజీ 247.

278 బకూనిన్, మిహయీల్ (1814–1876) – రష్యన్ విప్లవకారుడు, అరాజకవాదపు సిద్ధాంతవేత్త. – పేజీ 247.

279 ఫాన్‌వీజిన్, దెనీస్ (1745–1792) – రష్యన్ రచయిత, వికాసదాయకుడు. రష్యన్ సాంఘిక కామెడీ సృష్టికర్త. – పేజీ 247.

280 బుల్గారిన్, ఫద్దేయ్ (1789–1859) – రష్యన్ పత్రికేయుడు, రచయిత. ప్రగతి వ్యతిరేక వార్తాపత్రికలని ప్రచురించాడు. కుహనా చారిత్రక నవలల్ని రాశాడు. రచయితలమీద రాజకీయ నివేదికల్ని రాశాడు. – పేజీ 247.

281 మసాల్‌స్కీ, కాన్‌స్తంతీన్ (1802–1861) – రష్యన్ రచయిత. – పేజీ 247.

282 జోతొవ్, రాఫేల్ (1795–1871) – రష్యన్ రచయిత. – పేజీ 247.

283 అవేర్‌చెంకొ, అర్కాదీ (1881–1925) – రష్యన్ హాస్య చతురుడు. – పేజీ 247.

284 టబొరైట్స్ – బొహీమియాలో పదిహేనవ శతాబ్దపు తొలి అర్ధభాగంలో హుస్సైట్‌ల ఫ్యూడల్ వ్యతిరేక భాగం. – పేజీ 248.

285 "బారన్ మ్యున్‌హౌసెన్ సాహసకృత్యాలు" – రాస్పె (1737–1794), బ్యూర్గెర్ (1747–1794) లాంటి జర్మన్ రచయితల పుస్తకాలకి యిది ప్రస్తావన. – పేజీ 248.

286 పీటర్ ష్లెమిల్ – "పీటర్ ష్లెమిల్ అసాధారణ గాథ" అనే చిన్న నవల నాయకుడు. జర్మన్ రొమాంటిక్ రచయిత షామిస్సొ (1781–1838). – పేజీ 249.

287 "భూగర్భంనుంచి ఉత్తరాలు" – దొస్తొయేవ్‌స్కీ నవల. – పేజీ 249.

288 బొరీస్ సావిన్‌కొవ్ (1879–1925) – రష్యన్ రచయిత, రాజకీయవేత్త. – పేజీ 249.

289 అర్త్సిబాషెవ్ మిహాయీల్ (1878–1927) – రష్యన్ రచయిత. – పేజీ 249.

290 ఫిగ్నర్, వెరా (1852–1942) – రష్యన్ విప్లవోద్యమంలో పాల్గొన్న రచయిత్రి.– పేజీ 249.

291 "తను పూష్కిన్‌మీద ఉపన్యాసం యిచ్చిన తక్షణమూ... ...దొస్తొయేవ్‌స్కీ భావాలు ప్రచారంలోకి వచ్చాయి." – మాస్కోలో 1880 జూలై 8వ పూష్కిన్ స్మృతి చిహ్నం ప్రారంభించినప్పుడు దొస్తొయేవ్‌స్కీ చేసిన ఉపన్యాసపు ప్రస్తావన. – పేజీ 250.

292 స్త్రూవె, ప్యోత్ర్ (1870–1944) – రష్యన్ ఆర్థికవేత్త, తత్వవేత్త, చరిత్ర

కారుడు, ప్రచారకుడు, "చట్టబద్ధ మార్క్సిజపు" సిద్ధాంతవేత్త. కాన్స్టిట్యూషనల్ డెమోక్రటిక్ పార్టీ నాయకుల్లో ఒకడు. — పేజీ 250.

293 ఫీఖ్టె, యోహన్ (1762–1814) — జర్మన్ తత్వవేత్త. జర్మన్ ప్రామాణిక భావవాద ప్రతినిధి. — పేజీ 250.

294 స్తొలీపిన్, ప్యోత్ర్ (1862–1911) — రష్యన్ ప్రగతివ్యతిరేక రాజనీతిజ్ఞుడు, ఆంతరంగిక మంత్రి, మంత్రి మండలి అధ్యక్షుడు (1906 నుంచి). — పేజీ 250.

295 లియోన్త్యేవ్, కాన్స్తాన్తీన్ (1831–1891) — రష్యన్ రచయిత, సాహిత్య విమర్శకుడు. మతాన్ని, రాచరికాన్ని, ఎస్టేట్ వారసత్వ హక్కుని ప్రచారం చేశాడు. విప్లవాన్ని ప్రతిఘటించాడు. — పేజీ 250.

296 తిఖొమీరొవ్, లెవ్ (1852–1923) — రష్యన్ నరోద్నిక్కు, రచయిత, రాచరిక వాది. పేజి 250.

297 "...1848 తర్వాతా, 1871 తర్వాతా...." — 1848, 1871 (పారిస్ కమ్యూన్) ఫ్రెంచి విప్లవాల ప్రస్తావన. — పేజీ 250.

298 లైబ్నిట్స్, గోట్ఫ్రీడ్ విల్హెల్మ్ (1646–1716) — జర్మన్ భావవాద తత్వవేత్త, గణితవేత్త, భౌతికశాస్త్రజ్ఞుడు, భాషాశాస్త్రజ్ఞుడు. — పేజీ 251.

299 డెకార్ట్, రెనే (1596–1650) — ఫ్రెంచి తత్వవేత్త, గణితవేత్త, భౌతికశాస్త్రజ్ఞుడు, శరీరశాస్త్రవేత్త. — పేజీ 251.

300 హెగెల్, గియోర్గ్ విల్హెల్మ్ ఫ్రీడిహ్ (1770–1831) — జర్మన్ తత్వవేత్త. వస్తుగత భావవాద పునాదిగా గతితర్క సిద్ధాంతాన్ని క్రమబద్ధంగా రూపొందించాడు. — పేజీ 251.

301 సొలొగూబ్, ఫ్యోదొర్ (1863–1927) — రష్యన్ రచయిత; యీయన సృజనాత్మక కృషిలో క్షీణ యుగ లక్షణాలు వుంటాయి. — పేజీ 251.

302 సల్తీచీఖా — సల్తికోవా దార్య (1730–1801) వెక్కిరింపు పేరు. రష్యన్ జమీందారిణి. వంద మందికి పైగా భూస్వామ్య దాసుల్ని పీడించింది. — పేజీ 251.

303 కొరోబొచ్కా, పెతూఖ్ — ఎన్. గోగొల్ "మృత జీవులు"లోని పాత్రలు. — పేజీ 252.

304 ఎబర్ట్, ఫ్రీడిఖ్ (1871–1925) – జర్మనీ అధ్యకుడు (1919–1925), సోషల్ డెమోక్రటిక్ పార్టీ మితవాద నాయకుడు. – పేజీ 261.

305 నోస్కె, గుస్తావ్ (1868–1946) – జర్మన్ మితవాద సోషల్ డెమోక్రట్, 1919–1920లలో రక్షణ మంత్రి. – పేజీ 261.

"అమ్మ" నవల ఫ్రెంచి ప్రచురణకి ముందుమాట. మొదటి సారిగా రచయిత మరణం తర్వాత 1951లో ప్రచురితం.

306 "నేను దీన్ని అమెరికాలో వుండగా, హడావుడిగా...." – "అమ్మ" నవలని గోర్కీ అమెరికాలో 1906లో రాశాడు. అరెస్టు కాకుండా తప్పించుకుందుకు అక్కడికి పారి పోయాడు. – పేజీ 269.

307 "దీనిలో వున్న లోపాలు బహుశా శ్రామికవర్గంలో విప్లవ వర్గ చైతన్యం అభివృద్ధి చెందడానికి ఆటంకం కాలేదేమో." – దీని విప్లవ బోధనాత్మక గుణాలకి దీన్ని వి.ఐ. లెనిన్ యెంతగానో పొగిడాడు: "యీ పుస్తకం చాలా అవసరం. విప్లవోద్యమంలో చేరిన కార్మికులలో చాలా మంది వర్గచైతన్యం లేకుండా సద్యోజనితంగా పాల్గొన్నవాళ్ళు. యిప్పుడు వాళ్ళు 'అమ్మ' నవలని యెంతో లబ్ధి పొందుతూ చదువుతారు." – పేజీ 269.

308 "ఎర్ర సైన్యం చాంగ్ కై షెక్ దోపిడీ ముఠాతో మొక్కవోకుండా పోరాడుతూనే వుంది." – 1934లో చాంగ్‌కైషేక్ సైన్యాలకి వ్యతిరేకంగా చైనీస్ ఎర్ర సైన్యపు విజయ వంతమైన సైనిక చర్యలకి ప్రస్తావన. – పేజీ 270.

## పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించీ, దీని అనువాదం గురించీ మీ అభిప్రాయాలను "రాదుగ" ప్రచురణాలయానికి దయచేసి తెలుపండి.

మీ అభిప్రాయాలను ఈకింది చిరునామాకు పంపండి:

Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

## మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్
విజయవాడ – 520 004

విశాలాంధ్ర బుక్ హౌస్
11–1–37 గాంధీ రోడ్డు
తిరుపతి – 517 501

విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ – 520 002

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
విశాఖపట్నం – 530 002

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్ బజారు
హైదరాబాదు – 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్
హనుమకొండ
వరంగల్ – 506 011

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజీ రోడ్డు
అనంతపురం – 515 004

విశాలాంధ్ర బుక్ హౌస్
అరండల్ పేట
గుంటూరు – 522 002

202 "...లూవైన్ విశ్వవిద్యాలయాన్నీ దాని లైబ్రరీనీ 1914లో నాశనం చేసిన సంగతిని...." – 1914 జర్మన్ దాడిలో యెంతగాలో నష్టపోయిన పాత బెల్జియం పట్టణపు ప్రస్తావన. అతి పెద్ద విశ్వవిద్యాలయం నాశనమై, దాని లైబ్రరీ దగ్ధం అయిపోయింది. – పేజీ 189.

203 ఇన్క్విజిషన్ – కేథలిక్ చర్చికి చెందిన విచారణ సంస్థ. 13వ శతాబ్ది ఆఖర్లో ఫ్యూడల్ పెత్తనాన్నీ, చర్చి ఆధిపత్యాన్నీ యెదిరించేవాళ్లని విచారించేందుకు యేర్పరచారు. విచారణలు రహస్యంగా జరిగేవి. నిందితుల్ని క్రూరంగా హింసించేవాళ్లు. యీ సంస్థ తీర్పుని రద్దుచేసే అవకాశం లేదు. తరుచుగా బహిరంగ సజీవదహనశిక్ష విధించబడేది. – పేజీ 195.

204 టైటస్ (39–81) – రోమన్ చక్రవర్తి (79–81). – పేజీ 196.

205 మాల్థస్, థామస్ రాబర్ట్ (1766–1834) – ఇంగ్లీషు అర్థశాస్త్రవేత్త. జీవన ఆధారాలకంటే వేగంగా జనాభా పెరుగుతుందనీ, జనాభా పెరుగుదలని యుక్తివంతంగా అరికట్టక పోయినట్లయితే, కార్మిక ప్రజల దారిద్ర్యం తప్పని సరి అనీ అశాస్త్రీయ సిద్ధాంతాన్ని స్థాపించినవాడు. – పేజీ 200.

206 మూడవ ఇంటర్నేషనల్ – కమ్యూనిస్టు ఇంటర్నేషనల్. అనేక దేశాల కమ్యూనిస్టు పార్టీల అంతర్జాతీయ విప్లవ శ్రామికవర్గ సంస్థ. 1919 నుంచి 1943 దాకా వుంది. – పేజీ 204.

207 హౌప్ట్‌మాన్, గెర్హార్డ్ (1862–1946) – జర్మన్ రచయిత; జర్మన్ నాచురలిజపు నాయకుడు. నోబెల్ బహుమతీ గ్రహీత (1912). – పేజీ 204.

208 మాన్, థామస్ (1875–1955) – జర్మన్ నవలా రచయిత. యిరవయ్యవ శతాబ్దపు సవిమర్శక వాస్తవికవాదపు అత్యుత్తమ సంప్రదాయంలో పశ్చిమ దేశాల ఉదారవాద మేధావుల మేధాపర, నైతిక శోధనలని వ్యక్తం చేశాడు. బూర్జువా జీవిత రూపాల పతనాన్ని, బూర్జువా చైతన్య, సంస్కృతుల సంక్షోభాన్ని చూపించాడు. బైబిల్ కథమీద ఆధార పడిన నవలా త్రయం "జోసెఫ్, అతని సోదరులు." నోబెల్ బహుమతీ గ్రహీత (1929). – పేజీ 204.

"నాటకాల సమీక్ష" – 1933లో ప్రచురితం. సంక్షిప్తం.

209 "అస్తిత్వానికి ఆరంభం కార్యాచరణ'" – గ్యోతే, "ఫౌస్ట్" ఒకటవ భాగం, రంగం 3. – పేజీ 205.